# మహా భారతంలో
# జానపద కథాంశ కథలు



ఆచార్య ఎమ్. జయదేవ్
డి.లిట్.
తెలుగు శాఖాధ్యక్షులు
ఆంధ్రవిశ్వవిద్యాలయం, విశాఖపట్నం

# రచయిత గురించి

| | | |
|---|---|---|
| పేరు | - | మర్రెబోయిన జయదేవ్ |
| తల్లిదండ్రులు | - | వెంకటమ్మ, పుల్లన్న గార్లు |
| పుట్టినతేదీ | - | తెలియదు, పదవ తరగతి సర్టిఫికెట్ ప్రకారం 14-6-1956 |
| స్వంత ఊరు | - | చాకరాజువేముల గ్రామం, దొర్నిపాడు మండలం, కర్నూలు జిల్లా |
| విద్యాభ్యాసం | - | 1 నుంచి 5 వ తరగతి వరకు ఇటికాల గ్రామం,<br>6వ తరగతి - కొలిమిగుండ్ల, 7వ తరగతి నుంచి10వ తరగతి వరకు దొర్నిపాడు, ఇంటర్మీడియట్ - ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా,<br>బి.ఎ. - ఎస్.ఎస్.ఎన్. కళాశాల, నరసరావు పేట, గుంటూరు జిల్లా.<br>ఎం.ఏ., పిహెచ్.డి. - ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్నం.<br>డి.లిట్. - బరంపురం విశ్వవిద్యాలయం, బరంపురం, ఒరిస్సా. |
| డిప్లొమాలు | - | డిప్లొమా ఇన్ లింగ్విస్టిక్స్, డిప్లొమా ఇన్ ట్రాన్స్‌లేషన్ - ఆంధ్ర విశ్వవిద్యాలయం. |
| ఉద్యోగం | - | 1984 నుంచి 1990 వరకు గుడివాడ, ఏ.ఎన్.ఆర్ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా,<br>1990 నుంచి 1998 వరకు ఆంధ్ర విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో రీడరుగా,<br>1998 నుంచి ప్రొఫెసర్‌గా, 1996 నుంచి 1999 వరకు తెలుగు శాఖాధ్యక్షులుగా,<br>2004 నుంచి 2007 వరకు తెలుగు బోర్డ్ ఆఫ్ స్టడీస్ ఛైర్మన్‌గా,<br>2013 నుంచి 2016 వరకు ప్రాచ్యభాషల అధ్యాపక వర్గం ఆధ్యక్షులుగా<br>2016 నుంచి రెండవ సారి తెలుగు శాఖాధ్యక్షులుగా |
| ముద్రిత గ్రంథాలు | - | 1. దుర్భాక రాజశేఖర శతావధాని చారిత్రక కావ్యాలు,<br>2. సింహాచలం దేవళం కట్టుబడి కథాగేయం<br>3. వేమన వైశిష్ట్యం - స్త్రీ దృక్పథం<br>4. యాదవుల జానపద ప్రదర్శన కళలు<br>5. సంస్కృత మహాభారతంలో జానపద కథలు<br>6. మహా భారతంలో జానపద కథాంశ కథలు |
| అముద్రిత గ్రంథం | : | 1. దశావతార కథాగేయాలు |
| ఇష్టమైన అంశాలు | - | జానపద సాహిత్యం, వేమన పద్యాలు<br>సామాజిక స్పృహ ఉన్న రచనలు |

# మహా భారతంలో
# జానపద కథాంశ కథలు

ఆచార్య ఎం. జయదేవ్
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.
తెలుగు శాఖాధ్యక్షులు
ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్నం.

**MAHABHARATAM LO**
**JANAPADA KATHAMSA KATHALU**

**Written & Published by**
**Prof. M. Jayadev**
M.A., Ph.D., D.Litt.
Head, Dept. of Telugu,
Andhra University,
Visakhapatnam,
Andhra Pradesh, India.
Cell : 9290102364

Edition : August, 2017

Copies : 500

Price :Rs. 250/-



**For Copies :**

M. Padmavathi
Flat No. 5A, Madeti Enclave,
RamaKrishna Nagar,
Shantipuram, Visakhapatnam.

**Printed at :**

Vinay Offset Printers
Premasamajam Road, Dabagardnes
Visakhapatnam - 20
Cell : 8897905461

**ISBN No. : 978 - 93 - 5279 - 255 - 9**

**మహాభారతంలో**

**జానపద కథాంశ కథలు**

రచన, ముద్రణ
ఆచార్య ఎం. జయదేవ్
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.
తెలుగు శాఖాధ్యక్షులు
ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్నం.
సెల్ : **9290102364**

ప్రచురణ - ఆగష్టు, 2017

ప్రతులు : 500

వెల : రూ. 250/-

**ప్రతులకు :**
**ఎం పద్మావతి**
ఫ్లాట్ నెం. 5ఏ, మాదేటీ ఎన్‌క్లేవ్
49-33-8/6/9, రామకృష్ణనగర్
శాంతిపురం, విశాఖపట్నం-16
సెల్ : 9290102364

# ముందుమాట

మహాభారతం మహేతిహాసం. భారతదేశంలోనే గాకుండా ప్రపంచ సాహిత్యంలోనే దీనికి అద్వితీయమైన స్థానం ఉంది. లక్షకు పైగా శ్లోకాలతో కూడుకున్న ఇంత పెద్ద గ్రంథం ప్రపంచ సాహిత్యంలో మరొకటి లేదు. ఇందులో ధార్తరాష్ట్ర పాండవులకు సంబంధించిన ప్రధానాఖ్యానం చెప్పిన తీరు, మధ్యమధ్యలో వైవిధ్యభరితమైన కొన్ని వందల ఉపాఖ్యానాలు నిబంధించిన విధానం చాలా గొప్పది. ఈ గ్రంథం భారతీయుల జీవనవిధానం మీద చూపించిన ప్రభావం అనితరసాధ్యం. ప్రపంచంలోని ఇతర దేశాల్లో క్రైస్తవం, ఇస్లాం లాంటి కొత్త మతాలు పుట్టి కార్చిచ్చులాగా చాలా దేశాలకు వ్యాపించి అంతకు ముందున్న మతాలను, సంస్కృతీ సంప్రదాయాలను పూర్తిగా తుడిచిపెట్టి ఆయా దేశాల్లో కొలువు తీరాయి. భారతదేశంలో ఈ మతాలు ప్రవేశించి ఈ దేశస్థుల మీద చూపించిన ప్రభావం చాలా తక్కువ. ఇస్లాం, క్రైస్తవ మతాల వ్యాప్తికి ఆనాటి పాలకులు, మత సంస్థలు ఎంతగా ప్రయత్నించినప్పటికీ ఈ దేశ ప్రజల్లో చాలా తక్కువమంది మాత్రమే హిందూ మతాన్ని వదిలిపెట్టి ఇస్లాం, క్రైస్తవాలను స్వీకరించారు. అది కూడా ఈ దేశంలోని వర్ణ వ్యవస్థ, కుల వ్యవస్థల కారణంగా జరిగింది. ఈ దేశంలోని దళిత కులాల్లో కొందరు తమ కుల హైన్యాన్ని తొలగించుకోవడానికి హిందూమతాన్ని వదిలివేసి ఇస్లాం, క్రైస్తవాలను స్వీకరించారు. కొంతమంది స్వార్థంతో, మరికొంతమంది బలవంతంగా అగ్రకులస్థులు మతం మారినప్పటికీ మొత్తం మీద ఆ మతాలు ఇతర దేశాల్లో చూపించిన ప్రభావంతో పోలిస్తే మనదేశంలో వాటి ప్రభావం చాలా తక్కువే. దీనికి ప్రధాన కారణం మన భారత రామాయణ గ్రంథాలు. ఈ గ్రంథాల్లోని కథలు, పాత్రల ప్రవర్తన, నైతిక విలువలు, సంస్కృతీ సంప్రదాయాలు మొదలైనవి మన ప్రజల రక్తంలోనూ, నరనరాల్లోనూ జీర్ణించుకొని ఉండడం వల్ల వీరు ఆ మతాన్ని వదిలిపెట్టి కొత్త మతాలను స్వీకరించలేకపోయారు. అయితే కొత్త మతాల్లోని కొన్ని సంప్రదాయాలను హిందువులు స్వీకరించారు, స్వీకరిస్తున్నారు. అది హిందుమతంలోని విశాల దృక్పథాన్ని తెలియజేస్తుంది.

భారతీయుల మీద అనాది నుంచి నేటి వరకూ చాలా గొప్ప ప్రభావాన్ని చూపిస్తున్న మహాభారతాన్ని సంస్కృత భాషలో వ్యాసుడు రాసాడన్న విషయం అందరికీ తెలిసిందే. అయితే ప్రస్తుతమున్న మహాభారతంలో లక్షకు పైగా ఉన్న శ్లోకాలను అన్నింటినీ వ్యాసుడు రాయలేదు. వ్యాసుడు 'జయం' పేరుతో కేవలం 8,800 శ్లోకాల్లో ధార్తరాష్ట్ర పాండవులకు సంబంధించిన కథను రాశాడు. ఈ కథను వ్యాసుని శిష్యుడైన వైశంపాయనుడు సర్పయాగం చేస్తున్న జనమేజయునికి చెప్పినట్లుగా, ఈ సందర్భంలో ఆ కథను విన్న ఉగ్రశ్రవసుడు అనే పౌరాణికుడు

నైమిశారణ్యంలో సత్రయాగం చేస్తున్న శౌనకుడు మొదలైన ఋషులకు చెప్పినట్లుగా భారతంలో ఉంది. వైశంపాయనుడు వ్యాసుడు చెప్పిన 'జయం' కథను జనమేజయునికి చెబుతున్నపుడు జనమేజయునికి కలిగిన సందేహాలకు వివరణలు ఇవ్వటం వల్ల ఆ కథ 24,000 శ్లోకాలుగా పెరిగి భారతంగా పిలువబడిందని, ఈ భారత కథను ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలోని ఋషులకు చెప్పినపుడు శౌనకుడు అడిగిన ప్రశ్నలకు ఇచ్చిన వివరణలతో అది లక్షకు పైగా శ్లోకాలతో ఉన్న ప్రస్తుత మహాభారతంగా ఏర్పడిందని, ఆ విధంగా వ్యాసుడు రాసిన 'జయం' మూడు దశల్లో మహాభారతంగా పరిణామం చెందిందని ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారి లాంటి సంప్రదాయ సాహితీవేత్తలు అభిప్రాయపడ్డారు. ఈ అభిప్రాయం సమంజసంగా లేదు. ఎందుకంటే కథను వింటున్నవారు వెలిబుచ్చిన సందేహాలకు ఇచ్చిన సమాధానాల వల్ల మూలకథ మూడు నాలుగు రెట్లు పెరగదు. వ్యాసుడు రాసిన జయం కావ్యం వైశంపాయనుడు జనమేజయునికి చెప్పటం వల్ల 8,800 శ్లోకాల నుంచి ఇంచుమించు మూడు రెట్లు పెరిగి 24,000 శ్లోకాలుగా పరిణామం చెందే అవకాశం లేదు. అలాగే 24,000 శ్లోకాలతో కూడుకున్న భారత కథను ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలోని ఋషులకు చెప్పినపుడు ఆ కథ 24,000 శ్లోకాల నుంచి నాలుగు రెట్లు పైగా పెరిగి లక్ష శ్లోకాలుగా పరిణమించే అవకాశం లేదు. అందువల్ల జి.వి.సుబ్రహ్మణ్యంగారి అభిప్రాయం సమంజసం కాదని స్పష్టమవుతుంది. 8,800 శ్లోకాలతో ఉన్న 'జయం' లక్షకు పైగా శ్లోకాలతో మహాభారతంగా పరిణామం చెందాలంటే పండ్రెండు రెట్లకు పైగా పెరగాలి. కేవలం ముగ్గురి కారణంగా మూడు దశల్లో ఒక కావ్యం పండ్రెండు రెట్లకు పైగా పెరగటం అసాధ్యం.

హేతుబద్ధంగా పరిశీలిస్తే వ్యాసుడు రాసిన 'జయం' కావ్యం వ్యాసుని తర్వాత కాలంలో అనేకమంది సంస్కృత పండితులు, కవులు తమకు తెలిసిన కథలను, తోచిన కథలను అనేక శాస్త్ర విషయాలను రాసి భారతంలో చొప్పించారని చెప్పవచ్చు. అంటే 'జయం' కథ కొన్ని వందల సంవత్సరాల కాలంలో కొన్ని వందలమంది పండితుల చేతులు పడటం వల్ల మహాభారతంగా పరిణమించింది. అందువల్లనే ఇందులో పరస్పర భిన్నమైన విషయాలు, భిన్న శైలులు కన్పిస్తాయి. కొన్ని కథలు రెండు, మూడుసార్లు చెప్పబడ్డాయి. ఉదాహరణకు పరశురాముని కథ మూడుచోట్ల, కుమారస్వామి కథ మూడు చోట్ల, ఉదంకుని కథ రెండుచోట్ల, ఇంద్రుని బ్రహ్మహత్యా విభాగం కథ రెండుచోట్ల చెప్పబడ్డాయి. దీన్నిబట్టి భారత కవుల సంఖ్య అసంఖ్యాకమని తెలుస్తుంది.

వ్యాసుడు 'జయం' పేరుతో రాసిన ఈ కావ్యం కాలక్రమంలో అనేక చేర్పులు జరిగి మొదట భారతంగా ఆ తర్వాత అనేక ఉపాఖ్యానాలు చేర్చబడి మహాభారతంగా పరిణామం

చెందింది. ముఖ్యంగా ఈ గ్రంథానికి ప్రతులు తయారు చేసే సందర్భంలో ఈ చేర్పులు జరిగి ఉంటాయి. కాబట్టి ప్రస్తుత మహాభారతంలోని ఉపాఖ్యానాలు వ్యాసుడు రాసినవి కాదని అవన్నీ కాలక్రమంలో ప్రతిభావంతులైన సంస్కృత పండితులు రాసి చొప్పించినవని స్పష్టమవుతుంది. ఈ ఉపాఖ్యానాలు విశ్వసృష్టి, దేవతలు, ఆధ్యాత్మికాంశాలు, ఋషులు, గోవులు, అనేక ఇతర పశుపక్షులు, రాజనీతి, మోక్షం, పతివ్రతలు, వర్ణాశ్రమాలు, చక్రవర్తులు, బ్రాహ్మణ మాహాత్మ్యం, కృష్ణుని మాహాత్మ్యం, ఊర్ధ్వ అధోలోకాలు, ధర్మశాస్త్ర, అర్థశాస్త్ర, నీతిశాస్త్ర, వేదాంతశాస్త్రం మొదలైన అనేక విషయాలకు సంబంధించినవి ఉన్నాయి. ఇవన్నీ ఒకరు రాసినవి, ఒక కాలంలో రాసినవి కాదు. వేరు వేరు కాలాల్లో, వేరు వేరు వ్యక్తులు రాసినవి.

ఈ ఉపాఖ్యానాల్లో కొన్ని ఆనాటి జానపద కథాంశాలతో కూడిన కథలు ఉన్నాయి. అంటే ఆ నాడు లోకంలో మౌఖిక ప్రచారంలో ఉన్న జానపద కథలను అనుకరిస్తూ వాటిని ఆధారంగా చేసుకొని పండిత కవులు కల్పించిన కొన్ని కథలు సంస్కృత మహాభారతంలో ఉన్నాయి. ఇలాంటి వాటిని జానపద కథాంశ కథలు అనవచ్చు. కొన్ని అచ్చమైన జానపద కథలు ఉన్నాయి. మహాభారతంలో ఇలాంటి కథలు ఆది, శాంతి, అనుశాసన పర్వాల్లో ఎక్కువగా ఉన్నాయి. వన, సభ, ద్రోణ, కర్ణ, శల్య పర్వాల్లో ఒకటి రెండు చొప్పున ఉన్నాయి. వీటిలో 24 కట్టు కథలు, 9 ప్రాణి కథలు, 8 నీతి కథలు, 6 అద్భుత కథలు మొత్తం కలిపి 47 ఉన్నాయి.

'మహాభారతంలో జానపద కథాంశ కథలు' అనే ఈ గ్రంథంలో ఈ 47 కథలను గురించి విశ్లేషించాను. ఇందులో 5 అధ్యాయాలు ఉన్నాయి. మహాభారతంలో జానపద కథాంశ కథలు–ఉపోద్ఘాతం" అనే మొదటి అధ్యాయంలో జానపద కథల స్వరూప స్వభావాలను వివరించిన తర్వాత సంస్కృత మహాభారతంలోని ఆదిపర్వంలో అనుక్రమనికా పర్వం అనే ఉపపర్వంలో భారత రచనకు సంబంధించిన అమానుషాంశాలను హేతుబద్ధంగా విశ్లేషించి భారత కథ వ్యాసుడు రాయడానికి ముందు జానపద కవి చేత వీరగాథగా చెప్పబడి మౌఖిక ప్రచారంలో గాయక భిక్షుకుల చేత పాడబడుతూ ప్రసిద్ధి చెందిందని, ఆ తర్వాత వ్యాసుడు ఆ కథను తీసుకొని జయం పేరుతో ఇతిహాసంగా రచించాడని వివరించాను. "మహాభారతంలో కట్టు కథాంశ కథలు" అనే రెండవ అధ్యాయంలో సంస్కృత మహాభారతంలోని 24 కట్టు కథలను వాటిలోని జానపద కట్టుకథాంశాలను విశ్లేషించాను. "మహాభారతంలో ప్రాణి కథాంశ కథలు" అనే మూడవ అధ్యాయంలో మహాభారతంలోని 9 ప్రాణి కథలను, "మహాభారతంలో నీతి కథాంశ కథలు" అనే నాల్గవ అధ్యాయంలో భారతంలోని 8 నీతి కథలను గురించి, "మహాభారతంలో అద్భుత కథాంశ కథలు" అనే ఐదవ అధ్యాయంలో మహాభారతంలోని 6 అద్భుత కథలను గురించి విశదీకరించాను. ఈ కథల విశ్లేషణలో కవిత్రయం వారు తమ తెలుగు భారతంలో చేసిన ఔచిత్యవంతమైన మార్పులను, రామణీయకతను వివరించాను.

ఏదైనా ఒక విషయాన్ని గురించి వివరించేటపుడు ఇతర గ్రంథాల్లోని సదృశాంశాలను తీసుకొని పోల్చి తులనాత్మక పరిశీలన చేయడం అవసరం. ఈ కథల్లో "ప్రజాపతి పై మూడు వర్ణాలకు దాసులుగా శూద్రులను సృష్టించడం" అనే కట్టుకథలో రామాయణంలోని శంభూకవధ కథ, త్రిమతాచార్యులు తమ గ్రంథాల్లో శూద్రుల గురించి చెప్పిన అంశాలను వివరించాను. "బ్రహ్మహత్యాపాతక విభాగం కథ" భారతంలోనే కాకుండా రామాయణ, భాగవతాల్లో కూడా ఉంది. ఈ కథలన్నింటికీ మూలం కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహిత ద్వితీయ సంపుటంలో చెప్పిన మూడు కథలు. భారతంలోని బ్రహ్మహత్యా పాతకం విభాగం కథను వివరించే సందర్భంలో రామాయణ, భాగవత, కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితలోని కథలను గురించి కూడా విశ్లేషించాను. "ఉత్తంకుని కథ" భారతంలో రెండుచోట్ల ఉంది. ఈ కథలో చెప్పబడిన పౌష్యుని గురించిన కథ సంస్కృత రామాయణంలోనూ, సంస్కృత భాగవతంలోనూ ఉంది. ఉత్తంకుని కథను వివరించే సందర్భంలో రామాయణ, భాగవతంలోని కథలను కూడా వివరించాను. భారతంలోని "గరుడుని కథ"కు మూలం కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహిత షష్ఠకాండలో ఉంది. గరుడుని కథా సందర్భంలో ఈ అంశాన్ని కూడా వివరించాను. అంతేగాకుండా అవసరాన్ని బట్టి భారతంలోని బ్రాహ్మణ మాహాత్మ్యాన్ని వివరించే కథలను, బ్రాహ్మణ క్షత్రియ సంఘర్షనాత్మక కథలను, బ్రాహ్మణుల క్షత్రియ ద్వేషాన్ని తెలిపే కథలను విశ్లేషించాను. ఈ కథలు ఆయా కథల కాలంనాటి సాంఘిక, రాజకీయ పరిస్థితులను తెలుపుతున్నాయి. పరిశోధనలో వాస్తవాలను తెలపాలన్న ఉద్దేశ్యంతో భారతంలోని ఈ కథలను హేతు దృక్పథంతో విశ్లేషించాను.

జానపద విజ్ఞాన అధ్యయనం హేతు దృక్పథంతో కూడుకున్నది. మన ఇతిహాసాలు, పురాణాలు మొదలైన ప్రాచీన గ్రంథాల్లో జానపద విజ్ఞానాంశాలు చాలా ఉన్నాయి. ఈ గ్రంథాలను జానపద విజ్ఞాన దృక్పథంతో పరిశీలిస్తే ఎన్నో కొత్త విషయాలు వెలుగులోకి వస్తాయి. సంస్కృత మహాభారతంలో ఆనాటి విద్య, రాజకీయ, సామాజిక, సాంస్కృతికాంశాలు ఎన్నో ఉన్నాయి. 'జయం' పేరుతో ఇతిహాసంగా పుట్టిన ఈ కావ్యంలో తర్వాత కాలంలో భగవద్గీత లాంటి గంభీరమైన అంశాలు చేర్చబడి హిందూ మత గ్రంథంగా పరిణమించింది. జానపద విజ్ఞాన దృక్పథ పరిశీలన ఈ పరిణామాన్ని తెలుసుకోవడానికి ఉపయోగపడుతుంది. ప్రస్తుత గ్రంథం మహాభారతంలో జానపద కథాంశ కథలు అలాంటి దృక్పథంతో రాసినదే. ఈ గ్రంథం విజ్ఞుల మన్ననలను పొందుతుందని ఆశిస్తూ......

**– జయదేవ్**

# విషయ సూచిక

# మహాభారతంలో జానపద కథాంశ కథలు -ఉపోద్ఘాతం

జానపద విజ్ఞానం అతిప్రాచీన కాలం నుంచి ఒక తరం నుంచి మరొక తరానికి సాంప్రదాయికంగా సంక్రమిస్తున్న మహోన్నతమైన విజ్ఞానం. ఇది మానవుడు ఆదిమానవుని నుంచి ఆటవిక మానవుడుగా, ఆటవిక మానవుని నుంచి గ్రామీణ మానవునిగా, గ్రామీణ మానవుని నుంచి నాగరిక మానవునిగా పరిణామం చెందిన దశల్లోని సాహిత్యం, భాష, కళలు, జీవన విధానం, సాంఘి కాచారాలు మొదలైన వాటి నెన్నింటినో తెలియజేస్తుంది. జానపద విజ్ఞానం మన వేదాలు వేదాంగాలు, ఇతిహాసాలు, పురాణాలు, కావ్యాలు మొదలైన వాటిని చారిత్రక దృక్పథంతో హేతుబద్ధంగా పరిశీలించి విశ్లేషించడానికి తోడ్పడుతుంది. ఇలాంటి జానపద విజ్ఞానంలో సాహిత్యం, భాష, కళలు, వస్తుసంస్కృతి, సాంఘికాచారాలు అనే అయిదు అంశాలున్నాయి. వీటిలో సాహిత్యం ముఖ్యమైనది. దీన్ని జానపద సాహిత్యమని పిలుస్తున్నాం. ఇందులో గేయం, కథాగేయం, సామెత, పొడుపుకథ, కథ అనే అయిదు ప్రక్రియలున్నాయ. వీటిలో కథ విశిష్టమైనది. దీన్ని ఆంగ్లంలో “Folk tale” అని తెలుగులో జానపద కథ అని పిలుస్తున్నాం.

భారతదేశం జానపద కథలకు పుట్టినిల్లు లాంటిది. అతి ప్రాచీన కాలం నుంచి కథలు చెప్పడం ఈ దేశంలో ఉంది. సినిమాలు, టీ.వీ.లు లేని కాలంలో ప్రజలకు మంచి విజ్ఞాన వినోదాలను జానపద కథలు కలిగించాయి. గతంలో గ్రామాల్లో పెద్దలు పిల్లలు గూడా కథలు చెప్పుకునేవారు. తాతయ్యలు, బామ్మలు రాత్రిపూట తమ మనుమలు, మనుమరాళ్ళను దగ్గర పడుకోబెట్టుకొని వారికి అనేక కథలను చెప్పి నిద్ర పుచ్చేవారు. పిల్లలు కథలంటే చెవికోసుకుంటారు. కథలు చెప్పమని పెద్ద వారిని బ్రతిమాలుతారు. వారు చెప్పే కథలు వింటూ ఊకొడుతూ నిద్రపోతారు. పెద్దలు చెప్పే కథల్లో నీతి, దైవ భక్తి, ధర్మానురక్తి మొదలైన లక్షణాలుంటాయి. కథలు వినడం వల్ల ఇవన్నీ పిల్లలకు అలవడేవి. పెద్దలు చెప్పిన కథలను పిల్లలు తమలో తాము చెప్పుకునేవారు. తద్వారా పిల్లల్లో భాషాభివృద్ధి, కల్పనాశక్తి పెంపొందేవి. గ్రామాల్లోని ప్రజలు నాట్లు వేయటం, కలుపు తీయడం, కోత కోయడం మొదలైన పనులు చేసేటప్పుడు, పొలాలకు కాపలా కాసేటప్పుడు, వేరే ఊరికి కాలి నడకతో ప్రయాణించేటప్పుడు, తీరిక సమయాల్లో నలుగురు కలిసి కూర్చున్నప్పుడు అనేక రకాల జానపద కథలను చెప్పుకొని వినోదాన్ని పొందేవారు.

కథలు చెప్పడం ఒక కళ. కథలను అందరూ చెప్పలేరు. కథను అందంగా, వినే వారికి ఆసక్తికరంగా ఉత్సాహం కలిగే విధంగా చమత్కారంగా చెప్పాలి. ఇందు కోసం కథకుడు తడుము కోకుండా ధారాళంగా మాట్లాడగలగాలి. లోకజ్ఞుడుగా ఉండాలి. శ్రోతల వయస్సును, అనుభవాన్ని, సంస్కారాన్ని, గ్రహణ సామర్థ్యాన్ని, అభిరుచిని బట్టి కథను చెప్పాలి. కథకునికి సమయస్ఫూర్తి హాస్య ప్రియత్వం ఉండాలి. కథను చెప్పేటప్పుడు

మంచి సామెతలను, జాతీయాలను, అలంకారాలను ప్రయోగించాలి. మధ్యలో శ్రోతలకు కలిగే సందేహాలకు చక్కని వివరణ ఇవ్వగలగాలి. ఇలాంటి లక్షణాలున్నవాడు మంచి కథకుడుగా రానిస్తాడు. అలాగే శ్రోతలకు కూడా కొన్ని లక్షణాలుండాలి. కథకుడు కథను చెబుతున్నప్పుడు వినే వారిలో ఒకడు 'ఊ' కొట్టాలి. శ్రోతలు ఎంత మంది ఉంటే అంత మంది ఊ కొట్టకూడదు. ఒకరు మాత్రమే ఊ కొట్టాలి. అందరూ ఊ కొడితే ఒక్కొక్కరు ఒక్కొక్క రకంగా ఊ కొట్టి కథకునికి చిరాకు కలిగిస్తారు. అందువల్ల ఒక్కరు మాత్రమే ఊ కొట్టాలి. ఊ కొట్టేవాడు కథను జాగ్రత్తగా వింటూ కథకుడు కథను చెప్పే ధోరణికి తగినట్లుగా ఊ కొట్టాలి. అంటే కథకుడు కథను నెమ్మదిగా చెబుతున్నప్పుడు దానికి తగినట్లు నెమ్మదిగా, కథ వేగంగా, ఉత్సాహంగా సాగుతున్నప్పుడు అదే స్థాయిలో ఊ కొడుతూ కథకునికి మంచి ప్రోత్సాహాన్ని ఇవ్వాలి. అలా కాకుండా కథ వేగంగా సాగుతున్నప్పుడు ఊ కొట్టేవాడు నీరసంగా ఊ కొడితే కథకుడు కథను చెప్పలేడు. శ్రోతల్లో మిగిలిన వారు తాము కథను శ్రద్ధగా వింటున్నామని చెప్పడానికి అప్పుడప్పుడు కొన్ని సందేహాలను, వివరణలను అడగాలి. ఇలా అడగడం వల్ల శ్రోతలందరూ తను చెబుతున్న కథ పట్ల ఎంతో ఆసక్తిగా ఉన్నారని కథకుడు గ్రహించి మరింత ఉత్సాహంగా, ఆసక్తికరంగా కథను చెబుతాడు. జానపద కథను చెప్పేటప్పుడు ఊ కొట్టేవాడు తప్పని సరిగా ఉండాలి. ఊ కొట్టేవాడు లేకపోతే కథకుడు కథను చెప్పలేడు.

జానపద కథలను కల్పించిన వారు, మౌఖిక ప్రసారంలో వాటిని తరతరాలుగా చెప్పుకొని వాటిని ఇతర ప్రాంతాలకు వ్యాపింప చేసినవారు జానపదులు. జానపదులకు చదువుండదు. అయినప్పటికీ వారు మంచి ప్రతిభావంతులు, కల్పనా శక్తి, భావనా పటిమ ఉన్నవారు. లోకంలో జరిగే శృంగార, హాస్య, కరుణ, వీర, అద్భుతాంశాలకు సంబంధించిన అనేక సంఘటనలు జరిగినప్పుడు జానపద కవులు వాటికి స్పందించి ఆయా సంఘటనలను వివరిస్తూ తమ ప్రతిభా పాటవాలతో, కల్పనా సామర్థ్యంతో చక్కని కథను కల్పించి లోకం మీద వదిలివేస్తారు. అవి ఆ నోటా ఆ నోటా పాకి అనేక ప్రాంతాలకు వ్యాపిస్తూ అనేక మార్పులకు చేర్పులకు లోనవుతాయి. ఒక కథ పుట్టినప్పుడు ఒక విధంగా ఉండి కాలాంతరంలో దానిలో అనేక మార్పులు చేర్పులు చోటు చేసుకొని మరొక రకం కథగా రూపాంతరం చెందవచ్చు. ఉదాహరణకు ఒక చారిత్రక వీరుని కథ అది పుట్టినప్పుడు చారిత్రక కథ. అయితే కాలాంతరంలో అందులో వీరునికి సంబంధించిన పుట్టుక, పెరుగుదల, అతని సాహసాలు మొదలైన వాటికి సంబంధించి అనేక అద్భుత సంఘటనలు చోటు చేసుకొని అద్భుత కథగా మారిపోవచ్చు. ఈనాడు ప్రపంచ వ్యాప్తంగా చాలా భాషల్లో అనేక రకాల జానపద కథలు ప్రచారంలో ఉన్నాయి. అద్భుతకథలు, నీతికథలు, ప్రాణికథలు, కట్టుకథలు, హాస్యకథలు, స్త్రీలకథలు, పేదరాశి పెద్దమ్మకథలు, మోసగాండ్రకథలు, పురాణ కథలు, ఐతిహాసిక కథలు, శృంగార కథలు, బూతుకథలు మొదలైన అనేక రకాల కథలు దాదాపుగా అన్ని భాషల్లోనూ ఉన్నాయి. ఈ కథలకు వేరువేరుగా ప్రత్యేక లక్షణాలుంటాయి.

అద్భుత కథల్లో అద్భుత సంఘటనలకు ప్రాధాన్యత ఉంటుంది. నీతికథల్లో ప్రధానంగా నీతి చెప్పబడుతుంది. ప్రాణికథల్లో పశుపక్షి క్రిమి కీటకాదులకు ప్రాముఖ్యత ఉంటుంది. కట్టుకథల్లో లోకంలో ఉండే వస్తువులకు, ఆచారాలకు, నమ్మకాలకు కారణంగా ఒక కథ చెప్పబడుతుంది. హాస్యకథల్లో హాస్య సంఘటనలకు ప్రాధాన్యత ఉంటుంది. స్త్రీల కథల్లో స్త్రీలు ప్రధాన పాత్ర వహిస్తారు. పేదరాశి పెద్దమ్మ కథల్లో పేదరాశి పెద్దమ్మ అనే పాత్ర ప్రధానంగా ఉంటుంది. మోసగాండ్ర కథల్లో మోసగాండ్రు చేసే మోసాలు ప్రధానంగా చెప్పబడతాయి. ఇలా ఒక్కొక్క రకం కథల్లో ఒక్కొక్క అంశానికి ప్రాధాన్యత ఉంటుంది.

జానపద కథలు కథను చెప్పడమే ప్రధానంగా ఉంటాయి. ఈ కథల్లో ఎలాంటి ఆటంకం లేకుండా కథ సూటిగా సాగిపోతుంది. వీటిని సృష్టించిన జానపద కవులు, వీటిని చెప్పుకునే సాధారణ జానపదులు చదువు లేనివారు కావటం వల్ల వీటిలో సాహిత్యాంశాలుండవు. సంఘటనలకు తగినట్లుగా సన్నివేశాలను కల్పించి వాటిని చక్కగా నిర్వహించడం, చతురమైన సంభాషణలు, పాత్రచిత్రణ, వర్ణనలు, అలంకారాలు మొదలైన సాహిత్యాంశాలు జానపద కథల్లో తక్కువగా ఉంటాయి. లోకంలో మౌఖిక ప్రచారంలో ఉన్న జానపద కథల్లో మంచి వాటిని, తమకు నచ్చిన వాటిని పండిత కవులు గ్రహించి వాటికి సంభాషణలు, వర్ణనలు, అలంకారాలు, పాత్రచిత్రణ మొదలైన సాహిత్యాంశాలను జోడించి తమ కావ్యాల్లో చేర్చుకుంటూ ఉంటారు. మరికొందరు కవులు జానపద కథలను అనుకరిస్తూ కొన్ని కథలను తామే కల్పించి తమ కావ్యాల్లో చొప్పిస్తారు. ఈ రెండు రకాల కథలు సంస్కృత భారతంలో ఉన్నాయి.

భారతీయ సాహిత్యంలో మహాభారతానికి గొప్ప ప్రసిద్ధి, ప్రచారం ఉన్నాయి. సంస్కృత భాషలో వ్యాసుడు రాసిన ఈ గ్రంథం ఇతిహాసంగా పిలువబడి మిగిలిన భారతీయ భాషలన్నింటినీ ఎంతగానో ప్రభావితం చేసింది. భారతీయ భాష లన్నింటిలోకి ఈ మహేతిహాసం అనువదింప బడింది. ఇందులోని ప్రధాన కథను, ఉపాఖ్యానాలను ఆధారంగా చేసుకొని సంస్కృతంలోనూ, ఇతర భాషల్లోనూ కావ్యాలు, నాటకాలు మొదలైన అనేక ప్రక్రియల్లో ఎన్నో రచనలు వచ్చాయి. ఈ గ్రంథం మరొక ప్రసిద్ధేతిహాసమైన రామాయణం కంటే పరిమాణంలో నాలుగు రెట్లు పెద్దది. ఐరోపా దేశాల్లో మహేతిహాసాలుగా పిలువబడుతున్న ఇలియడ్, ఒడిస్సీ అనే రెండూ కలిపినా అవి మహాభారతం కంటే చిన్నవే. ఇంత పెద్ద కథ, ఇన్ని ఉపాఖ్యానాలు, వైవిధ్యభరితమైన ఇన్ని పాత్రలు ప్రపంచంలో మరే గ్రంథంలోనూ లేవు. ఇలాంటి మహాభారతానికి తత్కర్త అయిన వ్యాసుడు పెట్టిన పేరు "జయం". వ్యాసుని తర్వాత కాలంలో ఈ గ్రంథంలో కొన్ని చేర్పులు జరిగి మొదట "భారతం"గా, ఆ తర్వాత కాలంలో మరిన్ని చేర్పులు జరిగి మహాభారతంగా పిలువ బడింది. ఇందులోని కథ భరతవంశీయులైన ధార్తరాష్ట్రులకు పాండవులకు సంబంధించినది కావడం చేత ఇది భారతంగా పిలువ బడింది. ప్రస్తుతం ఈ గ్రంథంలో లక్షకు పైగా శ్లోకాలున్నాయి.

సంస్కృత భారతంలో భారత కథ చెప్పబడిన విధానం గురించి ఒక కల్పన చేయబడింది. నైమిశారణ్యంలో శౌనకుడు అనే ఋషి ఆధ్వర్యంలో ద్వాదశ వర్ష సత్ర యాగం చేస్తున్న ఋషులకు ఉగ్రశ్రవసుడు అనే పౌరాణికుడు భారత కథను చెప్పడంతో మహాభారతం మొదలవుతుంది. భారతాన్ని వ్యాసుడు రాసి దాన్ని తన శిష్యులకు చెప్పాడని, వారిలో వైశంపాయనుడు వ్యాసుని ఆజ్ఞతో హస్తినాపురంలో సర్పయాగం చేస్తున్న పాండవుల మునిమనుమడైన జనమేజయునికి చెప్పాడని, ఆ సమయంలో తాను అక్కడ ఉండి భారత కథను విన్నానని, దాన్ని ఋషులకు చెబుతానని ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలోని ఋషులకు చెబుతాడు. జనమేజయుని తండ్రి పరీక్షిన్మహారాజు. ఇతడు అభిమన్యునికి ఉత్తర వల్ల జన్మించిన కుమారుడు. ఇతడు శృంగి అనే ఋషి శాపం కారణంగా తక్షకుడు అనే నాగుని చేత కాటు వేయబడి మరణిస్తాడు. దానికి కోపించిన జనమేజయుడు ఉత్తంకుని ప్రేరణతో సర్పజాతిని నాశనం చేయాలన్న ఉద్దేశ్యంతో సర్పయాగం చేస్తాడు. ఈ సర్పయాగం జరిగిన విధానం భారతం ఆదిపర్వం 52 నుంచి 56 వరకు ఉన్న అయిదు అధ్యాయాల్లో ఇలా ఉంది. సర్పయాగంలో ఋత్విజులు మంత్రోచ్చారణలతో అగ్నిని ప్రజ్వలింప జేసి హోమం చేస్తూ యాగాగ్నిలోకి సర్పాలను ఆహ్వానించారు. ఋత్విజుల మంత్ర ప్రభావంతో

**"తతః సర్పాః సమాపేతుః ప్రదీప్తే హవ్యవాహనే**
**విచేష్టమానాః కృపణం ఆహ్వాయంతః పరస్పరమ్"**

**(ఆది. 52 – 4వ శ్లోకం)**

"సర్పాలన్నీ చేష్టలు దక్కి దీనంగా ఒకరినొకరు పిలుచుకుంటూ ప్రజ్వరిల్లుతున్న హోమ గుండంలో పడిపోతున్నాయి".

**"శ్వేతాః కృష్ణాశ్చ నీలాశ్చ స్థవిరాః శిశవస్తథా**
**నదంతో వివిధాన్ నాదాన్ పేతుర్దీప్తే విభావసౌ"**
**"క్రోశయోజన మాత్రాహి గోకర్ణస్య ప్రమాణతః**
**పతంత్యజస్రం వేగేన వహ్నౌ వగ్ని మతాంవర"**

**(ఆది. 52 – 6,7 శ్లోకాలు)**

"తెల్లని నల్లని నీల సర్పాలు, వృద్ధ, శిశు సర్పాలు ఆర్తనాదాలు చేస్తూ అగ్ని గుండంలో పడిపోతున్నాయి. కొన్ని క్రోసు పొడవున్న సర్పాలు, మరికొన్ని నాలుగు క్రోసులు పొడవున్న సర్పాలు, మరికొన్ని గోకర్ణమంత ప్రమాణం కల చిన్న సర్పాలు అన్నీ హోమాగ్నికి ఆహుతై పోతున్నాయి".

**"ఏవం శతసహస్రాణి ప్రయుతాన్యర్భుదానిచ**
**అవశాని వినష్టాని పన్నగానాంతు తత్రవై"**

**(ఆది. 52 – 8వ శ్లోకం)**

"ఈ విధంగా లక్షల, కోట్ల సర్పాలు ఆ అగ్నిలో పడి భస్మమైపోయాయి". ఇలా సర్పయాగం జరుగుతున్నప్పుడు ఆస్తీకుడు అనే ఋషి బాలకుడు అక్కడికి వచ్చి జనమేజయుని, అతడు

చేస్తున్న సర్పయాగాన్ని అదే పనిగా గొప్పగా ప్రశంసిస్తాడు. అతని ప్రశంసకు పొంగిపోయిన జనమేజయుడు వరం కోరుకోమని ఆస్తీకునికి చెబుతాడు. అదే సమయంలో పరీక్షిత్తును చంపిన తక్షకుడు యజ్ఞగుండంలో పడడానికి ఆకాశంలో సిద్ధంగా ఉంటాడు. జరుగుతున్న సర్పయాగాన్ని వెంటనే ఆపివేయాలని ఆస్తీకుడు కోరతాడు. ఇచ్చిన మాటకు కట్టుబడి జనమేజయుడు సర్పయాగాన్ని విరమిస్తాడు. దానితో తక్షకుడు యజ్ఞగుండంలో పడకుండా బతికిపోతాడు. ఈ సర్పయాగం జరుగుతున్న సమయంలో యజ్ఞకర్మల మధ్యలో వైశంపాయనుడు జనమేజయుడు మొదలైన వారికి భారతకథను చెప్పాడు.

పై సర్పయాగ వృత్తాంతంలోని హేతుబద్ధతను పరిశీలించుదాం. జనమేజయుడు చేసిన సర్పయాగంలో నాగులు నాశనం కావడానికి ప్రధాన కారణం నాగుల తల్లి అయిన కద్రువ శాపం. కద్రువ తన సవతి అయిన వినతతో ఉచ్చైశ్రవం అనే గుర్రం యొక్క తోక నల్లగా ఉందని పందెం వేస్తుంది. నిజానికి ఆ గుర్రం తోకతోపాటు పూర్తిగా తెల్లగా ఉంటుంది. పందెం గెలవడానికి కద్రువ గుర్రం తోకను నల్లగా చేయమని తన కుమారులైన వేయి మంది నాగులకు చెబుతుంది. నాగులు దానికి అంగీకరించక పోవడంచేత కద్రువ కోపించి జనమేజయుడు చేసే సర్పయాగంలో నాగులు నశిస్తారని శపిస్తుంది. అయితే తక్షకుడు లాంటి వారు ఆ తర్వాత తల్లి చెప్పిన పని చేసి ఆమె పందెంలో గెలిచేలాగా చేస్తారు. ఈ కథ కృతయుగంలో జరిగిన కథ. జనమేజయుడు కలియుగ ప్రారంభంలో సర్పయాగం చేసినట్లు భారతంలో ఉంది. కృతయుగానికి 17,28,000 సంవత్సరాలు, త్రేతా యుగానికి 12,96,000 సంవత్సరాలు, ద్వాపర యుగానికి 8,64,000 సంవత్సరాల కాలాన్ని మన పూర్వులు నిర్ణయించారు. ఈ మూడు యుగాలు కలిపితే 38,88,000 సంవత్సరాలు. అంటే కద్రువ నాగులకు ఇచ్చిన శాపం 38 లక్షల సంవత్సరాల తర్వాత కలియుగంలో జరిగిందని చెప్పాలి. ఇది ఏ మాత్రమూ నమ్మదగిన విషయం కాదు. కద్రువ శాపం వల్ల 38 లక్షల సంవత్సరాల తర్వాత జనమేజయుడు పుట్టి సర్పయాగం చేశాడని చెప్పడం కేవలం కల్పన మాత్రమే. కద్రువకు ఆదిశేషుడు మొదలైన వేయి మంది బలపరాక్రమాలు కలిగిన నాగులు పుట్టినట్లుగా, వినతకు అద్భుత బలసంపన్నుడైన గరుడుడు పుట్టినట్లుగా చెప్పిన ఈ కథ జానపద కథల ప్రభావంతో పండిత కవి కల్పించిన అద్భుతకథ. అది ఏమాత్రం వాస్తవం కాదు. స్త్రీలకు పాములు, పక్షులు పుట్టవు. భూమి మీద పాములు, పక్షులు, మానవులు మొదలైన ప్రాణులు కాలాంతరంలో పరిణామం ద్వారా ఏర్పడ్డారు. అందువల్ల కద్రువ నాగులను శపించిన విషయం వాస్తవం కాదు. అది పండితకవి కల్పన మాత్రమే.

అలాగే సర్పయాగం విషయం కూడా వాస్తవం కాదు. యజ్ఞ సమయంలో ఋత్విజులు మంత్రాలు పఠిస్తూ నాగుల పేర్లు పెట్టి పిలిచేసరికి ఆ మంత్రాల ప్రభావంతో ఎక్కడెక్కడో ఉన్న పాములు, ఆకాశంలో ఎగురుకుంటూ వచ్చి హాహాకారాలు చేస్తూ యజ్ఞగుండంలో పడిపోయినట్లుగా భారతంలో చెప్పబడింది. ఈ నాగులు సామాన్యమైనవి

కాదు. కొన్ని క్రోసు దూరమంత పొడవైనవి, మరి కొన్ని యోజనం దూరమంత పొడవైనవి, కొన్ని గోకర్ణమంత స్వల్ప ప్రమాణం కలవి ఉన్నాయి. క్రోసు అంటే రెండు మైళ్ళ దూరం, యోజనమంటే ఎనిమిది మైళ్ళ దూరం, గోకర్ణమంటే మానవుల బొటనవేలుకు చూపుడువేలుకు మధ్య ఉన్న దూరం. ఇలాంటి సర్పాలు లక్షలు, కోట్లు వచ్చి యజ్ఞగుండంలో పడి బూడిద అయిపోయాయట. ఎనిమిది మైళ్ళ పొడవున్న వేలు లక్షల కొలదిగా సర్పాలు పడి చావాలంటే యజ్ఞగుండం కొన్ని వందల మైళ్ళ విస్తీర్ణం కలిగి ఉండాలి. అందులో మంటలు జాజ్వల్యమానంగా విజృంభించాలంటే ఎన్ని సమిధలు వేయాలి? ఎంత నెయ్యి వేయాలి? అంత పెద్ద మంటలు విజృంభిస్తే యజ్ఞం చేసే బ్రాహ్మణులు మంట దరిదాపులో ఉండగలరా? అనే విషయాలు ఊహిస్తే సర్పయాగం ఆచరణ సాధ్యమైనది కాదని తెలుస్తుంది. ఋత్విజులు పఠించే మంత్రాల మహిమ వల్ల వారు పేరు పెట్టి పిలిచిన పెద్ద చిన్న సర్పాలు ఆకాశంలో ఎగురుకుంటూ వచ్చి యజ్ఞ గుండంలో పడ్డాయని చెప్పడం హేతుబద్ధమైనది కాదు. లక్షలు, కోట్లుగా ఉన్న సర్పాలకు వేరు వేరు పేర్లుండాలి. పేర్లన్నీ ఋత్విజులకు తెలిసి ఉండాలి. అప్పుడే వారు పేరుపెట్టి పాములను పిలువగలరు. కానీ లోకంలో సర్పాలకు పేర్లు ఉండవు. ఒకవేళ ఉన్నా కోట్ల సర్పాల పేర్లు వారికి తెలిసే అవకాశం లేదు. అలాగేవారు చెప్పే మంత్రాలకు కూడా ఎలాంటి మహిమ లేదు. కాకపోతే మంత్రాల బాణీ (Tune) కర్ణపేయంగా ఉండి మనస్సుకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. కాబట్టి భారతంలో చెప్పినట్లుగా ఋత్విజులు నాగుల పేర్లు చెప్పి మంత్రాలు పఠించడం వల్ల ఆ నాగులందరూ ఎగిరివచ్చి యజ్ఞగుండంలో పడి చనిపోయాయని చెప్పడం వాస్తవం కాదు. అది అతిశయోక్తులతో కూడిన అద్భుత కల్పన. ఈ కారణంచేత గూడా సర్పయాగం జరుగలేదని చెప్పవచ్చు.

భారతంలోని సర్పయాగాన్ని గురించి హేతుబద్ధంగా ఆలోచిస్తే ఒక విషయం తెలుస్తుంది. జనమేజయుని తండ్రి పాము కాటు చేత చనిపోయి ఉండవచ్చు. దానికి జనమేజయుడు కోపించి పాముల మీద పగబట్టి తన సేవకుల చేత చాలా పాములను చంపించి ఉండవచ్చు. దీన్ని కవి సర్పయాగంగా భారతంలో కల్పించి ఉంటాడు. దీనికి భారతంలోనే ఉదాహరణ ఉంది. ఆదిపర్వంలోని పౌలోమపర్వం అనే ఉపపర్వంలో రురు ప్రమద్వరల వృత్తాంతముంది. ఈకథలో రురువు ఒక ఋషి కుమారుడు, ప్రమద్వర విశ్వావసువు అనే గంధర్వుని వల్ల అప్సరస అయిన మేనకకు జన్మిస్తుంది. ఈమె పుట్టిన వెంటనే మేనక ఆ శిశివును వదిలివేసి తన దారిన తాను వెళ్ళిపోతుంది. ఆ శిశివును స్థూలకేశ మహర్షి అనే ఋషి తెచ్చి ఆమెకు ప్రమద్వర అనే పేరు పెట్టి పెంచి పెద్దచేస్తాడు. రురువు ఆమెను చూసి మోహించి పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు. పెద్దలు వారి పెళ్ళి నిర్ణయిస్తారు. ఈలోగా ప్రమద్వర ఒక పాము కాటు చేత మరణిస్తుంది. రురువు తన ఆయుస్సులో సగభాగం ప్రమద్వరకు ధారపోసి ఆమెను బ్రతికించుకొని పెళ్ళి చేసుకొంటాడు. తన ప్రియురాలైన ప్రమద్వరను కాటువేసి చంపిన పాము మీది కోపంతో రురువు పాములను చంపాలని దీక్ష వహించి కనిపించిన ప్రతి పామును కర్రతో కొట్టి చంపుతూ వుంటాడు.

అయితే ఒక ఋషి చేసిన అహింసా బోధ వల్ల పాములను చంపడం మానివేస్తాడు. జనమేజయుడు కూడా రురువు లాగానే పాముల మీద కోపం వహించి తన అనుచరులచేత కనిపించిన ప్రతి పామును చంపించి ఉంటాడు. దీన్నే పండిత కవి సర్పయాగంగా భారతంలో చెప్పి ఉంటాడు.

జనమేజయుడు అనేక వ్యయ ప్రయాసలకోర్చి పగతో పట్టుబట్టి చేస్తున్న సర్పయాగాన్ని ఋషిబాలకుడైన ఆస్తీకుని కోరిక ననుసరించి విరమించడం ఆనాటి రాజుల బ్రాహ్మణ భక్తిని తెలుపుతూ ఉంది. భారతంలో చాలా కథల్లో రాజుల బ్రాహ్మణ భక్తి వివరింప బడింది. ఈ కథలను రాసిన వారందరూ బ్రాహ్మణులే కాబట్టి వీరు సమాజం మీద తమ పెత్తనం కలకాలం ఉండేటట్లుగా ఇలాంటి కథలను కల్పించారు. రాజులే బ్రాహ్మణులు చెప్పినట్లుగా నడుచుకుంటున్నప్పుడు సాధారణ ప్రజలు గురించి చెప్పేదేముంది.

పై అంశాలన్నింటినీ బట్టి భారతంలోని సర్పయాగం కథ వాస్తవం కాదని కవి కల్పన అని స్పష్టమవుతుంది. సర్పయాగం జరగలేదు కాబట్టి వైశంపాయనుడు జనమేజయునికి భారత కథను చెప్పలేదు. వైశంపాయనుడు చెప్పలేదు కాబట్టి ఉగ్రశ్రవసుడు భారత కథను వినే అవకాశం, నైమిశారణ్యంలోని ఋషులకు చెప్పే అవకాశం లేదు. దీన్నిబట్టి వైశంపాయనుడు జనమేజయునికి భారత కథను చెప్పినట్లుగా దాన్ని విని ఉగ్రశ్రవసుడు శౌనకుడు మొదలైన ఋషులకు భారత కథను చెప్పినట్లుగా రాయడం కేవలం కల్పన అని స్పష్టంగా తెలుస్తుంది. భారత కథకు పవిత్రతను, ప్రసిద్ధిని కలిగించడానికి వ్యాసుని తర్వాత కాలంలో ఇలాంటి కల్పనలను చేశారు. భారతం ఒక్కటేకాదు, వ్యాసుని రచనలుగా చెప్పబడుతున్న భాగవతం, అష్టాదశ పురాణాలు అన్నింటినీ సూతుడుగా పిలువ బడుతున్న ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలోని ఋషులకు చెప్పినట్లుగా ఆయా గ్రంథాల్లో ఉంది. ఈ దేశంలో ఋషులకు శాపానుగ్రహ సమర్థులుగా గొప్ప పేరు ప్రఖ్యాతులున్నాయి. వారు ఏదైనా కథకు శ్రోతలుగా ఉంటే ప్రజలకు ఆ కథ మీద గట్టి నమ్మకం, పవిత్రభావం కలుగుతాయి. భారత, భాగవతాది గ్రంథాలకు ప్రజల్లో పవిత్రతను నమ్మకాన్ని కలిగించడానికి ఇలాంటి కల్పన చేశారు.

భారత రచనకు సంబంధించి రెండు అభూత కల్పనలు భారతంలో ఉన్నాయి. ఈ రెండింటిని గురించి ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలోని ఋషులకు చెబుతాడు.

**1. "పరాశరాత్మజో విద్వాన్బ్రహర్షిః సంశితవ్రతః**
**తదాఖ్యాన వరిష్టం స కృత్వా ద్వైపాయనః ప్రభుః"**
**"కథమధ్యాపయానీహ శిష్యానిత్యన్వచింతయత్**
**తస్య తచ్చింతతం జ్ఞాత్వాఋషేర్ద్వైపాయనస్య చ"**
**(ఆది. 1 – 55,56 శ్లోకాలు)**

"పరాశరాత్మజుడు, బ్రహ్మర్షి అయిన ద్వైపాయనుడు దీక్ష వహించి పుణ్య ప్రదమైన ఈ భారతకథను చెప్పిన తర్వాత దాన్ని శిష్యులకు ఎలా బోధించాలి అని ఆలోచించాడు". అప్పుడు లోక గురువైన బ్రహ్మదేవుడు అక్కడికి వస్తాడు. వ్యాసుడు బ్రహ్మతో "కృతం మయేదం భగవాన్ కావ్యం పరమ పూజితం" పరమ పూజ్యమైన ఈ కావ్యం నా చేత రచింప బడింది అని చెప్పి

**"యచ్చాపి సర్వం వస్తు తచ్చైవ ప్రతిపాదితం**
**పరం న లేఖకః కశ్చిదేతస్య భువి విద్యతే"**
**(ఆది. 1 – 70వ శ్లోకం)**

"భారతంలో అన్ని వస్తువులను గురించి చెప్పబడింది. కాని దీన్ని రాయడానికి తగిన లేఖకుడు భూమి మీద కనపడలేదు" అని చెబుతాడు. అప్పుడు బ్రహ్మ "త్వయాచ కావ్య మిత్యుక్తం తస్మాత్కావ్యం భవిష్యతి" నువ్వు దీన్ని కావ్యమన్నావు కాబట్టి ఇది కావ్యమే అవుతుంది. గృహస్థాశ్రమానికి మిగిలిన మూడు ఆశ్రమాలు సమానం కానట్లుగా నీ కావ్యంతో సమానమైనది మరెవరిది లేదు. "కావ్యస్య లేఖనార్థాయ గణేశః స్మర్యతాం మునే" ఈ కావ్యాన్ని రాయడానికి గణేశుని స్మరించు అని చెబుతాడు. బ్రహ్మ చెప్పినట్లుగానే వ్యాసుడు గణేశుని స్మరిస్తాడు. వెంటనే విఘ్నేశ్వరుడు అక్కడికి వచ్చి వ్యాసుని కోరిక మీద భారతానికి లేఖకుడవుతాడు. అంటే వ్యాసుడు చెబుతూ ఉంటే గణేశుడు భారతాన్ని రాస్తాడు.

పై వృత్తాంతంలో వ్యాసుడు చెప్పిన భారత కావ్యం గొప్పతనం తెలుసుకొని వాగ్దేవి భర్త అయిన బ్రహ్మదేవుడు తనకు తానుగా వ్యాసుని దగ్గరికి వచ్చి భారతాన్ని ప్రశంసించి దానికి లేఖకుడుగా గణేశుని సూచించాడు. దీన్ని బట్టి భారతానికి లేఖకులుగా మానవులు పనికి రారనేది బ్రహ్మ ఉద్దేశ్యం. ఈ వృత్తాంతం కూడా వ్యాసుని తర్వాత కాలంలో కల్పింప బడినదే. భారతం సామాన్యమైన కావ్యం కాదు, అది చాలా పవిత్రమైనదని చాటి చెప్పడానికి ఈ కల్పన చేయబడింది. భారతంలోనే కాదు రామాయణం, ఆధ్యాత్మ రామాయణం మొదలైన గ్రంథాల్లో కూడా ఇలాంటి కల్పనలు ఉన్నాయి. రామాయణంలో బ్రహ్మ వాల్మీకి వద్దకు వచ్చి

**"మచ్ఛన్దాదేవ తే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ**
**రామస్య చరితం సర్వం కురు త్వమృషి సత్తమ"**
**(శ్రీమద్రామయణం, బాల – 2 వ సర్గ, 31వ శ్లోకం)**

"ఋషిశ్రేష్ఠుడా నా సంకల్పాన్ని అనుసరించి ఈ వాక్కు ('మానిషాద ప్రతిష్ఠాం' అనే శ్లోకం) నీలో ప్రవర్తిల్లింది. రామ చరితాన్ని పూర్తిగా ఈ ఛందస్సులోనే నువ్వు రచించు".

**"ధర్మాత్మనో గుణవతో లోకే రామస్య ధీమతః**
**వృత్తం కథయ ధీరస్వ యథ తే నారదాచ్ఛృతమ్"**
**(శ్రీమద్రామయణం, బాల – 2వ సర్గ, 32వ శ్లోకం)**

"రాముడు ధర్మాత్ముడు. గుణవంతుడు, గొప్ప ప్రజ్ఞాశాలి. అలాంటి రాముని చరిత్రను నారదుని నుంచి నువ్వు విన్నది విన్నట్లుగా చెప్పు" అని వాల్మీకితో చెప్పినట్లుగా ఉంది. దీన్ని బట్టి ప్రాచీన గ్రంథాల రచనలో బ్రహ్మదేవుని ప్రమేయాన్ని మన పూర్వ కవులు కల్పించినట్లుగా తెలుస్తుంది. కావ్యం సరస్వతీ స్వరూపంగా మన కవులు భావించారు. బ్రహ్మ సరస్వతి భర్త కావడం చేత, సృష్టికర్త కావడం చేత మన పూర్వ కవులు ఇలాంటి కల్పనలు చేశారు. రామాయణ భారతాల్లోనే కాకుండా మరి కొన్ని ప్రాచీన గ్రంథాల్లో

కూడా ఇలాంటి కల్పనలున్నాయి. అధ్యాత్మ రామాయణంలో పరమేశ్వరుడు పార్వతికి రామాయణ కథను చెప్పినట్లుగా చెప్పబడింది. అంతేగాకుండా ఈశ్వరుడు గొప్ప రామభక్తునిగా ఇందులో చెప్పబడ్డాడు. పార్వతి పరమేశ్వరునితో

**"శ్రీ రామస్య కథా త్వత్వ: శ్రుత సంక్షేపతో మయా**
**ఇదానీం శ్రోతు మిచ్ఛామి విస్తరేణ స్ఫుటాక్షరమ్'**
**(అధ్యాత్మ రామాయణం – బాలకాండ – 2వ సర్గ – 3వ శ్లోకం.)**

"నేను మీ నోటి వెంట శ్రీరామకథను సంక్షేపంగా విన్నాను. దాన్ని విస్తార పూర్వకంగా వినగోరుతున్నాను" అని పల్కుతుంది. దానికి పరమేశ్వరుడు

**"శ్రుణు దేవి ప్రవక్ష్యామి గుహ్యాద్ గుహ్యతరం మహత్**
**అధ్యాత్మ రామచరితం రామేణోక్తం పురా మమ"**
**(అధ్యాత్మ రామాయణం – బాలకాండ – 2వ సర్గ – 4వ శ్లోకం.)**

"పూర్వం నాకు రాముడు వినిపించిన గుహ్యాతిగుహ్యమూ, మహత్తరమూ అయిన అధ్యాత్మ రామాయణం వినిపిస్తాను" అని చెప్పి అధ్యాత్మ రామ కథను చెపుతాడు. తులసీదాసు రామచరిత మానసం గ్రంథంలో ఆ కథను శివుడు మొదట పార్వతికి, ఆ తరువాత రామభక్తుడైన కాకభుశుండినికి చెప్పినట్లు, కాకభుశుండుడు యాజ్ఞవల్క్యమునికి, ఆ ముని భరద్వాజమునికి చెప్పినట్లు, దాన్ని తులసీదాసు తన గురువు ద్వారా బాల్యంలో విన్నట్లు, తాను విన్న ఆ కథను సరళమైన భాషలో కవితాబద్ధం చేస్తానని ఇలా చెప్పుకున్నాడు.

**"జాగబలిక జో కథా సుహాఈ భరద్వాజముని బరహి సునాఈ**
**కహిహఉ సొఇ సంబాద బఖానీ సునహు సకల సజ్జన సఖు మానీ**
**సంభుకీన్హ యహ చరిత సుహావా బహురి కృపాకరి ఉమహి సునావా**
**సొఇ సివ కాగభుసుండిహి దీన్హా రామభగత అధికారీ చీన్హా**
**తెహి సన జాగబలిక పుని పావా తిన్హపుని భరద్వాజ ప్రతిగావా**
**తేశ్రోతా బకతా సమ సీలా సవదరసీ జౌనహి హరిలీలా"**
**(రామచరిత మానసం –బాలకాండ – 29వ దోహ–1,2,3 చౌపాయి)**

అంతేగాకుండా రామచరిత మానసం గ్రంథంలో శివపార్వతులు రామునికి వీరభక్తులుగా చెప్పబడ్డారు. ఇవన్నీ వాస్తవాలు కావు. కవుల కల్పనలు. తమ కథకు దేవతలు, ఋషులు వక్తలుగా శ్రోతలుగా వుంటే ఆ కావ్యానికి పవిత్రత, ప్రజలలో ప్రసిద్ధి కలుగుతాయని భావించి ఆ కావ్యకర్తలు ఈ కల్పనలు చేశారు. వీటిలో అధ్యాత్మ రామయణం, రామచరిత మానసం గ్రంథాల్లోని కల్పనలు వీరవైష్ణవ కవులు చేసిన కల్పనల శాఖకు చెందుతాయి. వీరవైష్ణవులు తాము రాసే గ్రంథాల్లో శివుణ్ణి విష్ణుభక్తునిగా, వీరశైవులు తమ గ్రంథాల్లో విష్ణువును శివభక్తునిగా చిత్రిస్తారు. అధ్యాత్మ రామాయణ, రామచరిత మానసం గ్రంథాల్లో ఆ కావ్యకర్తలు విష్ణ్వవతారుడైన రాముని భక్తునిగా శివుని చిత్రించారు. ఈ కల్పన సమంజసమైనది కాదు. ఎందుకంటే పార్వతి పరమేశ్వరులు ఆదిదంపతులుగా మన పురాణాలలో ప్రసిద్ధులు.

వీరు రాముని కంటే చాలా పూర్వులు. అలాంటి వీరిని రామభక్తులుగా చిత్రించడం ఉచితం కాదు.

**2. "షష్టిశతసహస్రాణి చకారన్యాం స సంహితమ్**
**త్రింశచ్ఛత సహస్రం చ దేవలోకే ప్రతిష్ఠితం"**
**"పిత్రే పంచదశ ప్రోక్తం గంధర్వేషు చతుర్దశాః**
**ఏకం శతసహస్రం తు మానుషేషు ప్రతిష్ఠితం"**
**(ఆది. 1 - 104, 105 శ్లోకాలు)**

"వ్యాసుడు 60 లక్షల శ్లోకాలతో ఇంకొక సంహితను ఇచ్చాడు. వీటిలో 30 లక్షల శ్లోకాలు దేవలోకంలో ప్రతిష్ఠింపబడ్డాయి. పితృలోకంలో 15 లక్షలు, గంధర్వ లోకంలో 14 లక్షలు. లక్ష శ్లోకాలు మనుష్య లోకంలో ప్రతిష్ఠింపబడ్డాయి".

**"నారదో శ్రావయద్దేవానసితో దేవలః పితౄన్**
**గంధర్వ యక్షాం రక్షాంసి శ్రావయామాస వై శుకః"**
**(ఆది. 1 - 106వ శ్లోకం)**

"నారదుడు దేవ లోకంలోను, అసితుడయిన దేవలుడు పితృ లోకంలోను, శుకుడు గంధర్వ, యక్ష, రాక్షసులకు వినిపించారు".

**"అస్మిన్స్తు మానుషే లోకే వైశంపాయన ఉక్తవాన్**
**శిశ్యో వ్యాసస్య ధర్మాత్మా సర్వవేద విదాం వరః**
**ఏకం శత సహస్రం తు మయోక్తం వైనిబోధత"**
**(ఆది. 1 -107వ శ్లోకం)**

"మనుష్య లోకంలో వ్యాసుని శిష్యుడు, సర్వవేదవేత్త, ధర్మాత్ముడు అయిన వైశంపాయనుడు చెప్పాడు. దాన్ని మీకు చెబుతానని" ఉగ్రశ్రవసుడు ఋషులకు చెబుతాడు.

వైశంపాయనుడు భూలోకంలో చెప్పిన లక్ష శ్లోకాల విషయం భారతమను కుంటే దేవలోకంలో నారదుడు చెప్పిన 30 లక్షలు శ్లోకాల్లోని విషయం, పితృ లోకంలో అసితుడయిన దేవలుడు చెప్పిన 15 లక్షల శ్లోకాల్లోని విషయం, గంధర్వ లోకంలో శుకుడు చెప్పిన 14 లక్షల శ్లోకాల్లోని విషయం ఏమిటో ఇందులో ఉగ్రశ్రవసుడు చెప్పలేదు. కానీ ఆ 59 లక్షల శ్లోకాల్లోని విషయం కూడా భారత కథకు సంబంధించినదిగానే భావించాలి. మానవుల ఆయుర్దాయం, గ్రహణ సామర్థ్యం తక్కువ కాబట్టి వారికి లక్ష శ్లోక పర్యంతమైన భారతం సరిపోతుందని, మానవుల కంటే గంధర్వుల, పితృ దేవతల, దేవతల ఆయుర్దాయం గ్రహణ సామర్థ్యం చాలా రెట్లు ఎక్కువ కాబట్టి వారికి తగ్గట్టుగా భారతం విస్తరింపబడి చెప్పబడిందని భావించాలి. భారతకథ కేవలం మానవ లోకంలోనే గాకుండా దేవ, పితృ, గంధర్వ లోకాల్లో వారికి తగిన రీతిలో విస్తరించి చెప్పబడిన పవిత్ర కావ్యమని చెప్పడానికే ఈ కల్పన చేయబడింది.

భారతం మహాకావ్యం. కావ్యంలో కల్పనలు తప్పనిసరిగా ఉంటాయి. కల్పనలో అతిశయోక్తులు, మానవాతీతాంశాలు, అద్భుతమైన అంశాలు ఉంటాయి. మన పూర్వులు

వాస్తవమైన అంశాలను మతానికి, దేవతలకు, ఋషులకు ముడిపెట్టి చెప్పడం ప్రాచీన కాలం నుంచి ఉంది. ఆ అలవాటును బట్టే భారతాన్ని గురించి, దాని రచనను గురించి పైన చెప్పిన కల్పనలను చేశారు. ఈ కల్పనలను పక్కనపెట్టి భారత కథను గురించి భారత రచనను గురించి హేతుబద్ధంగా పరిశీలించి ఇలా చెప్పవచ్చు.

ఏ సాహిత్యంలోనైన మొదట జానపద సాహిత్యమే పుడుతుంది. శృంగార, హాస్య, కరుణ, వీర, భయానక, అద్భుతాంశాలకు సంబంధించిన ఏదైన సంఘటన జరిగినపుడు దానికి మొదట స్పందించేది జానపద కవులే. ఇలా స్పందించిన జానపద కవి సంఘటనను వివరిస్తూ గేయాన్ని గానీ, కథాగేయాన్ని గానీ, వచన కథను గానీ చెప్పి తన చుట్టూ ఉన్న వారికి దాన్ని వినిపిస్తాడు. ఆ తర్వాత అది ఆనోటా ఆనోటా పాకి ఇతర ప్రాంతాలకు వ్యాపిస్తుంది. ఇలా మౌఖిక ప్రచారంలో వ్యాపించేటప్పుడు దానిలో అనేక మార్పులు, చేర్పులు జరిగి పాఠాంతరాలు ఏర్పడతాయి. ప్రాచీన కాలంలో ఇప్పటి లాగా రేడియో, టీ.వి., సినిమా మొదలైన వినోద సాధనాలుండేవి కావు. అందువల్ల ప్రజలు జానపద కవులు చెప్పిన గేయాలను, కథాగేయాలను, వచన కథలను పాడుకుంటూ చెప్పుకుంటూ, పాడుతూ వుంటే వింటూ ఆనందించే వారు. వీటిలో కథాగేయాలను పాడడానికి 'గాయక భిక్షుకులు" అనే ప్రత్యేకమైన గాయకులు ఉండేవారు. ఈ గాయక భిక్షుకులు ఊరూరు తిరుగుతూ, తాము నేర్చుకున్న వీర, అద్భుత, కరుణ రసాలకు సంబంధించిన కథాగేయాలను పాడుతూ జీవించేవారు. వీటిలో వీరరస ప్రధానమైన కథా గేయాలను "వీరగాథలు" అని పిలుస్తున్నాం. బొబ్బిలి కథ, సర్వాయి పాపని కథ, కుమార రాముని కథ, పల్నాటి కథలు, కాటమరాజు కథలు మొదలైనవి ఇలాంటివి. ఇవన్నీ చారిత్రక సంఘటనల ఆధారంగా చెప్పబడిన వీరగాథలు. అంటే ఏదైనా ఒక యుద్ధం జరిగినప్పుడు గానీ, ఒక వీరరస సంఘటన జరిగినప్పుడు గానీ దానికి స్పందించిన గాయక భిక్షుకులు ఇతర జానపద కవులు ఆ సంఘటనను, అందుకు దారితీసిన పరిస్థితులను వివరిస్తూ ఒక కథను అల్లి, అందులో నాయకుని ప్రతినాయకుని ఏర్పాటు చేసి చక్కని బాణీతో వీరగాథను అల్లుతారు. ప్రస్తుతమున్న పల్నాటి కథలు, కాటమరాజు కథలు, బొబ్బిలి కథ, సర్వాయి పాపని కథ మొదలైన వీరగాథలను పరిశీలిస్తే ఇవన్నీ చిన్నచిన్న యుద్ధాలను గురించి చెప్పినవని తెలుస్తుంది. ఆంధ్రదేశాన్ని పరిపాలించిన ప్రసిద్ధ రాజులైన రాజరాజ నరేంద్రుడు, రుద్రమదేవి, శ్రీకృష్ణ దేవరాయలు మొదలైన వారి గురించి వీరగాథలు లేవు. చిన్నచిన్న సంస్థానాలకు చెందినవారు, చిన్న రాజ్యాలకు సంబంధించిన వారి యుద్ధాల గురించి మాత్రమే వీరగాథలు పుట్టాయి. అలాగే ధార్తరాష్ట్రులకు పాండవులకు మధ్య రాజ్యం కోసం చిన్న యుద్ధం జరిగి ఉంటుంది. ఆ యుద్ధంలో పాండవులు విజయం సాధించి ఉంటారు. ఆ యుద్ధానికి స్పందించిన జానపద కవి పాండవుల కథను వీరగాథగా చెప్పి ఉంటాడు. సాధారణంగా వీరగాథలు నాయక పక్షపాతయుతంగా ఉంటాయి. అంటే నాయక పక్షం వారు ధర్మాత్ములని గొప్ప పౌరుష పరాక్రమాలు గలవారని దైవాంశ

సంభూతులని చెబుతూ వారు చేసిన అసాధ్యమైన పనులను గురించి అభూత కల్పనలు జోడించి చెబుతారు. ప్రతి నాయకులు దుర్మార్గులుగా నీచమైన వారుగా చెప్పబడతారు. అలాగే పాండవుల కథలో గూడా జానపద కవి పాండవులను గురించి గొప్పగా, ప్రతినాయకుడైన దుర్యోధనుని గురించి అతని పక్షం వారిని గురించి తక్కువ చేసి చెప్పి ఉంటాడు.

జానపద కవి చెప్పిన ఈ పాండవుల కథ ఆనాడు బాగా ప్రసిద్ధమై ప్రజల మన్ననలు పొంది ఉంటుంది. ఇది చారిత్రక కథాగేయం కావడం వల్ల ఆనాడు దీన్ని ఇతిహాసంగా పేర్కొని ఉంటారు. ఇతిహాసమంటే ఇలా జరిగిందని చెప్పేది అని అర్థం. అంటే నేడు చరిత్ర అని పిలుస్తున్నదాన్ని మన పూర్వులు ఇతిహాసమని పిలిచారు. ఇతిహాసంగా పిలువబడిన పాండవుల కథను ఆనాడు చాలామంది జానపద కవులు లేక గాయక భిక్షుకులు చెబుతూ ఉండేవారు. దీనికి భారతంలోనే నిదర్శనముంది. ఉగ్రశ్రవసుడు భారత కథను నైమిశారణ్యంలోని ఋషులకు చెబుతూ

**"ఆచఖ్యుః కవయః కేచిత్ సంప్రత్యాచక్షతే పరే**
**ఆఖ్యాస్యంతి తథైవాన్యే ఇతిహాస మిమం భువి"**
**(ఆది. 1 - 26వ శ్లోకం)**

"ఈ ఇతిహాసాన్ని ఈ భూమి మీద పూర్వం చాలా మంది కవులు చెప్పారు. ప్రస్తుతం కొంత మంది చెబుతున్నారు. ఇంకా చాలా మంది ముందు ముందు చెబుతారు" అని చెబుతాడు. దీన్నిబట్టి వీరగాథగా జానపద గాయక భిక్షుకులచేత పాడబడుతున్న పాండవుల కథ ఆనాడు ఇతిహాసంగా పిలువబడుతూ బాగా ప్రసిద్ధి చెంది ఉంటుందని చెప్పవచ్చు. ఇలా ప్రసిద్ధి చెందిన పాండవుల కథను పండితకవి అయిన వ్యాసుడు స్వీకరించి సన్నివేశ నిర్వహణ, సంభాషణా చాతుర్యం, పాత్రచిత్రణ, వర్ణనలు, అలంకారాలు మొదలైన సాహిత్యాంశాలను జోడించి "జయం" అనే పేరుతో కావ్యంగా రాసి ఉంటాడు. ఇందులో పాండవులు పుట్టుక, వారి పెరుగుదల, వారి పౌరుష పరాక్రమాల ప్రదర్శన వారి ధర్మ పరాయణత్వం, దుర్యోధనుని కుట్రలు కుతంత్రాలు, అతని దుర్మార్గం, చివరకు యుద్ధం జరగడం, అందులో పాండవులు విజయం సాధించడంతో ధర్మరాజు రాజు కావడం వరకు ఉన్న కథ ఉంటుంది.

వ్యాసుడు జయం పేరుతో ధర్మరాజు రాజు కావడం వరకు ఉన్న కావ్యంలో ఎన్ని శ్లోకాలుండ వచ్చు అనేది ప్రశ్న. దీనికి సమాధానం భారతంలోనే ఉంది. భారతం ఆదిపర్వంలో ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలోని ఋషులకు మహాభారతం గురించి చెబుతూ

**"అష్టౌశ్లోక సహస్రాణి అష్టౌశ్లోక శతానిచ**
**అహం వేత్తి శుకో వేత్తి సంజయో వేత్తి వా న వా"**
**(ఆది. 1 - 81వ శ్లోకం)**

"8,800 శ్లోకాల అర్థం నాకు తెలుసు. శుకునికి తెలుసు, సంజయునికి తెలుసునో? తెలియదో?" అని భారతంలో గూడార్థాలతో కూడుకున్న శ్లోకాల గురించి చెప్పాడు. దీన్నిబట్టి వ్యాసుడు జయం పేరుతో రాసిన శ్లోకాల సంఖ్య 8,800 అని పరిశోధకులు

భావిస్తున్నారు”[1]. ఆ ఎనిమిది వేల ఎనిమిది వందల శ్లోకాలు ఏవి? అనేది తెలుసు కోవడం కష్టం. అందువల్లనే భారతంలో 8,800 శ్లోకాలను గురించి ఉగ్రశ్రవసుడు

**“తచ్ఛ్లోక కూటమద్యాపి గ్రథితం సుదృఢం మునే**
**భేత్తుం న శక్యతే ర్థస్య గూఢత్వాత్ ప్రశ్రి తస్య చ”**
**(ఆది. 1 – 82 వ శ్లోకం)**

“గూఢంగా, దృఢంగా కూర్చిన ఆశ్లోకాల అర్థం ఇప్పటికీ ఎవరికి తెలియదని” చెబుతాడు. అందులో ఉన్నది గూడార్థమే అయితే ఎవరికీ తెలియక పోవడ ముండదు. ఉద్దండ పండితులకు కొందరికి వాటి అర్థం తెలుస్తుంది. అది అర్థం గురించి చెప్పినది కాదు. జయేతిహాసంలోని శ్లోకాల గురించి చెప్పినది. దీన్ని బట్టి వ్యాసుడు జయం పేరుతో రాసిన గ్రంథంలో 8,800 శ్లోకాలుంటాయని చెప్పవచ్చు. ఇది భారతానికి మొదటి దశ.

రెండవ దశ “జయం”లో చేర్పులు జరిగి భారతంగా పిలువ బడడం. ఈ దశలో ఎన్ని శ్లోకాలుంటాయన్నది ప్రశ్న. దీనికి గూడా సమాధానం భారతంలోనే ఉంది.

**“ఇదం శత సహస్రం తు లోకానాం పుణ్యకర్మనాం**
**ఉపాఖ్యానైః సహజ్ఞే యం ఆద్యం భారతముత్తమం”**
**“చతుర్వింశతి సాహస్రీం చక్రే భారత సంహితాం**
**ఉపాఖ్యానైర్వినా తావత్ భారతం ప్రోచ్యతే బుధైః”**
**(ఆది.1 – 100, 101 శ్లోకాలు)**

భారతం ఉపాఖ్యానాలతో కలిసి లక్ష శ్లోకాలతో ఉన్నది. ఉపాఖ్యానాలు లేకుండా బుధులు దీన్ని 24000 శ్లోకాలుగా చెబుతారని పై శ్లోకాల్లో చెప్ప బడింది. దీన్నిబట్టి రెండవ దశలో భారతంగా పిలువబడినప్పుడు ఇందులో 24,000 శ్లోకాలున్నాయని స్పష్టంగా తెలుస్తూ వుంది. ఈ దశలో ఉపాఖ్యానాలు చేరలేదు. ప్రధాన కథ అయిన పాండవుల కథ మాత్రమే ఉండేది. ఇక మూడవ దశ మహాభారతం. అంటే ప్రస్తుత దశ. ఈ దశలో లక్ష శ్లోకాలతో అనేక ఉపాఖ్యానాలతో ఇది ఉంది. ఈ విధంగా వ్యాసుడు జయం పేరుతో రాసిన ఈ కావ్యం కాలక్రమంలో అనేక మార్పులు, చేర్పులు జరిగి మొదట భారతంగా, ఆ తర్వాత మహాభారతంగా పరిణామం చెందింది. ముఖ్యంగా భారతానికి ప్రతులు తయారు చేసే సందర్భంలో ఈ మార్పులు, చేర్పులు ఎక్కువగా జరిగి ఉంటాయి. కాబట్టి ప్రస్తుత మహాభారతంలోని ఉపాఖ్యానాలేవీ వ్యాసుడు రాసినవి కాదని, అవన్నీ కాలక్రమంలో ప్రతిభా వంతులైన సంస్కృత పండితులు రాసి భారతంలో చొప్పించినవని స్పష్టమవుతూ ఉంది. ఈ ఉపాఖ్యానాలు విశ్వసృష్టి, దేవతలు, ఆధ్యాత్మికాంశాలు, ఋషులు, గోవులు, ఇతర పశుపక్షులు, రాజనీతి, మోక్షం, పతివ్రతలు, వర్ణాశ్రమాలు, చక్రవర్తులు, బ్రాహ్మణమాహాత్మ్యం, ఊర్ధ్వ, అధోలోకాలు, కృష్ణుని మాహాత్మ్యం, ధర్మశాస్త్ర, అర్థశాస్త్ర, వేదాంతం మొదలైన అనేక విషయాలకు సంబంధించినవి ఉన్నాయి. ఇవన్నీ ఒకరు రాసినవి ఒక కాలంలో రాసినవి కాదు. వేర్వేరు వ్యక్తులు వేర్వేరు కాలాల్లో రాసినవి. కొన్ని కథలు

రెండుసార్లు మూడుసార్లు చెప్పబడ్డాయి. ఉదాహరణకు ఉత్తంకుని కథ ఆదిపర్వంలోనూ, అశ్వమేధిక పర్వంలోనూ రెండుచోట్ల కొద్ది మార్పులతో ఉంది. ఈ రెండింటినీ రాసింది ఒకరు కాదు. అలాగే కుమారస్వామి పుట్టుక కథ వనపర్వంలో, శల్యపర్వంలో, అనుశాసనపర్వంలో మూడుచోట్ల మూడు విధాలుగా ఉంది. ఈ మూడింటిని రాసింది ఒకరు కాదు. ఒక కవి ఒక గ్రంథంలో ఒక కథను రెండుసార్లు, ముడుసార్లు రాయడు. అందువల్ల మహాభారతంలోని ఉపాఖ్యానాలన్నీ వేర్వేరు వ్యక్తులు వేర్వేరు కాలాల్లో రాసినవని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఈ సందర్భంలో పింగళి లక్ష్మీకాంతం గారి అభిప్రాయం గమనించ దగినది. "సంస్కృత భారత ప్రతులు అనేక రాష్ట్రములలో అనేక రీతులుగా నున్నవి. వాటిలో ఉత్తర దేశ ప్రతులకును, దక్షిణ దేశ ప్రతులకును చాల వ్యత్యాసములున్నవి. ఉత్తరాది ప్రతులలో కూడ ఒండొంటికిని భేదమున్నది. వాటిలోనుండు కొన్ని ప్రకరణములు, ఉపాఖ్యానములును వీటిలో కనబడవు. అట్లే వీటిలో నుండునవి వాటిలో కానరావు. అందును ఇందును సమానముగా నున్న భాగముల యందైనను శ్లోక సంఖ్య సరిపోదు. మూలభారతము పుట్టిన పిమ్మట గడచిన ఇన్ని వేల సంవత్సరముల కాలములో ప్రతులు వ్రాసికొనువారు ఎవరికి తోచినట్లు వారు కొన్ని శ్లోకములు కల్పించి, కొన్నింటిని తొలగించి, కొన్ని ప్రకరణములను పెంచి, కొన్నింటిని తగ్గించి యుందురు. కావున సమగ్ర గ్రంథము మనకు యథాతథముగా దక్కలేదు. ఈ తారుమారు నన్నయ నాటికే జరిగినది"[2].

ప్రస్తుతమున్న మహాభారతంలో వ్యాసుడు రాసిన 8,800 శ్లోకాలతో కూడుకున్న "జయం"ను వేరు చేయవచ్చునేమో పరిశీలించవలసి ఉంది. దీనికి మనకు భారతంలోనే ఆధారం కనిపిస్తుంది. ఆదిపర్వంలోని అంశావతరణ పర్వంలో 61వ అధ్యాయం 'జయం'లోని కథను తెలుసుకోవడానికి ఉపకరిస్తుంది. ఈ అధ్యాయంలోని కథను వైశంపాయనుడు జనమేజయునికి చెబుతూ ప్రధానకథను అంటే కౌరవ పాండవుల కథను క్లుప్తంగా వివరిస్తాడు. ఈ కథ పాండురాజు చనిపోయిన తర్వాత పాండవులు హస్తినాపురానికి రావడంతో మొదలై కురుక్షేత్ర యుద్ధంలో పాండవులు విజయం సాధించడంతో ముగుస్తుంది. ఈ కథ మొత్తం 55 శ్లోకాలలో వివరింపబడింది. ఇందులోని విషయాలను క్లుప్తంగా తెలుసుకుందాం.

పాండురాజు చనిపోయిన తర్వాత పాండవులు హస్తినాపురానికి రావడం, పాండవుల పౌరుష పరాక్రమాలను, తేజస్సును, ప్రజల్లో వారికి పెరుతున్న గౌరవం చూసి దుర్యోధనుడు అసూయ పడడం, దుర్యోధనుడు భీముని చంపడానికి విషాన్నం పెట్టించడం, బంధించి గంగానదిలో తోసివేయడం, నిద్రపోతుండగా కాలసర్పాల చేత కరిపించడం మొదలైనవి చేయడం, కౌరవులు పాండవులకు చేస్తున్న అపకారాన్ని విదురుడు తప్పిస్తూ ఉండడం, దుర్యోధనుడు పాండవుల కోసం వారణావతంలో లక్కఇల్లు కట్టించి వారిని చంపించే ప్రయత్నం చేయడం, పాండవులు రహస్య మార్గం ద్వారా అక్కడినుండి బయటపడి అడవిలో ప్రవేశించడం, హిడింబుని వధ, భీముడు హిడింబను పెళ్ళి చేసుకోవడం, ఘటోత్కచుని పుట్టుక, పాండవులు ఏకచక్రపురంలో నివసించడం, భీముడు బకాసురుని చంపడం, పాండవులు ద్రౌపదీ

స్వయంవరానికి వెళ్ళి ఆమెను భార్యగా పొందటం, తిరగి పాండవులు హస్తినాపురానికి రావడం, పాండవులు ఖాండవప్రస్థంలో తమ వారందరితోటి నివసించడం, భీమార్జున నకుల సహదేవులు నాలుగు దిక్కుల్లో ఉన్న రాజులను జయించడం, అర్జునుడు 13మాసాలు తీర్థయాత్రలకు వెళ్ళడం, ఆ సమయంలో ద్వారకకు వెళ్ళి సుభద్రను వివాహం చేసుకోవడం, అర్జునుడు శ్రీకృష్ణునితో కలిసి ఖాండవ వనాన్ని అగ్నిచేత దహింపజేయడం, అగ్నిదేవుడు అర్జునుడికి గాండీవాన్ని, అక్షయబాణాలు కలిగిన అమ్ములపొదిని, కపిధ్వజం కలిగిన రథాన్ని ఇవ్వడం, అర్జునుడు మయుడు అనే రాక్షసుని రక్షించడం, మయుడు మయసభను నిర్మించి ధర్మరాజుకివ్వడం, దుర్యోధనుడు మయసభను చూసి అసూయపడి శకుని సాయంతో ధర్మరాజుతో జూదమాడి వారి సర్వస్వాన్ని స్వాధీనం చేసుకోవడం, పాండవులు 12 ఏళ్ళు అరణ్యవాసం, ఒక యేడు అజ్ఞాతవాసం చేసిన తర్వాత తమ రాజ్యాన్ని అడగడం, దుర్యోధనుడు అంగీకరించకపోవడంతో కురుక్షేత్ర యుద్ధం జరగడం, యుద్ధంలో పాండవులు జయించడం జరుగుతుంది. ఇంతటితో ఈ అధ్యాయంలోని కథ ముగుస్తుంది.

గుజరాత్ రిసెర్చ్ సొసైటి ఆనరరీ డైరక్టరు ప్రొఫెసర్ కేశవరాం కె. శాస్త్రి గారు అనేక సంవత్సరాలు కష్టపడి భండార్కర్ ఓరియంటల్ రీసెర్చ్ ఇనిస్టిట్యూట్ వారు ప్రచురించిన సంశోధిత ప్రతిలోని 78,675 శ్లోకాల మహాభారతం నుంచి 8,801 శ్లోకాలు గల మూల భారతాన్ని(జయాన్ని) తయారు చేసి 1977లో జయ సంహిత లేక ఉర్ మహాభారత (THE UR-MAHABHARATA) అనే పేరుతో రెండు సంపుటాలుగా ప్రచురించారు. ఈ గ్రంథాన్ని గుజరాత్ రిసెర్చ్ సొసైటి వారు ముద్రించారు. ఈ గ్రంథానికి ఆధారం పైన చెప్పిన ఆదిపర్వంలోని 61వ అధ్యాయం. ఈ గ్రంథంలో తాము చేసిన పరిశోధన గురించి శాస్త్రిగారు 21 పుటల పీఠికలో వివరించారు. భండార్కర్ ఇనిస్టిట్యూట్ వారు ప్రచురించిన సంశోధిత ప్రతిలోని ఉపాఖ్యానాలన్నింటిని శాస్త్రిగారు తొలగించి  కౌరవ పాండవులకు సంబంధించిన ప్రధాన కథను ఇచ్చారు. ఇందులో పాండవులు కురుక్షేత్ర యుద్ధంలో విజయం సాధించిన తరువాత ధర్మరాజు అశ్వమేధ యాగం చేయడం వరకు ఉన్న కథ ఉంది. ఈ 8801 శ్లోకాల జయసంహితను ఆధారంగా చేసుకొని చిత్తూరు జిల్లాకు చెందిన నాయుని కృష్ణమూర్తిగారు "జయమ్" అనే పేరుతో 375 పుటల నవలను తెలుగులో రాశారు. ఆసక్తి ఉన్నవారు కేశవరాం శాస్త్రి గారు రూపొందించిన సంస్కృత జయసంహితను, నాయుని కృష్ణమూర్తిగారు రాసిన జయమ్ నవలను పరిశీలించవచ్చు.

కేశవరాం శాస్త్రి గారు ప్రచురించిన జయసంహితలో  భారత నాయకులైన పాండవుల పుట్టుకకు సంబంధించిన కథ లేదు. కావ్యంలో నాయకుల పుట్టుక తప్పనిసరిగా ఉండాలి. అందువల్ల భారతంలో 96వ అధ్యాయంలో చెప్పబడిన మహాభిషుని కథ, 97వ అధ్యాయంలోని శంతనుని కథ, 98వ అధ్యాయంలోని భీష్ముని పుట్టుక, సత్యవతిని శంతనుడు వివాహం చేసుకోవడం, విచిత్ర వీర్యునికి భీష్ముడు అంబిక, అంబాలికలను తెచ్చి వివాహం చేయడం, విచిత్ర వీర్యుని మరణం, అంబిక అంబాలికలు వ్యాసుని ద్వారా ధృతరాష్ట్ర

పాండురాజులను కనడం, పాండురాజు రాజు కావడం, పాండురాజు వేటకు వెళ్ళి కిందముని శాపానికి గురి కావడం, కుంతీమాద్రులు పాండవులను కనడం, పాండురాజు మరణం, మాద్రి సహగమనం అనే కథాంశాలు ఉండాలి. 61వ అధ్యాయంలో చెప్పబడిన కథకు ఈ అంశాలను ముందుగా జోడిస్తే వ్యాసుడు రాసిన 'జయం'లోని కథ వస్తుంది. ఈ కథలో ధర్మరాజు రాజు కావడంతో కావ్యాన్ని ముగించాలి. అతడు అశ్వమేధ యాగం చేసిన కథ ఇందులో ఉండకూడదు.

సంస్కృత మహాభారతంలో వందకు పైగా ఉపాఖ్యానాలున్నాయి. వీటిలో కొన్ని ఆ కాలంనాడు జానపదుల్లో మౌఖిక ప్రచారంలో ఉన్న జానపద కథలున్నాయి. కొన్ని జానపదకథల ప్రభావంతో పండిత కవులు కల్పించిన కథలున్నాయి. జానపదకథలలో కట్టుకథలు ప్రాణికథలు, నీతికథలు, అద్భుతకథలు, హాస్యకథలు మొదలైన చాలా రకాలున్నాయి. వీటిలో భారతంలో కట్టుకథలు, ప్రాణికథలు, నీతికథలు, అద్భుతకథలు అనే నాలుగు రకాలకు చెందిన కథలున్నాయి. వీటిలో నాలుగు మాత్రమే నిజమైన జానపదకథలు. మిగిలినవన్నీ జానపదకథల ప్రభావంతో పండితకవులు కల్పించినవే. ఈ కథల్లో జానపద కథాంశాలున్నాయి. అందువల్ల వీటిని జానపద కథాంశ కథలు అని చెప్పవచ్చు. ఈ కథలు ఆదిపర్వంలో పదకొండు, సభాపర్వంలో రెండు, వనపర్వంలో రెండు, ఉద్యోగపర్వంలో ఒకటి, ద్రోణపర్వంలో రెండు, కర్ణపర్వంలో రెండు, శల్యపర్వంలో ఒకటి, శాంతిపర్వంలో ఇరవై, అనుశాసనపర్వంలో ఐదు కలిపి మొత్తం నలభైఏడు కథలున్నాయి. ఈ నలభైఏడు కథల్లో కట్టుకథాంశ కథలు ఇరవైనాలుగు, ప్రాణి కథాంశ కథలు తొమ్మిది, నీతి కథాంశ కథలు ఎనిమిది, అద్భుత కథాంశ కథలు ఆరు ఉన్నాయి. ప్రాణి కథలలో హంసా-కాకి కథ, గృధ్ర-గోమాయు సంవాదం కథ అచ్చమైన జానపద కథలు. మిగిలిన ఏడు జానపదకథాంశ కథలు. అంటే జానపద ప్రాణికథల ప్రభావంతో పండిత కవులు కల్పించినవి. నీతికథలలో ఋషి-శ్వానం కథ అచ్చమైన జానపద కథ. మిగిలిన ఏడు జానపద నీతికథాంశ కథలు. అద్భుతకథలలో శలదలుల చరిత్ర-వామదేవమహాత్మ్యం కథలోని పరీక్షిన్మహారాజు కథ అచ్చమైన జానపద కథ. ఈ కథలో మిగిలిన భాగం, అద్భుతకథలలోని మిగిలిన ఐదు కథలు అద్భుతకథాంశ కథలు. ఈ గ్రంథంలోని తరువాత నాలుగు అధ్యాయాలలో ఈ నాలుగురకాల కథలను విశ్లేషించాను.

# 2. మహాభారతంలో కట్టుకథాంశ కథలు

'కట్టు' అంటే కల్పించడం అని అర్థం. గేయం, కవిత, నాటకం మొదలైన అన్ని సృజనాత్మక ప్రక్రియల్లోనూ కల్పన ప్రధానంగా ఉంటుంది. అసలు సాహిత్య మంటేనే కల్పించడమని అర్థం. మరి కట్టుకథల కల్పనలో ప్రత్యేకత ఏమంటే లోకంలో ఉన్న కొన్ని విషయాలకు, వస్తువులకు, ఆచారాలకు, సంప్రదాయాలకు, నమ్మకాలకు అవి అలా లోకంలో ఉండడానికి గల కారణాన్ని గురించి ఇవి ఒక కథను కల్పించి చెబుతాయి. ఈ కల్పనలో దేవతలకు, ఋషులకు ప్రధాన పాత్ర ఉంటుంది. సూర్యచంద్ర గ్రహణాలు ఏర్పడడం గురించి ఒక జానపద కట్టుకథ ఇలా ఉంది. పూర్వం కొంత మంది బాలురు అడవిలో పశువులను కాస్తూ తమకు కనిపించిన ఒక పెద్ద నాగుపాము గుడ్లను పగుల గొడతారు. దానికి నాగుపాము కోపించి వారివెంట పడుతుంది. బాలురు భయంతో పరుగెత్తుకొని వెళ్ళి సూర్య చంద్రుల దగ్గర దాక్కుంటారు. తనకు వ్యతిరేకంగా బాలురకు ఆశ్రయ మిచ్చినందుకు పాము కోపించి సూర్యచంద్రులను కాటువేస్తుంది. నాగుపాము సూర్యుని కాటు వేయడం వల్ల ఏర్పడిన మచ్చ సూర్య గ్రహణమని, చంద్రుని కాటు వేయడం వల్ల ఏర్పడిన మచ్చ చంద్ర గ్రహణమని జానపదులు కల్పించారు. ఈ కథలో ఎలాంటి హేతుబద్ధతా లేదు. శాస్త్ర జ్ఞానం తెలియని రోజుల్లో జానపదులు తమ బుద్ధికి తోచినట్లుగా ఈ కథను కల్పించారు. అలాగే లోకంలో చాలా విషయాలకు సంబంధించిన కట్టుకథలు ప్రచారంలో ఉన్నాయి. లోకంలో మనకు ఉపయోగపడుతున్న ఒక వస్తువును మొదట ఒక దేవుడు గానీ, దేవత గానీ, ఋషి గానీ సృష్టించి ఇచ్చినట్లుగా, వారు అలా సృష్టించి ఇవ్వడానికి ఒక కారణమున్నట్లుగా ఈ కట్టుకథల్లో చెప్పబడుతుంది. ఉదాహరణకు మనకు చెప్పులు, గొడుగు ఎంతగానో ఉపయోగ పడుతున్నాయి. వాటిని సూర్యుడు మొదట సృష్టించి జమదగ్ని మునికి ఇచ్చాడని అప్పటి నుంచి భూలోకంలో అవి అందుబాటులోకి వచ్చాయని ఒక కథ సంస్కృత భారతంలో ఉంది. ఈ కథకు ఎలాంటి హేతుబద్ధతా లేదు. గొడుగు చెప్పులను మానవులు తమ అవసరాలకు అనుగుణంగా తయారు చేసుకొని ఉపయోగించు కుంటున్నారు. కానీ భారతంలో ఆ రెండు వస్తువులను సూర్యుడు సృష్టించి ఇచ్చినట్లుగా ఒక కథను కవి కల్పించి చెప్పాడు. ఇలాంటి కథలనే కట్టుకథలు అంటారు. అలాగే లోకంలో ఉన్న కొన్ని సంప్రదాయాలకు, నమ్మకాలకు అవి అలా లోకంలో ఏర్పడడానికి గల కారణాన్ని గురించి కొన్ని కట్టుకథలున్నాయి. ఈ కథలకు వేటికీ ఎలాంటి హేతుబద్ధతా ఉండదు. ఈ కథలు మతం పట్ల, దేవతల పట్ల, ఋషుల పట్ల ఆనాటి మానవులకున్న భావనను, ఆలోచనా విధానాన్ని, సమాజం యొక్క పరిస్థితిని తెలియజేస్తాయి.

సంస్కృత భారతంలో ఇలాంటి కట్టుకథలు మొత్తం ఇరవై నాలుగున్నాయి. ఆదిపర్వంలో అయిదు, వనపర్వంలో రెండు, ద్రోణ, కర్ణ, శల్య, స్త్రీపర్వాల్లో ఒక్కొక్కటి,

శాంతి పర్వంలో తొమ్మిది, అనుశాసన పర్వంలో నాలుగు ఉన్నాయి. వాటి పేర్లు ఇవి

1. భృగు మహర్షి శాపంవల్ల అగ్ని సర్వభక్షకుడు కావడం
2. అనూరుడు సూర్యుని సారథి కావడం
3. (ఎ) సర్పాలు గరుడునికి ఆహారం కావడం
   (బి) సర్పాలకు రెండు నాలుకలు ఏర్పడడం
4. శేషుడు భూభారాన్ని వహించడం
5. ఔర్వుడు అనే ఋషి తన కోపాగ్నిని సముద్రంలో వేయగా అది బడబాగ్నిగా మారడం
6. స్కందుడు స్వాహాదేవిని అగ్నితో చేర్చి గౌరవించడం
7. ఎ. అగ్నివంశం కథ
   బి. అగ్నిశాపం కారణంగా చేపలు ప్రాణులకు ఆహారం కావడం
   సి. మరణించిన సహాగ్ని శరీరం భూమిలో కలిసిపోయి అనేక లోహాలుగా మారడం
8. మృత్యుదేవత పుట్టుక కథ
9. ఒక స్త్రీ శాపం వల్ల మాతృస్వామ్యం ఏర్పడడం
10. దక్షుడు సృష్టించిన క్షయవ్యాధివల్ల చంద్రుడు క్షీణించడం
11. సంసార బంధం కథ
12. రాజనీతి శాస్త్రం పుట్టుక కథ
13. ప్రజాపతి పై మూడు వర్ణాలకు దాసులుగా శూద్రులను సృష్టించడం
14. దండం పుట్టుక కథ
15. ఖడ్గం పుట్టుక కథ
16. బ్రహ్మ హత్యాపాతక విభాగం కథ
17. వృత్రాసురుని రక్తం నుంచి పుట్టగొడుగులు పుట్టడం
18. జ్వరం పుట్టుక కథ
19. శుక్రుని కథ
20. బృహస్పతి శాపం వల్ల జలంలో జలప్రాణులు ఏర్పడడం
21. (ఎ) బంగారం పుట్టుక కథ
    (బి) కప్ప ఏనుగు, చిలుకలకు దేవతలు వరాలివ్వడం
22. గొడుగు, చెప్పుల పుట్టుక కథ
23. గోవుల మలమూత్ర స్థానాల్లో లక్ష్మీనివాసం
24. దుర్వాసుని వరాల వల్ల శ్రీకృష్ణుడు పూజనీయుడు కావడం

## 1. భృగుమహర్షి శాపం వల్ల అగ్నిదేవుడు సర్వభక్షకుడు కావడం:

సంస్కృత భారతంలో ఈ కథ ఆదిపర్వంలోని పౌలోమపర్వం అనే ఉప పర్వంలో ఐదవ అధ్యాయం నుంచి ఏడవ అధ్యాయం వరకు ఉన్న మూడు అధ్యాయాల్లో 77 శ్లోకాల్లో ఉంది. ఈ కథను ఉగ్రశ్రవనుడు అనే పౌరాణికుడు నైమిశారణ్యంలోని ఋషులకు చెబుతాడు. ఋషులు భారతకథ కంటే ముందుగా భృగు వంశం గురించి చెప్ప వలసిందిగా ఉగ్రశ్రవసుని కోరినపుడు అతడు భృగు వంశంలో ప్రసిద్ధులైన ఋషులను గురించి చెబుతూ ఈ కథను ఇలా చెబుతాడు.

బ్రహ్మ వరుణుని యజ్ఞంలో అగ్ని నుంచి భృగుమహర్షిని పుట్టించాడు. ఈ భృగు మహర్షి భార్య పులోమ. ఆమె గర్భవతిగా ఉన్నప్పుడు భృగు మహర్షి స్నానం చేయడానికి బయటికి వెళ్లాడు. పులోమను భృగుమహర్షి వివాహం చేసుకోక ముందు పులోముడు అనే రాక్షసుడు ఆమెను వివాహం చేసుకోవాలనుకుంటాడు. కానీ ఆమె తండ్రి పులోమను భృగుమహర్షికిచ్చి వివాహం చేస్తాడు. భృగు మహర్షి స్నానానికి వెళ్ళిన సమయంలో పులోముడు అక్కడికి వచ్చి పులోమను చూసి తాను గతంలో వరించిన స్త్రీగా ఆమెను అనుమానించి తన అనుమానాన్ని నివృత్తి చేసుకోవడానికి అక్కడ జ్వలిస్తున్న అగ్నిని "ఈమె ఎవరి భార్య? ఈమెను నేను పూర్వం భార్యగా వరించాను, అనంతరం ఆమె తండ్రి అసత్య వ్యవహారంతో ఈమెను భృగువుకిచ్చి వివాహం చేశాడు. అగ్నిదేవా! నువ్వు సమస్త ప్రాణుల్లో నిత్యం సంచరిస్తూ ఉంటావు. పుణ్య పాపాల విషయంలో సాక్షిగా ఉంటావు. కాబట్టి నిజంచెప్పు" అని పులోముడు అగ్నిదేవుని పదే పదే అడుగుతాడు. అతని మాటలను విని అగ్నిదేవుడు ఒక వైపు అసత్యానికి, మరోవైపు భృగుమహర్షి శాపానికి భయపడి అసత్యం చెప్పడం ఇష్టంలేక రాక్షసునితో ఈమె గతంలో పులోముడు వరించిన స్త్రీయేనని, అయితే ఆమెను భృగుమహర్షి శాస్త్రోక్తంగా వివాహం చేసుకున్నాడని చెబుతాడు. వెంటనే పులోముడు వరాహ రూపాన్ని ధరించి ఆమె నెత్తుకొని వాయు వేగంతో వెళ్తూ వుంటాడు. ఆమె గర్భంలో ఉన్న శిశువు దీన్ని గమనించి కోపంతో గర్భం నుంచి బయటపడి రాక్షసుని తన కంటి చూపుతో భస్మం చేస్తాడు. తల్లి గర్భం నుంచి చ్యుతుడు కావడం చేత ఆ శిశువుకు "చ్యవనుడు" అనే పేరు కల్గుతుంది. ఆతర్వాత పులోమ తన కుమారుని తీసుకొని దుఃఖంతో బ్రహ్మవద్దకు వెళ్తుంది. బ్రహ్మ ఆమెను ఓదారుస్తాడు. ఆమె కన్నీటి బిందువులు మహానదిగా మారతాయి. పులోమ బ్రహ్మ వద్ద నుంచి తమ ఆశ్రమానికి వస్తూ వున్నప్పుడు ఆ నది ఆమెను అనుసరించి ప్రవహిస్తుంది. బ్రహ్మ ఆ నదికి "వధూసర" అనే పేరు పెడతాడు. ఆ నది భృగుమహర్షి ఆశ్రమ ప్రాంతంలో ప్రవహిస్తూ ఉంది. పులోమ ఆశ్రమానికి వచ్చిన తర్వాత జరిగిన విషయం మొత్తాన్ని భృగుమహర్షికి చెబుతుంది. అప్పుడు భృగు మహర్షి "నువ్వు నా భార్యవని ఆ రాక్షసునికి ఎవరు చెప్పారు?" అని

కోపంగా ప్రశ్నిస్తాడు. దానికి పులోమ తన గురించి అగ్ని చెప్పాడని చెబుతుంది. వెంటనే భృగుమహర్షి "సర్వ భక్షకుడవు అవుతావని" అగ్నిని శపిస్తాడు. భృగువు ఆవిధంగా శపించగానే అగ్ని కోపించి ఇలా అంటాడు. "పక్షపాతం లేకుండా నన్ను అడిగినపుడు నేను సత్యాన్నే చెప్పాను. ఇందులో నా తప్పేమి ఉంది.

**"వృష్టో హి సాక్షీ యః సాక్ష్యం జానానో ప్యన్యథా వదేత్**
**స పూర్వనాత్మనః సప్తకులే హన్య త్తథా పరాన్"**

**(ఆది. 7 – 3)**

"సాక్షి అయినవాడు తెలిసి అబద్ధం చెబితే అతనితోపాటు అతని వంశంలోని అటు ఏడు తరాలు, ఇటు ఏడు తరాలు నాశనమౌతాయి". బ్రాహ్మణుడా! నేను కూడా నీకు శాపం ఇవ్వగలను. కానీ బ్రాహ్మణులు నాకు పూజ్యులు. వేదోక్తమైన విధానం ద్వారా నా యందు హోమం చేయబడిన హవిస్సు చేత దేవతలు, పితరులు తృప్తి చెందుతున్నారు. కాబట్టి నేను దేవతలకు, పితరులకు ముఖం అవుతున్నాను. వారికి ముఖంగా ఉన్న నేను సర్వ భక్షకుడను ఏలా కాగలను". అగ్ని ఇలా అనుకొని బ్రాహ్మణుల అగ్నిహోత్రాల్లో, యజ్ఞయాగాల్లో ఉన్న తన రూపాన్ని ఉపసంహరిస్తాడు. అగ్ని లేకపోవడం చేత ప్రజలందరూ ముఖ్యంగా బ్రాహ్మణులు ఓంకార, వషట్కారాలు లేక స్వధా, స్వాహాకారాలు లేక తల్లడిల్లుతారు. అపుడు ఋషులు, దేవతలు కలిసి బ్రహ్మ వద్దకు వెళ్ళి అగ్నికి కల్గిన శాపం, ఆ కారణం చేత అగ్ని అన్ని రకాల క్రియల నుంచి తన రూపాన్ని ఉపసంహరించడం, అగ్ని లేకపోవడం చేత ప్రజలందరూ పడుతున్న బాధలను గురించి బ్రహ్మదేవునికి వివరిస్తారు. బ్రహ్మ అగ్నిదేవుని పిలిచి మృదువుగా ఇలా అంటాడు. "హుతాశనా! ముల్లోకాలను నువ్వే ధరిస్తున్నావు. సమస్త కార్యకలాపాలను నువ్వే ప్రవర్తింజేస్తున్నావు. కాబట్టి క్రియా కలాపాలు విచ్ఛేదం కాకుండా నువ్వే చూడాలి.

**"త్వం పవిత్ర సదా లోకే సర్వభూత గతిశ్చహ**
**నత్వం సర్వ శరీరేణ సర్వభక్షత్వ యేష్యసి"**
**"అపానేహ్యర్చి యాస్తే సర్వ భక్ష్యంతితాః శిఖీన్**
**క్రవ్యాదాచ తనుర్యా తేసా సర్వ భక్షతిష్యతి"**

**(ఆది. 7–21,22)**

"నీవు లోకంలో సదా పవిత్రునివి. నువ్వు నీ శరీరమంతటి తోనూ సర్వ భక్షకత్వం పొందవు. నీ అపాన ప్రదేశంతో మాత్రమే మృతశరీరం మొదలైన సమస్తాన్ని భక్షిస్తావు". సూర్య కిరణాల స్పర్శ చేత సమస్తమూ శుచి అయినట్లుగా నీ జ్వాలల చేత దగ్ధమైన సర్వమూ శుచి అవుతుంది. నువ్వు గొప్ప తేజస్వరూపుడివి. నీ స్వీయ తేజస్సు చేతనే ఋషి శాపాన్ని నిజం చేయి. నీ యందు హెూమం చేయబడిన దానిలో దేవతల భాగాన్ని, నీ భాగాన్ని కూడా స్వీకరించు" బ్రహ్మ మాటలను విని అగ్నిదేవుడు అలాగే జరుగుతుందని బ్రహ్మకు

చెప్పి అతని ఆజ్ఞను పాటించడానికి వెళ్ళిపోతాడు. దేవతలు ఋషులు సంతోషించి వారి నివాసాలకు వెళ్ళిపోతారు. ఈ విధంగా అగ్నిదేవుడు భృగు శాపం వల్ల సర్వభక్షకుడు అయ్యాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథ బ్రాహ్మణుడైన భృగు మహర్షి గొప్పతనాన్ని చాటి చెప్పడానికి కల్పించ బడింది. ప్రాచీన సాహిత్యంలో చెప్పబడిన ఋషులందరూ బ్రాహ్మణులే. తపస్సు, వేదాధ్యయనం చేయడం, యజ్ఞ యాగాదులు చేయించడం, చేయడం మొదలైన కార్య కలాపాలన్నీ బ్రాహ్మణులు మాత్రమే చేసేవారు. తపస్సు వల్ల మహర్షులు గొప్ప మహాత్మ్యాన్ని పొందుతారని, అలాంటివారి ముందు దేవతలు కూడా నిలబడలేరని, ఇలాంటి వారు దేవతలను కూడా శపించ గలరని చాటి చెప్పడానికే పండితుడైన బ్రాహ్మణ కవి ఈ కథను కల్పించాడు. అంతేగాకుండా అలాంటి ఋషుల కుమారులు గర్భంలో వున్నప్పటికీ వారు గొప్ప మాహాత్మ్యం కలిగిన వారని, అవసరమైతే ఆ శిశువులు గర్భం నుంచి తమంత తాముగా బయటకు వచ్చి తమ కంటి చూపుతో రాక్షసులను భస్మం చేయగల మహిమోపేతులని కూడా కవి ఈ కథలో చెప్పాడు. హేతుబద్ధంగా ఆలోచిస్తే అగ్ని దేవుడు కాదు. ఒక ప్రకృతి శక్తి. ప్రకృతిలో గాలి, నీరు, సూర్యుడు మొదలైన శక్తులున్నాయి. వాటిలో అగ్ని కూడా ఒక శక్తి. మన ప్రాచీనులు ఈ శక్తులను దేవతలుగా భావించారు. తర్వాత కాలంలో ఈ శక్తులకు రూపాన్ని ఆపాదించి పూజించడం ప్రారంభించారు. దీనికి కారణం ఈ ప్రకృతి శక్తుల వల్ల మానవులకు అనేక ప్రయోజనాలుండడమే. ప్రాచీన మానవులు కృతజ్ఞతతో ఈ ప్రకృతి శక్తులను దేవతా మూర్తులుగా కొలిచారు. నిజానికి ప్రకృతి శక్తి అయిన అగ్ని మొదటి నుంచి సర్వ భక్షకత్వం లక్షణంగా కల్గినదే. అగ్ని తన పరిమాణాన్నిబట్టి శక్తిని బట్టి అది అన్ని వస్తువులనూ దహించి వేస్తుంది. అగ్ని చిన్న మంటగా ప్రారంభమై అది పెద్దమంట కావడానికి ఆ తర్వాత జ్వాలలతో విజృంభించడానికి అవసరమైన పరిస్థితులు ఉంటే అగ్ని విజృంభించి దేన్నయినా భస్మీపటలం చేస్తుంది. చెప్పేదేమంటే సర్వభక్షకత్వం అగ్నికి సహజంగా ఉంది. అంతే కాకుండా దానికి కింది భాగంలో మాత్రమే దహనం చేయగల శక్తి ఉంటుంది. కింది భాగాన్ని ఆధారంగా చేసుకొని పైన జ్వాలలు పెరుగుతూ ఉంటాయి. అగ్నికి గల ఈ లక్షణాన్ని పండిత కవి గ్రహించి భృగు మహర్షి శాపం వల్ల అగ్ని సర్వభక్షకత్వాన్ని పొందాడని, బ్రహ్మదేవుని ఆజ్ఞచేత తన అపాన ప్రదేశంతో మాత్రమే అగ్ని దహన క్రియ చేస్తున్నాడని కల్పించి చెప్పాడు. ఈ కారణంచేత ఇది కట్టుకథ అవుతుంది. అంటే లోకంలో సర్వభక్షకత్వాన్ని చేస్తున్న అగ్నిని చూసి అలా సర్వభక్షకత్వం ఋషిశాపం కారణంగా అగ్నికి కల్గిందని ఒక కథను కల్పించి చెప్పడం చేత ఇది కట్టుకథ అవుతూ ఉంది. అయితే ఇది అచ్చమైన జానపద కథ కాదు. జానపద కట్టుకథల ప్రభావంతో పండితకవి కల్పించినది. అందువల్ల ఇందులో జానపద కట్టుకథాంశ ఉంది.

ఈ కథలో బ్రహ్మ, వరుణుని యజ్ఞంలో అగ్ని నుంచి భృగు మహర్షిని పుట్టించినట్లుగా చెప్పబడింది. అంటే భృగుమహర్షి బ్రహ్మకు, వరుణునికి, అగ్నికి ముగ్గురికి కుమారుడు అని చెప్పాలి. భృగుమహర్షి తన పుట్టుకకు కారకుడైన అగ్నిని ఈ కథలో శపించాడు. ఇది అనౌచిత్యమైన విషయం. ఈ కథలో పులోముడు వరాహరూపంలో పులోమను ఎత్తుకొని పోతున్నట్లుగా చెప్పబడింది. ఇష్టం లేని స్త్రీని వరాహరూపంలో ఎత్తుకొని పోవడం కష్టం. రాక్షసులు కామచరులు కాబట్టి పులోముడు తన నిజరూపంతోనే పులోమను ఎత్తుకొని ఆకాశ మార్గంలో వెళ్లగలడు. అలాగాకుండా వరాహరూపంలో ఎత్తుకొని పోతున్నట్లుగా చెప్పడం అనౌచిత్యం. తల్లి గర్భం నుంచి బయట పడిన శిశువుకు చ్యవనుడు అనే పేరు కలిగినట్లుగా ఈ కథలో వుంది. గర్భం నుంచి చ్యుతమైన వానికి చ్యుతుడు అనే పేరు వస్తుంది కానీ చ్యవనుడు అనే పేరు రాదు. ఇది కూడా ఈ కథలోని ఒక అనౌచిత్యం. ఇలా ఈ కథలో అనేక అనౌచిత్యాలు వున్నాయి. తల్లి గర్భం నుంచి బయట పడిన చ్యవనుడు తన కంటి చూపుతో రాక్షసుని భస్మం చేసినట్లు, పులోముడు చనిపోయిన తర్వాత పులోమ అప్పుడే పుట్టిన తన కుమారుని తీసుకొని బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్ళి తన పరిస్థితిని చెప్పుకొని దుఃఖించినట్లుగా, ఆమె కన్నీటి బిందువులు నదిగా మారి ప్రవహించినట్లుగా ఈ కథలో ఉంది. ఈ మూడు అంశాలు ఏ మాత్రం నమ్మడానికి వీలు కాని అద్భుత కల్పనలు. అందుకనే నన్నయ తన భారతంలో ఆమె బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్ళిన విషయాన్ని చెప్పకుండా వదిలివేశాడు.

నన్నయ ఈ కథను ఆదిపర్వం ప్రథమాశ్వాసంలోని 128 వ వచనం నుంచి 143వ వచనం వరకూ ఉన్న పదహారు పద్య గద్యాల్లో క్లుప్తంగా రాశాడు. ఈ కథలో నన్నయ రాసిన కొన్ని పద్యాలు రమణీయంగా ఉండి ప్రసిద్ధి పొందాయి. భృగు మహర్షి తనను శపించినపుడు అగ్నిదేవుడు సత్యం చెప్పనివాడు ఘోరమైన నరకంలో పడిపోతాడని ఇలా చెబుతాడు.

**క॥ “తన యెఱిగిన యర్థం బొరు**
**దనఘా! యిది యెట్లు సెప్పుమని యడిగిన జె**
**ప్పని వాడును సత్యము సె**
**ప్పని వాడును ఘోరనరక పంకమున బడున్”**

**(ఆదిపర్వం, ప్రథమాశ్వాసం, 136వపద్యం)**

నన్నయకు బ్రాహ్మణ కులాభిమానం ఎక్కువ. మూలంలో అగ్నిదేవుడు “మాణ్యాస్తు బ్రాహ్మణా మమ” (బ్రాహ్మణులు నాకు పూజ్యులు) అని మాత్రమే ఉండగా నన్నయ ఒక చంపకమాల పద్యంలో బ్రాహ్మణుల గురించి చాలా గొప్పగా ఇలా చెప్పాడు.

**చ॥ “అడిచిన దిట్టినన్ మహోపరుషంబులు పల్కి యల్కతో**
**బొడిచిన నుత్తమద్విజులు పూజ్యులు వారల కెగ్గు సేసినం**

**జెడు నిహముం బరంబు నిది సిద్ధము గావుటెఱింగి భక్తినె**
**ప్పుడు ధరణీ సురోత్తముల బూజల దన్పుదు నల్గ నోడుదున్"**

**(ఆదిపర్వం, ప్రథమాశ్వాసం, 138 వ పద్యం)**

"బ్రాహ్మణులు కొట్టినా, తిట్టినా, అతి కఠినమైన మాటలు పల్కి, కోపంతో పొడిచి నప్పటికీ సద్బ్రాహ్మణులు పూజింప దగినవారు. అలాంటి వారికి అపకారం చేస్తే ఇహపరాలు రెండూ చెడిపోతాయి. దీన్ని నిశ్చయంగా తెలిసినవాణ్ణి కావడం చేత నేను ఎల్లప్పుడూ సద్బ్రాహ్మణులను పూజించి సంతోష పరుస్తాను. వారి మీద కోపించడానికి జంకుతాను" అని బ్రాహ్మణుల గురించి అగ్ని చెప్పినట్లుగా నన్నయ రాశాడు. కొట్టడం, తిట్టడం, కఠినమైన మాటలు పలికి కోపంతో పొడవటం దుష్ట మానవుని లక్షణాలు. ఈ లక్షణాలు ఉన్నప్పటికీ బ్రాహ్మణుడు సద్బ్రాహ్మణుడేనని నన్నయ్య చెప్పాడు. దీన్ని బట్టి నన్నయ్యకు బ్రాహ్మణ కులాభిమానం ఎంతగా ఉందో ఊహించవచ్చు. ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు తమ తెలుగు సాహిత్య చరిత్ర మొదటి భాగంలోని "నన్నయ ఆత్మీయత" అనే ప్రకరణంలో నన్నయ బ్రాహ్మణ కులాభిమానంతో రాసిన అంశాలను గురించి చక్కగా వివరించారు. అయితే శ్రీరామమూర్తిగారు దీన్ని నన్నయ బ్రాహ్మణ మతాభిమానంగా చెప్పారు. అది నన్నయ బ్రాహ్మణ మతాభిమానం కాదు. బ్రాహ్మణ కులాభిమానమే.

## 2. అనూరుడు సూర్యుని సారథి కావడం :

ఈ కథ ఆది పర్వంలోని ఆస్తీక పర్వం అనే ఉపపర్వంలో గరుడుని కథలో 24వ అధ్యాయంలో 20 శ్లోకాల్లో ఉంది. ఈ కథను నైమిశారణ్యంలోని ఋషులకు ఉగ్రశ్రవసుడు చెబుతాడు. సూర్యుడు తూర్పు దిక్కున ఉండి భయంకరమైన తన తేజస్సుతో లోకాలను దహించి వేస్తున్నప్పుడు గరుడుడు తన అన్న అయిన అరుణుని తీసుకొని వచ్చి సూర్యుని దగ్గర నిలిపాడు అని ఉగ్రశ్రవసుడు చెప్పినపుడు, శౌనకుడు "సూర్యుడు ఎందుకు లోకాలను దగ్ధం చేయదలచాడు" అని అడుగుతాడు. అపుడు ఉగ్రశ్రవసుడు "రురుడు తన తండ్రియైన ప్రమతిని ఇదే ప్రశ్న అడిగినపుడు ప్రమతి ఈ కథను రురునికి చెప్పాడు. ఆ కథను నేను చెబుతాను విను" అని ఉగ్రశ్రవసుడు ఈ కథను చెబుతాడు.

దేవ దానవులు సముద్రాన్ని చిలికినపుడు అందులో నుంచి అమృతం ఉద్భవించింది. విష్ణువు అమృతాన్ని దేవతలకు పంచుతున్న సమయంలో రాహువు దేవతల పంక్తిలో కూర్చొని అమృతాన్ని సేవించబోతూ ఉన్నప్పుడు సూర్య చంద్రులు చూసి విష్ణువుకు చెబుతారు. విష్ణువు తన చక్రంతో రాహువు తల నరికి వేస్తాడు. అయితే అప్పటికే అమృతాన్ని నోట్లో పోసుకోవటం వల్ల మొండెం నుంచి తల వేరయినప్పటికీ అమృత ప్రభావంతో తల భాగం ప్రాణంతోనే ఉండి ఆ రాహువు సూర్య చంద్రులను పట్టుకొని బాధపెడుతూ ఉంటాడు. తాను రాహువు తల నరికించి దేవతలకు చాలా మేలు చేసినప్పటికీ తనను

రాహువు బాధిస్తూ ఉంటే దేవతలు తనకు సహాయంగా రాకుండా చోద్యం చూస్తున్నారని సూర్యునికి దేవతల మీద కోపం వచ్చి ముల్లోకాలకు బాధ కల్పించాలనే ఉద్దేశంతో అస్త్రాద్రికి చేరి అక్కడే ఉంటూ లోకాలను తన కిరణాలచేత తపింప జేస్తుంటాడు. అపుడు ఋషులు దేవతలు కలిసి బ్రహ్మవద్దకు వెళ్ళి సూర్యుడు లోకాలను దహింప జేస్తున్న విషయాన్ని గురించి చెబుతారు. బ్రహ్మ

**"కశ్యపస్య సుతో ధీమానరుణోత్యభి విశ్రుతః**
**మహాకాయో మహాతేజాః సస్థాస్యతి పురోరవేః"**
**"కరిష్యతి చ సారథ్యం తేజశ్చస్య హరిష్యతి**
**లోకానాం స్వస్తి చైవం స్యాదృషీణాం చ దివౌకసాం"**
**(ఆది. 24 - 16,17)**

"కశ్యప మహర్షి కుమారుడైన అరుణుడు చాలా విశాలమైన శరీరం కలవాడు, గొప్ప తేజస్వి, అతణ్ణి సూర్యుని ముందు రథం మీద కూర్చుండ బెట్టి సారథ్యం చేయిస్తే భయంకరమైన సూర్యుని తేజస్సు అడ్డగింప బడుతుంది" అని చెబుతాడు. అప్పుడు గరుడుడు లోకాల క్షేమాన్ని కోరి తన అన్న, నడుము కింది భాగం లేనివాడు అయిన అరుణుని మోసుకొని వెళ్ళి సూర్యుని రథం మీద కూర్చో బెడతాడు. దానితో సూర్యుని తీవ్రమైన కిరణాలు అడ్డగింపబడతాయి. ఈ విధంగా అరుణుడు సూర్యుని సారథి అయ్యాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

పై కథలో చెప్పినట్లుగా సూర్యుడు దేవుడు కాదు. $1,50,00,000^{C}$ డిగ్రీల ఉష్ణోగ్రతతో వివిధ రకాల వాయువులతో భగభగా మండుతున్న గోళాంకార నక్షత్రం. భూమి, అంగారకుడు మొదలైన గ్రహాలు తమ చుట్టూ తాము తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతున్నాయి. భూమి తన చుట్టూ తాను తిరగడానికి ఒక రోజు పడుతుంది. ఇలా తిరగడం వల్లనే రాత్రింబవళ్ళు ఏర్పడుతున్నాయి. సూర్యుడు కూడా పరిభ్రమిస్తున్న గోళమే. అయితే ఈ గోళం మిగిలిన గ్రహాల మాదిరిగా వేరే గోళం చుట్టూ తిరగదు. ఇది తన చుట్టూ తాను తిరుగుతూ ఉంది. ఈ శాస్త్ర జ్ఞాన విషయం తెలియక మన ప్రాచీన కవులు భూమి స్థిరంగా ఉందని, సూర్యుడు తూర్పు దిక్కున ఉదయించి ఆకాశంలో ప్రయాణిస్తూ సాయంత్రానికి పడమర దిక్కున అస్తమిస్తున్నట్లుగా భ్రమించారు. భూమి మీద ఉన్న మనకు సూర్యుడు ఒకచోట స్థిరంగా ఉండకుండా ఆకాశంలో తూర్పుదిశ నుండి పడమటివైపు వెళ్తున్నట్లుగా కనిపిస్తుంది. ప్రకృతి శక్తి అయిన సూర్యుని మన ప్రాచీనులు దేవునిగా భావించి అతనికి రూపాన్ని ఏర్పరచి పూజించడం ప్రారంభించారు. ఉదయాద్రి నుంచి అస్త్రాద్రి వరకూ చాలా దూరం ఉంటుంది. కాబట్టి సూర్యదేవుడు ఏడు గుర్రాలు పూన్చిన ఏకచక్ర రథం మీద ఎక్కి ఈ ప్రయాణం చేస్తున్నట్లుగా మన పూర్వులు భావించారు. రథం, రథమ్మీద రథికుడు ఉన్నప్పుడు దానికి సారథి కూడా కావాలి. సూర్యునికి సారథిగా

ఉన్నవాడు సూర్యుని లాగానే ఒక్క క్షణం కూడా ఆగకుండా సూర్యుని రథంమీదనే కూర్చుని ఎల్లప్పుడు తిరుగుతూ ఉండాలి. అలా ఉండాలంటే కాళ్ళు ఉన్నవాడు పనికిరాడు. కాళ్ళు ఉంటే ఆ వ్యక్తి ఎక్కువ సేపు రథం మీద కూర్చుని రథానికి కట్టిన గుర్రాలను తోలలేడు. ఈ కారణం చేతనే నడుము కింది భాగం లేని అనూరుడు వినత పుత్రుడైన అరుణుడు సూర్యసారథిగా ఉన్నట్లుగా తర్వాత కాలంలో మన పురాణకర్తలు కల్పించారు.

ఈ కథలో సూర్యుడు కోపించి తన కిరణాలతో లోకాలను తపించ జేయడానికి ఒక కారణంగా విష్ణువు రాహువు తలను తన చక్రంతో ఖండించిన కథ చెప్పబడింది. ఈ కథ కూడా కల్పనే. సూర్య చంద్ర గ్రహణాలకు సంబంధించి ఇలాంటి కథలను మన పురాణకర్తలు కల్పించారు. సూర్య, చంద్ర గ్రహణాలేర్పడడానికి వేరే కారణాలున్నాయి. రాహుకేతువులకు, సూర్యచంద్ర గ్రహణాలకు ఎలాంటి సంబంధం లేదు. అసలు దేవతలు రాక్షసులు పాల సముద్రాన్ని చిలకడం అందులో నుంచి అమృతం రావడం మొదలైన కథ అంతా కూడా మన పురాణకర్తల కల్పనే. అందువల్ల తనను రాహువు హింసిస్తూ ఉంటే తనకు సహాయంగా దేవతలు రాలేదని సూర్యుడు కోపించి తన కిరణాల చేత లోకాలను తపింప జేశాడనేది వాస్తవం కాదు. పురాణకర్తల కల్పన. అసలు సూర్యుడు దేవుడు కాడని, అతడు రథం మీద తూర్పు దిక్కు నుంచి పడమర దిక్కుకు ప్రయాణించడం లేదన్నది వాస్తవమైనప్పుడు అతనికి సారథి అవసరం లేదు. ఈకారణం చేత పై కథ అంతా పూర్తిగా కట్టుకథ అని స్పష్టమవుతూ ఉంది. ఈ కథ కూడా జానపద కట్టుకథల ప్రభావంతో పండితకవి కల్పించినదే. అందువల్ల ఇందులో జానపద కట్టు కథాంశం ఉంది.

ఈ కథలో అరుణుడు చాలా విశాలమైన దేహంతో సూర్యుని ప్రకాశాన్ని అడ్డుకున్నట్లుగా చెప్ప బడింది. సూర్యుని ప్రకాశాన్ని అడ్డుకోగల విశాలమైన శరీరం ఏ ప్రాణికి ఉండదు. ఇలాంటి వన్నీ ఆధునికులు ఏమాత్రం నమ్మడానికి శక్యం కానివి. ప్రాచీన కవులకు ఖగోళశాస్త్ర పరిజ్ఞానం లేకపోవడం చేత ఇలాంటి కట్టుకథలను కల్పించారని చెప్పవచ్చు.

ఈ కథలో అనౌచిత్యమైన అంశాలున్నాయి. ఇందులో కథ ప్రారంభంలో సూర్యుడు తూర్పు దిక్కునే ఉండి తన కిరణాలచేత లోకాలను దహించాడని ఉగ్రశ్రవసుడు శౌనకాది మునులకు చెప్పినట్లుగా ఉంది. రాహువు తనను పట్టుకొని బాధ పెడుతూ వుంటే దేవతలు తనకు సాయం చేయకుండా ఉన్నారనే కోపంతో అతడు అస్త్రాద్రికి చేరి అక్కడే వుంటూ లోకాలను దహిస్తున్నాడని ఈ కథలో లోపల చెప్పబడింది. ఈ రెండింటిలో ఏది నిజం. సూర్యుడు తూర్పుదిక్కునే ఉండి లోకాలను దహించాడా? లేక అస్త్రాద్రిలో ఉండి లోకాలను దహించాడా? అనేది ఇందులో స్పష్టంగా లేదు. అలాగే సూర్యుడు కోపంతో ప్రయాణం మానివేసి ఒకే దిక్కులో ఉండి లోకాలను దహిస్తూ ఉన్నట్లుగా ఇందులో చెప్పబడింది. అప్పుడు సూర్యుడు తిరిగి ఉదయాద్రి నుంచి అస్త్రాద్రికి పయనించే లాగా చేయాలి. అది చేయకుండా అనూరుడైన అరుణుని సూర్యుని సారథిగా

చేసి తీవ్రమైన సూర్యుని కిరణాలను అడ్డుకున్నట్లుగా ఇందులో ఉంది. సూర్యుడు పయనించడం మానివేసి ఒక దగ్గరే ఉంటే అటువైపు ఎల్లప్పుడు పగలుగా ఉంటుంది. దానికి అవతల వైపు ఎల్లప్పుడు చీకటిగా (రాత్రిగా) ఉంటుంది. ఈ కథలో ఈ సమస్య గురించి చెప్ప లేదు. ఇది ఈ కథలో అనౌచిత్యం.

నన్నయ ఆదిపర్వంలో ఈ కథను అనువదించకుండా వదలివేశాడు.

## 3. ఎ. సర్పాలకు రెండు నాలుకలు ఉండడం :
## బి. సర్పాలు గరుడునికి ఆహారం కావడం :

ఈ రెండు కథలు సంస్కృత భారతంలోని ఆదిపర్వంలోని ఆస్తీకపర్వం అనే ఉపపర్వంలో గరుడుని వృత్తాంతంలో చెప్పబడ్డాయి. ఈ కథలను నైమిశారణ్యంలోని మునులకు ఉగ్రశ్రవసుడు చెబుతాడు. గరుడుడు చాలాగొప్ప బలవంతుడు. అతని ముందు దిక్పాలకులు, దేవేంద్రుడు మొదలైన వారు కూడా నిలబడలేరు. ఇతని తల్లి వినత, పెదతల్లి కద్రువ. వీరిద్దరూ కశ్యపుని భార్యలు. కద్రువ కుమారులు నాగులు. వినత కద్రువలు పందెం వేసుకొని ఓడిపోయిన వారు గెలిచిన వారికి దాస్యం చేయాలను కుంటారు. ఆ పందెంలో వినత ఓడిపోయి కద్రువకు దాస్యం చేస్తూ ఉంటుంది. కద్రువతోపాటు ఆమె కుమారుడైన గరుడుడు కూడా కద్రువకు, ఆమె కుమారులైన నాగులకు దాస్యం చేస్తూ వుంటాడు. గరుడుని తల్లి దాస్య విముక్తి కావాలంటే అమృతం తెచ్చి తమకు ఇవ్వాలని నాగులు చెబుతారు. గరుడుడు అమృతం తేవడం కోసం దేవలోకం మీదికి దండెత్తి దేవేంద్రుడు మొదలైన దేవతలను జయించి అమృత కలశాన్ని గ్రహిస్తాడు. దేవేంద్రుని వజ్రాయుధం కూడా గరుడుని ఏమీ చేయలేదు. దానితో దేవేంద్రుడు తగ్గిపోయి గరుడునితో మైత్రి కోరతాడు. అతనితో మైత్రికి గరుడుడు కూడా అంగీకరిస్తాడు. అపుడు దేవేంద్రుడు అమృతాన్ని స్వీకరించిన వారు దేవతలకు బాధ కల్గించవచ్చు కాబట్టి అమృత కలశాన్ని ఇచ్చి వేయమని గరుడుని కోరతాడు. దానికి గరుడుడు తాను ఒక కారణం చేత అమృతాన్ని తీసుకొని పోతున్నానని, దాన్ని ఎవరికీ తాగడానికి ఇవ్వనని, దాన్ని తీసుకొని వెళ్ళి ఒక చోట ఉంచుతానని, దేవేంద్రుడు అదృశ్యంగా వచ్చి అమృత కలశాన్ని అపహరించ వచ్చునని చెబుతాడు. దానికి దేవేంద్రుడు సంతోషించి ఏదైనా వరం కోరుకోమని గరుడునికి చెబుతాడు. గరుడుడు కద్రువ, ఆమె కుమారులు తన తల్లిని మోసగించి దాస్యం చేయించుకున్న విషయం గుర్తుకు తెచ్చుకొని వాటి మీద పగ సాధించడానికి దేవేంద్రునితో

**"ఈ శో హమపి సర్వస్వ కరిష్యామి తు తేర్థితామ్**
**భవేయుర్భజగాః శక్ర మమ భక్ష్యా మహాబలాః"**

**(ఆది. 34 – 13)**

"మహా బలవంతులైన సర్పాలు నాకు ఆహారం కావాలి" అని కోరతాడు. అలాగే అవుతాయని దేవేంద్రుడు ఆ వరాన్నిస్తాడు.

ఆ తర్వాత గరుడుడు అమృత కలశాన్ని తీసుకొని నాగుల దగ్గరకు వచ్చి వారందరితో "నాగులారా! మీరు కోరిన విధంగా నేను ఆమృతాన్ని తెచ్చాను. దీన్ని ఈ దర్భల మీద ఉంచుతున్నాను. మీరు స్నానం చేసి శుచులై వచ్చి అమృతాన్ని తాగండి. అమృతాన్ని తెస్తే నా తల్లి దాసీత్వం తొలగుతుందని మీరు చెప్పారు.ఆ మాట ప్రకారం అమృతం తెచ్చాను. ఇప్పటి నుంచి నా తల్లి మీ దాసీత్వం నుంచి విముక్తురాలయ్యింది" అని చెబుతాడు. నాగులు ఆ మాటలకు అంగీకరించి స్నానం చేయడానికి వెళ్తారు. ఇంద్రుడు అక్కడికి అదృశ్యంగా వచ్చి దర్భల మీద ఉన్న అమృత కలశాన్ని తీసుకొని వెళ్ళిపోతాడు. నాగులు స్నానం చేసి అమృతాన్ని తాగాలన్న కోరికతో వస్తారు. అయితే దర్భలమీద అమృతకలశం లేకపోవడం గమనించి, దాన్ని ఎవరో దొంగిలించారని వారు భావిస్తారు.

**"సోమస్థానమిదం చేతి దర్భాంస్తే లిలిహుస్తదా**
**తతోద్విదాకృతా జిహ్వాః సర్పాణాం తేన కర్మణా"**

**(ఆది. - 34 - 23)**

"దర్భల మీద అమృత కలశం ఉంచడం వల్ల నాగులు దర్భలను నాకుతారు. ఆలా నాకడం వల్ల వాటి నాలుకలు రెండుగా చీలుతాయి". ఈ కారణం చేతనే నేటికీ పాములకు రెండు నాలుకలు ఉన్నాయి. అప్పటి నుంచీ గరుడుడు సర్పాలను భుజిస్తూ పక్షులన్నిటికి రాజై సుఖంగా ఉన్నాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

పై కథలో గరుడుడు సర్పాలను ఆహారంగా స్వీకరించడానికి దేవేంద్రుడు అతనికి వరమివ్వడం కారణంగా చెప్పబడింది. అలాగే దర్భలను పాముల నాకడం చేత వాటి నాలుక రెండుగా చీలినట్లు చెప్పబడింది. భారతంలో గరుడుని పుట్టుక, అత్యంత విశాలమైన పెద్దదైన దేహాన్ని అతను కల్గి ఉండడంతోపాటు దేవత లందరినీ జయించ గల బలపరాక్రమాలను అతను కల్గి ఉండడం మొదలైన ఈకథ అంతా అనేక అద్భుత సంఘటనలతో కూడి ఉంది. ఇదంతా కల్పితమే. లోకంలో గద్ద చాలా శక్తివంతమైన పక్షి. అది చాలా వేగంగా ఎగురగలదు. చాలా బలమైనది కూడా. గద్ద వేగంగా ఎగురుతూ వచ్చి చెట్టు మీద కూచుంటే చెట్టు కంపిస్తుంది. అంతటి వేగం దానికుంది. అది సర్పాలను తింటుంది. ప్రకృతిలో కొన్ని ప్రాణులకు కొన్ని ప్రాణులు ఆహారంగా కన్పిస్తున్నాయి. పిల్లికి ఎలుక, పాముకు కప్పలు, ఎలుకలు మొదలైనవి దీనికి ఉదాహరణ చెప్పవచ్చు. అలాగే గద్దలకు పాములు ఆహారంగా ప్రకృతిలో ఉన్నాయి. దీన్ని గమనించిన ప్రాచీన కవి లోకంలో అత్యంత శక్తివంతమైన గద్దను నాయకునిగా చేసుకొని దానికి అమానుషమైన, అద్భుతమైన కల్పనలను జోడించి గరుడుని వృత్తాంతాన్ని రచించాడు. ఈ కథ చాలా ఆశ్చర్యకరంగా, ఆసక్తికరంగా ఉంది. దీన్ని కల్పించిన కవి కల్పనా చాతుర్యం చాలా గొప్పది. అతడు మహాకవి అనడంలో ఎలాంటి సందేహం లేదు. ఈ కారణం చేతనే గరుడుని వృత్తాంతాన్ని ఆస్తికులు, సంప్రదాయవాదులు వాస్తవమని భావిస్తున్నారు.

నమ్ముతున్నారు. కానీ హేతుబద్ధంగా ఆలోచిస్తే ఇది వాస్తవం కాదు. పూర్తిగా కల్పన. ప్రకృతిలో పాములకు నాలుక చివర చీలి రెండు నాలుకలు ఉన్నట్లుగా కన్పిస్తూ ఉంది. అలాగే పాములు గద్దలకు ఆహారంగా ఉన్నాయి. ఈ రెండు విషయాలను గమనించిన కవి పై గరుత్మంతుని కథలో వాటిని కల్పించి చెప్పాడు. అందువల్లనే ఇవి కట్టుకథలు అవుతున్నాయి. ఇవి కూడా జానపద కట్టుకథల ప్రభావంతో పండిత కవి కల్పించినవే.

నన్నయ ఆదిపర్వం ద్వితీయాశ్వాసంలో రెండవ వచనం నుంచి 122వ పద్యం వరకు వున్న 121 పద్య గద్యాల్లో గరుడుని వృత్తాంతాన్ని వివరించాడు. నన్నయ మూలాన్ని అనుసరించి ఈ కథను రాశాడు. ఇందులో ఎలాంటి మార్పులు చేయలేదు.

## 4. శేషుడు భూభారాన్ని వహించడం:

ఈ కథ సంస్కృత భారతంలో ఆదిపర్వంలో ఆస్తీకపర్వం అనే ఉపపర్వంలో 36వ అధ్యాయంలో 25 శ్లోకాల్లో ఉంది. దీన్ని ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలో ఋషులకు చెబుతాడు. ఉగ్రశ్రవుడు గరుత్మంతుని వృత్తాంతాన్ని చెప్పిన తర్వాత శౌనకుడు "కద్రువ ఇచ్చిన శాపం నుంచి తప్పించుకోవడానికి మహాసర్పాలు ఏమి చేశాయి" అని అడుగుతాడు. దానికి సమాధానంగా ఉగ్రశ్రవుడు ఈ కథను చెబుతాడు.

సర్పాలందరిలోకి పెద్దవాడు ఆదిశేషుడు. అతడు తల్లిని, తమ్ములను వదలిపెట్టి జితేంద్రియుడై గంధ మాదన పర్వతంమీద కొంత కాలం ఆ తర్వాత అనేక పుణ్య తీర్థాల్లో ఘోరమైన తపస్సు చేస్తాడు. అతని తపస్సుకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై "శేషుడా ఎందుకు ఇంత తీవ్రమైన తపస్సు చేస్తున్నావు నీ కోరిక ఏమిటి? ప్రాణి కోటికి మేలు కలిగించు" అని పల్కుతాడు. దానికి శేషుడు "పితామహా నా సోదరులందరూ మందబుద్ధులు, వారు పరస్పరం శత్రు భావంతో దెబ్బలాడు కుంటున్నారు. అందువల్ల నేను వారిని చూడకూడదని తపస్సు చేసుకుంటున్నాను. నాగులైన నా సోదరులు వినతను, ఆమె కుమారుడైన గరుడుని ద్వేష భావంతో చూస్తున్నారు. గరుడుడు నా తండ్రిగారి వరం వల్ల మహా పరాక్రమవంతుడుగా ఉన్నాడు. ఈ కారణంచేత తపస్సు చేసి కృశించి శరీరాన్ని విడిచి పెట్టాలను కుంటున్నాను" అని అంటాడు. దానికి బ్రహ్మ శేషునితో "నీ సోదరుల చెడునడతలు నాకు తెలుసు. నీ తల్లి కద్రువ ఇచ్చిన శాపంవల్ల వాళ్ళు భయపడుతున్నారు. శాప పరిహారాన్ని కూడా నేను చేసిపెట్టాను. నీ సోదరుల గురించి నీవు విచారించ వద్దు. నీకు కావలసిన వరం కోరుకో" అని అంటాడు. దానికి శేషుడు, "పితామహా! నా బుద్ధి ఎప్పుడూ ధర్మం మీదనే నిలిచి ఉండేటట్లుగా తపస్సులో లగ్నమయ్యేటట్లుగా వరాన్ని ఇవ్వు" అని కోరతాడు. దానికి బ్రహ్మ "శేషుడా! నీ శమదమాలకు చాలా సంతోషం కల్గింది. ప్రస్తుతం ప్రజలందరికీ ఉపకారం కలిగే పని చేయి.

**"ఇమాం మహీం శైలవనో తపత్రాం, స సాగర గ్రామ విహార పత్తనాం**
**త్వం శేష సమ్యక్ చలితాం యథావత్, సంగృహ్యా తిష్ఠస్వ యథాచలా స్యాత్"**

**(ఆది. 36 – 19)**

“పర్వతాలతో అడవులతో, సముద్రాలతో, గ్రామాలతో, పట్టణాలతో కూడిన ఈ భూమి ఎప్పుడూ చలిస్తూ ఊగుతూ ఉంటుంది. నీవు భూభారాన్ని వహించి నిశ్చలంగా ఉండేలాగా మోస్తూ ఉండు” అని చెబుతాడు. దానికి ఆదిశేషుడు అంగీకరించి “నీ ఆజ్ఞను శిరసా వహించి భూభారాన్ని తప్పక మోస్తాను. భూమిని నిశ్చలంగా ఉంచుతాను. భూమిని నా శిరస్సు మీద ఉంచండి” అని అంటాడు. అపుడు బ్రహ్మ “శేషా! నీవు భూమి కింది భాగానికి వెళ్ళు, అలా వెళ్ళడానికి అది నీకు మార్గాన్ని ఇస్తుంది. ఆ దారిలో నీవు పాతాళానికి వెళ్ళి అక్కడ భూమికింద నీ శరీరాన్ని ఉంచి భూభారాన్ని వహించు” అని చెబుతాడు. బ్రహ్మ చెప్పినట్లుగానే శేషుడు పాతాళానికి వెళ్ళి తన తలమీద భూమిని ధరిస్తాడు.

**“అధోభూమో వసన్యేవం నాగోనంతః ప్రతాపవాన్**
**ధారయన్వసుధామేకః శాసనాద్బ్రహ్మణో విభుః”**
**(ఆది. 36 – 24)**

“బ్రహ్మ ఆజ్ఞ ప్రకారం భూమినిమోస్తూ శేషుడు పాతాళలోకంలో నివసిస్తున్నాడు”. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథ ఏ మాత్రం హేతుబద్ధమైనది కాదు. ఆదిశేషుడు విష్ణువుకు తల్పంగా ఉన్నట్లు ప్రసిద్ధమైన కథ ఉంది. విష్ణువుకు తల్పంగా ఉన్న ఆదిశేషుడు పాతాళ లోకంలో నివసిస్తూ భూమిని ఏవిధంగా మోస్తూ ఉంటాడు? అంతేగాకుండా భూమికి కింద ఈ కథలో చెప్పినట్లుగా పాతాళలోకం లేదు. పాతాళలోకమే కాదు అసలు ఏ లోకమూ లేదు. భూగోళ జ్ఞానం తెలియని మన పూర్వకవులు భూమి కింద అతల, వితల, రసాతల, పాతాళ మొదలైన ఏడు లోకాలు వున్నట్లుగా, భూమి పైన స్వర్గలోకం, గోలోకం, బ్రహ్మలోకం మొదలైన ఏడు లోకాలు వున్నట్లుగా ఊహించి చెప్పారు. ప్రస్తుతం మనకు తెలిసిన భూగోళ ఖగోళ జ్ఞానం ప్రకారం ఈ లోకాలేవీ లేవు. భూమి మిగిలిన గ్రహాలు విశ్వంలో సూర్యుని చుట్టూ వేరు వేరు కక్ష్యల్లో తిరుగుతూ ఉన్నాయి. వీటిని ఎవ్వరూ మోయడం లేదు. అందువల్ల ఆదిశేషుడు భూమిని మోస్తున్నాడన్న కథ కట్టుకథ అని స్పష్టంగా చెప్పవచ్చు. ఇది జానపద కట్టుకథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ. అలాగే భూమిని అష్టదిగ్గజాలు మోస్తున్నాయని ఒక కథ, అది కూర్మం మోస్తూ ఉందని మరొక కథ ఉన్నాయి. ఈ కథలు నిజమైతే భూమిని శేషుడు మోస్తున్నట్లా? అష్ట దిగ్గజాలు మోస్తున్నట్లా? కూర్మం మోస్తున్నట్లా? ఈ మూడు కథలు వేరు వేరు వ్యక్తులు కల్పించినవి. గ్రీకు పురాణాల్లో జ్యూస్ అనే దేవునికుమారుడైన హెర్క్యులీస్ అనే మహాబలుడు భూమిని మోస్తున్నట్లుగా ఒక కథ ఉంది. మిగిలిన దేశాల్లో కూడా ఇలాంటి కథలు ఉండవచ్చు. ఈ కథలన్నీ కట్టుకథలని స్పష్టంగా చెప్పవచ్చు.

ఈ కథను తిక్కన ఆదిపర్వం ద్వితీయాశ్వాసంలోని 124వ పద్యం నుంచి 126వ వచనం వరకూ ఉన్న మూడు పద్య గద్యాల్లో క్లుప్తీకరించి రాశాడు.

## 5 . ఔర్వుడు అనే ఋషి తన కోపాగ్నిని సముద్రంలో వేయగా అది బడబాగ్నిగా మారడం :

ఈ కథ ఆదిపర్వంలోని చైత్రరథపర్వం అనే ఉపపర్వంలో 179,180వ అధ్యాయాల్లో 55 శ్లోకాల్లో ఉంది. ఈకథను వశిష్టుడు తన మనుమడైన పరాశరునికి చెబుతాడు.

పూర్వం కృతవీర్యుడు అనే గొప్పరాజు ఉండేవాడు. అతడు భృగు వంశస్తులకు యజమాని. ఈ రాజు సోమయాగం చేసి విస్తారమైన ధనాన్ని భృగు వంశస్తులకు దానం చేశాడు. అతడు చనిపోయిన తర్వాత ఆ వంశస్తులకు ధనం అవసరమై భృగు వంశస్తుల దగ్గర చాలా ధనముందని తెలిసి, రాజ కుటుంబీకులందరూ భృగు వంశస్తులను యాచిస్తారు. కొందరు భార్గవులు తమ ధనాన్ని భూమిలో దాచి వేస్తారు. కొందరు రాజులకు ఇవ్వకుండా బ్రాహ్మణులకు దానం చేస్తారు. మరికొందరు తమ వద్ద ఉన్న ధనాన్ని ఆ రాజులకు ఇస్తారు. ఆ రాజుల్లో ఒకరు దేనికోసమో భూమిని తవ్వుతూ ఉండగా ఒక భృగు వంశస్తుని ఇంటిలో పాతిపెట్టి ఉంచిన ధనం కనిపిస్తుంది. అప్పుడు రాజులు కోపంతో భృగు వంశంలోని పురుషులను చంపడం ప్రారంభిస్తారు. అంతే కాకుండా వారు భృగు వంశంలోని గర్భస్త శిశువులను గూడా చంపడం మొదలు పెడతారు. భృగువంశ పత్నులు కొందరు తమ గర్భాలను రక్షించు కోవడానికి హిమాలయ పర్వతాల్లోని గుహల్లో దాక్కుంటారు. వారిలో ఒక స్త్రీ తన గర్భాన్ని భయంతో తన తొడలో దాచుకుంటుంది. ఈ విషయం తెలిసిన మరొక బ్రాహ్మణ స్త్రీ క్షత్రియులకు చెబుతుంది. అపుడు క్షత్రియులందరూ ఆ గర్భవిచ్ఛేదన చేయడానికి బయలుదేరుతారు. అపుడు గర్భస్థ శిశువు తల్లి తొడను చీల్చుకొని బయటికి వచ్చి తన తపో ప్రభావంతో తన కోసం వెదుకుతున్న క్షత్రియుల కళ్ళను పోగొడతాడు. తొడ నుంచి పుట్టిన వాడు కావడం చేత ఆ బాలుడు ఔర్వుడు అనే పేరుతో పిలవబడతాడు. క్షత్రియులు ఔర్వుని తల్లి దగ్గరకు వచ్చి తమకు చూపును ప్రసాదించ వలసిందిగా కోరతారు. ఆమె వారి చూపును పోగొట్టిన దాన్ని తాను కాదని, తన కుమారుడైన ఔర్వుడు తన దివ్య తేజస్సుతో ఆ పని చేసి ఉంటాడని, కాబట్టి చూపు కోసం తన కుమారుని యాచించమని చెబుతుంది. రాజులు ఔర్వుని ప్రార్థించి చూపును పొంది వెళ్ళిపోతారు.

ఆ తర్వాత ఔర్వుడు క్షత్రియులు తమ వంశస్తులను చంపినందుకు చాలా కోపించి సర్వ లోకాలను నాశనం చేయాలని తీవ్రమైన తపస్సు చేస్తుంటాడు. అపుడు చనిపోయిన అతని పితృదేవతలు అతని వద్దకు వచ్చి అతనితో "తీవ్రమైన క్రోధంతో చేస్తున్న తపస్సును నియంత్రించు. క్షత్రియులు మా కోరిక మీదనే మమ్ములను చంపారు. మా ఆయువు బాగా మించి పోవడం చేత మమ్ములను చంపమని మేమే వారికి చెప్పాం. క్షత్రియులకు మా మీద కోపం కల్గడానికి దాచి ఉంచిన ధనాన్ని వాళ్ళకు కన్పించేలా చేశాం. ఆత్మహత్య పాపం కాబట్టి మేము ఆత్మహత్య ద్వారా చనిపోకుండా క్షత్రియుల చేతిలో చనిపోయాము. నీవు ప్రస్తుతం సర్వ లోకాలను నాశనం చేయాలను కోవడం మాకు ఇష్టమైనది కాదు. కాబట్టి ఆ ప్రయత్నం విరమించుకో" అని చెబుతారు. దానికి

ఔర్వుడు వారితో "నేను కోపంతో సర్వ లోక వినాశనం చేస్తానని ప్రతిజ్ఞ చేశాను. నా ప్రతిజ్ఞ నెరవేరకపోతే అగ్ని అరణిని దహించినట్లుగా అది నన్ను దహించి వేస్తుంది. తల్లి తొడలో నేను ఉన్నప్పుడు క్షత్రియులు భార్గవులను చంపిన సందర్భంలో వారు చేసిన ఆర్తనాదాలను నేను విన్నాను. నా తల్లి నన్ను రక్షించడానికి గర్భంలో ఉన్న నన్ను తొడలో దాచి అనేక కష్టాలు పడింది. పాప కర్మలను చేసే వారిని నిరోధించకుంటే లోకంలో చాలా మంది పాపపు పనులను చేస్తారు.

**"జానన్నపిచ యః పాపం శక్తిమాన్న నియచ్ఛతి**
**ఈశస్సన్ సోపి తేనైవ కర్మణా సంప్రయుజ్యతే"**

**(ఆది. 180 – 11)**

"పాపపు పనిని నిరోధించ గల శక్తి ఉన్నవారు పాపకృత్యాన్ని నియంత్రించక పోతే అలాంటి వానికి పాపపు కర్మఫలం అంటుకుంటుంది". మా పితరులను చంపిన వారిని దండించ గల శక్తి నాకుంది. నేను సమర్థుడనై ఉండి కూడా పాప కృత్యాలను చూస్తూ ఊరుకుంటే నాకు గూడా పాపాల వల్ల తీవ్రభయం కల్గుతుంది. కాబట్టి కోపంతో నాలో పుట్టిన అగ్ని జ్వాలలతో లోకాలను నాశనం చేయాలనుకున్నాను. నేను దాన్ని నిరోధిస్తే అది తన తేజస్సుతో నన్నే దహించి వేస్తుంది. కాబట్టి లోకాలకు నాకు కూడా మేలు కలిగేటట్లు మీరు చూడండి" అని ఔర్వుడు పితరులను కోరతాడు. దానికి పితరులు సమస్త జగత్తూ జలమయం, లోకాలు నీటిలోనే ప్రతిష్ఠించబడి ఉన్నాయి. కాబట్టి నీ క్రోధాగ్నిని నీటికి స్థానమైన సముద్రంలో విడిచిపెట్టు. అది నీటిని దహిస్తుంది. ఈ విధంగా నీ ప్రతిజ్ఞ కూడా నెరవేరుతుంది. లోకాలన్నీ నష్టపోకుండా ఉంటాయి" అని చెబుతారు. వారు చెప్పినట్లుగా

**"తతస్తం క్రోధజంతాత్ ఔర్వాగ్నిం వరుణాలయే**
**ఉత్ససర్జ చ చైవాపయుంక్తే మహోదదౌ"**

**(ఆది. 180 – 11)**

ఔర్వుడు తన క్రోధం నుంచి పుట్టిన అగ్నిని సముద్రంలో వదలి వేస్తాడు. అతడు వదలి వేసిన ఆ అగ్ని ఇప్పటికీ అశ్వ ముఖాకృతితో సాగర జలాలను తాగుతూనే ఉంది. ఆ బడబ అంటే ఆ గుర్రం తన నోటి నుంచి అగ్నిని కక్కుతూ సముద్ర జలాన్ని తాగుతూనే ఉంటుంది. వేదవేత్తలకు ఇది తెలుసు అని వశిష్టుడు పరాశరునికి ఈ కథను చెప్పాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

సముద్రంలో బడబాగ్ని ఉంది. అది మనందరికీ తెలుసు. అలా బడబాగ్ని సముద్రంలో ఉండడానికి కారణం ఔర్యుడు తన కోపాగ్నిని సముద్రంలో వదలి వేయడంగా ఈ కథలో కల్పించ బడింది. అందువల్ల ఇది కట్టు కథ అవుతుంది. సముద్రంలో బడబాగ్ని ఉన్నట్లుగా గ్రహించిన కవి ఋషుల మహాత్మ్యాన్ని చాటి చెప్పడానికి ఈ కథను కల్పించాడు. ఇది జానపద కట్టుకథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ. ఒకరి కడుపులోని

పిండాన్ని మరొకరి కడుపులోకి ప్రవేశపెట్టడం, గర్భాశయంలోని పిండాన్ని తీసి మరొక అవయవంలో దాచిపెట్టడం అనేవి జానపద కవుల భావనలు. పరకాయ ప్రవేశ విద్య కూడా జానపద కవులు భావనే. ఈ కథలో ఔర్వుని తల్లి పిండ రూపంలో తన గర్భంలో వున్న ఔర్వుని, గర్భం నుంచి తీసి తన తొడలో దాచినట్లుగా చెప్పబడింది. మనుషులు కాలు మడిచి కింద కూర్చున్నప్పుడు తొడ, పిక్క కలిసిన ప్రదేశం స్త్రీ యోని ఆకారంలో వుంటుంది. ఈ కారణం చేతనే పండిత కవి ఔర్వుని తల్లి తన గర్భాన్ని వంద సంవత్సరాలు తొడలో దాచినట్లుగా చెప్పాడు. ఇక్కడ పండిత కవి జానపదుల భావనను తీసుకున్నాడు. పిండరూపంలో వున్న బలరాముణ్ణి చెరసాలలో వున్న దేవకి గర్భం నుంచి రేపల్లెలో వున్న రోహిణి గర్భంలోకి యోగమాయ మార్చినట్లుగా భాగవతంలో వుంది. ఇది కూడా జానపద భావనే. గర్భంలో ఎంత ఎక్కువ కాలం వుంటే ఆ శిశువు అంత గొప్ప మహిమాన్వితుడు అవుతాడన్నది జానపద కవుల భావన. ఈ భావన ప్రకారం పండిత కవి ఔర్వుడు వంద సంవత్సరాలు తొడలో వున్నట్లుగా ఈ కథలో చెప్పాడు.

ఈ కథలో తల్లి తొడలో వున్న ఔర్వుడు బయటకు వచ్చి తన తపో మాహాత్మ్యంతో తనను చంపడానికి వెతుకుతున్న క్షత్రియుల కళ్ళు పోగొట్టినట్లుగా వుంది. ఇది బ్రాహ్మణుల మాహాత్మ్యాన్ని చాటిచెప్పే సంఘటన. ఈ కథలో కొన్ని అనౌచిత్యాలు వున్నాయి. చాలా మంది భృగు వంశస్థులను చంపి తనను చంపడానికి వస్తున్న క్షత్రియులు తమకు చూపు ప్రసాదించమని వేడుకోగానే ఔర్వుడు వారికి చూపును ప్రసాదించడం ఆశ్చర్యంగా ఉంది. పోనీ ఋషి కాబట్టి ఆ పని చేశాడనుకుంటే ఏ పాపమూ చేయని సర్వ లోకాలను తన క్రోధాగ్నితో ఔర్వుడు నాశనం చేయాలను కోవడం విడ్డూరంగా ఉంది. తనకు అపకారం చేసిన వారిని వదలి వేసి ఎలాంటి అపకారం చేయని ముల్లోకాల్లోని దేవతలు, రాక్షసులు, మానవులతోపాటు సమస్త ప్రాణికోటినీ నాశనం చేయాలను కోవడం పాపం, దుర్మార్గం కూడా. ఔర్వుని పితృదేవతలు అతని దగ్గరికి వచ్చి తాము కావాలనే క్షత్రియుల చేతిలో చనిపోయామని చెప్పడం మరింత విడ్డూరంగా కనిపిస్తుంది. కావాలని చంపించుకున్న వారు ప్రాణ భయంతో హాహాకారాలు చేస్తూ పరుగెత్తరు. కానీ ఈ కథలో తన పితరులు భయంతో సర్వ లోకాలకు పరిగెత్తినట్లుగా, వారికి ఎవరూ శరణు ఇవ్వనట్లుగా, భృగు వంశస్థుల పత్నులకు రక్షకులే దొరకనట్లుగా ఔర్వుడే తన పితరులతో చెబుతాడు. కాబట్టి ఈ కథ యావత్తూ అనౌచిత్యమైన అంశాలతో కూడుకొని ఉంది.

ఈ కథ కథాకాలం నాటి రాజకీయ, సాంఘిక పరిస్థితిని తెలుపుతూ వుంది. ఆనాడు బ్రాహ్మణులు రాజులను ప్రశంసించి వారిచేత యజ్ఞయాగాలను చేయించేవారు. దీనికి కారణం యజ్ఞయాగాల సందర్భంలో రాజులు బ్రాహ్మణులకు ముఖ్యంగా రాజ పురోహిత వంశం వారికి అపరిమితమైన ధనాన్ని దానంగా ఇవ్వడమే. యజ్ఞయాగాల సందర్భంలో రాజులు ఇచ్చిన ధనాన్ని బ్రాహ్మణులు తమ ఇళ్లలో భూమిలో పాతిపెట్టి

దాచుకొనే వారు. రాజులకు ధనం అవసరమైనప్పుడు తిరిగి బ్రాహ్మణులను యాచించేవారు. ఆ ధనం రాజులు ఇచ్చిందే కాబట్టి కొంత మంది బ్రాహ్మణులు రాజుల అవసరానికి వారు అడిగినప్పుడు రాజులకు ఇచ్చేవారు. మరి కొంత మంది బ్రాహ్మణులు ధనం ఇచ్చేవారు కాదు. దీనితో రాజులు కోపించి బ్రాహ్మణులను కొట్టి గాని, చంపి గాని వారి వద్ద వున్న ధనాన్ని తీసుకునే వారని ఈ కథవల్ల తెలుస్తుంది. రాజులు ఇలా చేయడం వల్లనే బ్రాహ్మణుల సొమ్ము ఇతరులు తీసుకోకూడదని, అలా తీసుకుంటే వారు ఘోరనరక కూపంలో పడిపోతారని, బ్రాహ్మణులను హత్యచేయడం వల్ల బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంటుందని, దానికి నిష్కృతి లేదని అనేక కథలు కల్పించి మన ప్రాచీన గ్రంథాల్లో బ్రాహ్మణకవులు చెప్పారు. దీనికి ఉదాహరణగా భారతం అనుశాసనపర్వం 101వ అధ్యాయమైన "రాజన్య చండాల సంవాదాన్ని" చెప్పవచ్చు. ఇందులో బ్రాహ్మణుల సొమ్ము అపహరించడం చాలా గొప్ప పాపంగా చెప్పబడింది. ఈ కథను భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. బ్రాహ్మణుల సొమ్ము అపహరించిన మూఢులు, బుద్ధిహీనులు, క్రూరులు అయిన మానవులు ఏ లోకాలకు వెళతారు అని ధర్మరాజు ప్రశ్నించగా దానికి సమాధానంగా భీష్ముడు ఈ కథను ఇలా చెబుతాడు.

" చండాలుడు రాజన్యునితో ఇలా చెబుతాడు. "రాజా! ఒకప్పుడు బ్రాహ్మణుడి గోవుల దొంగతనం జరిగింది. వాటిని తీసుకొని వెళుతుంటే గోధూళి సోమరసం మీద పడి సోమరసాన్ని అపవిత్రం చేసింది. ఆ సోమరసాన్ని తాగిన బ్రాహ్మణులు, యజ్ఞం చేయించిన రాజు వెంటనే నరకానికి వెళ్లారు. ఆ గోవుల పాలు, నెయ్యి, పెరుగు తాగిన మనుషులు, బ్రాహ్మణులు, క్షత్రియులు అందరూ నరకానికి వెళ్లారు. గోవులను దొంగిలించిన వారు పుత్రపౌత్రులతో పాటు నశించారు. రాజా! అప్పుడు నేను బ్రహ్మచారినై, జితేంద్రియుడనై అక్కడే ఉన్న ఆ గోధూళి పడిన భిక్షను స్వీకరించడం చేత ఈ జన్మలో చండాలుడనయ్యాను. కాబట్టి బ్రాహ్మణుల సొమ్ము ఎప్పుడూ, ఎవ్వరూ కొంచెంకూడా అపహరించకూడదు" అని చండాలుడు రాజన్యునితో చెప్పి నేను ఈ చండాలత్వం నుండి ఎలా ముక్తి పొందగలను? అని రాజన్యుని అడుగుతాడు. దానికి రాజన్యుడు "బ్రాహ్మణులకోసం ప్రాణాలను పరిత్యజించు. ఈ శరీరాన్ని బ్రాహ్మణ రక్షణ కోసం యుద్ధాగ్నిలో పచ్చి మాంసం తినే జంతువులకు అహుతిచెయ్యి. అలా బ్రాహ్మణ రక్షణ కోసం యుద్ధం చేసి ప్రాణాలు విడిచితే నీకు మోక్షం వస్తుంది" అని రాజన్యుడు చెప్పగా చండాలుడు బ్రాహ్మణ ధన రక్షణ కోసం పోరాడి ప్రాణాలను త్యజించి ఇష్టగతిని పొందాడు."

ఈ కథలో ఒక బ్రాహ్మణుని గోవులను దొంగిలించి తీసుకుని పోతున్నప్పుడు వాటి కాలినడక వల్ల లేచిన ధూళి సోమరసం మీద పడి అది అపవిత్రమయిందట. సోమరసం అంటే యజ్ఞం పూర్తయిన తర్వాత తాగే ద్రావం. అది చాలా పవిత్రమయినదిగా యజ్ఞం చేసేవారు భావిస్తారు. అలాంటి సోమరసం దొంగిలింపబడిన బ్రాహ్మణుల గోధూళి పడి అపవిత్రమైందట. ఆ సోమరసాన్ని తాగిన యజ్ఞం చేసిన బ్రాహ్మణులు, చేయించిన

రాజు వెంటనే నరకంలో పడిపోయారట. దొంగిలింపబడిన ఆవుల పాలు తాగిన బ్రాహ్మణులు, క్షత్రియులు మిగిలిన వర్ణాల వారు అందరూ నరకానికి వెళ్లిపోయారట. గోవులను దొంగిలించిన వారు పుత్రపౌత్రులతో నశించిపోయారట. చివరకు ఆ జన్మలో గోధూళి పడిన భిక్షాన్నం తిన్న పాపం చేత బ్రహ్మచారి ఈ జన్మలో చండాలుడుగా జన్మించాడట. ఆ తర్వాత చండాలుడు బ్రాహ్మణ ధనరక్షణ కోసం యుద్ధంలో ప్రాణాలను వదిలివేసి మోక్షం పొందాడట. ఈ రాతలన్నీ పచ్చి అబద్ధాలతో కూడినవి. బ్రాహ్మణుల జోలికి, బ్రాహ్మణుల సొమ్ము జోలికి రాకుండా ప్రజలను భయభ్రాంతులను చేయడానికి రాసినవి. ఈ రాతల్లో ఏమాత్రం నిజం లేదు.

నన్నయ ఈ కథను ఆదిపర్వం సప్తమాశ్వాసంలోని 132వ వచనం నుంచి 149వ వచనం వరకూ ఉన్న 18 గద్య పద్యాల్లో చెప్పాడు. నన్నయ ఇందులో ఎలాంటి మార్పులు చేయలేదు.

## 6 ఎ) అగ్ని వంశం కథ

ఈ వృత్తాంతం వనపర్వంలోని మార్కండేయ సమస్యాపర్వం అనే ఉపపర్వంలో 217వ అధ్యాయం నుంచి 222వ అధ్యాయం వరకు ఉన్న ఆరు అధ్యాయాల్లో 137 శ్లోకాల్లో వివరంగా ఉంది. ఈ వృత్తాంతాన్ని మార్కండేయ మహర్షి ధర్మరాజుకు చెబుతాడు. ధర్మరాజు మార్కండేయ మహర్షిని " పూర్వం అగ్నిదేవుడు నీటిలోకి ఎందుకు వెళ్లాడు? అగ్ని అదృశ్యం కాగా అంగిరసుడు అనే మహర్షి అగ్ని అయి దేవతలకు హవిస్సును ఎలా చేర్చాడు? ఒక్కడే అయిన అగ్నిదేవుడు భిన్నమైన పనుల్లో అనేక రూపాలుగా ఎందుకు కన్పిస్తాడు?" అని అడుగుతాడు. దానికి సమాధానంగా మార్కండేయ ముని అగ్నివంశం కథను ఇలా చెబుతాడు.

పూర్వకాలంలో అంగిరసుడు అనే ఋషి గొప్ప తపస్సు చేసి అగ్నిదేవుని మించిపోయే కాంతితో ప్రకాశిస్తూ జగత్తునంతటినీ వెలిగించాడు. అగ్నిదేవుడు కూడా తపస్సు చేస్తూ ఉన్నప్పటికీ అంగిరసుని తేజస్సుతో సంతప్తుడై బాగా వాడిపోయి అంగిరసుని వద్దకు వెళ్తాడు. అంగిరసుడు అగ్నిదేవునితో "నువ్వు త్వరగా లోకాలను వృద్ధి చేసే పనికి పూనుకోవాలి. బ్రహ్మదేవుడు నిన్ను చీకటిని పోగొట్టే అగ్నిగా మొదట సృష్టించాడు. నీ స్థానాన్ని నువ్వు త్వరగా గ్రహించు" అని చెబుతాడు. దానికి అగ్నిదేవుడు "లోకంలో నా కీర్తి అంతరించింది. నీవు అగ్నివి అయ్యావు. లోకులందరూ అగ్నిగా నన్ను కాకుండా నిన్నే భావిస్తారు. నీవే మొదటి అగ్నిగా ఉండు. నేను ప్రాజాపాత్యం పేరుతో రెండవ అగ్నిని అవుతాను" అని అంటాడు. అంగిరసుడు దానికి అంగీకరించకుండా "అగ్నిదేవా! దేవతలకు హవిస్సును చేర్చడం ద్వారా ప్రజలను స్వర్గానికి చేర్చే పుణ్యకార్యాన్ని నువ్వే నిర్వహించు. నన్ను చీకటిని పోగొట్టే అగ్నిపథంలో నిలిపి నీ మొదటి కుమారునిగా చేసుకో" అని కోరతాడు. దానికి అగ్ని అంగీకరించి అలాగే చేస్తాడు.

ఆ తర్వాత మార్కండేయుడు "నేను బ్రాహ్మణ గ్రంథాల్లోని విధి వాక్యాల ద్వారా అనేక కర్మల ద్వారా అనేక ప్రయోజనాలను కలిగించే ప్రసిద్ధమైన మిక్కిలి కాంతివంతమైన అగ్నులను గురించి వివరిస్తాను" అని ధర్మరాజుతో చెప్పి వాటి గురించి ఇలా చెబుతాడు.

బ్రహ్మదేవుని మూడవ కుమారుడైన అంగిరసుని భార్యపేరు శుభ. ఆమెయందు అతనికి బృహత్కీర్తి, బృహజ్జ్యోతి, బృహద్బ్రహ్మ, బృహన్మనుడు, బృహన్మంత్రుడు, బృహద్భాసుడు, బృహస్పతి అనే ఏడుగురు కుమారులు, భానుమతీదేవి, రాగ, సినీవాలి, అర్చిష్మతి, హవిష్మతి, మహిష్మతి, మహామతి, కుహు అనే ఎనిమిది మంది కుమార్తెలు కలిగారు. బృహస్పతి భార్య చాంద్రమసి. ఈమె పుత్రరూపంలో శంయువు, నిశ్చ్యవనుడు, విశ్వజిత్తు, విశ్వభుక్కు, ఊర్ధ్వభాక్కు, స్విష్టకృత్తు అనే పవిత్రాగ్నులను, స్వాహా అనే పుత్రికను కనింది. వీరిలో శంయువు దర్శ, పూర్ణమాస యజ్ఞాలలో ప్రధానాహుతులను ఇచ్చేటప్పుడు హవిస్సును స్వీకరిస్తాడు. అనేక రంగులు గల జ్వాలలతో వెలిగేవాడు, సాటిలేని శక్తిశాలి అయిన ఇతను చాతుర్మాస్య అశ్వమేథయాగాల్లో పూజితుడు. ఇతని భార్య ధర్మదేవత పుత్రిక అయిన సత్య. ఈమె వల్ల అతనికి భారద్వాజుడు అనే పుత్రుడు, ముగ్గురు కుమార్తెలు కలిగారు. యజ్ఞాలలో మొదటి ఆద్యభాగంతో భారద్వాజుడు అనే అగ్ని పూజింపబడతాడని చెబుతారు. ఈ భారద్వాజుని భార్య పేరు వీర. ఈమె కుమారుడు వీరుడు. బ్రాహ్మణులు సోమునితోపాటు వీరుని కూడా ద్వితీయాద్యభాగంతో పూజించడం చెప్పబడింది. ఇతనికి ఆహుతి ఇచ్చేటపుడు మంత్రాన్ని ఉపాంశువుగా ఉచ్చరిస్తారు. వీరుడు శరయువు అనే భార్య వల్ల సిద్ధి అనే పుత్రుని కన్నాడు. సిద్ధి తన కాంతితో సూర్యుని కప్పివేశాడు. సూర్యుడు ఆచ్ఛాదితుడైనపుడు సిద్ధి అగ్ని సంబంధమైన యజ్ఞాన్ని అనుష్ఠించాడు. శంయువుకు ఇంకొక భార్య వల్ల భరతుడు అనే అగ్ని పుట్టాడు. ఇతడు అన్ని పౌర్ణమాస యజ్ఞాలలో స్రువంతో(కొయ్యగరిటె) నేతిని గ్రహించి సమర్పింపబడతాడు. ఇతనికి భరతుడు అనే కొడుకు భరతి అనే కుమార్తె కలిగారు. ఈ భరతుడు అనే అగ్ని నుండి పావకుడు జన్మించాడు.

బృహస్పతి రెండవ కుమారుడైన నిశ్చ్యవనుడు తేజస్సు, కాంతి కలవాడు. ఇతడు వాగభిమానదేవత అయిన అగ్ని. ఇతని కుమారుడు సత్యుడు అనే అగ్ని. ఈ సత్యుడు శబ్దాలకు వాచ్య వాచక సంబంధం కలిగిస్తాడు. ఇతడు బాధతో ఆర్తనాదం చేసే ప్రాణులను బాధ నుండి విముక్తులను చేస్తాడు. అందువల్ల ఈ అగ్నికి నిష్కృతి అని ఇంకొక పేరుంది. ఇతని కొడుకు స్వనుడు. ఇతను రోగాన్ని కలిగించే అగ్ని. ప్రాణులు ఇతనిచేత బాధితులై బాధతో కేకలు పెడతారు. అందువల్ల ఇతనికి స్వనుడు అనే పేరు వచ్చింది. బృహస్పతి మూడవ కుమారుడైన విశ్వజిత్తు సమస్త జగత్తు యొక్క బుద్ధిని వశపరుచుకుంటాడు. బృహస్పతి నాల్గవ కుమారుడైన విశ్వభుక్కు అనే అగ్ని సమస్త ప్రాణుల కడుపులో ఉండి తిన్న పదార్థాలను జీర్ణం చేస్తాడు. పాకయజ్ఞంలో ఇతనిని పూజిస్తారు. ధర్మాన్ని ఆచరించే ద్విజులు ఈ విశ్వభుక్కు అనే అగ్నిలోనే అన్ని కర్మలను ఆచరిస్తారు. బృహస్పతి ఐదవ కొడుకైన ఊర్ధ్వభాక్కు భయంకరమైన

బడబాగ్ని రూపంలో సముద్రజలాన్ని తాగుతుంటాడు. ఇతను ప్రాణవాయువును ఆశ్రయించినవాడు. బృహస్పతి ఆరవ కుమారుడైన స్విష్టకృత్తు అనే అగ్నికి ఇచ్చే నేతిధార ఉత్తరాభిముఖ ప్రవాహంగా ఉండి కోరికలను సిద్ధింపజేస్తుంది. అగ్ని స్వరూపుడైన బృహస్పతి ప్రశాంతంగా ఉన్న ప్రాణుల మీద కోపగించినపుడు అతని శరీరం నుంచి వచ్చిన చెమట అతని కుమార్తె అయింది. ఈమె పేరు స్వాహా. అన్ని ప్రాణుల్లోను ఈమె ఉంటుంది. ఈమె కొడుకు కాముడు అనే అగ్ని. యుద్ధంలో శత్రువులను చంపే అగ్ని పేరు అమోఘుడు. మోక్షాన్ని ఇచ్చే అగ్ని పేరు ఉక్థం.

ఆ తర్వాత మార్కండేయ ముని పాంచజన్యాగ్ని జననం గురించి, సంతతి గురించి ఇలా చెబుతాడు. కశ్యప పుత్రుడు కాశ్యపుడు, వశిష్ట పుత్రుడు వాశిష్టుడు, ప్రాణ పుత్రుడు ప్రాణకుడు, అంగిరసుని పుత్రుడు చ్యవనుడు, త్రివర్చుడు అనే ఐదుగురు అగ్నులు కీర్తిమంతులు. వీరు యశస్సులో బ్రహ్మతో సమానులైన కుమారులు కలగాలని భూః, భువః, స్వః, మహః, జనః అనే 5 మంత్రాలతో పరమాత్ముని గురించి గొప్ప తపస్సు చేసి ఐదు రంగులు గల పురుషుని ఆవిర్భవింపజేశారు. అందువల్ల అతను పాంచజన్యుడు అయ్యాడు. ఈ పాంచజన్యుడు తన పితృ వంశాన్ని వృద్ధి చేయడానికి పదివేల సంవత్సరాలు ఘోర తపస్సు చేసి దక్షిణాగ్నిని కలిగించాడు. బృహత్ అనే సామాన్ని శిరస్సు నుంచి, రథంతరం అనే సామాన్ని ముఖం నుంచి వ్యక్తం చేశాడు. ఇవి రెండు వేగంగా ఆయుష్షను హరిస్తాయి. కాబట్టి వీటికి తరసాహరాలు అని పేరు. తర్వాత పాంచజన్యుడు తన ఐదుగురు పితరుల కోసం ప్రణిధి, మహత్తరుడు, భానుడు, సౌభరుడు, అనుదాత్తుడు అనే ఐదుగురు పుత్రులను సృష్టించాడు. తపస్సు అనే మరొక పేరు ఉన్న పాంచజన్యుడు విఘ్నాలను కలిగించే పదిహేను మంది ఉత్తర దేవులను సృష్టించాడు. సుభీముడు, అతిభీముడు, భీముడు, భీమబలుడు, అబలుడు అనే ఐదుగురు ఒక దళం. వీరు దేవతల యజ్ఞాన్ని నాశనం చేసేవారు. సుమిత్రుడు, మిత్రవంతుడు, మిత్రజ్ఞుడు, మిత్రవర్ధనుడు, మిత్రధర్ముడు అనే ఐదుగురు మరొక దళం. సురప్రవీరుడు, వీరుడు, సురేశు డు, సువర్చుడు, సురహంత అను ఐదుగురు ఇంకొక దళం.వీరు స్వర్గంలో ఉండి భూమి మీద యజ్ఞం చేసేవారి యజ్ఞ సామగ్రిని అపహరిస్తారు. అగ్ని గుణంతో స్పర్థ ఉండడం వల్ల వీరు హవిస్సును అపహరిస్తారు. యజ్ఞకర్మలో నిపుణులు యజ్ఞశాల బైట ఉన్న వేదిక మీద ఈ వినాయకులకు ఇవ్వదగిన భాగాన్ని ఉంచాలన్న నియమాన్ని ఏర్పరిచారు. ఈ పాంచజన్యునికి ఊష్మా అనే పేరు గల అగ్ని కలిగాడు. ఇతను ప్రాణుల శరీరంలో వేడిగా వ్యక్తమవుతూ ఉంటాడు.

పాంచజన్యుని పుత్రుడయిన భానువుకు సుప్రజ, బృహద్భాస అనే ఇద్దరు భార్యలున్నారు. వీరిద్దరికీ బలదుడు, మన్యుమంతుడు, విష్ణువు(ధృతిమంతుడు), అగ్రయణుడు, విశ్వదేవుడు, స్తుభుడు అనే ఆరుగురు పుత్రులు కలిగారు. వీరిలో బలదుడు బలహీన ప్రాణులకు ప్రాణాన్ని బలాన్ని ఇస్తాడు. మన్యుమంతుడు శాంతంగా ఉండే ప్రాణుల్లో భయంకరమైన

కోప రూపంగా వ్యక్తమవుతూ ఉంటాడు. విష్ణువు దర్శ, పౌర్ణమాస యజ్ఞాల్లో హవిస్సును సమర్పించే విధానంలో వ్యక్తమవుతూ ఉంటాడు. అగ్రయణ (కొత్తపంటతో తయారయ్యే హవిస్సుతో జరిగే యజ్ఞ) కర్మలో సమర్పించే హవిస్సును అగ్రయణుడు గ్రహిస్తాడు. భానువు మూడవ భార్య నిశ. ఈమె రోహిణి అనే కుమార్తెను, సోముడు, అగ్ని, వైశ్వానరుడు, విశ్వపతి, సన్నిహితుడు, కపిలుడు, అగ్రణి అనే ఏడుగురు కుమారులను కన్నది. వైశ్వానరుడు చాతుర్మాస్య యజ్ఞాల్లో ప్రధాన హవిస్సుతో పర్జన్యునితో కలిసి పూజితుడవుతాడు. విశ్వపతి ప్రభావం వల్ల ఆహుతులు దోషరహితాలవుతాయి. సన్నిహితుడు దేహదారుల ప్రాణాలను ఆశ్రయించి శరీరాన్ని ఒక పనిలో ప్రవర్తింపజేస్తాడు. క్రోధ స్వరూపమైన అగ్నికి ఆశ్రయమైనవాడు కపిలుడనే అగ్ని. మానవులు అనేకరకాలైన యాగాల్లో సమస్త భూతాలకు ఆహారంలో మొదటి భాగాన్ని అర్పించగా స్వీకరించే అగ్ని అగ్రణి.

నీటిలో నివసించే సహాగ్ని కుమారుడు అద్భుతుడు అనే అగ్ని. ఈ అద్భుతుడు అన్ని లోకాలకూ, అన్ని భూతాలకూ అధిపతి. ఇతను గృహపతి అనే పేరుతో ఎల్లప్పుడూ పూజింపబడుతూ హోమహవిస్సును దేవతలకు చేర్చుతూ ఉంటాడు. ఇతని కుమారుడైన భరతుడు మరణించిన శరీరాలను దహిస్తాడు.

### బి) **సహాగ్ని శాపం కారణంగా చేపలు ఇతర ప్రాణులకు ఆహారం కావడం**

### సి) **మరణించిన సహాగ్ని శరీరం భూమిలో కలిసిపోయి అనేక లోహాలుగా మారడం**

ఒకసారి సహాగ్ని కోసం దేవతలు వెదుకుతుంటారు. వారితో పాటు సహాగ్ని మనుమడు నియతుడు కూడా రావడం చూసి, అతను తనను తాకుతాడేమో అని భయపడి సహాగ్ని సముద్రంలో దాక్కుంటాడు. దేవతలు అతనికోసం వెదుకుతూ అతను ఎక్కడ ఉంటే అక్కడికి వెళుతూ ఉంటారు. ఒకరోజు అగ్ని అంగిరసునితో "నేను బలహీనున్ని అయ్యాను. నీవు అగ్ని పదవిని అలంకరించి దేవతలకు హవిస్సును చేర్చు" అని చెప్పి అగ్ని దేవుడు ఇంకొకచోటుకి వెళ్ళి దాక్కుంటాడు. అయితే చేపలు అగ్ని దాక్కున్న చోటును అంగిరసునికి చెబుతాయి. తాను దాక్కున్న విషయం చేపలు చెప్పినందుకు అగ్ని కోపించి "మీరు ప్రాణులకు ఆహారం అవుతారు" అని చేపలను శపిస్తాడు. అధర్వముని దేవతలకు హవిస్సును చేర్చమని సహాగ్నిని మళ్ళీ కోరతాడు. అగ్ని దానికి అంగీకరించడు. అంతేకాకుండా చిక్కిపోయిన తన శరీరాన్ని భరించలేక దాన్ని వదిలి పెట్టి భూమిలో లీనమై అనేక ధాతువులను సృష్టిస్తాడు. సహాగ్ని తన చీము రక్తాల నుంచి గంధకాన్ని, తైజస ధాతువులను (వీర్యం, బంగారం) సృష్టించాడు. ఎముకల నుంచి దేవదారు వృక్షాన్ని వెలువరించాడు. కఫం నుంచి స్ఫటికాన్ని, పిత్తం నుంచి (పైత్యం) మరకతాన్ని వ్యక్తం చేశాడు. అతని యకృత్తు నుంచి నల్లని ఇనుము కలిగింది. ఆయన గోళ్ళు మేఘాలు అయ్యాయి. నాడులు పగడాలయ్యాయి. అంతేగాకుండా

సహోగ్ని శరీరం నుంచి అనేక ధాతువులు ఉత్పన్నమయ్యాయి. ఇలా శరీరాన్ని వదిలి ఆయన మహత్తర తపస్సులో లీనమయ్యాడు. భృగువు, అంగిరసుడు మొదలైన మునులు వచ్చి ఆయనను తపస్సు నుంచి విరమింపజేశారు. అగ్ని తన ఎదురుగా అంగిరసుని చూసి భయంతో సముద్రంలో ప్రవేశిస్తాడు. అగ్ని అదృశ్యం కావడం వల్ల సర్వజగత్తు భయపడి అధర్వుడైన అగ్నిని ఆశ్రయిస్తుంది. దేవతలు అధర్వుని పూజిస్తారు. అప్పుడు అధర్వుడు ప్రాణులందరూ చూస్తూ ఉండగా సముద్రాన్ని మథించగా పుట్టిన అగ్నిని చూచి లోకులకు ఉపయోగపడుమని ఆజ్ఞాపిస్తాడు.

ఈ విధంగా పూర్వకాలంలో అదృశ్యమైన అగ్నిని అంగిరుడు మళ్ళీ పిలిచాడు. అందువల్ల వ్యక్తమైన అగ్ని అన్ని ప్రాణుల హవిస్సును వహిస్తున్నాడు. అనేక స్థానాల్లో తిరుగుతూ సహోగ్ని వేదం చెప్పిన దేవతలను, వారి స్థానాలను కలిగించాడు. సింధునదం, పంచనదం, దేవిక, సరస్వతి, గంగ, శతకుంభ, సరయూ, గండకి, చర్మణ్వతి, మహి, మేధ్య, మేధాతిథి, తామ్రవతి, వేత్రవతి, కౌశికి, తమస, నర్మద, గోదావరి, బడబ, భారతి, కావేరి, తుంగవేణ, కృష్ణవేణ మొదలైన నదీనదాలను అగ్నుల ఉత్పత్తి స్థానాలుగా చెప్పారు. ఈ అగ్నులన్నీ బ్రహ్మదేవుని మానసిక సంకల్పం వల్ల అత్రి వంశంలో ఆయన సంతానంగా కలిగారు. ఈ విధంగా లెక్కించడానికి వీలులేనివి, చీకటిని పోగొట్టేవి, మిక్కిలి ప్రకాశవంతమైనవి, గొప్పవి అయిన అగ్నుల ఉత్పత్తి క్రమాన్ని వర్ణించాను. అద్భుతాగ్ని మాహాత్మ్యాన్ని వేదాలు వర్ణించినట్లుగానే అన్ని అగ్నులకు మాహాత్మ్యం ఉందని తెలుసుకోవాలి. వీటన్నింటిలో అగ్ని తత్త్వం సమానంగానే ఉంది. జ్యోతిష్టోమం అనే యజ్ఞం ఉద్భిదం మొదలైన అనేక రూపాల్లో వ్యక్తమైనట్లుగానే ఒకే అగ్నితత్త్వం ప్రజాపతి శరీరం నుంచి అనేక రూపాల్లో అవతరించింది. ఇలా నేను మహత్తరమైన అగ్ని వంశాన్ని వివరించాను. ఆ అగ్నిదేవుని వివిధ వేదమంత్రాలతో అర్చిస్తే దేహదారులు ఇచ్చే హవిస్సును దేవతలకు చేరుస్తాడని మార్కండేయ ముని ధర్మరాజుకు చెబుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

హేతుబద్ధంగా ఆలోచిస్తే అగ్ని దేవుడు కాడు. మనిషి కాదు. అగ్ని ప్రకృతిలో ఉన్న అనేక శక్తుల్లో ఒక శక్తి. ఇలాంటి ప్రకృతి శక్తికి వంశం ఉండే అవకాశమే లేదు. అగ్ని మానవులకు అనేక రకాలుగా ఉపయోగపడుతూ ఉంది. అందులోనూ పూర్వకాలంలో యజ్ఞయాగాదులు, హోమాలు మొదలైన అనేక అగ్ని కార్యాలు చేసే బ్రాహ్మణులకు చాలా రకాలుగా ఉపయోగపడేది. ఈ వృత్తాంతంలో దర్శయజ్ఞం, పౌర్ణమాస యజ్ఞం, అశ్వమేధయాగం, పాకయజ్ఞం, అగ్రయణ యజ్ఞం, చాతుర్మాస యజ్ఞం అనే యజ్ఞాల ప్రస్తావన ఉంది. ఈ కథలో రోగాన్ని కలిగించే అగ్ని, ప్రాణుల కడుపులోని ఆహారాన్ని జీర్ణం చేసే అగ్ని, బడబాగ్ని, యుద్ధంలో శత్రునాశనం చేసే అగ్ని, మోక్షాన్నిచ్చే అగ్ని, దక్షిణాగ్ని, గార్హపత్యాగ్ని, ఆహవనీయాగ్ని, ఆయువును హరించే అగ్నులు, దేవతల యజ్ఞాన్ని నాశనం చేసే అగ్నులు, యజ్ఞం చేసేవారి సామగ్రిని అపహరించే అగ్నులు, హవిస్సును అపహరించే

అగ్నులు, పుష్టిని కలిగించే అగ్నులు, ప్రాణులు శరీరంలో వేడిగా వ్యక్తమయ్యే అగ్ని, అవసద్యాగ్ని, బలహీన ప్రాణులకు బలాన్ని, ప్రాణాన్ని ఇచ్చే అగ్ని, శాంతంగా ఉండే ప్రాణుల్లో భయంకరమైన కోపరూపంగా వ్యక్తమయ్యే అగ్ని, యాగాన్ని నిర్దోషం చేసే అగ్ని, దేహదారుల ప్రాణాలను ఆశ్రయించి వ్యక్తి శరీరాన్ని ఒకపనిలో ప్రవర్తించజేసే అగ్ని, క్రోధ స్వరూపమైన అగ్ని, అన్ని యాగాల్లో అన్ని భూతాలకూ ఆహారం మొదట అర్పించగా స్వీకరించే అగ్ని, అగ్ని కార్యంలో కలిగే దోషాలకు ప్రాయశ్చిత్తంగా ఉన్న అగ్నులు, బుద్ధి తత్త్వానికి అధిపతి అయిన అగ్ని, మరణించిన ప్రాణుల శరీరాలను దహించే అగ్ని మొదలైన అగ్నులను గురించి చెప్పబడింది. ఈ అగ్నుల పేర్లు బ్రాహ్మణాలు, అరణ్యకాలు మొదలైన గ్రంథాల్లో చెప్పబడ్డాయి. ఈ కథను కల్పించిన సంస్కృతకవి ఈ అగ్నులన్నీ అంగిరసముని వంశానికి, కాశ్యపుడు, వశిష్ఠుడు మొదలైన పంచ ఋషుల వంశానికి చెందినవారని ఇందులో కల్పించి చెప్పాడు. నిజానికి ఈ కథలో చెప్పినట్లుగా ఇన్ని రకాల అగ్నులు లేవు. ఉన్నది ఒకే అగ్ని. అది ప్రకృతి శక్తి. ఇది అనేక రకాలుగా ఉపయోగపడుతూ ఉంది. బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు మొదలైన గ్రంథాల్లో ఒక్కొక్క పనికి ఉపయోగపడే అగ్నికి ఒక్కొక్క పేరు పెట్టారు. ఈ కథను కల్పించిన కవి ఆ పేర్లుగల అగ్నులన్నీ ఋషుల వంశానికి చెందినవనీ ఇందులో చెప్పాడు. అందువల్ల ఇది కట్టుకథ అవుతూ ఉంది. ఇది జానపద కట్టుకథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ.

ఈ కథ ఋషుల గొప్పతనాన్ని, మాహాత్మ్యాన్ని తెలుపుతూ ఉంది. ఋషులు గొప్ప తపస్సు చేసి దాని ప్రభావంతో అగ్నిగా మారిపోవచ్చునని, అంతేకాకుండా అతని పుత్రపౌత్రులు, వారి సంతానం కూడా అగ్నులుగా మారవచ్చునని తెలియజేస్తూ ఉంది.

ఈ వృత్తాంతంలో సహాగ్ని నీటిలో దాక్కునపుడు చేపలు అతని ఉనికిని దేవతలకు చెప్పడం చేత సహాగ్ని కోపించి చేపలు ప్రాణులకు ఆహారం అవుతాయి అని శపించినట్టుగా ఉన్న కథ కూడా కట్టుకథే. లోకంలో మానవులు, కొన్ని జంతువులు, పక్షులు చేపలను ఆహారంగా గ్రహిస్తున్నాయి. దీన్ని గమనించిన పండితకవి సహాగ్ని శాపం కారణంగా చేపలు ఇతర ప్రాణులకు ఆహారంగా మారినట్లుగా ఈ కథలో కల్పించడం చేత ఇది కట్టుకథ అయింది.

అగ్ని చేపలను శపించిన భారతంలోని ఈ కథకు మూలం అని చెప్పదగిన కథ కృష్ణ యజుర్వేదీయ తైతిరీయ సంహిత ద్వితీయాష్టకం, షష్ఠ ప్రపాఠకం, షష్ఠ అనువాకంలో ఉంది. ఈ కథ ఇలా ఉంది.

"అగ్నే స్త్రయో జ్యాయాగ్ం సో భ్రాతర ఆసన్తే దేవేభ్యో హవ్యం వహన్త: ప్రామీయన్త సోగ్ని రబిభేదిత్థం వావస్య ఆర్తిమారిష్యతీతి స నిలాయత సోప: ప్రావిశత్తం దేవతా: ప్రైష మైచ్ఛన్తం మత్స్య: ప్రాబ్రవీత్త మశప ద్ధియా ధియా త్వా వధ్యాసు ర్యో మా ప్రావోచ ఇతి తస్మాన్మత్స్యం ధియా ధియా ఘ్నన్తి శప్త:"

అగ్నికి ముగ్గురు అన్నలున్నారు. వారు దేవతల కోసం హవిస్సును వహిస్తూ చనిపోయారు. దేవతల కోసం హవిస్సును వహిస్తే తాను కూడా చనిపోతానేమోనని అగ్ని

భయపడి దేవతలకు కన్పించకుండా పారిపోయి నీటిలో దాక్కున్నాడు. దేవతలు అగ్నికోసం వెదుకుతున్నపుడు ఒక చేప అగ్ని ఉనికిని గురించి దేవతలకు చెబుతుంది. దానికి అగ్ని కోపించి కొండాలు చెప్పేదానివై నా ఉనికిని గురించి దేవతలకు చెప్పావు కాబట్టి నిన్ను జాలరులు తమ బుద్ధి పుట్టినపుడు చంపుతారని శపిస్తాడు. కాబట్టి జాలరులు నేటికి తమకు తోచినపుడు చేపలను చంపుతున్నారు. ఇంతటితో ఈ కథ[3] ముగుస్తుంది.

తైత్తిరీయ సంహితలోని ఈ కథ కూడా కట్టు కథే. అనాదిగా జాలరులు చేపలను పట్టుకొని జీవిస్తున్నారు. దీన్ని గమనించిన తైత్తిరీయ సంహిత కవి అగ్నిదేవుని శాపం కారణంగా జాలర్లు చేపలను చంపుతున్నట్లుగా ఈ కథలో కల్పించాడు. అందువల్ల ఇది కట్టుకథ అవుతుంది. ఈ కథలో అగ్ని నీటిలో దాక్కోవడానికి చెప్పిన కారణం భారతంలో చెప్పిన కారణం కంటే సముచితంగా ఉంది. అగ్ని యొక్క ముగ్గురు అన్నలు దేవతల కోసం హవిస్సును మోస్తూ మరణించడం చేత హవిస్సును మోస్తే తాను కూడా చనిపోతానని అగ్ని భయపడి దేవతలకు కన్పించకుండా నీటిలో దాక్కున్నట్లుగా ఈ కథలో ఉంది. భారతంలో సహాగ్ని బలహీనుడైపోయి దేవతలకు హవిస్సును మోయలేక ఆ బాధ్యతను అంగిరసునికి అప్పగించి సముద్రంలో దాక్కున్నట్లుగా ఉంది. కృష్ణ యజుర్వేదంలో అగ్నికి పేరు లేదు. కేవలం అగ్ని అని మాత్రమే చెప్పబడింది. భారతంలో ఆ అగ్ని సహాగ్ని అని చెప్పబడింది. భారతంలోని కథననుసరించి కృష్ణ యజుర్వేదంలోని కథ చెప్పబడిందా? లేక కృష్ణ యజుర్వేదంలోని కథననుసరించి భారతంలోని కథ చెప్పబడిందా? చెప్పడం కష్టమే. అయినప్పటికీ భారతంలోని ఈ అగ్నివంశం కథ వ్యాసుడు రాసింది కాదు. వ్యాసుని తర్వాత కాలంలో సంస్కృతకవి ఈ కథను కల్పించి భారతంలో చొప్పించాడు. కృష్ణ యజుర్వేదంలో అగ్నికి పేరు లేదు. భారతంలోని కథలో అగ్నికి సహాగ్ని అనే పేరు ఉంది. కాబట్టి కృష్ణయజుర్వేదంలోని కథను తీసుకొని భారతకవి కొద్ది మార్పులు చేసి భారతంలో చొప్పించినట్లుగా మనం భావించవచ్చు.

భారతంలో సహాగ్ని చిక్కిపోయిన తన శరీరాన్ని వదలివేసి భూమిలో లీనమై గంధకం, బంగారం, దేవదారు వృక్షం, స్ఫటికం, నల్లని ఇనుము మొదలైన అనేక ధాతువులను సృష్టించినట్లుగా చెప్పబడింది. ఇది కూడా కట్టుకథే. పైన చెప్పిన ధాతువులు భూమిలో అనేక కారణాల చేత ఏర్పడుతున్నాయి. భూమిలో ముడిసరుకు రూపంలో ఉన్నవాటిని మానవులు బయటికి తీసి శుద్ధి చేసి తమ అవసరాలకు అనుగుణంగా వాడుకుంటున్నారు. దీన్ని గమనించిన పండితకవి సహాగ్ని భూమిలో కలిసిపోయి అనేకధాతువులను కల్పించినట్లుగా చెప్పడం చేత ఇది కట్టుకథ అయింది. భూమిలో అనేక రకాల ఖనిజాలు ఎలా ఏర్పడ్డాయి అనే ప్రశ్నకు సమాధానంగా వరంగల్ లోని నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇన్‌ఫర్‌మేషన్ టెక్నాలజీ (నిట్)లో ఆచార్యులుగా ఉన్న రామచంద్రయ్యగారు ఇలా తెలియజేస్తున్నారు. "మన సౌరమండలం ఉద్భవించి దాదాపు 600కోట్ల సంవత్సరాలయింది. మధ్యలో సూర్యుడు

అంచుల్లో గ్రహాలు ఉండేలా సౌరపళ్ళెం తొలిదశలో ఉండేది. అది భ్రమణం చెందే క్రమంలో అంచుల్లో ఉన్న పదార్థాలు గ్రహాలుగా మారగా మధ్యలో ఉబ్బుగా ఉన్న ప్రాంతం సూర్యుడుగా రూపాంతరం చెందింది. తొలిదశలో గ్రహాలు కూడా స్వయం ప్రకాశకాలే. అంటే బుధుడు, శుక్రుడు, భూమి, తదితర గ్రహాలు కూడా బుల్లి నక్షత్రాల్లాగ ఉండేవి. అంటే వాటిలో హైడ్రోజన్ పరమాణువులు, హీలియం పరమాణువులుగా మారే కేంద్రక సంలీన చర్యలు జరిగేవి. వాటిలో ఉన్న హైడ్రోజన్ పెద్దపరమాణువులుగా మారే క్రమంలో విపరీతమైన ఉష్ణశక్తి విడుదలయ్యింది. ఆ క్రమంలో చాలా మూలకాలు ఏర్పడ్డాయి. ఉష్ణోగ్రత తగ్గే కొద్ది ఆ మూలకాల్లో ఎలక్ట్రాన్లు కూడా స్థిర కక్ష్యల్లోకి చేరుకున్నాయి. తద్వారా రసాయనిక ప్రక్రియలకు తెర తీసినట్లయింది. రసాయనికంగా స్థిర తల్పాన్ని ప్రదర్శించే మూలకాలు, రసాయనికంగా అస్థిరంగా ఉన్న మూలకాలు  అనే రెండు వర్గాలుగా మూలకాలు స్థూలంగా ఉండేవి. భూమి మధ్యభాగంలో ద్రవఇనుము ఇంకా అలాగే ఉంది. ఉడికే అన్నం బుడగలుగా పొంగినట్లు దాదాపు ద్రవస్థితిలో ఉన్న భూభాగం కూడా కుతకుత ఉడుకుతున్న తరుణంలో కొండలు, లోయలు, నెరియలు ఏర్పడ్డాయి. అస్థిరంగా ఉన్న మూలకాలు పరస్పర సంయోగం ద్వారా సమ్మేళనాలుగా మారాయి. ఉదాహరణకు ఇనుము, ఆక్సిజన్ కలిసి హెమటైట్ (ఫెర్రిక్ ఆక్సైడ్) ఘన పదార్థంగా, అల్యూమినియం ఆక్సిజన్‌తో కలిసి బాక్సైట్‌గా మారాయి. జింకు తదితర మూలకాలు కూడా గంధకం, సిలికాన్, ఆక్సిజన్, కర్బనం వంటి పదార్థాలతో కలిసి సల్ఫైడ్‌లు, కార్బోనేట్ల లాంటివి ఘనరూపాల్లోకి నేల కింది అడుగు భాగాన స్థిరపడ్డాయి. నేలలో ఘనరూపాల్లో ఉన్న లోహ సంబంధ పదార్థాలనే ఖనిజాలు అంటారు".[4]

## 7. స్కందుడు స్వాహాదేవిని అగ్నితో చేర్చి గౌరవించడం:

ఈ కథ సంస్కృత భారతంలో  వనపర్వంలోని మార్కండేయ సమస్యాపర్వం అనే ఉపపర్వంలో 231వ అధ్యాయంలో ఏడు శ్లోకాల్లో చెప్పబడింది. మార్కండేయ మహర్షి ధర్మరాజుకు కుమారస్వామి వృత్తాంతాన్ని గురించి చెబుతూ ఈ కథను చెబుతాడు. కుమారస్వామి ఉద్భవించిన తర్వాత అతని జన్మకు కారకులైన వారందరూ వచ్చి తమ కోరికలను తీర్చమని కుమారస్వామిని కోరతారు. వీరిలో సప్తర్షుల భార్యలు, మాతృగణం ఉన్నారు. మాతృగణాల కోరిక తీరిన తర్వాత స్వాహాదేవి వచ్చి కుమారస్వామితో "నీవు నా కుమారుడవు పరమ దుర్లభమైన నా కోరికను నీవు తీర్చాలి" అని అంటుంది. " అమ్మా! నీ కోరిక ఏమి?" అని స్కందుడు అడుగుతాడు. దానికి స్వాహాదేవి "మహాభుజా! నేను దక్ష ప్రజాపతికి ప్రియమైన పుత్రికను. నా పేరు "స్వాహా" చిన్నప్పటి నుంచి నాకు అగ్నిదేవుని మీద కోరిక ఉంది. అయితే నేను ఆయనను  ప్రేమిస్తున్న సంగతి అతనికి తెలియదు. ఆయనతో శాశ్వతంగా కలసి ఉండాలని నా కోరిక" అని అంటుంది. అపుడు స్కందుడు

**"హవ్యం కవ్యంచ యత్కించిద్ ద్విజానాం మంత్రసంస్తుతమ్।**
**హోష్యంత్యాగ్నౌ సదా దేవి స్వాహేత్యుక్త్వా సముద్ధృతమ్।"**
**"అద్యప్రభృతి దాస్యంతి సువృత్తాః సత్పథే స్థితాః**
**ఏవమగ్నిస్త్వయా సార్థం సదా వత్స్యాతి శోభనే"**
**(వన. 231 – 5, 6 శ్లోకాలు)**

"ఓ దేవీ! ఈ రోజు నుంచి సన్మార్గులు సదాచారులు ధర్మాత్ములు అయిన మానవులు దేవతలకు, పితృదేవతలకు హవ్య, కవ్య రూపంగా బ్రాహ్మణులు చేసే వేద మంత్రో చ్చారణతో అగ్నిలో వేసే ఆహుతులను స్వాహాకారంతో అర్పిస్తారు. ఇందు వల్ల అగ్నిదేవుడు ఎల్లప్పుడూ నీతో కూడి ఉంటాడు" అని చెప్పి స్వాహాదేవిని పూజిస్తాడు. తర్వాత అగ్నిదేవునితో కలిసి స్వాహాదేవి స్కందుని ఆదరిస్తుంది. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

పురాణాల ప్రకారం స్వాహాదేవి అగ్నిదేవుని భార్య. బ్రాహ్మణులు యజ్ఞ యాగాల్లో హవ్యకవ్యాలు వేసే సందర్భంలో "స్వాహా" అనే మాటను ఉచ్చరిస్తుంటారు. "స్వాహా" అంటే సమర్పిస్తున్నాను అని అర్థం. ఇది ప్రాచీన కాలం నుంచి లోకంలో జరుగుతున్న వ్యవహారం. ఈ విషయాన్ని గమనించిన పండిత కవి స్వాహాదేవి దక్షుని కుమార్తె అని, ఆమె అగ్నిదేవుని ప్రేమిస్తున్నదని, ఆమె కోరికను అనుసరించి కుమారస్వామి బ్రాహ్మణులు వేద మంత్రోచ్చారణతో హవ్యకవ్యాలను అగ్నిలో వేసేటప్పుడు "స్వాహా" అని ఉచ్చరించి వేస్తారని దానివల్ల స్వాహాదేవి అగ్నిదేవునితో శాశ్వతంగా కలిసి ఉంటుందని, ఇలా కలిసి ఉండేలాగా చేసినవాడు కుమారస్వామి అని పై కథలో కల్పించాడు. అంటే లోకంలో ఉన్న ఒక విషయాన్ని ఆ విషయం అలా ఉండడానికి కారణంగా పై కథను కల్పించడం జరిగింది. అందువల్ల ఈ కథ కట్టుకథ అవుతూ ఉంది. ఇది జానపద కట్టుకథల ప్రభావంతో పండితకవి కల్పించినది. ఎర్రన తను రాసిన భారతంలో ఈ కథను అనువదించకుండా వదలివేశాడు.

## 8. మృత్యుదేవత పుట్టుక కథ :

ఈ కథ సంస్కృత భారతంలోని ద్రోణపర్వంలోని అభిమన్యువధ పర్వం అనే ఉపపర్వంలో 52 అధ్యాయం నుంచి 54వ అధ్యాయం వరకూ ఉన్న 3 అధ్యాయాల్లో 126లో శ్లోకాల్లో ఉంది. ఈ కథను పద్మవ్యూహంలో చనిపోయిన అభిమన్యుని కోసం దుఃఖిస్తున్న ధర్మరాజుతో వ్యాసుడు చెబుతాడు. ధర్మరాజు యుద్ధంలో చనిపోయిన మహావీరులను గురించి ప్రస్తావించి దేనివల్ల మృత్యువు కల్గుతుంది? ఏ కారణంచేత ఆ మృత్యువు ప్రాణులను హరిస్తుంది? అనే విషయం చెప్ప వలసిందిగా వ్యాసుని కోరతాడు. దానికి వ్యాసుడు పూర్వం అకంపనుడు అనే రాజుకు దేవర్షి నారదుడు చెప్పిన ఇతివృత్తాన్ని చెబుతాను విను అని ఈ కథను ఇలా చెబుతాడు.

సృష్టి ప్రారంభంలో బ్రహ్మ ప్రజలను సృష్టించాడు. ఆ ప్రజలకు మరణం ఉండేది కాదు. ఈ కారణం చేత జనాభా పెరిగిపోయి భూభారం ఎక్కువయింది. దాన్ని ఎలా తగ్గించాలో బ్రహ్మకు తెలియక తీవ్రంగా చింతించాడు. ఎంత ఆలోచించినా సృష్టి సంహారానికి మార్గం తెలియకపోవడం చేత అతనికి చాలా కోపం కల్గింది. క్రోధంవల్ల అతని ఇంద్రియాల నుంచి అగ్ని ఆవిర్భవించి అన్ని దిక్కుల్లోని సర్వస్వాన్ని దహించడం ప్రారంభిస్తుంది. అపుడు ఈశ్వరుడు బ్రహ్మదేవుని దగ్గరకు వచ్చి క్రోధాన్ని ఉపసంహరించి జగత్తును రక్షించ వలసిందిగా కోరతాడు. రుద్రుని మాటలు విని బ్రహ్మ జగత్తు మేలుకోరి తన క్రోధాన్ని ఉపసంహరిస్తాడు. అలా అగ్నిని ఉపసంహరిస్తున్న బ్రహ్మదేవుని సర్వేంద్రియాల నుంచి ఒక స్త్రీ ఆవిర్భవిస్తుంది.

**"కృష్ణారక్తా తథా పింగరక్త జిహ్వాస్యలోచనా**
**కుణ్డలాభ్యాం చ రాజేంద్ర తప్తాభ్యాం తప్తభూషణా"**
**(ద్రోణ. 53 - 18వ శ్లోకం)**

"ఆమె శరీరం నలుపు ఎరుపు రంగులో ఉంది. ఆమె నాలుక, ముఖం, కళ్ళు పచ్చని ఎర్రని రంగులు కల్గి ఉన్నాయి. ఆమె ప్రకాశిస్తున్న కుండలాలను ఆభరణాలను ధరించి ఉంది". ఆమె బ్రహ్మ సర్వేంద్రియాల నుంచి ఉద్భవించి దక్షిణ దిక్కును ఆశ్రయించి బ్రహ్మ ఈశ్వరులను చూసి చిరునవ్వు నవ్వింది. బ్రహ్మ ఆమెను "మృత్యువా!" అని సంబోధించి

**"త్వంహి సంహారభుద్ధ్యాథ ప్రాదుర్భూతా రుషో మమ**
**తస్మాత్ సంహార సర్వాస్త్వం ప్రజాః సజడ పండితాః**
**మమ త్వం హి నియోగేన తతః శ్రేయో హ్యవాప్స్యసి"**
**( ద్రోణ. 53 - 21 శ్లోకం)**

"నువ్వు సమస్త లోకాలను సంహరించు. సంహారబుద్ధితో నా కోపం నుంచి నీవు పుట్టావు. కాబట్టి పండిత పామరులనే భేదం లేకుండా సమస్త ప్రజలను సంహరించు. నాయీ ఆజ్ఞను నీవు పాటించాలి. దీనివల్ల నీకు శ్రేయస్సు కలుగుతుంది" అని చెబుతాడు.

ఆ మాటలను విని మృత్యు దేవత వెక్కివెక్కి ఏడవ సాగింది. బ్రహ్మ ఆమె కన్నీటిని తన చేతులతో గ్రహించి ఆమెను ఓదార్చాడు. అపుడు ఆమె బ్రహ్మ దేవునితో "నీవు సృష్టించిన స్త్రీ తెలిసి తెలిసి లోకానికి అపకారం కలిగించే ఇలాంటి క్రూర కర్మను ఎలా చేస్తుంది? ప్రజలకు ఇష్టులైన పుత్రులను, సోదరులను, తల్లి దండ్రులను, భర్తలను నేను చంపితే నాకు కీడు కలగాలని వారు భావిస్తారు. దయనీయ స్థితిలో దుఃఖిస్తున్న వారి కళ్ళ నుంచి పడే కన్నీటి బిందువులకు నేను భయపడి శరణుకోరి ప్రార్థిస్తున్నాను. ప్రాణధారులకు ప్రాణాలు చాలా ఇష్టమైనవి. వారు దుఃఖిస్తూ ఉంటే వారి ప్రాణాలను నేను తీయలేను. నీవు అంగీకరిస్తే ధేనుకాశ్రమానికి వెళ్ళి నీ ఆరాధనలో ఆసక్తనై తీవ్రమైన తపస్సు చేస్తాను" అని కోరుతుంది. దానికి బ్రహ్మ "మృత్యువా! ప్రజా సంహారం కోసమే

నిన్ను సంకల్పించాను. కాబట్టి పోయి ప్రజలను సంహరించు. ఇది ఇలాగే జరుగవలసి ఉంది. నా ఆజ్ఞను పాలించు, నీకు లోక నింద రాకుండుగాక" అని పలికి బ్రహ్మ ప్రసన్నుడై చిరునవ్వు నవ్వుతాడు. అతణ్ణి చూసి మృత్యుదేవత అక్కడి నుంచి వెళ్ళి ధేనుకాశ్రమంలోనూ అనేక పుణ్య క్షేత్రాల్లోనూ, మేరు పర్వతం మీద హిమాలయ పర్వతం మీద అనేక వేల సంవత్సరాలు బ్రహ్మ యందు దృఢమైన భక్తితో అత్యంత కఠినమైన తపస్సు చేస్తుంది.

ఆమె తపస్సుకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై "మృత్యుదేవీ! ఎందుకు ఇలా నానా విధాలయిన తపస్సు చేస్తున్నావు?" అని ప్రశ్నిస్తాడు. దానికి ఆమె దేవా! ఆరోగ్య వంతులను దుఃఖిస్తున్న వారిని చంపలేను. అందువల్ల నేను తపస్సు చేశాను. భీతిల్లిన నాకు అభయమివ్వాలి. ఆర్తురాలను, ఏ పాపం ఎరుగని నేను యాచిస్తున్నాను. నాకు నీవే దిక్కు" అని ప్రార్థిస్తుంది. ఆమె మాటలు విని భూత భవిష్యద్వర్తమాన విషయాలు తెలిసిన బ్రహ్మ ఆమెతో "మృత్యుదేవీ! ఈ ప్రజలను చంపడం నీకు అధర్మం కాదు. నామాట ఏ విధంగానూ అసత్యం కాదు. అందువల్ల కళ్యాణీ! నాల్గు విధాలుగా జన్మించిన (చమటవల్ల పుట్టేవి, గుడ్డు నుంచి పుట్టేవి, నేలను చీల్చుకొని వచ్చేవి, మావి నుంచి పుట్టేవి) ప్రాణులను సంహరించు. ఈ సంహార కార్యంలో లోక పాలకుడైన యముడు, వ్యాధులు నీకు తోడ్పడతాయి. నేను దేవతలు నీకు వరం ఇస్తున్నాము. నీవు పాప రహితవై నిర్మల రూపంతో ప్రసిద్ధి చెందుతావు. "బ్రహ్మ మాటలను విని ఆమె "దేవా! ఈ పని నేను మాత్రమే చేయవలసి ఉంటే నీ ఆజ్ఞను శిరసా వహిస్తాను. ఈ విషయంలో నా విన్నపాన్ని విను. ఈర్ష్యాసూయలు, లోభ క్రోధాలు, మోహద్రోహాలు మొదలైనవి దేహధారుల దేహాలను ఛేదించుగాక" అని కోరుతుంది. అపుడు బ్రహ్మ మృత్యుదేవీ! నీవు చెప్పినట్లుగానే అవుతుంది. నీకు అధర్మ దోషం అంటదు. ప్రాణులను సంహరించు. నా చేతుల్లో పట్టిన నీ కన్నీటి బిందువులు ప్రాణులకు తమ శరీరాల నుంచి కలిగిన వ్యాధులుగా మారి ఆయువు తీరిన వారిని చంపుతాయి. కాబట్టి నీకు ఎలాంటి పాపం కల్గదు. కామ క్రోధాలను వదలిపెట్టి ఈ లోకంలోని జీవులను సంహరించు. దీని వల్ల నీకు గొప్ప ధర్మం లభిస్తుంది. ధర్మాచరణతో నిన్ను నీవు పవిత్రురాలను చేసుకో" అని చెబుతాడు. మృత్యుదేవత బ్రహ్మదేవుని ఆదేశాన్ని గ్రహించి అతని ఆదేశాన్ని నెరవేర్చకపోతే శపిస్తాడేమో! అని భయపడి బ్రహ్మ చెప్పిన దానికి అంగీకరిస్తుంది. ఆమె కామ క్రోధాలను వదలివేసి ఆయువు తీరిన ప్రాణుల ప్రాణులను హరిస్తూ వుంది. ఇదే ప్రాణులకు మృత్యువు. వ్యాధులు కూడా ఆమె నుంచే పుట్టాయి. రోగాల వల్ల ప్రాణి అస్వస్థుడౌతాడు. ఆయువు తీరిన తర్వాత అన్ని ప్రాణులకు మృత్యువు ఇలా కలుగుతూ వుంది' అని నారదుడు అకంపనునికి చెప్పినట్లుగా వ్యాసుడు ధర్మరాజుకు చెబుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథలో క్రోధాగ్నిని ఉపసంహరించిన బ్రహ్మ శరీరం నుంచి మృత్యు దేవత ఉద్భవించి అతని ఆజ్ఞతో భూమి మీద ఉన్న సర్వ ప్రాణులను సంహరిస్తూ ఉందని

చెప్పబడింది. భూమి మీద పుట్టిన ప్రతి ప్రాణి గిట్టుతూ ఉంది. ప్రాణులు అనేక రకాలుగా చనిపోతున్నాయి. కొన్ని ప్రాణులు పుట్టిన వెంటనే, కొన్ని పుట్టి కొంత కాలం గడచిన తర్వాత, మరికొన్ని ముసలితనంతో దేహం క్షీణించి చని పోతున్నాయి. అలాగే కొన్ని ప్రాణులు అనేక రోగాల బారిన పడి, మరికొన్ని ప్రాణులు ఇతర ప్రాణుల చేత చంపబడి చనిపోతున్నాయి. ఇలా సర్వ ప్రాణులు చనిపోవడం గమనించిన జిజ్ఞాసువైన మానవుడు ప్రాణులు చనిపోవడానికి గల కారణాన్ని ఊహించే ప్రయత్నం చేశాడు. ఆ ప్రయత్నంలో భాగమే మృత్యుదేవతా కల్పన. మనవారు ఒక్కొక్క అంశానికి ఒక్కొక్క దేవతను రూపొందించుకున్నారు. ప్రకృతిలోని అనేక అంశాలైన గాలి, అగ్ని, వర్షం, భూమి, అడవులు మొదలైన అంశాలకు వాయుదేవుడు, అగ్నిదేవుడు, వరుణదేవుడు, భూదేవత, వనదేవత మొదలైన విధంగా దేవతలను రూపొందించుకున్నట్లుగానే ప్రాణుల మరణానికి మృత్యుదేవతను రూపొందించుకున్నారు. ఆ మృత్యుదేవతకు సంబంధించి పండిత కవి ఈకథను కల్పించాడు. అందువల్ల ఈ కథ కట్టుకథ అవుతుంది. ఇది జానపద కట్టుకథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ.

ఈ కథలో సృష్టి కారకుడైన బ్రహ్మ శరీరం నుంచి పుట్టిన మృత్యుదేవత బ్రహ్మ ఆదేశాన్ని అనుసరించి ప్రాణుల సంహారం చేస్తున్నట్లుగా చెప్పబడింది. త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, ఈశ్వరులు క్రమంగా సృష్టి, స్థితి, లయకారులుగా ప్రసిద్ధి ఉంది. కానీ భారతంలోని ఈ మృత్యుదేవత కథలో ఈ ప్రసిద్ధికి భిన్నంగా సృష్టి కారకుడైన బ్రహ్మ తన క్రోధాగ్నితో చరాచర జగత్తును లయం చేస్తున్నట్లుగా, లయకారకుడైన శివుడు అలా లయం చేయవద్దని బ్రహ్మను ప్రార్థించినట్లు, అతని ప్రార్థనను అంగీకరించి బ్రహ్మ తన క్రోధాగ్నిని ఉపసంహరిచుకున్నట్లు చెప్పబడింది. విష్ణుభక్తుడు లేక విష్ణువు కుమారుడైన బ్రహ్మ భక్తుడు అయిన కవి ఈ కథను కల్పించి ఉండవచ్చు.

ఈ మృత్యుదేవత కథ భారతంలో ద్రోణపర్వంలోనే కాకుండా శాంతి పర్వంలో మళ్ళీ చెప్పబడింది. శాంతి పర్వంలోని మోక్షధర్మ పర్వం అనే ఉపపర్వంలో 257, 258 అధ్యాయాల్లో 64 శ్లోకాల్లో ఉంది. ఈ కథను భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. ఇందులో ధర్మరాజు కురుక్షేత్ర యుద్ధంలో చనిపోయిన రాజులను గురించి ప్రస్తావించి వీరిని మృతులని ఎందుకంటున్నాము? వీరు ఎలా చని పోతారు? ప్రాణులందరినీ మృత్యువు ఎందుకు అపహరిస్తుంది? చెప్పుమని భీష్ముని కోరినపుడు భీష్ముడు ఈ కథను మొదట అకంపనుడు అనే రాజుకు నారదుడు చెప్పినట్లుగా చెప్పి అదే కథను ధర్మరాజుకు చెబుతాడు. ద్రోణపర్వంలోని మృత్యుదేవత కథకు, శాంతి పర్వంలోని మృత్యుదేవత కథకు తేడాలేదు. రెండింటిలోనూ ఉన్నది ఒక్కటే కథ.

తిక్కన ఈ కథను ద్రోణపర్వంలోని ద్వితీయాశ్వాసంలో 160వ వచనం నుంచి 175వ వచనం వరకూ ఉన్న 16 పద్య గద్యాల్లో క్లుప్తీకరించి చెప్పాడు. సంస్కృత భారతాన్ని

అనుసరించి శాంతిపర్వం పంచమాశ్వాసం 201వ వచనం నుంచి 213వ వచనం వరకూ ఉన్న 13పద్య గద్యాల్లో మళ్ళీ క్లుప్తంగా చెప్పాడు.

## 9. ఒక స్త్రీ శాపం వల్ల మాతృస్వామ్య వ్యవస్థ ఏర్పడడం:

ఈ కథ సంస్కృత భారతం కర్ణ పర్వంలోని 45వ అధ్యాయంలో కర్ణశల్య సంవాదంలో మూడు శ్లోకాల్లో ఉంది. ఈ వృత్తాంతాన్ని కర్ణుడు శల్యునితో చెబుతాడు. కర్ణుడు తన బల పరాక్రమాలను గురించి గొప్పగా చెప్పుకుంటూ అర్జునుని తప్పక చంపుతానని గర్వోక్తులు పల్కినపుడు శల్యుడు అతణ్ణి కించ పరుస్తూ మాట్లాడతాడు. దానికి కోపించిన కర్ణుడు మద్ర దేశస్థులు వర్ణాశ్రమాచార ధర్మాలను పాటించరని నిందిస్తూ ఈ వృత్తాంతాన్ని ఇలా చెబుతాడు.

పూర్వకాలంలో ఒకసారి కొందరు దోపిడి దొంగలు అరట్టదేశం నుంచి ఒక ఉత్తమ స్త్రీని అపహరించి తెచ్చి బలవంతంగా ఆమెను చెరుస్తారు. ఆమె కోపించి వారిని "నేను బాలికను, నాకు బంధువులున్నారు. అయినప్పటికీ నన్ను మీరు అధర్మంగా చెరిచారు. మీ కులంలోని స్త్రీలందరూ వ్యభిచారిణులు అవుతారు. మీరు ఈ ఘోరమైన పాపం నుంచి విముక్తి పొందలేరు. కాబట్టి మీ ఆస్తిపాస్తులకు మేనళ్ళుళ్ళు వారసులౌతారు గానీ కొడుకులు కారు" అని శపిస్తుంది. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

పై వృత్తాంతంలో మాతృస్వామ్య వ్యవస్థ చెప్పబడింది. మాతృస్వామ్య వ్యవస్థలో ఆస్తి కుమారులకు గాకుండా కూతుళ్ళకు చెందుతుంది. కుటుంబంలో తల్లి తర్వాత మేనమామ ప్రధానపాత్ర పోషిస్తాడు. కూతురు పెళ్లి చేసుకొని అత్తవారింటికి వెళ్ళదు. ఆమె పుట్టింట్లోనే ఉంటుంది. భర్త ఆమె దగ్గరికి వచ్చి పోతుంటాడు. ఈ వ్యవస్థలోని స్త్రీలకు లైంగిక స్వేచ్ఛ ఉంటుంది. వీరు భర్తతోనే కాకుండా తమకు ఇష్టమైన ఇతర పురుషులతో కూడా లైంగిక కార్యకలాపాల్లో పాల్గొంటారు. సంతానం మీద భర్త కంటే భార్యకే అధికారం ఎక్కువగా ఉంటుంది. ఆమె తర్వాత ఆమె సోదరులు కుటుంబ బాధ్యత స్వీకరిస్తారు. ఈ వ్యవస్థ భారత కాలంలో శల్యుని రాజ్యమైన మద్ర దేశంలోనూ అరట్ట దేశంలోనూ ఉండేది. పితృస్వామ్య వ్యవస్థలో ఉన్న కర్ణునికి పై మాతృస్వామ్య వ్యవస్థ చాలా నీచంగా కనిపించి ఆ వ్యవస్థను గురించి, ఆ వ్యవస్థలో ఉన్న స్త్రీలను గురించి నిందించాడు.

పై వృత్తాంతంలో దొంగల చేత బలాత్కరింప బడిన అరట్ట దేశానికి చెందిన ఒక ఉత్తమ జాతి స్త్రీ శాపం కారణంగా మాతృస్వామ్య వ్యవస్థకు చెందిన పరిస్థితులు ఏర్పడినట్లుగా కల్పించ బడింది. శాపం కారణంగా ఏ వ్యవస్థా ఏర్పడదు. ఉన్న వ్యవస్థకు పండిత కవి శాపాన్ని ఒక కారణంగా కల్పించాడు. అందువల్ల పై వృత్తాంతం కట్టుకథ అవుతూ ఉంది. ఇది జానపద కట్టుకథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ.

తిక్కన ఈ వృత్తాంతాన్ని అనువదించకుండా వదలివేశాడు.

## 10. దక్షుడు సృష్టించిన క్షయవ్యాధివల్ల చంద్రుడు క్షీణించడం:

ఈ కథ మహాభారతం శల్యపర్వంలోని గదా యుద్ధ పర్వం అనే ఉప పర్వంలో 35వ అధ్యాయంలో 48 శ్లోకాల్లో ఉంది. ఈ కథను వైశంపాయనుడు జనమేజయునికి చెబుతాడు. కురుక్షేత్ర యుద్ధంలో ఎవరి పక్షమూ వహించకుండా తీర్థ యాత్రలకు వెళ్ళిన బలరాముడు దర్శించిన ప్రభాసతీర్థ మహాత్మ్యాన్ని గురించి వైశంపాయనుడు జనమేజయునికి చెప్పి ఈ తీర్థంలోనే క్షయతో బాధపడతున్న చంద్రుడు స్నానం చేసి శాప విముక్తిని పొంది తేజస్వి అయి ప్రకాశిస్తున్నాడు అని చెప్పినపుడు జనమేజయుడు చంద్రునికి క్షయవ్యాధి ఎలా వచ్చింది? దానికి సంబంధించిన కథ వివరంగా చెప్పమని వైశంపాయనుని అడుగుతాడు. దానికి సమాధానంగా వైశంపాయనుడు ఈకథను ఇలా చెబుతాడు.

దక్ష ప్రజాపతి తన 27గురు కుమార్తెలను చంద్రునికిచ్చి పెళ్ళిచేస్తాడు. వారిలో రోహిణి మంచి అందగత్తె కావడం వల్ల చంద్రుడు ఆమెతోనే సుఖించేవాడు. దీనితో మిగలిన 26 మంది కోపించి తమ తండ్రి అయిన దక్ష ప్రజాపతికి చంద్రుని ప్రవర్తనను గురించి ఫిర్యాదు చేస్తారు. దక్షుడు భార్యలందరినీ సమానంగా ప్రేమించమని చంద్రునికి చెబుతాడు. అయినప్పటికీ చంద్రుడు తన ప్రవర్తన మార్చుకోకుండా రోహిణి దగ్గరే ఉంటాడు. మిగిలిన దక్షుని కుమార్తెలు రెండవసారి దక్షుని దగ్గరకు వచ్చి చంద్రుని ప్రవర్తనను గురించి చెబుతారు. చంద్రుడు తన మాటను మన్నించకుండా అధర్మంగా ప్రవర్తిస్తున్నందుకు దక్షుడు కోపగించి చంద్రుని కోసం క్షయవ్యాధిని సృష్టిస్తాడు. అది చంద్రునిలో ప్రవేశించడం వల్ల చంద్రుడు రోజు రోజుకు క్షీణిస్తుంటాడు. దాని నుంచి బయట పడడానికి చంద్రుడు వివిధ యాగాలు చేస్తాడు. అయినప్పటికీ చంద్రుడు క్షీణించిపోతూ ఉంటాడు. చంద్రుడు క్షీణించడం చేత ఓషధులు లేక ప్రజా సంక్షయం జరిగి ప్రజలు కూడా క్షీణిస్తూ ఉంటారు. దానితో దేవతలు దక్షుని దగ్గరికి వెళ్ళి చంద్రుని శాపాన్ని మరల్చి ఓషధులను జీవించేలాగా చేసి ప్రజలను రక్షించమని వేడుకుంటారు. దానికి దక్షుడు "నా శాపాన్ని మరల్చను. భార్యలందరి విషయంలో చంద్రుడు సమానంగా ప్రవర్తించాలి. శ్రేష్ఠమైన సరస్వతీ తీర్థంలో మునిగితే చంద్రుడు నెలలో సగంరోజులు క్షీణిస్తూ మిగిలిన సగం రోజులు వర్ధిల్లుతాడు" అని చెబుతాడు. దక్షుని మాట ప్రకారం

**"అమావాస్యాం మహాతేజాస్త త్రోన్మజ్జాన్ మహాద్యుతిః**
**లోకాన్ ప్రభాసయామాస శీతంశు త్వమవాప చ"**

**(శల్య. 35 – 79)**

"చంద్రుడు అమావాస్య నాడు ప్రభాస తీర్థంలో మునిగి లోకాలను ప్రకాసింప జేసే శీతాంశుత్వాన్ని పొందుతాడు". అప్పటినుంచి చంద్రుడు అమావాస్యనాడు ఉత్తమమైన ప్రభాస తీర్థంలో స్నానంచేసి కాంతివంతుడవుతున్నాడు. అందు వల్లనే దానికి ప్రభాసతీర్థం అనే పేరు వచ్చింది. ఇంటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథ ఏమాత్రమూ హేతుబద్ధమైనది కాదు. ఈ కథలో చెప్పినట్లుగా చంద్రుడు దేవుడు కాదు. భూగ్రహానికి ఉపగ్రహం. సూర్యుని చుట్టు భూమి తిరుగుతూ వుంటే, భూమి చుట్టు చంద్ర ఉపగ్రహం తిరుగుతూ ఉంది. చంద్ర ఉపగ్రహం స్వయంగా ప్రకాశించలేదు. సూర్యకాంతి వల్ల అది ప్రకాశిస్తుంది. సూర్యునికి చంద్రునికి మధ్య భూమి అడ్డుగా వచ్చినపుడు సూర్యకాంతి పడక చంద్ర ఉపగ్రహం భూలోక వాసులకు కనిపించదు. చంద్రునికి సంబంధించి నెలలో కృష్ణపక్షం, శుక్లపక్షం అనే రెండు భాగాలున్నాయి. కృష్ణపక్షం పౌర్ణమి తర్వాత వచ్చే పాడ్యమితో ప్రారంభమై చంద్రుడు రోజు రోజుకు కొంచెం కొంచెం కనిపించకుండా పోతూ 15వ రోజైన అమావాస్య నాటికి పూర్తిగా కనిపించదు. దీనికి కారణం భూమి తన చట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరిగేటపుడు సూర్యకాంతిని చంద్రుని మీద పడకుండా మెల్లమెల్లగా అడ్డుకుంటూ చివరకు పూర్తిగా అడ్డమవుతుంది. దాంతో చంద్రుడు కనిపించడు. దాన్నే మనం అమావాస్య అంటున్నాం. అమావాస్య మరుసటిరోజు నుంచి శుక్లపక్షం మొదలవుతుంది. ఈ దశలో చంద్రుడు రోజు రోజుకు కొంచెం కొంచెం కనిపిస్తూ చివరి పౌర్ణమి నాటికి పూర్తిగా భూలోక వాసులకు వెలుగును ప్రసరిస్తూ కన్పిస్తాడు. దీనికి కారణం అమావాస్య నాటికి పూర్తిగా సూర్యకాంతికి అడ్డుగా ఉన్న భూమి ఆ మరుసటి రోజు నుంచి కొంచెం కొంచెం అడ్డు తొలగుతూ చివరి పదిహేనవ రోజైన పౌర్ణమి నాటికి పూర్తిగా తొలగి పోతుంది. దాంతో సూర్యకాంతి చంద్రుని మీద పడి భూలోక వాసులకు పున్నమి చంద్రుడు కనిపిస్తాడు. ఈ విధంగా ప్రకృతిలో నియమం ప్రకారం జరిగే ఈ ప్రక్రియ మన ప్రాచీన కవికి తెలియక పోవడం చేత చంద్రుని క్షీణతకు, ప్రకాశానికి దక్షుడు శపించడమూ, అతడే శాప విమోచనాన్ని కల్గించడమూ కారణంగా చేస్తూ పై కథను కల్పించాడు. ఆ కారణంచేత ఈ కథ కట్టుకథ అవుతూ ఉంది. ఇది జానపద కట్టుకథల ప్రభావంతో పండిత కవి కల్పించినది.

ఈ కథకు మూలమని చెప్పదగిన కథలు కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితలో రెండు ఉన్నాయి. ఒకటి కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహిత ద్వితీయకాండ, తృతీయ ప్రపాఠకం, పంచమానువాకంలోనూ, రెండవది ద్వితీయకాండ పంచమ ప్రపాఠకం షష్టానువాకంలో ఉంది. ఈ రెండు భిన్నంగా ఉన్నాయి. మొదట తృతీయ ప్రపాఠకం పంచమానువాకంలో ఉన్న కథను తెలుసుకుందాం.

## మొదటి కథ :

ప్రజాపతికి ముప్పై ముగ్గురు కుమార్తెలుండేవారు. వారిని అతడు రాజైన సోమునికి ఇచ్చాడు. సోముడు వారిలో రోహిణిని మాత్రమే పొందాడు. మిగిలిన వారు రోహిణి సుఖాన్ని సహించనివారై ప్రజాపతి వద్దకు తిరిగి వచ్చారు. చంద్రుడు వారి వెంట ప్రజాపతి వద్దకు వచ్చి తిరిగి వారిని తనకు ఇమ్మని యాచించాడు. వారందరిని సమానంగా పొందుతానని శపథం చేస్తే ఇస్తానని ప్రజాపతి సోమునికి చెప్తాడు. సోముడు శపథం చేయగా ప్రజాపతి

వారిని సోమునికి ఇస్తాడు. సోముడు వారిని గ్రహించి చేసిన శపథాన్ని ఉల్లఘించి పూర్వం లాగానే రోహిణిని మాత్రమే పొందాడు. అప్పుడతనికి యక్ష్మరోగం(క్షయరోగం) వచ్చింది. రాజుకు యక్ష్మరోగం రావడం చేత దానికి రాజయక్ష్మ అనే పేరు వచ్చింది. జాయా(భార్యా) నిమిత్తంగా రావడం చేత దానికి జాయేన్య అనే పేరు వచ్చింది. అది చాలా పాపం కలది కావడంచేత దానికి పాపయక్ష్మ అనే పేరు వచ్చింది. ఎవరు ఈ విధంగా ఈ యక్ష్మరోగం యొక్క అవాంతర విశేషాలను, పుట్టుకను తెలుసుకుంటాడో అతనిని అవి పొందవు. యక్ష్మరోగం సంక్రమించిన తర్వాత సోముడు మిగిలిన ముప్పై ఇద్దరిని సేవించడానికి వస్తాడు. వారు మమ్ములను సమానంగా పొందేటట్లుగా వరం కోరుతారు. ఆ తర్వాత వారు సోముని కోసం ఆదిత్యదేవతాకమైన చరువును నిర్వాపం చేస్తారు. దానిచేత సోముని ప్రబలమైన యక్ష్మరోగం నుంచి విడిపిస్తారు. ఇంతటితో ఈ కథ[5] ముగుస్తుంది.

ఈ కథలో చంద్రుడు రాజైన సోముడు అని చెప్పబడ్డాడు. చంద్రుడు అని చెప్పబడలేదు. సోముడు ప్రజాపతి దగ్గర అతని కుమార్తెలందరినీ సమానంగా పొందుతానని చేసిన శపథాన్ని ఉల్లంఘించడం వల్ల అతనికి క్షయరోగం కలిగినట్లుగా, సోముడు తన తప్పు తెలుసుకొని ప్రజాపతి కుమార్తెలందరినీ సమానంగా పొందుతానని ప్రజాపతి కుమార్తెలకు చెప్పడంతో వారు ఆదిత్యదేవతాకమైన చరువును నిర్వాపం చేయడంతో యక్ష్మరోగం నుంచి సోముడు విముక్తుడయినట్లుగా చెప్పబడింది. ఈ కథలో కట్టుకథా లక్షణం లేదు. ఈ కథలో ప్రజాపతికి పేరులేదు. భారత కవి దక్ష ప్రజాపతి అని చెప్పాడు. కృష్ణయజుర్వేదంలో ప్రజాపతి కుమార్తెలు ముప్పైముగ్గురు అని ఉండగా భారత కవి ఇరవై ఏడుగురు అని చెప్పాడు. కృష్ణయజుర్వేదంలో సోముడు తాను చేసిన శపథాన్ని ఉల్లంఘించడం వల్ల అతనికి యక్ష్మరోగం కలిగినట్లుగా ఉండగా భారతకవి తన కుమార్తెలందరినీ సమానంగా ఆదరించాలని తాను చెప్పిన మాట చంద్రుడు వినకపోవడం వల్ల దక్షుడు కోపించి క్షయరోగాన్ని సృష్టించి చంద్రుని మీదికి పంపించినట్లుగా రాసాడు. కృష్ణయజుర్వేదంలో సోముడు తాను చేసిన తప్పును గ్రహించి ప్రజాపతి కుమార్తెలందరినీ సమానంగా పొందడంతో వారు ఆదిత్య దేవతా సంబంధమైన యజ్ఞం చేసి సోముని యక్ష్మరోగం నుంచి విముక్తిని చేసినట్లుగా ఉండగా భారతకవి దక్షుడు చెప్పిన శాప విమోచన మార్గం వల్ల చంద్రుడు నెలలో సగం రోజులు క్షీణించి అమావాస్యనాడు ప్రభాసతీర్థంలో స్నానం చేసి వర్ధిల్లుతున్నట్లుగా చెప్పాడు. కృష్ణయజుర్వేదం కథలో కట్టుకథా లక్షణం లేదు. భారత కవి కృష్ణయజుర్వేదంలోని కథకు కొన్ని మార్పులు చేసి కట్టుకథాలక్షణం కల్పించాడు.

కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహిత ద్వితీయ కాండ పంచమ ప్రపాఠకం షష్ఠోనువాకంలో రాజయక్ష్మరోగం పుట్టుకను గురించిన కథ ఇంకొక విధంగా ఉంది. దర్శ, పూర్ణమాస యాగాల గురించి వివరించే సందర్భంలో అమావాస్య, పున్నమి రోజుల్లో స్త్రీ సంపర్కం చేయకూడదనే విషయాన్ని వివరిస్తూ ఈ కథ ఇలా చెప్పబడింది.

రెండవ కథ :

చంద్రునికి కృష్ణపక్ష రాత్రులు ఒక వర్గంగాను, శుక్లపక్ష రాత్రులు ఒక వర్గంగాను అయి భార్యలుగా ఉన్నారు. కృష్ణపక్షంలోని చివరిదైన అమావాస్యను, శుక్లపక్షంలోని చివరిదైన పౌర్ణమిని నిషేధం కారణంగా చంద్రుడు పొందలేదు. ఆ రాత్రులు చంద్రుని సంభోగం కోసం నిర్బంధించి బలత్కారంగా అనుభవించాయి. అందువల్ల చంద్రునికి యక్ష్మరోగం(క్షయరోగం) సోకింది. రాజును యక్ష్మరోగం పొందడం చేత దానికి రాజయక్ష్మ అనేపేరు ఏర్పడింది. చంద్రుడు తాను చేసిన శపథాన్ని ఉల్లంఘించి పాపి అయ్యాడు, అలాంటి పాపికి యక్ష్మరోగం సోకడం చేత అది పాపయక్ష్మ అయింది. ఈ యక్ష్మరోగం జాయ (భార్య)ల నిమిత్తంగా ఏర్పడటం చేత జాయేన్య అని వ్యవహరింపబడింది. ఈ పాపయక్ష్మ, రాజయక్ష్మ రోగాల ఉత్పత్తి విధాన్ని తెలుసుకున్నవాడిని ఈ యక్ష్మవ్యాధులు సోకవు. అప్పుడు చంద్రుడు అమావాస్య పూర్ణిమ రాత్రులకు నమస్కరిస్తూ వారిని చేరాడు, "మేమిద్దరమే దేవతల హవిర్భాగాలను వహిస్తాము, మమ్ములను ఆశ్రయించి మాత్రమే దేవతలను ఉద్దేశించి యాగం చేయాలనే వరాన్ని కోరుతున్నాము." అని వారిద్దరూ పలుకుతారు. ఈ కారణం చేతనే సాటి రాత్రులన్నింటిలోనూ అమావాస్య పౌర్ణమినాడు మాత్రమే దేవతలను ఉద్దేశించి యాగాలు చేయబడుతున్నాయి. ఇంతటితో ఈ కథ[6] ముగుస్తుంది.

ఈ కథలో కట్టుకథా లక్షణం ఉంది. వేదకాలం నాటి పెద్దలు అవసరాన్ని బట్టి దర్శయాగాన్ని అమావాస్యనాడు, పూర్ణమాస యాగాన్ని పౌర్ణమినాడు చేయాలని నిర్ణయించి ఆ యాగాలను ఆ రోజుల్లోనే చేసేవారు. లోకంలోని ఈ సంప్రదాయానికి అనుగుణంగా ఈ కథ కల్పించబడింది. చంద్రుడు తన భార్యలైన అమావాస్య పూర్ణిమలకు ఇచ్చిన వరం వల్ల దర్శయాగాన్ని అమావాస్యనాడు, పౌర్ణిమనాడు పూర్ణమాస యాగాన్ని చేస్తున్నారని ఈ కథలో కల్పించడం చేత ఇది కట్టు కథ అవుతూ ఉంది.

కృష్ణయజుర్వేదంలోని పై రెండు కథల్లో చంద్రుని వివాహం భిన్నంగా చెప్పబడింది. అందువల్ల ఈ రెండు కథలను వేరు వేరు వ్యక్తులు కల్పించారని చెప్పవచ్చు. హేతుబద్ధంగా ఆలోచిస్తే చంద్రుడు మనిషి కాడు. దేవుడు కాడు. భూగ్రహానికి ఒక ఉపగ్రహం. ఉపగ్రహం పెళ్ళి చేసుకునే అవకాశమే లేదు. అయితే మన ప్రాచీనులు చంద్రుని వల్ల, చంద్రుడు ఇచ్చే వెన్నెల వల్ల ఉన్న ఉపయోగాలను గమనించి కృతజ్ఞతతో ఆకాశంలో కన్పిస్తున్న చంద్రుని దేవునిగా భావించి ఇలాంటి కథలను అల్లారు. ఈ కథలు ప్రాచీనకాలంలో మన పూర్వుల చంద్రుని గురించిన ఆలోచనలను భావనలను తెలియజేస్తున్నాయి. ఈ రెండు కథల్లోను యక్ష్మరోగం పుట్టుకను తెలుసుకున్నవారిని యక్ష్మరోగం బాధించదని ఫలశృతి చెప్పబడింది. దీన్నిబట్టి అతి ప్రాచీనకాలం నుంచి మన పూర్వులు కథలకు ఫలశృతి చెప్పేవారని తెలుస్తుంది.

తిక్కన ఈ కథను భారతం శల్యపర్వం ద్వితీయాశ్వాసంలో 147వ పద్యం నుంచి 153వ వచనం వరకూ 7 పద్యగద్యాల్లో క్లుప్తంగా చెప్పాడు.

## 11. సంసార బంధం కథ:

ఈ కథ స్త్రీ పర్వం 5వ అధ్యాయంలో 24 శ్లోకాల్లో ఉంది. ఈ కథను విదురుడు ధృతరాష్ట్రునికి చెబుతాడు. “గహనమైన ఈ సంసారాన్ని ఎలా అర్థం చేసుకోవాలి. దీని గురించి నాకు సవిస్తరంగా చెప్పుమని ధృతరాష్ట్రుడు విదురుని అడిగినపుడు నిగూఢమైన ఈ సంసార వనాన్ని గురించి పరమ మునులు చెప్పే విషయాన్ని నీకు వివరిస్తాను అని ఈ కథను ఇలా చెబుతాడు.

ఒక బ్రాహ్మణుడు ఒక దట్టమైన కీకారణ్యంలోకి ప్రవేశిస్తాడు. ఆ అడవి సింహాలు, పులులు, ఏనుగులు, ఎలుగుబంట్లు మొదలైన క్రూర మృగాల సమూహాలతో అతి భయంకరంగా ఉంది. వాటినిచూసి భయంతో బ్రాహ్మణుని వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి. వాటికి చిక్కకుండా తప్పించు కోవడానికి అతడు భయంతో పరుగెడుతున్నాడు. అవి అతని వెంటపడ్డాయి. ఆ సమయంలో అతడు ఆ అడవిని అన్ని వైపుల నుంచి ఆవరించి ఉన్న పెద్ద వలను చూస్తాడు. ఒక స్త్రీ ఆ వలను తన చేతితో విసరి పట్టుకొని ఉంది. ఆ అడవిలో ఆకాశాన్ని తాకుతున్న ఎత్తైన చెట్లున్నాయి. ఆ చెట్లకు పొడవైన ఐదు తలల పాములు వ్యాపించి ఉన్నాయి. ఆ అడవి మధ్యలో ఒక బావి ఉంది. ఆ బావి గడ్డితో, గట్టి తీగలతో అన్ని వైపులా కప్పబడి ఉంది. బ్రాహ్మణుడు పరిగెత్తుతూ వచ్చి బావిలో పడ్డాడు. బావిలో లతల సమూహాలు అల్లబడి ఉన్నందువల్ల అతడు కింద పడకుండా మధ్యలోనే లతల్లో చిక్కుకొని తలకిందులుగా వేలాడు తున్నాడు. బావి మధ్యలో బలిష్టమైన ఒక పెద్ద పామును అతడు చూస్తాడు. బావి పై భాగాన గట్టు మీద ఒక పెద్ద ఏనుగు ఉంటుంది. అది తెల్లగా నల్లగా ఉండి ఆరు ముఖాలతో 12 కాళ్ళతో ఉంది. ఆ బ్రాహ్మణుడు తగులుకొని ఉన్న లతా తీగల మీద తేనెటీగలు భయంకరంగా మూగి ఉన్నాయి. ఆ తేనెతుట్టె నుంచి తేనె అనేక ధారలుగా కారుతూ ఉంది. తలకిందులుగా వేలాడుతూ సంకట స్థితిలో ఉన్న ఆ బ్రాహ్మణుడు ఆ తేనె ధారను నిరంతరంగా తాగుతున్నాడు. ఎంత తాగినా ఆశ తీరక ఇంకా ఇంకా తాగాలని అతను అనుకుంటున్నాడు. ఆ స్థితిలో కూడా అతనికి జీవితం మీద విరక్తి కల్గలేదు. నల్లని తెల్లని ఎలుకలు ఆ చెట్టును కొరుకుతున్నాయి. దట్టమైన ఆ అడవిలో పాములు, భయంకరమైన స్త్రీ, బావిలో కింద పాము, పైన గట్టు మీద ఏనుగు, ఎలుకలు కొరికితే చెట్టు పడిపోతుందన్న భయం, తేనెటీగల వల్ల భయం మొత్తం ఆరు రకాల భయాలు అతణ్ణి భయపెడుతున్నాయి. ఇలాగే సంసార సాగరంలో పడిపోయిన మనిషి కూడా అనేక భయాల మధ్య నివసిస్తున్నాడు. అయినప్పటికీ నిర్వేదాన్ని పొందకుండా ఆశతోనే జీవితాన్ని సాగిస్తున్నాడు.

పై కథను విదురుడు ధృతరాష్ట్రునికి చెప్పి సంసార సాగరాన్ని గురించి మోక్షవేత్తలు ఉదాహరించిన పోలిక ఇది. దుర్గమమైన ఆ అడవి మహా సంసారం యొక్క స్వరూపం. పాములన్నీ రోగాలు, పెద్ద శరీరంతో నిలబడి ఉన్న స్త్రీ వార్ధక్యం. వార్ధక్యం మనిషి రంగునూ

రూపాన్ని నాశనం చేస్తుంది. బావి అని చెప్పినది జీవి శరీరం. బావిలో కింద ఉన్న మహాసర్పం కాలం. అది అన్ని ప్రాణులను అంతం చేస్తుంది. బావి మధ్యలో పెరిగిన తీగలు దేహధారులకు ఉన్న జీవితాశ. ఆ ఆశలో చిక్కుకొని మానవుడు వేలాడుతున్నాడు. బావి గట్టు మీద ఉన్న ఆరు ముఖాల ఏనుగు సంవత్సరం. దాని ఆరు ముఖాలు ఆరు ఋతువులు, దాని పన్నెండు పాదాలు పన్నెండు నెలలు. ఎల్లప్పుడూ ఆ వృక్షాన్ని కొరుకుతున్న నల్లని, తెల్లని ఎలుకలు రాత్రింబవళ్ళు. అక్కడున్న తేనెటీగలు కోరికలు, ధారలుగా కారుతున్న ఆ తేనె కామ రసాలు. మానవులు ఆ ధారల్లోనే మునిగిపోతారు. ఈ విషయాన్ని తెలుసుకున్న పండితులు వైరాగ్యంతో సంసార బంధాలను వదలివేస్తారు అని ధృతరాష్ట్రునికి విదురుడు చెబుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

సంసారాన్ని మన వారు భయంకరమైన కీకారణ్యంగా, అనంతమైన సాగరంగా ఉపమించారు. అడవి మధ్యలో చిక్కుకున్న మనిషి దారి తెన్నూ తెలియకుండా భయంకరమైన క్రూర మృగాల మధ్య బిక్కుబిక్కు మని గడుతుపుతూనే తన ప్రాణ రక్షణకు అనేక ప్రయత్నాలు చేస్తాడు. అలాగే సాగర మధ్యలో చిక్కుకున్న మనిషి కూడా ఎటు వెళ్ళాలో తెలియక జీవితం మీద ఆశతో అనంతమైన సాగరాన్ని ఈదే ప్రయత్నం చేస్తాడు. పైన చెప్పిన కథలో కవి సంసారిని కీకారణ్యంలో చిక్కుకున్న ఏకాకి అయిన మానవుడుగా ఉపమించాడు. సంసారి భార్యా పిల్లలను పోషించడానికి, రక్షించడానికి నిరంతరం శ్రమిస్తూ ఉండాలి. అదొక జీవన పోరాటం. ఆ పోరాటంలో అనేక దుఃఖాలు, సుఖాలు ఉంటాయి. దుఃఖాలతో బాధ పడేటప్పుడు సంసారికి సంసారం మీద విరక్తి కల్గవచ్చు. ఆ దుఃఖం పోయిన తర్వాత విరక్తి కూడా పోతుంది. ఈ విధంగా మానవుడు ఒక తరం నుంచి మరొక తరం సుఖ దుఃఖాలతో కూడుకున్న సంసార జీవనాన్ని కొనసాగిస్తున్నాడు. ఇలా కొనసాగించడం వల్లనే సృష్టిలో మనుషులు నిరంతరంగా కొనసాగుతున్నారు. సృష్టి కొనసాగాలంటే సంసార జీవనం ఉండవలసిందే. అయితే మోక్షవేత్తల అభిప్రాయం దీనికి భిన్నంగా ఉంటుంది. మానవ జన్మ దుర్లభమైనది. గత జన్మల్లో చేసుకున్న పుణ్యం కారణంగా మానవ జన్మ లభిస్తుంది. మానవ జన్మ పరమార్థం మోక్షాన్ని పొందడం. కాబట్టి ఈ జన్మలో భవ బంధాలతో కూడుకున్న సంసారమనే కీకారణ్యంలోకి ప్రవేశించకుండా వైరాగ్య భావంతో దేవ దేవుని స్మరిస్తూ మరణించి మోక్షాన్ని పొందాలని మోక్షవేత్తలు చెబుతారు. మోక్షవేత్తలు ఈ విషయాన్ని ఎంతగా చెప్పినప్పటికీ సాధారణ ప్రజలు దాన్ని పట్టించుకోకుండా సంసార బంధంలోకి వెళ్తున్నారు. లోకంలో సంసారాన్ని కీకారణ్యంతో పోల్చడం సాంప్రదాయంగా వస్తూ వుంది. దానికి అనుగుణంగా కవి ఈ కథను కల్పించి చెప్పాడు. అందువల్ల ఇది కట్టుకథ అవుతూ ఉంది. ఇది జానపద కట్టుకథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ.

ఈ కథను తిక్కన స్త్రీపర్వం ప్రథమాశ్వాసంలో 42వ వచనం నుంచి 51వ పద్యం వరకూ ఉన్న 10 పద్యగద్యాల్లో రచించాడు.

## 12. రాజనీతి శాస్త్రం పుట్టుక కథ:

ఈ కథ శాంతిపర్వంలోని రాజధర్మానుశాసన పర్వం అనే ఉపపర్వంలో 59వ అధ్యాయంలో 145 శ్లోకాల్లో ఉంది. దీన్ని భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. ధర్మరాజు "రాజు అనే శబ్దం ఎలా పుట్టింది? అతడు మిగిలిన ప్రజల కంటే ఏ విధంగా ఉన్నతుడు? అతడు భూమిని ఎలా రక్షించ గలుగుతున్నాడు? ప్రజలందరూ దేవుని ముందు శిరస్సు వంచినట్లుగా రాజు ముందు శిరసు వంచుతున్నారు. దీని తత్త్వమంతా చెప్పవలసింది" అని భీష్ముని కోరతాడు. దానికి సమాధానంగా భీష్ముడు ఈ కథను ఇలా చెబుతాడు.

మొదట కృతయుగంలో రాజ్యమూ లేదు, రాజూ లేదు. దండమూ లేదు, దండించే వాడు లేదు. ప్రజలందరూ ధర్మపరులు కావడం చేత ధర్మబద్ధంగా జీవిస్తూ పరస్పరం రక్షించుకుంటూ ఉండేవారు. కొంతకాలం తర్వాత వారిలో మోహం ప్రవేశించింది. మోహపరవశులైన నరులు లోభానికి, కామానికి వశులయ్యారు. దీనితో ప్రజలు అధర్మవర్తనులై బలవంతంగా స్త్రీలను పొందటం, మాట్లాడ గూడని మాటలు మాట్లాడడం, తినగూడని వాటిని తినడం, తప్పు ఒప్పు లేకుండా ప్రవర్తించడం మొదలు పెడతారు. దీంతో సమాజం అల్లకల్లోల మవుతుంది. ధర్మం నశించి వేద విజ్ఞానం నశిస్తుంది. దీనితో దేవతలు భయపడి బ్రహ్మవద్దకు వెళ్ళి మానవ లోకంలో జరుగుతున్న అక్రమాలను అల్లకల్లోలాను బ్రహ్మకు వివరించి మానవులకు శ్రేయస్కరమైన పని చేయవలసిందిగా కోరతారు. బ్రహ్మ వారికి అభయమిచ్చి పంపించి

**"తతో ధ్యాయ సహస్రాణాం శతం చక్రే స్వబుద్ధిజయ్**
**యత్ర ధర్మస్తదైవార్థః కామశ్చై వాభి వర్ణితః"**
**(శాంతి. 59 - 29వ శ్లోకం)**

"తన బుద్ధి నుంచి లక్ష అధ్యాయాల రాజనీతి శాస్త్రాన్ని రచిస్తాడు". ఈశాస్త్రంలో ధర్మార్థ కామాల గురించి, సత్వం, రజస్సు, తమస్సు అనే త్రిగుణాల గురించి, స్థానం, వృద్ధి, క్షయ అనే త్రివర్గాల గురించి, ఆత్మ, దేశం, కాలం, ఉపాయం, కార్యం, సహాయుడు అనే షడ్వర్గాల గురించి వివరింప బడింది. ఈ నీతి శాస్త్రంలో మంత్రుల లక్షణం, రాజదూత, రాజపుత్రుని లక్షణం, గూఢచారుల విచారణకు వివిధ ఉపాయాలు, వేరువేరు స్థానాల్లో వేరు వేరు పద్ధతుల్లో గూఢచారులను నియమించడం, సామం, దానం, భేద, దండం, ఉపేక్ష అనే ఐదు ఉపాయాల గురించి, హీన, మధ్యమ, ఉత్తమ సంధుల గురించి వివరింపబడింది. ఇందులో ఇంకా శత్రువుల మీదికి దండెత్తే యాత్రా సమయాలు, రథాలు, ఏనుగులు, గుర్రాలు, పదాతి దళాలు విష్టి, నౌకాబలం, చారబలం, దేశిక బలం అనే ఎనిమిది అంగాల గురించి, శతృవులు, మిత్రులు, ఉదాసీనుల గురించి, యుద్ధాలలో అనేక వ్యూహాల గురించి వివరింపబడి ఉంది.

ఈ గ్రంథంలో ఇంకా అగడ్తలు తవ్వే పద్ధతి, సేనను యుద్ధానికి నడిపించడం, దొంగలచేత, క్రూరులైన ఆటవికుల చేత శత్రు దేశాలను పీడించడం, సప్తాంగాలున్న

రాజ్యం యొక్క తగ్గుదల, పెరుగుదల, సమత్వం, శత్రువులు, మధ్యస్థులు, మిత్రులను గురించిన వివరణ, తన కంటే బలవంతులను అణచివేసే విధానాలు, ప్రమాదం కల్గించే వారిని వెతికి పట్టుకొనే విధానం, మల్ల క్రీడ, ఆయుధ ప్రయోగం, త్యాగం, ధనం కూడబెట్టడం, అనాథులను చేరదీయడం, సేవకులను కనిపెట్టి ఉండడం, తగిన సమయాలలో దానం చేయడం, వ్యసనాలకు దూరంగా ఉండడం మొదలైన రాజ గుణాలు వివరింపబడ్డాయి. ఈ గ్రంథంలో ఇంకా సేవకులు చేసే చెడ్డ పనులు, వేరువేరు వృత్తులు, ఇలాంటి సేవకులను పసిగట్టడం, ప్రమాదాన్ని తొలగించుకోవడం, ధర్మార్థకామాల కోసం ధనం ఖర్చు చేసే విధానం, కష్టాలను తొలగించుకోవడం కోసం ధనం ఖర్చు చేసే విధానం. యుద్ధానికి అవసరమైన అనేక ఆయుధాలను, కవచాలను, రథాలను తయారుచేసే ఉపాయాలు, పణవం, ఆనకం, శంఖ, భేరులు మొదలైన యుద్ధ వాద్యాలను మోగించడం, మణులు, పశువులు, భూమి, వస్త్రం, దాసీజనం, సువర్ణం అనే ఆరు ద్రవ్యాలను సేకరించడం, శత్రు ద్రవ్యాలను నాశనం చేయడం, తమ అధికారంలోకి వచ్చిన ప్రదేశంలో శాంతి నెలకొల్పడం మొదలైనవన్నీ ఉన్నాయి. ఇంకా ఈ గ్రంథంలో సత్యత్వం, మధురమైన మాటలు, ప్రజలు గుంపుగా కూర్చున్న ప్రదేశాల్లో నిత్యమూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వారిని పరీక్షించడం, బ్రాహ్మణులను దండించక పోవడం, జాతులను బట్టి, గుణాలను బట్టి సేవకుల ఎంపిక, పౌరుల రక్షణ, దేశ, జాతి, కులాల ధర్మాలు, ఒక్కొక్క మండలంలో పన్నెండుమంది రాజులను నిల్పడం, కోశాగారం వృద్ధి పొందించుకునే పద్ధతి, ధనం సంపాదించుకునే పద్ధతి, లోకమంతా సన్మార్గంలో ఉండి చలింపకుండా నిలిచే ఉపాయాలు మొదలైనవన్నీ ఈ నీతిశాస్త్రంలో బ్రహ్మ వర్ణించాడు. మంగళ ప్రదమైన ఈ శాస్త్రాన్ని రచించిన తర్వాత బ్రహ్మ ఇంద్రాది దేవతలతో "లోకహితం కోసం సరస్వతీదేవి నా బుద్ధిని ప్రభావితం చేసింది, ఈ బుద్ధితో నేను ఈ శాస్త్రాన్ని రాశాను.

**"దణ్డేన సహితా హ్యేషా లోకరక్షణ కారికా**
**నిగ్రహానుగ్రహరతా లోకా ననుచరిష్యతి"**
**"దణ్డేన నీయతే చేదం దణ్డం నయతి వాపునః**
**దణ్డనీతి రితి ఖ్యాతా త్రీన్‌లోకా నభివర్తతే"**

**(శాంతి. 59 – 77,78 శ్లోకాలు)**

"ఇది లోకాన్ని రక్షిస్తుంది. ఈ జగత్తు దండం చేత నడపబడుతుంది. అందువల్ల ఇది దండనీతి అని ప్రసిద్ధి కెక్కుతుంది. ఇది ముల్లోకాల్లోనూ వ్యాపిస్తుంది" అని చెబుతాడు. లక్ష అధ్యాయాలతో బ్రహ్మ రాసిన ఈ దండనీతి శాస్త్రాన్ని ఆ తర్వాత శంకరుడు గ్రహించి ప్రజల ఆయువు తగ్గి పోతుందని తెలుసుకుని ఆ శాస్త్రాన్ని పదివేల అధ్యాయాలున్న గ్రంథంగా సంగ్రహించి చెబుతాడు. దీని పేరు "వైశాలాక్షం". దీన్ని ఇంద్రుడు మరింతగా సంగ్రహించి ఐదువేల అధ్యాయాలుగా చెప్పాడు. దీని పేరు "బాహుదంతకం" బృహస్పతి

ఈ శాస్త్రాన్ని "బార్హస్పత్యం" అనే పేరుతో మూడు వేల అధ్యాయాలుగా సంక్షేపిస్తాడు. శుక్రుడు దాన్ని వెయ్యి అధ్యాయాలుగా సంగ్రహం చేస్తాడు. మానవుల ఆయువు తగ్గి పోవడాన్ని గ్రహించి మహర్షులు బ్రహ్మ రాసిన దండనీతి శాస్త్రాన్ని ఇలా సంక్షేపించారు.

అపుడు దేవత లందరూ విష్ణువు వద్దకు వెళ్ళి "మానవు లందరి కంటే శ్రేష్ఠుడైన ఒక్కణ్ణి మాకు అధిపతిగా ఇమ్ము" అని అడుగుతారు. నారాయణుడు తేజోరూపుడైన విరజుడు అనే మానస పుత్రుని సృష్టిస్తాడు. విరజుని కొడుకు కీర్తిమంతుడు, ఇతని కొడుకు కర్దముడు. ఈ ముగ్గురూ రాజ్యపాలనకు అంగీకరించకుండా తపస్సు మీద దృష్టి మరలిస్తారు. కర్దముడి కొడుకు అనంగుడు. ఇతడు దండనీతిని గ్రహించి రాజ్య పాలనను స్వీకరిస్తాడు. అతని తర్వాత మృత్యు దేవత మానస పుత్రిక అయిన సునీథ కుమారుడైన వేనుడు రాజు అవుతాడు. ఇతడు అధర్మపరుడు కావడం చేత మహర్షులు మంత్రపూతాలైన దర్భలతో అతణ్ణి చంపివేస్తారు. మహర్షులు వేనుని కుడిచేతిని మథించగా ఇంద్రుని లాంటి మహాపురుషుడు పుడతాడు. అతడు కవచం, ఖడ్గం, ధనస్సు, బాణాలు ధరించి ఉంటాడు. అతణ్ణి దండనీతి ఆశ్రయిస్తుంది. అతను మహర్షులకు నమస్కరించి తాను ఏమి చేయాలో ఆజ్ఞాపించ వలసిందిగా కోరతాడు. అపుడు దేవతలు, మహర్షులు అతనితో "ధర్మ బుద్ధితో సర్వ ప్రాణుల మీద సమబుద్ధి కల్గి నిష్పక్షపాతంగా ధర్మాన్ని ఆచరించు. మానవు లెవరైనా ధర్మం నుండి తొలగితే వారిని దండించు. త్రికరణ శుద్ధిగా వేదాన్ని రక్షిస్తానని చాలా సార్లు ప్రతిజ్ఞ చేయి. దండనీతి శాస్త్రంలో చెప్పిన ప్రకారం ధర్మాన్ని నిశ్శంకంగా నిర్వహిస్తానని, బ్రాహ్మణులు నాకు దండింపదగని వారు అని, లోకం సంకరం కాకుండా రక్షిస్తాను అని ప్రతిజ్ఞ చేయి" అని చెబుతారు. అప్పుడు వైన్యుడు (వేనుని కొడుకు) వారితో "పురుష శ్రేష్ఠులైన బ్రాహ్మణులు నాకు సమస్కరింప దగినవారు" అని అంటాడు. బ్రాహ్మణు లందరూ "అట్లే అగుగాక" అని వైన్యునితో అంటారు. ఆ తర్వాత వైన్యునికి శుక్రుడు పురోహితుడుగా, వాలఖ్యిలులు, సారస్వతులు అనే మహర్షి గణం మంత్రులుగా, గర్గ మహర్షి జ్యోతిష పండితుడుగా ఉంటారు. ఆ తర్వాత విష్ణువు, ఇంద్రాది దేవతలు, మహర్షులు మొదలైన వారు వేనుని కుమారుడైన పృథువుకు రాజ్యాభిషేకం చేస్తారు. భూదేవి సముద్రుడు, హిమవంతుడు, ఇంద్రుడు మేరు పర్వతం మొదలైన వారు పృథువుకు అనేక విలువైన బంగారాన్ని, రత్నాలను, అక్షయమైన ధనాన్ని కానుకగా ఇస్తారు. గుర్రాలు, రథాలు, ఏనుగులు కోట్ల కొలది భటులు పృథువు తలచిన వెంటనే అతని వద్దకు వస్తాయి. అతని రక్షణలో ప్రజలు ముసలితనం, కరువు, రోగం, దొంగల భయం మొదలైనవి లేకుండా సుఖంగా ఉంటారు. అతనికి పర్వతాలు కూడా మార్గాన్ని ఇచ్చేవి. అతని ధ్వజాలు ఎప్పుడూ వాలిపోలేదు. భూమి పదిహేడు రకాల పంటలనిచ్చింది. యక్షులు, రాక్షసులు, నాగులు అతని కోర్కెలన్నింటినీ తీర్చేవారు. ఈ లోకాన్నంతటినీ పృథువు ధర్మబద్ధంచేసి ప్రజలనందరినీ రంజింపజేశాడు. అందువల్ల అతడు రాజ శబ్దంతో పిలవబడ్డాడు.

బ్రాహ్మణులను క్షతములు అంటే బాధల నుంచి త్రాణం అంటే రక్షణ చేశాడు కాబట్టి అతనికి క్షత్రియుడు అనే పేరు వచ్చింది. పృథువు చేసిన ధర్మ పరిపాలన వల్ల భూమికి పృథివి అనే పేరు వచ్చింది. సనాతనుడైన విష్ణువు స్వయంగా అతణ్ణి "రాజా! నిన్ను ఎవరూ మించి పోలేరు"అని స్థాపన చేస్తాడు. పృథువు చేసిన తపస్సు చేత విష్ణువు అతనిలో ఆవేశిస్తాడు. అందువల్ల మానవులూ దేవతలు కూడా దేవునికి నమస్కరించినట్లు అతనికి (రాజుకు) నమస్కరించారు. పృథువు బ్రహ్మ చెప్పిన రాజనీతి శాస్త్రాన్ని అనుసరించి రాజ్యాన్ని పరిపాలిస్తాడు. అతని తర్వాత అతని వారసులు రాజులవుతారు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

పై కథలో రాజ్యానికి రాజుకు అవసరమైన అన్ని అంశాలతో కూడిన రాజనీతి శాస్త్రాన్ని బ్రహ్మ రచించినట్లు, వేనుని కుడిచేయి నుంచి పృథువు ఉద్భవించినట్లు, విష్ణువు దేవతలు మొదలైన వారందరూ అతణ్ణి రాజుగా అభిషేకించినట్లు అతడు బ్రహ్మ చెప్పిన రాజనీతి శాస్త్రానుసారంగా ప్రజాపాలన సాగించినట్లుగా చెప్పబడింది. హేతుబద్ధంగా అలోచిస్తే ఇది కట్టుకథని స్పష్టమవుతుంది. మన పూర్వులు ప్రతి విషయాన్ని దేవునికి ముడిపెట్టి చెప్పారు. లోకంలోని అనేక వస్తువులు, శాస్త్ర పరిజ్ఞానం మొదలైనవి దేవతలు సృష్టించి యిచ్చినట్లుగా మనవారు చెప్పారు. ఉదాహరణకు భరతుడు తన నాట్యశాస్త్రంలో యుగసంధి కాలంలో కామ, లోభ, మాత్సర్యాలకు లోనై అధర్మంగా ప్రవర్తిస్తున్న ప్రజలను ధర్మ నిరతులను కావించడానికి దృశ్యం, శ్రవ్యం అయిన క్రీడనీయకాన్ని సృష్టించుమని ఇంద్రాది దేవతలు బ్రహ్మను ప్రార్థించినట్లు, బ్రహ్మ సమాధిస్థితుడై చతుర్వేదాల సారాన్ని గ్రహించి నాట్య వేదాన్ని సృష్టించి భరతునికి బోధించినట్లుగా, భరతుడు దాన్ని తన శిష్యులకు బోధించి వారి చేత నాటక ప్రదర్శన ప్రారంభించి నట్లుగా చెప్పాడు"[7]. ఇది పూర్తిగా కల్పితం. భరతుని నాట్యశాస్త్రం నాటక లక్షణ గ్రంథం. లక్ష్యం లేకుండా లక్షణ గ్రంథం పుట్టదు. భరతుని కాలం నాటికి నాటక రచన, నాటక ప్రదర్శన మన దేశంలో గొప్ప పరిణత దశలో ఉన్నాయి. వాటిని గ్రహించి భరతుడు నాట్యశాస్త్ర గ్రంథాన్ని రాశాడు. వాస్తవం ఇది కాగా భరతుడు దాన్ని దాచి పెట్టి తన గ్రంథానికి పవిత్రతను ప్రసిద్ధిని కలిగించడానికి నాటక శాస్త్ర పరిజ్ఞానాన్ని బ్రహ్మ తనకు బోధించినట్లుగ కల్పించి చెప్పాడు.

అలాగే లోకంలో రాజనీతి శాస్త్రాన్ని చాలా మంది మేధావులు రాశారు. సంస్కృతంలో కౌటిల్యుని అర్థశాస్త్రం, కామందకుని నీతిశాస్త్రం, శుక్ర నీతి శాస్త్రం మొదలైనవి ప్రసిద్ధమైన నీతిశాస్త్రగ్రంథాలు. వీటిని ఆయా రచయితలు తమ కాలం నాటి రాజకీయ, ఆర్థిక, సాంఘిక పరిస్థితులను బట్టి రాజనీతిశాస్త్ర గ్రంథాలను రచించారు. దీన్ని గ్రహించిన పండితకవి రాజనీతి శాస్త్రాన్ని బ్రహ్మదేవుడు తన బుద్ధి నుంచి సృష్టించి నట్లుగా పై కథను కల్పించాడు. అందువల్ల ఈ కథ కట్టుకథ అవుతూ ఉంది. ఇందులో జానపద కట్టుకథాంశ ఉంది.

రాచరికంలో **"న విష్ణుః పృథివీ పతిః"** అనే మాట ప్రచారంలో ఉంది. విష్ణుంశ లేనివాడు రాజు కాలేడు అని దాని అర్థం. త్రిమూర్తుల్లో విష్ణువుస్థితి కారకుడుగా చెప్పబడ్డాడు. అంటే విష్ణువు సృష్టిని కాపాడేవాడు. రాజు గూడా తన అధీనంలో ఉన్న భూభాగాన్ని ప్రజలను కాపాడతాడు కాబట్టి రాజును విష్ణుంశ స్వరూపుడు అని చెప్పారు. దీనికి తగ్గట్టుగా ఈ కథలో వేనుని కుమారుడైన పృథువు ప్రజలందరికీ రాజుగా నియమించబడినట్లు, అతనిలో విష్ణువు ప్రవేశించినట్లు, అందు వల్లనే పృథువును విష్ణువుగా భావించి మానవులు దేవతలు అతనికి సమస్కరించి నట్లుగా పండిత కవి కల్పించి చెప్పాడు. రాజరికంలో రాజు సర్వాధికారి. అతని మాటకు తిరుగుండదు. అతడు తప్పుచేసినా ఎవరూ ప్రశ్నించ గూడదు. ప్రశ్నించిన వానికి చావు తప్పదు. అందువల్లనే ప్రజలు అతనికి భయపడి అతణ్ణి దేవునిలాగా సేవించే వారు. రాజులు తమ దగ్గర ఉన్న పురోహిత వర్గం ద్వారా రాజు దైవాంశ సంభూతుడని ప్రచారం చేయించుకొని చదువు లేని ఆనాటి ప్రజలను నమ్మించారు. అలాగా ప్రజలను నమ్మించడానికి కల్పించిన కథే భారతం లోని ఈ కట్టుకథ కూడా. ఇది జానపద కట్టుకథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ.

ఈ వృత్తాంతాన్ని తిక్కన శాంతిపర్వం ద్వితీయాశ్వాసంలోని 198వ వచనంనుంచి 218వ వచనం వరకూ ఉన్న 21 పద్యగద్యాల్లో క్లుప్తీకరించి చెప్పాడు.

## 13. ప్రజాపతి పై మూడు వర్ణాలకు దాసులుగా శూద్రులను సృష్టించడం:

ఈ వృత్తాంతం శాంతిపర్వంలోని రాజ ధర్మానుశాసన పర్వం అనే ఉప పర్వంలో 60వ అధ్యాయంలో 27వ శ్లోకం నుంచి 40వ శ్లోకం వరకూ ఉన్న 14 శ్లోకాల్లో ఉంది. నాలుగు వర్ణాల వారి ధర్మాలను వివరించ వలసిందిగా భీష్ముని ధర్మరాజు కోరినపుడు భీష్ముడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాల వారి ధర్మాలను గురించి చెప్పి చివరగా శూద్రుల ధర్మాలు గురించి చెప్పేటపుడు ఈ వృత్తాంతాన్ని ఇలా చెబుతాడు.

ప్రజాపతి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాలకు దాసునిగా శూద్రుని కల్పించాడు. అందువల్ల శూద్రునికి పై మూడు వర్ణాల వారికి సేవ చేయడమే ప్రధానమైన విధి.

**"తస్మాచ్ఛూద్రస్య వర్ణానాం పరిచర్యా విధీయతే**
**తేషాం శుశ్రూషణాచ్చైవ మహత్ సుఖ మవాప్నుయత్"**
**"శూద్ర ఏతాన్ పరిచరేత్ త్రీన్ వర్ణా ననుపూర్వశః**
**సంచయాంశ్చ న కుర్వీత జాతు శూద్రః కథంచన"**
**"పాపీయాన్ హి ధనం లబ్ధ్వా వశే కుర్యాద్ గరీయసః**
**రాజ్ఞా వా సమనుజ్ఞాతః కామం కుర్వీత ధార్మికః"**

**(శాంతి., 60-28,29,30 శ్లోకాలు)**

"అందువల్ల శూద్రుడు మూడు వర్ణాల వారికి పరిచర్య చేయాలి, వారి సేవ వల్ల అతడు గొప్ప సుఖాన్ని పొందుతాడు. శూద్రుడు ఎప్పుడు గూడా ధనం కూడబెట్ట కూడదు. అలా కూడబెట్టితే

పాపాన్ని పొందుతాడు. చివరకు దాన్ని ధనవంతుల పాలు చేస్తాడు. అయితే రాజు అనుమతి తీసుకొని శూద్రుడు ధార్మిక కార్యాలు చేయడానికి ధనాన్ని సంపాదించ వచ్చు". మిగిలిన వర్ణాల వారు శూద్రుని తప్పక ఆదరించాలి. పై మూడు వర్ణాల వారు తాము వాడిన గొడుగు, చెప్పులు, తలపాగ, ఆసనం, విసనకర్ర తమకు పరిచర్య చేసే శూద్రునికి ఇవ్వాలి.

**"అధర్యాణి విశీర్ణాని వసనాని ద్విజాతిభిః**
**శూద్రాయైవ ప్రదేయాని తస్య ధర్మధనం హి తత్"**

**(శాంతి. 60 - 33వ శ్లోకం)**

"పై మూడు వర్ణాల వారు తాము చాలా కాలం ధరించిన వస్త్రాలను శూద్రునికి ఇవ్వాలి. అవి శూద్రులకు ధర్మ ధనం". ద్విజన్ములకు సేవ చేయడానికి శూద్రుడు వస్తే వారు అతనికి తప్పక ఆ అవకాశాన్ని కల్పించాలని ధర్మవేత్తలు చెబుతారు. సంతానం లేని శూద్రునికి యజమాని పిండ ప్రదానం చేయాలి. వృద్ధులు, దుర్బలులు అయిన శూద్రులను భరించాలి. దైన్యస్థితితో ఉన్న యజమానిని శూద్రుడు విడిచిపెట్టి వెళ్ళకూడదు. పైగా మరింత ఆదరంగా చూడాలి. శూద్రునికి వేరుగా ధనం లేదు. ఎందుకంటే అతడే యజమానికి సొమ్ము. కాబట్టి పై మూడు వర్ణాలవారి యజ్ఞమే అతనికి యజ్ఞం. స్వాహా, స్వధా లేక మిగిలిన వేదమంత్రాలు శూద్రునిలో ఉండవు. అందువల్ల శూద్రుడు వైదికవ్రత దీక్ష పొందకుండా పాకయజ్ఞాల ద్వారా యజ్ఞం చేయాలి. పాకయజ్ఞం యొక్క దక్షిణను పూర్ణపాత్రలు అంటారు. పై జవనుడు అనే శూద్రుడు ఐంద్రాగ్నం అనే విధానంతో యజ్ఞం చేసి దక్షిణగా లక్ష పూర్ణపాత్రలు ఇచ్చాడని మేము విన్నాం. పై మూడు వర్ణాలకు యజ్ఞం ఏ విధంగా విధింప బడిందో అలాగే శూద్రులకు పై మూడు వర్ణాలకు సేవ చేయడమే యజ్ఞం అని విధింపబడింది. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాల వారికి సేవ చేయడానికి బ్రహ్మ శూద్రులను సృష్టించాడని, అందువల్ల శూద్రులు పై మూడు వర్ణాల వారికి బానిసలుగా ఉండి సేవ చేయాలని, వారు ఆస్తిపాస్తులను సంపాదించుకో గూడదని, అలా సంపాదిస్తే అది పాపమని, శూద్రులకు యజ్ఞం చేసే అధికారం లేదని, పై మూడు వర్ణాల వారికి సేవచేయడమే వారికి యజ్ఞం లాంటిదని చాలా దుర్మార్గంగా బ్రాహ్మణకవి చెప్పాడు.

ఈ కథ కట్టుకథ అని స్పష్టంగా తెలుస్తూ ఉంది. వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ భారతదేశంలో మాత్రమే ఉన్నాయి. ప్రపంచవ్యాప్తంగా పురోహిత వర్గం అనేక దుర్మార్గాలు చేసింది. మిగిలిన దేశాల్లో వర్ణవ్యవస్థ లేకపోవడం చేత ప్రజల్లో ఎవరైనా పురోహితులుగా మారవచ్చు. తయారు కావచ్చు. కాని భారతదేశంలోని పురోహిత వర్గానికి చెందిన బ్రాహ్మణులు వర్ణవ్యవస్థను కల్పించి తరతరాలుగా తమ వారసులు తమ కులస్థులు మాత్రమే పురోహితులుగా ఉండే ఏర్పాటు గావించుకొని సమాజం మీద పెత్తనం చెలాయిస్తూ శూద్రులకు ఎలాంటి హక్కులు లేకుండా బానిసలుగా చేశారు. ఈ వ్యవస్థను ఎవరూ ప్రశ్నించకుండా దేవుడే ఈ వ్యవస్థను ఏర్పాటు చేశాడని ఈ కథ లాంటి కథలను కల్పించి

అజ్ఞానులుగా అమాయకులుగా ఉన్న ప్రజలను నమ్మించారు. దీనికి ఉదాహరణ సంస్కృత రామయణంలోని శంబూవధ కథ. ఈ వృత్తాంతం ఉత్తరకాండ 73 నుంచి 76 వరకు వున్న 4 సర్గల్లో వుంది. ఈ కథలో త్రేతాయుగ ధర్మాన్ని అనుసరించి శూద్రులు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యజాతులకు సేవ చేయాలని, వారు తపస్సు చేయడం అధర్మమని, శూద్రుడైన శంబూకుడు దుర్భుద్ధితో తపస్సు చేయడంవల్ల రామరాజ్యంలో అధర్మం జరిగి తత్కారణంగా ఒక బ్రాహ్మణ కుమారుడు అకాలమరణం చెందాడని, రాముడు శంబూకుని వధించడంతో చనిపోయిన బ్రాహ్మణ బాలుడు తిరిగి జీవించాడని, ఈ పని చేసినందుకు దేవతలు రాముని గొప్పగా ప్రశంసించారని, అగస్త్యుడు రామునికి దివ్యమైన ఆభరణాన్ని బహూకరించాడని చెప్పబడింది.

ఇది చాలా దుర్మార్గమైన కథ. దీన్ని వాల్మీకి రాయలేదు. ఈకథ వున్న ఉత్తరకాండ మొత్తం ప్రక్షిప్తం. వాల్మీకి రాముని ఆదర్శ కుమారుడుగా, ఆదర్శ సోదరునిగా, ఆదర్శ భర్తగా, ఆదర్శ పాలకునిగా మొత్తం కలిపి గొప్ప ఆదర్శ పురుషునిగా చిత్రించాడు. అలాంటి వాల్మీకి రామునికి చెడ్డ పేరును తెచ్చే శంబూక వధలాంటి దుర్మార్గమైన కథను రాయడు. ముక్కు మూసుకొని తపస్సు చేసుకుంటున్న శంబూకుని వర్ణాశ్రమ ధర్మస్థాపన పేరుతో నిర్దాక్షిణ్యంగా చంపేటంత దుర్మార్గునిగా వాల్మీకి రాముని చిత్రించడు. ఒకవేళ శంబూకుడు తపస్సు చేయడం అధర్మమే అయితే అతనిచేత తపస్సు విరమింప చేయవచ్చు. అతణ్ణి చంపవలసిన అవసరం లేదు. చెప్పేదేమంటే వాల్మీకి తరువాత కాలంలో బ్రాహ్మణకవి ఈ కథను కల్పించి విష్ణ్వవతారుడైన శ్రీరాముడు వర్ణాశ్రమ ధర్మరక్షణ కోసం శూద్రుడైన శంబూకుని తలను నరికి వేశాడని అజ్ఞానులైన ప్రజలను నమ్మించడానికి ఈ కథను కల్పించాడు. ఈ కథ ద్వారా రాముని దుర్మార్గునిగా చిత్రించడానికి కూడా ఈ బ్రాహ్మణ కవి వెనుకాడలేదు. నిన్న మొన్నటి వరకు చదువుకునే అవకాశాలు లేక అజ్ఞానాంధకారంలో వున్న చాలా మంది భారతీయులు ఈ కథలను, ఇలాంటి రాతలను నమ్మారు. భారతదేశాన్ని ఆంగ్లేయులు పాలించడం వల్ల, వారు విద్యను అన్ని వర్ణాల వారికి అందుబాటులోకి తేవడంవల్ల ప్రజలు విద్యా వివేకవంతులై బ్రాహ్మణులు స్వార్థబుద్ధితో కల్పించిన ఇలాంటి కథలను, రాతలను నమ్మడం లేదు.

భారతంలోని ఈ కథలో శూద్రులు పాకయజ్ఞం చేయవచ్చునని చెప్పబడింది. పాకయజ్ఞ మంటే కొత్త ధాన్యాన్ని కొత్తకుండలో వండి దాన్ని హోమం చేయడం. శూద్రులు అలా పాక యజ్ఞం చేసినప్పుడు బంగారం, ధనం మొదలైన వాటితో నింపిన పూర్ణపాత్రలను బ్రాహ్మణులకు మాత్రమే దానం చేయాలి. శూద్రులు ఇలాంటి యజ్ఞాలు చేయడానికి మాత్రమే ధనం సంపాదించాలి. వారికి ఇదే ధార్మిక కార్యం. పైజవనుడు అనే శూద్రుడు ఇంద్రుని, అగ్నిని ప్రధాన దేవతలుగా భావించి ఐద్రాగ్నం అనే పాకయజ్ఞం చేసి లక్ష మంది బ్రాహ్మణులకు పూర్ణపాత్రలను దానం చేశాడని ఈ కథలో చెప్పబడింది. అంటే శూద్రులు బ్రాహ్మణులకు దానం చేయడానికే ధనం సంపాదించాలి గానీ వారు

అనుభవించడానికి కాదన్న మాట. ఆనాటి బ్రాహ్మణులు ఎంత దుర్మార్గమైన రాతలు రాశారో దీన్ని బట్టి అర్థమవుతుంది.

ఇలాంటి కవులే కాకుండా త్రిమతాచార్యులుగా పేరుపొందిన శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు కూడా శూద్రులు పశువులతో సమానులని వారు నడుస్తున్న శ్మశానం లాంటి వారని తమ రచనల్లో చాలా దుర్మార్గంగా రాశారు. శంకరాచార్యులు బ్రహ్మసూత్ర భాష్యంలో ఇలా రాశాడు.

**"ఇతశ్చన' శూద్రస్యాధికార: । యదస్య స్మృతే: శ్రవణాధ్యయానార్థప్రతిషేధో భవతి।**
**వేదప్రతిషేధో వేదాధ్యయన ప్రతిషేధస్తదర్థ జ్ఞానానుష్ఠానయోశ్చ ప్రతిషేధ: శూద్రస్య స్మర్యతే।**
**శ్రవణ ప్రతిషేధస్తావత్**
**'అథ్యాస్య వేద ముపశృణ్వత: స్త్రపుజతుభ్యాం శ్రోత్ర పరిపూరణమితి ।'**
**'పద్యు హ వాఏతత్ శ్మశానం యత్ శూద్ర: తస్మాత్ శూద్రసమీపే'**
**నాధ్యేతవ్యమ్ ఇతి । అత ఏవాధ్యయనప్రతిషేధ:। యస్య హి సమీ**
**పే పి నాధ్యేతవ్యం భవతి స కథమశ్రుత మధీయీాత భవతి చ**
**వేదోచ్చారణే జిహ్వాచ్ఛేదో ధారణే శరీరభేద: ఇతి । అత ఏవ చార్థా**
**దర్థజ్ఞానానుష్ఠానయో: ప్రతిషేధో భవతి 'స శూద్రాయ మతిం' దద్యాత్**
**ఇతి శ్రావయేచ్చతురో వర్ణాన్ ఇతి చేతి హాసపురాణా ధిగమే**
**చాతుర్వర్ణ్య స్యాధికార స్మరణాత్ ।**
**వేదపూర్వకస్తు నాస్త్య ధికార: శూద్రాణామితి స్థితమ్ ॥**

**(బ్రహ్మసూత్ర శాంకరభాష్యం 127వ పుట. అధ్యాయం 3.పద.3, సూ.38వ భాష్యం)[8]**

స్మృతి ద్వారా శూద్రులు వేదాలను చదవడం వినడం నిషేధింపబడింది. ఒకవేళ శూద్రుడు వేద శబ్దాన్ని వింటే అతని చెవులను సీసంతో, లక్కతో నింపివేయాలి. శూద్రుడు నడుస్తున్న శ్మశానం. కాబట్టి వాని సమీపంలో అధ్యయనం చేయకూడదు. అందువల్లనే అధ్యయనం నిషేధింపబడిందని స్పష్టమవుతూ ఉంది. శూద్రుడు వేదాలను ఉచ్చరిస్తే వాడి నాలుకను కోసి వేయాలి. శరీరాన్ని ముక్కలుగా నరికివేసే విధానం ఉంది. కాబట్టే వేదార్థ జ్ఞానం, దానినసుసరించి ఆచరణ నిషేధింపబడింది. 'శ్రావయేచ్చతురో వర్ణాన్' మొదలైన మహాభారత వచనాల ద్వారా ఇతిహాస పురాణాల అధ్యయనానికి నాలుగు వర్ణాల వారికి అధికారం ఉందని తెలుస్తుంది. కానీ శూద్రులకు వేదాధ్యయనం నిషేధింపబడింది అని పై భాష్యం యొక్క భావం. రామానుజాచార్యులు వేదాంత భాష్యం 1.3- 38 లో ఇలా రాశాడు.

**'శూద్రస్య వేదశ్రవణ తదధ్యయన తదర్థానుష్ఠానాని ప్రతిషిధ్యన్తే ।**
**పద్యుహవా ఏతత్ శ్మశానం యచ్ఛూద్ర: తస్మాత్ శూద్రసమీపే నాధ్యేతవ్యమ్।**
**తస్మాత్ శూద్రో బహుపశూరయజ్ఞియ ఇతి బహుపశు: పశుసదృశ ఇత్యర్థ:।**
**అనుపశృణ్వతో ధ్యయన తదర్థజ్ఞాన తదర్థారుష్ఠానాని న సంభవన్తి ।**

**అతస్తాన్యపి ప్రతిషిద్ధాన్యేవ । స్వర్యతే చ శ్రవణాది నిషేధః।**
**అథ హాస్య వేదముపశృణ్వత స్త్రపుజ తుభ్యాం**
**శ్రోత్రపరిపూరణ ముదాహరణే జిహ్వాచ్ఛేదో ధారణే శరీరభేద ఇతి ।**
**న చాస్యోపదిశేద్ ధర్మ న చాస్య వ్రతమాదిశేత్ ॥ ఇతి చ ।**
**అతః శూద్రస్యానధికార ఇతి సిద్ధమ్ ॥' (మను. 4 -80)**[9]

శూద్రునికి వేదాల శ్రవణం, అధ్యయనం వాటి అనుష్ఠానం ఆచరణ నిషిద్ధం. శూద్రుడు తిరుగులాడుతున్న శ్మశానమై ఉన్నాడు. కాబట్టి వాని సమీపంలో అధ్యయనం చేయకూడదు. అతడు పశువుతో సమానం. వేద శ్రవణమే అతనికి నిషేధమై ఉండగా వాటి అధ్యయనం, అర్థజ్ఞానం, వైదికాచరణ విషయం సంభవం కాదు. శూద్రుడు వేదాన్ని వింటే వాని చెవుల్లో సీసం, లక్కను కరిగించి నింపివేయాలి. ఒకవేళ వాడు వేదాన్ని ఉచ్చరిస్తే వాడి నాలుకను కోసి వేయాలి. వేదమంత్రాన్ని జ్ఞాపకముంచుకున్న వాని శరీరాన్ని ముక్కలు ముక్కలుగా నరికివేయాలి. కాబట్టి శూద్రుడు వేదాధ్యయనం, బ్రహ్మవిద్యా ప్రాప్తి విషయంలో ఎల్లప్పుడూ అనధికారియై ఉన్నాడు అనేది పై భాష్యం యొక్క భావం.

మధ్వాచార్యులు ఉపర్యుక్త వేదాంత సూత్రంలోనూ, వల్లభాచార్యులు పారాశరస్మృతికి రాసిన బ్రహ్మసూత్రాను భాష్యంలో కూడా శంకరాచార్యులు, రామానుజాచార్యుల్లాగానే శూద్రులను గురించి దుర్మార్గమైన అభిప్రాయాలను వెలిబుచ్చారు. దీనిని బట్టి మధ్య యుగాలనాటి బ్రాహ్మణులు శూద్రుల పట్ల ఎంత దుర్మార్గంగా ప్రవర్తించారో స్పష్టమవుతుంది. ప్రాచీనకాలంలో బ్రాహ్మణులు రాసిన ఇలాంటి దుర్మార్గమైన రాతలకు నేటి బ్రాహ్మణులకు ఎలాంటి సంబంధం లేదు. నేటి బ్రాహ్మణుల్లో కొందరు ఈ రాతలను లోలోపల అంగీకరించవచ్చు. ఇలాంటి వారు మారిన దేశకాల పరిస్థితులను బట్టి బహిరంగంగా వీటిని సమర్థించరు. నేటి బ్రాహ్మణుల్లో ఎక్కువమంది ఈ రాతలను అంగీకరించరు, సమర్థించరు.

ఈ వృత్తాంతాన్ని తిక్కన శాంతిపర్వం ద్వితీయాశ్వాసంలోని 226వ పద్యం నుంచి 228వ పద్యం వరకూ ఉన్న మూడు పద్యాల్లో చాలా క్లుప్తంగా చెప్పాడు.

## 14. దండం పుట్టుక కథ:

ఈ కథ శాంతిపర్వంలోని రాజ ధర్మానుశానస పర్వం అనే ఉపపర్వంలో 121, 122 అధ్యాయాల్లో 116 శ్లోకాల్లో ఉంది. దీన్ని భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. ధర్మరాజు భీష్ముని ఇలా అడుగుతాడు. "సనాతనమైన రాజ ధర్మాన్ని గురించి మీరు చెప్పిన దాన్ని బట్టి దండమే ఈశ్వరుడు. దండంలోనే సర్వమూ నిలిచి ఉంది. లోకంలోని సమస్త ప్రాణులకు సర్వవ్యాపకమైన దండమే శ్రేయస్కర మైందని తెలుస్తూ వుంది. అలాంటి దండాన్ని గురించి యదార్థ స్వభావం తెలుసు కోవాలనుకుంటున్నాను. దండం అంటే ఏమిటి? అది ఎలా ఉంటుంది? అది దేని మీద ఆధారపడి ఉంటుంది? అది ఎలా పుట్టింది? దాని ఆకారం

ఎలా ఉంటుంది? దండమనే పేరుగల వాటిలో ఏది ప్రసిద్ధం? దండం దేని మీద ఆధారపడి ఉంటుంది? మొదలైన విషయాలు చెప్పవలసిందిగా కోరుతున్నాను" ధర్మరాజు పై ప్రశ్నలకు సమాధానంగా భీష్ముడు దండం గురించిన సర్వ విషయాలను ఇలా చెప్పాడు.

ఈ లోకమంతా దేని అధీనంలో ఉందో అదే దండం. దండానికి మరో పేరు వ్యవహారం. పూర్వకాలంలో మనువు మిత్రుల, శత్రువుల పట్ల సమభావం కలిగి దండాన్ని ప్రయోగిస్తూ ప్రజలను బాగా రక్షించాడు. దండాన్ని సరిగ్గా ప్రయోగిస్తే రాజుకు ధర్మార్థ కామాలు మూడు ఎల్లప్పుడు సమకూరుతాయి. కాబట్టి దండమే పరమ దైవం.

**"నీలోత్పల దళశ్యామ శ్చతుర్దంష్ట్ర శ్చతుర్భుజః**
**అష్టపాన్నైక నయనః శంకుకర్ణో ర్ధ్వరోమవాన్"**
**"జటీ ద్విజిహ్వ స్తామ్రాస్యో మృగరాజ తనుచ్ఛదః**
**ఏతద్ రూపం బిభర్త్యుగ్రం దండో నిత్యం దురాధరః"**
**"అసి ర్ధను ర్గదా శక్తి స్త్రిశూలం ముద్గరః శరః**
**ముసలం పరశు శ్చక్రం పాశం దండర్ష్టి తోమరాః"**
**"సర్వ ప్రహరణీయాని సన్తి యానీహ కానిచిత్**
**దండ ఏవ స సర్వాత్మా లోకే చరతి మూర్తిమాన్"**

**(శాంతి. 121 – 15,16,17,18 శ్లోకాలు)**

"దండం శరీరం నల్ల కలువరేకుల లాగా శ్యామలంగా ఉంటుంది. ఇది నాలుగు కోరలు, నాలుగు భుజాలు, 8 పాదాలు, చాలా కళ్ళు, శంకువు లాంటి చెవులతో నిక్కపొడుచుకున్న రోమాలతో ఉంటుంది. దాని తల మీద జటలుంటాయి. అది రెండు నాలుకలతో, ముఖం రాగి రంగుతో ఉంటుంది. దాని శరీరం సింహం చర్మంతో ఆచ్ఛాదితమై ఉంటుంది. కత్తి ధనస్సు, గద, శక్తి, త్రిశూలం, ముద్గరం, బాణం, ముసలం, పరశువు, చక్రం, పాశం, దండం, తోమరం మొదలైన ఆయుధాలన్నింటిలోనూ దండమే మూర్తీభవించి లోకంలో చరిస్తూ ఉంది." ఈ దండమే అపరాధులను భేదిస్తూ, ఛేదిస్తూ, బాధిస్తూ, ఖండిస్తూ, చీలుస్తూ, గాయపరుస్తూ, పరుగులు తీయిస్తూ అన్ని వైపులా సంచరిస్తూ ఉంది. ఈ దండం సర్వత్రా వ్యాపించి ఉండడం వల్ల విష్ణువు అని, నరులకు ఆశ్రయం కావడం వల్ల నారాయణుడు అని, ప్రభావశాలి కావడం వల్ల ప్రభువు అని పిలువ బడుతుంది. అలాగే అది ఎల్లప్పుడు గొప్ప రూపాన్ని ధరించి ఉండడం వల్ల మహా పురుషునిగా చెప్పబడుతూ ఉంది. దండనీతిని బ్రహ్మ కుమార్తెగా చెబుతారు. దానికి లక్ష్మి , సరస్వతి, జగద్ధాత్రి, వృత్తి మొదలైన పేర్లున్నాయి. ఈ విధంగా దండం లోకంలో అనేక రూపాలుగా ఉంది. ఈ దండం లేకుంటే లోకంలో మనుషులు ఒకరి కొకరు చంపుకుంటారు. దండం వలన భయం చేతనే మనుషులు ఒకరి నొకరు చంపుకోకుండా రక్షణ పొందుతున్నారు. కాబట్టి దండం అందరికీ ఆశ్రయింపదగినది. ఇది ఈ లోకాన్ని సత్య మార్గంలో నిల్పుతుంది. సత్యంలోనే ధర్మం ఉంది. దండం ప్రజల రక్షణకు ఎల్లప్పుడూ జాగరూకమై ఉంటుంది.

ఈ విధంగా రక్షించడం అనే ప్రయోజనం కల్గిన దండం క్షత్రియత్వాన్ని పొందుతుంది. ఈశ్వరుడు, పురుషుడు, ప్రాణం,సత్వం, చిత్తం, ప్రజాపతి, భూతాత్మ, జీవుడు అనే ఎనిమిది పేర్లతో దండం ప్రతిపాదింపబడుతూ ఉంది. రాజ్యానికి శరీరంగా చెప్పబడిన రథాలు, అశ్వదళం, గజదళం, మంత్రులు, వైద్యులు మొదలైన అనేక అంగాల్లో దండమే ప్రధాన అంగం. ఎందుకంటే అదే అన్నిటికీ మూల కారణం. ఈశ్వరుడు ప్రయత్న పూర్వకంగా క్షత్రియునికి దండాన్ని ప్రసాదించాడు. బ్రహ్మ లోక రక్షణ కోసం, స్వధర్మ స్థాపన కోసం ఉపదేశించిన ధర్మం దండమే. కాబట్టి రాజులకు దీన్ని మించిన పరమ పూజనీయమైన వేరొక ధర్మం లేదు.

ఇలాంటి దండోత్పత్తిని గురించి ప్రాజ్ఞులు ప్రాచీనమైన ఇతిహాసాన్ని చెబుతూ ఉంటారు. ఈ ఇతిహాసాన్ని మాంధాత మహారాజుకు వసుహోముడు అనే రాజు చెప్పాడు. ఆ కథ ఇది. బ్రహ్మ ఒకసారి యజ్ఞం చేయాలనుకున్నాడు. అయితే అతనికి తనతో సమానమైన ఋత్విజుడు కనిపించలేదు. అప్పుడు అతను తన తల మీద ఒక గర్భాన్ని ధరించి వేయి సంవత్సరాలు గడిచిన తర్వాత అతనికి ఒక తుమ్ము వస్తుంది. దానితో ఆ గర్భం కింద పడుతుంది. తుమ్ము నుంచి పుట్టినవాడు కావడం వల్ల ఆ బాలునికి “క్షుపుడు” అనే పేరు వస్తుంది. బ్రహ్మ చేస్తున్న యజ్ఞానికి క్షుపుడు ఋత్విజుడు అయ్యాడు. బ్రహ్మ యజ్ఞం ప్రారంభించగానే ఆ యజ్ఞం ప్రధానంగా కనిపించడం వల్ల బ్రహ్మ యొక్క దండం అంతర్థానమైపోయింది. అది మాయం కాగానే ప్రజల్లో వర్ణసాంకర్యం ఏర్పడి పరస్పరం కలహించుకోసాగారు. తన సొమ్ము పరుల సొమ్ము అని అనుకోకుండా స్వార్థంతో దెబ్బలాడుకోవడం ప్రారంభించారు. బలవంతులు బలహీనులను చంపివేశారు. లోకంలో విశృంఖలత్వం వ్యాపించింది. ఇలాంటి దశలో బ్రహ్మ ఈశ్వరునితో “లోకంలో వర్ణసంకరం కల్గకుండా ఏదైనా ఏర్పాటు చేయవలసిందిగా కోరతాడు. శూలాయుధాన్ని ధరించిన ఈశ్వరుడు చాలాసేపు ధ్యానించి తనను తాను దండంగా సృష్టించుకుంటాడు. ఈ దండం వలన ధర్మాచరణం జరగడం చూసి సరస్వతీదేవి దండనీతిని సృష్టిస్తుంది. అది ముల్లోకాల్లోనూ ప్రసిద్ధికెక్కుతుంది. ఆ తర్వాత ఈశ్వరుడు మళ్లీ చాలాసేపు ధ్యానించి ఆయా సమూహాలకు ఒక్కొక్కరు చొప్పున రాజులను ఏర్పాటు చేస్తాడు.

దేవతలకు ఇంద్రుని రాజుగా, పితరులకు యముని రాజుగా, ధనానికి రాక్షసులకు కుబేరుని, పర్వతాలకు మేరువును, నదులకు సముద్రుని, నీటికి వరుణుని ఇలా ఆయాజాతుల వారికి రాజులను నియమిస్తాడు. బ్రహ్మకు చిన్న కొడుకుగా పుట్టిన క్షుపుని ప్రజలకు, సమస్త ధర్మధరులకు అధిపతిగా చేస్తాడు. బ్రహ్మ యజ్ఞం ముగిసిన తర్వాత ఈశ్వరుడు ధర్మాన్ని రక్షించే దండాన్ని విష్ణువుకు, విష్ణువు అంగిరసునికి, అంగిరసుడు ఇంద్ర మరీచులకు, మరీచుడు భృగువుకు, భృగువు ఋషులకు, ఋషులు లోకపాలురకు, లోకపాలురు క్షుపునికి, క్షుపుడు మనువుకు, మనువు తన పుత్రులకు దండాన్ని వరుసగా

అప్పగిస్తారు. అదే క్రమంగా అధికారుల చేతిలోకి వచ్చి ప్రజా పరిపాలనలో జాగరూకమై ఉంది. బ్రహ్మతో సమానమైన తేజస్సుగల ఆ దండం అందరినీ వారి వారి హద్దుల్లో ఉంచుతుంది. ఇది సర్వలోకేశ్వరుడైన మహాదేవుని స్వరూపం. ఇదే సమస్త ప్రజలనూ పాలిస్తూ ఉంది అని భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. ఇంతటితో ఈ వృత్తాంతం ముగుస్తుంది.

దండించడం అంటే శిక్షించడం. కాబట్టి దండం అంటే శిక్ష అని అర్థం. నేరం చేసిన వారిని రాజు గానీ, అధికారి గానీ శిక్షించాలి. శిక్ష లేకపోతే దుర్మార్గులు పేట్రేగిపోయి సన్మార్గులను బాధిస్తారు. అందువల్ల నేరం చేసిన వారిని ఎలాంటి జాలి, దయ లేకుండా కఠినంగా శిక్షించాలి. అలా శిక్షిస్తారనే భయమున్నప్పుడే ప్రజలు ఎలాంటి నేరాలు ఘోరాలు చేయకుండా న్యాయబద్ధంగా ఉంటారు. కాబట్టి లోకంలో అతి ముఖ్యమైనది శిక్ష . అంటే దండం అతి ముఖ్యమైనది. లోకాన్ని కాపాడుతున్నది, సక్రమంగా నడిపిస్తున్నది దండం. కాబట్టి ఆ దండం మీద కృతజ్ఞతతో కవి దండం ఈశ్వర స్వరూపమని ఈ కథను కల్పించాడు. ఈశ్వరుడు లయ కారుకుడు. అంటే సృష్టిని నాశనం చేసేవాడు. అందువల్లనే ఈశ్వరుడంటే భయం. దండం పట్ల గూడా ప్రజలకు భయముంటుంది కాబట్టి ఈ కథలో ఈశ్వరుడు తనను దండంగా సృష్టించుకున్నట్లుగా, ఆ దండం మొదట విష్ణువు చేతికి, ఆ తర్వాత అది రాజుల వద్దకు, అధికారుల వద్దకు వచ్చినట్లుగా కవి పై కథను కల్పించాడు. దండం కఠినమైనది, దానికి జాలి దయ ఉండదు. అది అమూర్తం. అంటే కంటికి కనిపించనిది. అమూర్తమైన చాలా వాటికి మన పూర్వులు మూర్తిని రూపొందించుకున్నారు. అలాగే దండం మీద కృతజ్ఞతతో కవి దాని రూపాన్ని కొంత భయం కలిగించే విధంగా చెప్పాడు. దండం నల్లగా, నాలుగు కోరలు, నాలుగు భుజాలు, ఎనిమిది పాదాలు చాలా కళ్ళు, నిక్కపొడుచుకున్న రోమాలు, రెండు జటలు, సింహంలాంటి చర్మం కలిగి ఉందని కవి కల్పించి చెప్పాడు. ఈ విధంగా ఈ కథ అంతా కవి కల్పించినదే అవుతూ వుంది. అందు వల్లనే ఇది కట్టుకథ అయింది. ఇందులో జానపద కట్టుకథాంశ ఉంది.

తిక్కన ఈ వృత్తాంతాన్ని శాంతిపర్వం తృతీయాశ్వాసంలో 108వ వచనం నుంచి 122వ పద్యం వరకూ ఉన్న 15 పద్యగద్యాల్లో క్లుప్తీకరించి చెప్పాడు.

## 15. ఖడ్గం పుట్టుక కథ:

ఈ కథ శాంతిపర్వంలోని ఆపద్ధర్మానుశాసన పర్వం అనే ఉపపర్వంలో 166వ అధ్యాయంలో 89 శ్లోకాల్లో ఉంది. ఖడ్గయుద్ధంలో నేర్పరి అయిన నకులుడు భీష్మునితో "లోకంలో ధనుస్సు శ్రేష్ఠమైన ఆయుధం అని అనుకుంటారు. కానీ నా ఉద్దేశ్యంలో ఖడ్గమే శ్రేష్ఠమైనది. ధనుస్సు, గద, శక్తి మొదలైన ఆయుధాలు ధరించిన వారిని ఖడ్గం ధరించిన వీరుడు బాధింప సమర్థుడవుతాడు. యుద్ధాల్లో ఏ ఆయుధం శ్రేష్ఠమైనది? అని నాకు సందేహం కలుగుతూ ఉంది. తాతా! ఖడ్గాన్ని ఎవరు ఏవిధంగా ఉత్పన్నం చేశారు? ఖడ్గ యుద్ధానికి ప్రథమాచార్యుడు ఎవరు? చెప్ప వలసిందిగా" కోరతాడు. ఈ ప్రశ్నలకు సమాధానంగా భీష్ముడు ఈ కథను ఇలా చెబుతాడు.

సృష్టి ప్రారంభంలో జగత్తు అంతా నీటితో నిండి ఉంటుంది. బ్రహ్మ మొదట ఉద్భవించి అగ్ని, సూర్యుడు, ఆకాశం, భూమి, చంద్రుడు, నక్షత్రాలు, గ్రహాలు అనేక మంది ఋషులు మొదలైన వారిని సృష్టిస్తాడు. వీరందరూ బ్రహ్మదేవుని ఆజ్ఞ ననుసరించి సనాతన ధర్మాన్ని రక్షిస్తూ ఉంటారు. ఆ తర్వాత రాక్షసులు ఉద్భవించి బ్రహ్మ శాసనాన్ని అతిక్రమించి ధర్మానికి హాని చేస్తారు. వీరు దండోపాయంతో సమస్త ప్రజలను పీడిస్తుంటారు. అలా వేల సంవత్సరాలు గడిచిన తర్వాత బ్రహ్మదేవుడు హిమాలయ పర్వత శిఖరం మీద ఒక యజ్ఞాన్ని మొదలు పెడతాడు. మహర్షులు, ఇతర కార్యకర్తలు శాస్త్రవిధి ననుసరించి యజ్ఞ కార్యాలు చేస్తుంటారు. అలాంటి దశలో యజ్ఞ మండపంలోని అగ్నిని వెదజల్లుతూ ఒక భయంకరమైన భూతం ఉద్భవించింది.

**"నీలోత్పల సవర్ణాభం తీక్ష్ణ దంష్ట్రం కృశోదరమ్**
**ప్రాంశుం సదుర్ధర్ష తరం తథైవ హ్యమితౌ జసమ్"**
**(శాంతి. 166 – 39వ శ్లోకం)**

ఆ భూతం నల్ల కలువల కాంతి లాంటి కాంతి కల్గి ఉంది. పదునైన కోరలు, సన్నటి నడుము కలిగిన ఆ భూతం చాలా పొడవైనది. గొప్ప తేజస్సుతో సమీపింప వీలు కానిది. ఆ భూతం పుట్టిన వెంటనే భూకంపం ఏర్పడింది. పెద్ద తరంగాలు, సుడులతో సముద్రం అల్లకల్లోల మయింది. ఆకాశం నుంచి ఉల్కలు రాలి పడ్డాయి. చెట్ల కొమ్మలు విరిగిపోయాయి. సమస్త ప్రాణులు గొప్ప భయంతో వ్యథ చెందాయి. ఆ భూతాన్ని చూపి బ్రహ్మ ఋషులు దేవతలతో ఈ భూతాన్ని నేనే ధ్యానించాను. ఇది అసి అనే పేరుగల ఆయుధం. దీన్ని రాక్షస సంహారానికి లోక రక్షణకు నేను ఆవిష్కరించాను అని చెబుతాడు.

**"తత స్తద్రూప ముత్సృజ్య బభౌ నిస్త్రింశ ఏవసః**
**విమల స్తీక్ష ధారశ్చ కాలాన్తక ఇవోద్యతః"**
**(శాంతి. 166 – 44 శ్లోకం)**

"ఆ తర్వాత భూతం తన రూపాన్ని వదలి ఖడ్గరూపంలో ప్రకాశిస్తుంది. దాని అంచు చాలా పదునుగా ఉంటుంది. మిలమిల మెరుస్తున్న ఆఖడ్గం యముని లాగా ఉంటుంది". అలాంటి ఖడ్గాన్ని బ్రహ్మ శివునికి ఇస్తాడు. శివుడు ఆ ఖడ్గాన్ని ధరించి, చతుర్భుజుడై యుద్ధ కాంక్షతో ఖడ్గాన్ని ఆకాశంలో గిరగిరా తిప్పుతాడు. భయంకర రూపం దాల్చిన శివుని చూసి రాక్షసులు రకరకాల ఆయుధాలు ధరించి అతని మీదికి యుద్ధానికి వస్తారు. శివుడు ఏమాత్రం వెనకడుగు వేయకుండా ఖడ్గంతో రాక్షసులను చంపుతూ, ఖండిస్తూ, చీలుస్తూ, గాయ పరుస్తూ, ముక్కలుగా నరకుతూ సంచరిస్తూ ఉంటాడు. శివుని ఖడ్గయుద్ధం ధాటికి రాక్షసులు తట్టుకోలేక తలా ఒక దిక్కుకు పారిపోతారు. గొప్ప యద్ధం జరగటం వల్ల అక్కడ రాక్షసుల రక్త మాంసాల బురదతో భూమి నిండిపోయి భయంకరంగా ఉంటుంది.

రాక్షస సంహారం చేసి ధర్మ సంస్థాపన చేసిన తర్వాత శివుడు రౌద్ర రూపాన్ని ఉపసంహరించి, మంగళకరమైన శివ రూపాన్ని దాలుస్తాడు. మహర్షులు, దేవగణాలు

శివుని అద్భుత విజయానికి సంతోషించి అతణ్ణి పూజిస్తారు. దానవ రక్తంతో తడిసిపోయి ధర్మాన్ని స్థాపించిన ఖడ్గాన్ని శివుడు విష్ణువుకు ఇస్తాడు. విష్ణువు మరీచికి, మరీచి మహర్షులకు, మహర్షులు ఇంద్రునికి, ఇంద్రుడు దిక్పాలురకు, వారు సూర్య పుత్రుడైన మనువుకు ఆ ఖడ్గాన్ని ఇస్తారు. ఇలా శివుని నుంచి ఆ ఖడ్గం మనువుకు చేరుతుంది. మనువు దాన్ని ప్రజా రక్షణ కోసం క్షుపునికి ఇస్తాడు. క్షుపుడు ఇక్ష్వాకువుకు, ఇక్ష్వాకువు పురూరవునికి, పురూరవుని నుంచి ఆయువు, నహుషుడు, యయాతి, పూరుడు ఆ ఖడ్గాన్ని పొందుతారు. పురూరవుని నుంచి అది అనేక రాజులను చేరి, చివరకు ద్రోణుడు, కృపుల ద్వారా పాండవులను చేరుతుంది. ఈ వృత్తాంతాన్ని భీష్ముడు నకులునికి చెప్పి ఖడ్గం అన్ని ఆయుధాల్లోకి శ్రేష్ఠమైనదని, యుద్ధ విశారధులైనవారు దాన్ని ఎల్లప్పుడు పూజించాలని చెబుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

పై కథ ఏ కొంచెం హేతుబద్ధంగా అలోచించినా అది కట్టుకథ అని స్పష్టంగా తెలుస్తుంది. బ్రహ్మదేవుడు విశ్వంలోని అనేక గ్రహాలను, ఋషులను, రాక్షసులను, మానవులను సృష్టించిన తర్వాత దానవులు ప్రజలను పీడిస్తూ ఉన్నప్పుడు కొన్ని వేల సంవత్సరాలు గడచిన తర్వాత యజ్ఞం ప్రారంభించినట్లు ఆ యజ్ఞంలో “అసి” అనే భూతం పుట్టి ఖడ్గ రూపాన్ని ధరించినట్లు అది ఒకరి నుంచి ఒకరికి పరంపరగా లభించినట్లుగా చెప్పబడింది. రాక్షసుల చేత పీడింప బడుతున్న వారిని బ్రహ్మ కొన్నివేల సంవత్సరాలు చూస్తూ ఊరుకున్నాడని చెప్పడం సమంజసమైనది కాదు. లోకంలో ధనస్సు, బాణాలు, గద, శూలం, ఈటె మొదలైన అనేక ఆయుధాల తోపాటు ఖడ్గాన్ని కూడా మానవులు తయారు చేసుకున్నారు. ఖడ్గం యజ్ఞంలో భూత రూపంలో ఆవిర్భవించిందని తర్వాత అది కత్తి రూపంగా రూపాంతరం చెందిందని, అది బ్రహ్మ నుంచి పరంపరగా పాండవులకు చేరిందని చెప్పడం ఖడ్గానికి గొప్ప తనాన్ని ఆపాదించడానికి చెప్పిన కల్పిత కథ అని స్పష్టంగా చెప్పవచ్చు. లోకంలో ఒకే ఖడ్గం ఎప్పుడూ ఉండదు. ఖడ్గవిద్యా నిపుణులందరూ కత్తులను ధరిస్తారు. అంటే లోకంలో కొన్ని లక్షల కత్తులను లక్షల యోధులు తయారు చేయించుకొని ఉపయోగిస్తూ ఉన్నారు. పై కథలో చెప్పినట్లుగా యజ్ఞంలో పుట్టిన ఖడ్గం బ్రహ్మ నుంచి శివునికి, శివుని నుంచి అనేక మంది చేతులు మారి చివరకు పాండవులను చేరిందని చెప్పడం ఏమాత్రం హేతుబద్ధం కాదు. ప్రారంభంలో మానవులు ఏ వస్తువునైనా ప్రాథమికమైనదిగా తయారు చేస్తారు. ఆ తర్వాత కాలం గడిచేకొద్దీ తాము సౌకర్యవంతంగా వాడు కోవడానికి వీలుగా ఆ వస్తువుకు అనేక మార్పులు చేర్పులు చేస్తూ ఉంటారు. ఖడ్గం విషయంలో కూడా ఇదే జరిగింది. కాబట్టి పై కథ కట్టుకథ అని స్పష్టంగా చెప్పవచ్చు. ఇందులో జానపద కట్టుకథాంశ ఉంది.

తిక్కన ఈ కథను శాంతిపర్వం తృతీయాశ్వాసంలోని 441వ వచనం నుంచి 450 పద్యం వరకూ ఉన్న 10 పద్యగద్యాల్లో క్లుప్తంగా వివరించాడు. తిక్కన ఈ కథలో ఎలాంటి మార్పులు చేయలేదు.

## 16. బ్రహ్మహత్యాపాతక విభాగం కథ:

ఈ కథ శాంతిపర్వంలోని మోక్షధర్మపర్వం అనే ఉపపర్వంలో 281, 282 అధ్యాయాల్లో 110 శ్లోకాల్లో వివరంగా ఉంది. ఈ కథను భీష్ముడు పాండవులకు చెబుతాడు. వృత్రుడు ధార్మికుడు, విష్ణుభక్తుడు, తత్త్వవేది. అలాంటి వృత్రుని ఇంద్రుడు ఎలా చంపాడు అని ధర్మరాజు భీష్ముని ప్రశ్నించగా భీష్ముడు ఈ కథను ఇలా చెబుతాడు.

వృత్రుడు 500 యోజనాల ఎత్తు, 300 యోజనాల లావు ఉన్నవాడు. మహాపర్వతంలాంటి అతని రూపాన్ని చూసి దేవతలు, ఇంద్రుడు భయపడతారు. వృత్రుడు దేవతల మీద వారి సైన్యం మీద రాళ్ళవాన కురిపిస్తాడు. దేవగణాలు బాణవర్షంతో రాళ్ళవానను తొలగిస్తారు. మహామాయావి అయిన వృత్రుడు తన మాయతో దేవేంద్రుని మోహింపజేస్తాడు. మోహంలో ఉన్న ఇంద్రుని వశిష్టుడు రథంతర సామగాన వాక్కులతో మేల్కొలుపుతాడు. బృహస్పతి, దేవర్షులు శంకరుని వద్దకు వెళ్ళి లోకహితం కోసం వృత్రాసురవధ జరిపించాలని ప్రార్థిస్తారు. అపుడు శంకరుని తేజస్సు రుద్ర జ్వరమై వృత్రుని ఆవరిస్తుంది. జ్వరం ఆవహించగానే వృత్రుని శరీరంలో వణుకు పుడుతుంది. తీవ్రమైన గగుర్పాటు కలుగుతుంది. అతని జ్ఞాపకశక్తి నశిస్తుంది. ఆ సమయంలో విష్ణువు ఇంద్రుని వజ్రాయుధంలో ప్రవేశించగా ఇంద్రుడు వజ్రాయుధాన్ని ప్రయోగించి వృత్రుని సంహరిస్తాడు. వృత్రుని శరీరం నుంచి భయంకరమైన బ్రహ్మ హత్య పాతకం వెలువడుతుంది. అది నల్లని కోరలతో నలుపు, పసుపు రంగులతో, విరబోసుకున్న జుట్టుతో, భయంకరమైన నేత్రాలతో మెడలో పుర్రెమాల ధరించి నెత్తురుతో తడిసిన నార బట్టలతో, వికృతంగా, భయంకరంగా ఉంటుంది. ఇలాంటి బ్రహ్మహత్యా పాతకం ఇంద్రుడు పట్టుకొని అతడి శరీరానికి అంటుకుపోతుంది. బ్రహ్మహత్యా భయంతో ఇంద్రుడు పారిపోయి కమల నాళంలోకి ప్రవేశించి చాలా సంవత్సరాలు అందులోనే దాక్కొని ఉంటాడు. బ్రహ్మహత్య కూడా ఇంద్రుని పట్టుకొని ఉంటుంది.

దానితో దేవేంద్రుడు తేజోహీనుడై బ్రహ్మ వద్దకు వెళ్ళి తనను పట్టుకున్న బ్రహ్మహత్యా పాతకం తొలగించ వలసిందిగా కోరతాడు. బ్రహ్మ బ్రహ్మహత్యా పాతకంతో "ఇంద్రుని విడిచిపెట్టు, నాకు సంతోషాన్ని కల్గించు, నీ కోరిక ఏమిటోచెప్పు చేస్తాను" అని అంటాడు. దానికి బ్రహ్మహత్య పాతకం "నాకు ఒక నివాసాన్ని ఏర్పరచాలి, లోక రక్షణ కోసం నీవు ఏర్పరిచిన ఈ నియమం ఒక కొత్త సంప్రదాయాన్ని కల్గిస్తుంది. కాబట్టి నాకొక నివాసాన్ని చూపించు" అని అంటుంది. బ్రహ్మ దానికి అంగీకరించి ఇంద్రుని అంటుకు పోయిన బ్రహ్మహత్యా పాతకాన్ని తొలగించి వెంటనే అగ్నిని తలచుకుంటాడు. అగ్ని బ్రహ్మవద్దకు వచ్చి తానేమి చేయాలో చెప్పమని బ్రహ్మను అడుగుతాడు. దానికి బ్రహ్మ "ఇంద్రుని బ్రహ్మహత్యా పాతకం నుంచి విమోచనం కల్గించడానికి బ్రహ్మహత్యను నాల్గు భాగాలుగా విభజిస్తున్నాను. నీవు నాల్గవ భాగం తీసుకో" అని అంటాడు. దానికి అగ్ని అంగీకరించి తన భాగానికి వచ్చిన బ్రహ్మహత్యా పాతకాన్ని వదిలించు కోవడానికి మార్గం

చెప్ప వలసిందిగా కోరతాడు. దానికి బ్రహ్మ

**"యస్త్వాం జ్వలంత మాసాద్య స్వయం వైమానవః క్వచిత్**
**బీజౌషధి రసై ర్వహ్నే న యక్ష్యతి తమోవృతః"**
**"త మేషా యాస్యతి క్షిప్రం తత్రై వచ నివత్స్యతి**
**బ్రహ్మవధ్యా హవ్యవాహ న్యేతు తే మానసో జ్వరః"**

**(శాంతి. 282 – 33, 34 శ్లోకాలు)**

"జ్వలించే నీలో ఎవరైనా తమోగుణంతో బీజాలు కానీ, ఓషధులు కానీ, ఫలరసాలు కానీ వేసి హోమం చేయకపోతే వెంటనే అతనిలోకి ఈ బ్రహ్మ హత్య ప్రవేశిస్తుంది" అని చెబుతాడు. ఆ మాటలు విని అగ్ని సంతోషిస్తాడు. వెంటనే బ్రహ్మహత్యలోని నాల్గవ భాగం అగ్నిలో ప్రవేశిస్తుంది. తర్వాత బ్రహ్మ వృక్షాలను, ఓషధులను, తృణాలను తన వద్దకు పిలిచి వారితో ఇంద్రునికి సంక్రమించిన బ్రహ్మహత్యా పాతకంలోని నాల్గవ భాగాన్ని తీసుకోమని చెబుతాడు. దానికి అవి బాధపడి "మాకు వచ్చే ఈ బ్రహ్మహత్య ఏవిధంగా అంతమవుతుంది. ఇప్పటికే మేము దైవోపహతులమై స్థావరాలుగా పుట్టి వేడినీ, చలినీ, గాలినీ భరిస్తూ ఉన్నాము. నీ ఆజ్ఞతో బ్రహ్మహత్యను కూడా భరిస్తాం.కానీ దీన్నుంచి మాకు విముక్తి ఎలా కల్గుతుంది" అని అడుగుతాయి. అపుడు బ్రహ్మ

**"పర్వకాలే తు సంప్రాప్తే యో వై ఛేదన భేదనమ్**
**కరిష్యతి నరో మోహాత్ త మేషానుగమిష్యతి"**

**(శాంతి. 282 – 41వ శ్లోకం)**

"పర్వ కాలాల్లో అజ్ఞానంతో మిమ్ములను ఛేదించే వారిని ఈ బ్రహ్మ హత్య చుట్టు కుంటుంది" అని చెబుతాడు. ఆ తర్వాత బ్రహ్మ అప్సరసలను పిలిచి ఇంద్రునికి సంక్రమించిన బ్రహ్మహత్యలోని నాల్గవ భాగాన్ని స్వీకరించమని చెబుతాడు. దానికి వారు అంగీకరించి తమకు సంక్రమించిన బ్రహ్మహత్య నుంచి విముక్తి ఎలా కల్గు తుందని కోరతారు. దానికి బ్రహ్మ

**"రజస్వలాలసు నారీషు యో వై మైథున మాచరేత్**
**తమేషా యాస్యతి క్షిప్రం వ్యేతు వో మానసో జ్వరః"**

**(శాంతి. 282 – 46వ శ్లోకం)**

"రజస్వల అయిన స్త్రీలతో సంగమించే వారిని బ్రహ్మహత్యా పాతకం పొందుతుంది" అని చెబుతాడు. ఆ తర్వాత బ్రహ్మ నీటిని పిలిచి వృత్ర సంహారం వల్ల ఇంద్రునికి సంక్రమించిన బ్రహ్మహత్యలో చివరి నాల్గవ భాగాన్ని స్వీకరించ వలసిందిగా చెబుతాడు. దానికి నీరు అంగీకరించి దాని నుంచి విముక్తి కలిగే ఉపాయం తెలుపవలసిందిగా కోరుతుంది. అపుడు బ్రహ్మ "నీటిని చులకన చేసి ఆ నీటిలో శ్లేష్మ, మల, మూత్రాలను విసర్జించిన వారికి బ్రహ్మహత్య పాతకం సంక్రమించి దాని నుంచి మీకు విముక్తి కల్గుతుంది" అని

చెబుతాడు. ఈ విధంగా బ్రహ్మ వృత్రాసుర వధ వలన ఇంద్రునికి సంక్రమించిన బ్రహ్మాహత్యా పాతకాన్ని నాల్గు భాగాలుగా చేసి నలుగురికి పంచి పెడతాడు. ఆ తర్వాత ఇంద్రుడు బ్రహ్మ అనుజ్ఞతో అశ్వమేధయాగం చేసి బ్రహ్మాహత్యా పాతకం నుంచి పరిశుద్ధుడౌతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

మన ప్రాచీన గ్రంథాల్లో బ్రహ్మాహత్యా పాతకం, గోహత్యా పాతకం మహా పాపాలుగా చెప్పబడ్డాయి. బ్రాహ్మణుని చంపడం వల్ల బ్రహ్మాహత్యా పాతకం, గోవును చంపడం వల్ల గోహత్యా పాతకం మానవులను పట్టుకొని పీడిస్తాయని ప్రాచీన గ్రంథాల్లో బ్రాహ్మణులు రాశారు. భారతదేశం ప్రధానంగా వ్యావసాయిక దేశం. వ్యవసాయానికి గోవు అనేక రకాలుగా ఉపయోగపడుతుండడం వల్ల దాని మీద కృతజ్ఞతతో మన పూర్వులు దాన్ని గోమాతగా పూజించి దానికి అపకారం చేయగూడదనే ఉద్దేశంతో గోహత్యను మహాపాతకంగా చెప్పారు. ప్రాచీన గ్రంథాలను రాసిన వారందరూ బ్రాహ్మణులే కాబట్టి తమకు ఎవరూ అపకారం చేయకుండా ప్రజలను భయ పెట్టడానికి బ్రాహ్మణహత్య మహాపాతకంగా బ్రాహ్మణులు చెప్పుకున్నారు. అంతేగాకుండా తెలిసి గానీ తెలియక గానీ బ్రాహ్మణుల సొమ్ము పూచిక పుల్ల గానీ చివరకు బ్రాహ్మణుల ధూళి గానీ గ్రహిస్తే మహాపాపంగా కొన్ని గ్రంథాల్లో రాశారు. ఇవన్నీ బ్రాహ్మణులు స్వార్థబుద్ధితో కల్పించిన కథలు.

భారతంలోని పై కథలో వృత్రాసురుని చంపడం వల్ల ఇంద్రునికి బ్రహ్మ హత్యా పాతకం చుట్టుకుందని చెప్పబడింది. వృత్రుడు అసురుడు అంటే రాక్షసుడు. ఇతడు బలం కోసం అరవై వేల సంవత్సరాలు తపస్సు చేసి గొప్పబలాన్ని పొందినట్లుగా, వృత్రుడు 500 యోజనాలు ఎత్తు 300 యోజనాల లావు ఉన్నట్లుగా ఈ కథలో చెప్పబడింది. మహాపర్వతం లాంటి ఇంత భారీ శరీరం గల వృత్రుని చూసి ఇంద్రుడు భయంతో వణికిపోతాడు. విష్ణువు, ఈశ్వరుడు, ఇంద్రునికి సాయంగా వస్తారు. ఈశ్వరుని తేజస్సు జ్వరం రూపంలో వృత్రునిలో ప్రవేశిస్తుంది. అలా ప్రవేశించినపుడు అతని శరీరంలో వణకు పుట్టి శరీరం వివర్ణమై నిస్తేజమైపోతుంది. ఆ దశలో విష్ణువు ఇంద్రుని వజ్రాయుధంలో ప్రవేశిస్తాడు. అపుడు ఇంద్రుడు వజ్రాయుధాన్ని వృత్రుని మీద ప్రయోగించి చంపుతాడు.

ఈ కథను పరిశీలిస్తే వృత్రుని వధకు ప్రధాన కారకులు ఈశ్వరుడు, విష్ణువు అని తెలుస్తుంది. ఇంద్రుడు కేవలం ఆయుధాన్ని ప్రయోగించినవాడు మాత్రమే. విష్ణువు, ఈశ్వరుల సహాయం లేకుండా ఇంద్రుడు వృత్రాసురుని మీద వజ్రాయుధాన్ని ప్రయోగించి నప్పటికీ అది అతణ్ణి చంపి ఉండేది కాదు. అందువల్ల ఈ కథలో వృత్రాసురుని వధకు ప్రధానకారకులు ఈశ్వరుడు, విష్ణువు. బ్రహ్మ హత్యాపాతకం వృత్రుని శరీరం నుంచి బయటకు వచ్చి వృత్రుని వధకు ప్రధాన కారకులైన విష్ణువు ఈశ్వరులను వదలివేసి దేవేంద్రుని పట్టుకొని పీడించిందని చెప్పడం సమంసజంగా లేదు. అసలు హేతుబద్ధంగా చూస్తే వృత్రాసురుని వధ వల్ల బ్రహ్మాహత్యా పాతకం వచ్చే అవకాశమే లేదు. ఎందుకంటే

వృత్రుడు బ్రాహ్మణుడు కాడు. అతడు యజ్ఞగుండం నుంచి పుట్టిన రాక్షసుడు. ఇలాంటి వారిని చంపితే బ్రహ్మహత్యా పాతకం వచ్చే అవకాశమే లేదు. అందువల్ల ఈ కథ సహేతకమైనది, సమంజస మైనది కాదు.

ఒకవేళ వృత్రుని చంపడం వల్ల బ్రహ్మహత్యా పాతకం ఇంద్రునికి చుట్టు కుందనుకుందాం. పాప పుణ్యాలు రెండూ ఆ కర్మలు చేసిన వారే అనుభవించాలి. అంటే బ్రహ్మహత్యా పాతకాన్ని దేవేంద్రుడు అనుభవించాలి. బ్రహ్మ ఆ పాతకం నుంచి దేవేంద్రునికి విముక్తి కల్గించి ఏ పాపం చేయని నలుగురికి ఆ పాతకాన్ని పంచి ఇచ్చాడని చెప్పడం అన్యాయం, దుర్మార్గం. ఈ కారణం చేత కూడా ఈ కథ సమంజసంగా లేదు.

అయితే లోకంలో చెట్లను కొట్టడం, నీటిలో మలమూత్ర విసర్జన చేయడం, రజస్వలతో సంగమం అనే మూడు మహా పాపాలుగా పరిగణింప బడుతున్నాయి. కొన్ని ప్రాంతాల్లో చెట్టును నరికినవాడు, అతని కుటుంబం నాశనమౌతుందనే నమ్మకం గట్టిగా ఉంది. అందులోనూ పర్వ దినాల్లో చెట్టును కొట్టడం ఘోరమైన పాపంగా పరిగణించబడుతూ వుంది. అందువల్లనే ఈ కథలో బ్రహ్మహత్యా పాతకం లోని నాల్గవ భాగం పర్వదినాల్లో చెట్లను, ఔషధ మొక్కలను, తృణాలను ఖండించిన వారికి పాపం చుట్టుకుంటుందని చెప్ప బడింది. ఈ కథలో బ్రహ్మ హత్యా పాతకంలోని మరొక నాల్గవ వంతు భాగాన్ని అప్సరసలకు ఇచ్చాడు. అప్సరసలు దేవకాంతలు. వారికి సంక్రమించిన బ్రహ్మహత్యా పాతకం రజస్వలా సందర్భంలో స్త్రీలను సంగమించిన వారికి సంక్రమిస్తుందని ఈ కథలో చెప్పబడింది. అప్సరసలకు మానవ స్త్రీలకు ఏ సంబంధం లేదు. అలాంటప్పుడు అప్సరసలకు చుట్టుకున్న బ్రహ్మహత్యా పాతకం వారిని వదలి ఎలా పోతుంది. లోకంలో రసజ్వల అయినస్త్రీలను సంగమిస్తే పాపం వస్తుందని ప్రజలు నమ్ముతున్నారు. కాబట్టి అప్సరసలకు గాకుండా స్త్రీలకు వరం ఇచ్చినట్లుగా చెప్పి ఉంటే ఉచితంగా ఉండేది. తిక్కన తన భారతంలో బ్రహ్మ అప్సరసలకు బదులుగా స్త్రీలకు ఇచ్చినట్లుగా రాశాడు.

నీటిలో శ్లేష్మం, మల, మూత్ర విసర్జన మొదలైనవి చేయడం మహాపాపంగా లోకంలో ఉంది. దాన్ని గమనించి ఈ కథా రచయిత ఇంద్రునికి సంక్రమించిన ఒక వంతు బ్రహ్మహత్యా పాతకం నీటిలో విసర్జన చేసిన వారికి చెందుతుందని రాశాడు. నాల్గు భాగాల్లో మొదటి భాగం బ్రహ్మ అగ్నికి ఇచ్చినట్లుగా ఈ కథలో చెప్పబడింది. యజ్ఞ యాగాల్లో విత్తనాలు, ఓషధులు, ఫలరసాలు వేసి హొూమం చేయని వారికి అగ్నికి భాగంగా వచ్చిన బ్రహ్మహత్యా పాతకం కల్గుతుందని కవి కల్పించి రాశాడు. యజ్ఞ యాగాలు రాజులు, మంత్రులు, ధనవంతులు మాత్రమే చేయగలరు. సామాన్య ప్రజలు చేయలేరు. అందువల్ల యజ్ఞ యాగాల్లో బీజాలు ఓషధులు మొదలైనవి వేసి హోమం చేయని వారికి పాపం వస్తుందనే విషయం లోకంలో ప్రచారంలో లేదు. ఈ విషయం వేదాలు ఉపనిషత్తులు మొదలైన గ్రంథాల్లో ఉండవచ్చు. అది తెలుసుకున్న పండిత కవి ఈ విధమైన కల్పన చేశాడు.

పైన చెప్పిన అంశాలను బట్టి ఈ కథ లోకంలో ప్రచారంలో ఉన్న నమ్మకాలను అనుసరించి కల్పించినట్లుగా స్పష్టమౌతూ ఉంది. ఈ కారణం చేత ఈ కథ కట్టుకథ అవుతూ ఉంది. ఇది జానపద కట్టుకథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ.

ఇదే కథ కొద్ది మార్పులతో భారతం ఉద్యోగపర్వంలో తొమ్మిదవ అధ్యాయంనుంచి పద్దెనిమిదవ అధ్యాయంవరకు ఉన్న పది అధ్యాయాలలో 324శ్లోకాలలో వివరంగా ఉంది. ఈ కథను శల్యుడు ధర్మరాజుకు చెబుతాడు. కురుక్షేత్ర యుద్ధంలో పాండవుల పక్షాన యుద్ధం చేయడానికి తన మద్ర దేశం నుంచి ససైన్యంగా బయలుదేరిన శల్యునికి దారి మధ్యలో అనేక సౌకర్యాలను దుర్యోధనుడు కల్పించి శల్యుడు తన పక్షాన యుద్ధం చేసేటట్లుగా చేసుకుంటాడు. ఆ తర్వాత శల్యుడు పాండవుల వద్దకు వచ్చి వారు పడిన కష్టాలను గురించి ఓదార్చుతూ సాక్షాత్తు దేవేంద్రుడు భార్యతో సహా దుఃఖాన్ని అనుభవించాడు అని చెబుతాడు. అప్పుడు ధర్మరాజు ఇంద్రుడు భార్యతో సహా ఎందుకు దుఃఖాన్ని పొందాడు? అని అగుడుతాడు. దానికి శల్యుడు ఈ కథను ఇలా చెబుతాడు.

దేవశ్రేష్ఠుడు, మహాతపస్వి అయిన త్వష్ట ప్రజాపతి అయ్యాడు. ఇంద్రుని మీద వున్న ద్రోహబుద్ధితో ఇతడు మూడు తలలు గల విశ్వరూపుడు అనే కొడుకును సృష్టిస్తాడు. ఈ విశ్వరూపుడు ఇంద్ర పదవిని కోరి తపస్సు చేస్తుంటాడు. దీనితో ఇంద్రుడు భయపడి అతని తపస్సు భగ్నం చేయడానికి అప్సరసలను పంపిస్తాడు. అప్సరసల ప్రయత్నం ఫలించదు. దీనితో ఇంద్రుడు శత్రుశేషం వుంచగూడదని భావించి విశ్వరూపుని మీదకి వజ్రాయుధాన్ని ప్రయోగించి చంపుతాడు. విశ్వరూపుడు చనిపోయినప్పటికీ తేజస్సుతో సజీవంగానే కన్పిస్తుంటాడు. అతన్ని చూసి ఇంద్రుడు భయపడతాడు. అదే సమయంలోనే తక్షుడు అనే విశ్వకర్మ గండ్రగొడ్డలి భుజం మీద పెట్టుకొని అక్కడకు వస్తాడు. మనుషులు చేసే హింసా ప్రధానమైన కామయజ్ఞాల్లో పశువు తలను భాగంగా ఇస్తానని ఆశ చూపి ఇంద్రుడు విశ్వకర్మ చేత విశ్వరూపుని మూడు తలలను నరికిస్తాడు.

తన కుమారుని ఇంద్రుడు చంపినట్లుగా త్వష్ట తెలుసుకొని కోపంతో అగ్నిలో హోమం చేసి వృత్రాసురుని సృష్టించి ఇంద్రుని చంపమని అతన్ని పంపిస్తాడు. వృత్రునికి, ఇంద్రునికి గొప్ప యుద్ధం జరుగుతుంది. వృత్రుడు ఇంద్రుని పట్టుకొని మింగేస్తాడు. దేవతలందరు వృత్రాసురునికి ఆవులింతను కల్పిస్తారు. వృత్రుడు ఆవులించడానికి నోరు తెరవగానే ఇంద్రుడు తన అవయవాల పరిణామాన్ని తగ్గించుకొని వృత్రుని నోటి నుంచి బయటకు వస్తాడు. ఆ తర్వాత మళ్ళీ యుద్ధం జరుగుతుంది. ఆ యుద్ధంలో ఇంద్రుడు ఓడిపోయి యుద్ధం నుంచి వెనుదిరిగి దేవతలతో కలిసి విష్ణువును శరణు కోరతాడు. ప్రస్తుతానికి ఇంద్రుడు వృత్రునితో సంధి చేసుకోవాలని, సమయం చూసి తాను అదృశ్య రూపంలో వజ్రాయుధం లోకి ప్రవేశిస్తానని అప్పుడు ఇంద్రుడు వజ్రాయుధాన్ని ప్రయోగించి వృత్రుని చంపాలని విష్ణువు దేవతలతో చెబుతాడు. దేవతలు, ఋషులు వృత్రుని వద్దకు

వెళ్ళి ఇంద్ర వృత్రాసుర యుద్ధం వల్ల ప్రజలు బాధపడుతున్నారని అందువల్ల ఇంద్రునితో స్నేహం చేయమని వృత్రునితో చెబుతారు. ఎండిన, తడిసిన ఏ వస్తువుతో గానీ, శస్త్రాస్త్రాలతో గానీ, రాత్రి గానీ, పగలు గానీ దేవతలు తనను చంపగూడదని అలా అయితేనే ఇంద్రునితో సంధికి అంగీకరిస్తానని వృత్రుడు చెబుతాడు. దానికి వారు అంగీకరిస్తారు. సంధి ప్రకారం ఇంద్రుడు వృత్రునితో కలిసి వున్నప్పటికీ అతన్ని చంపడానికి అవకాశం కోసం ఇంద్రుడు ఆలోచిస్తూ వుంటాడు. ఒకనాడు వృత్రుడు సంధ్యా సమయంలో సముద్రం ఒడ్డున వుంటాడు. అక్కడ పెద్ద కొండలాగా నురగ వుంటుంది. అది పగలు కాదు, రాత్రి కాదు, నురగ తడిది కాదు, పొడిది కాదు, ఆయుధమూ కాదు. వృత్రుని చంపడానికి అదే తగిన సమయంగా ఇంద్రుడు భావించి విష్ణువును తలచుకొని వజ్రాయుధంతో కూడిన నురగును వృత్రుని మీదకి విసురుతాడు. విష్ణువు దానిలో ప్రవేశించి వృత్రున్ని చంపేస్తాడు. వృత్రుడు చనిపోయినందుకు దేవేంద్రుడు, దేవతలు, ఋషులు అందరూ చాలా సంతోషిస్తారు. అయితే ఇంద్రుడు అసత్య దోషంతో చాలా కుంగిపోయి లోకాల చివరికి వెళ్ళి బురద పాము లాగా నీటిలో దాక్కుంటాడు. ఇంద్రుడు కనిపించకుండా పోవడంతో అనావృష్టి ఏర్పడి ప్రాణులన్నీ సంక్షోభంలో పడతాయి. అప్పుడు దేవతలు, ఋషులు ఆలోచించి తన దృష్టిలో పడిన అందరి తేజస్సును వశం చేసుకొనే వరాన్ని నహుషునికి ఇచ్చి అతన్ని ఇంద్ర పదవిలో నియమిస్తారు.

నహుషుడు కొంతకాలం ధర్మబద్ధంగా పరిపాలించిన తర్వాత స్వర్గసౌఖ్యాలను మరిగి దేవేంద్రుని భార్య అయిన శచీదేవిని కోరతాడు. శచీదేవి పతివ్రత కావడం చేత నహుషుని కోరికను అంగీకరించకుండా బృహస్పతిని శరణు వేడుతుంది. బృహస్పతి ఆమెకు శరణు యిచ్చి తొందరలోనే దేవేంద్రుడు తిరిగి వస్తాడని, ఈలోగా ఆమె నహుషుని కలిసి కొంతకాలం గడువు కోరమంటాడు. శచీదేవి నహుషుని కలిసి కొంతకాలం గడువు తీసుకుంటుంది. దేవతలు విష్ణువు సలహాను అనుసరించి ఇంద్రుని దగ్గరకు వెళ్ళి అతనితో అశ్వమేధయాగం చేయించి విష్ణువును పూజింపజేసి ఇంద్రుని పట్టుకున్న బ్రహ్మహత్యా దోషాన్ని తొలిగిస్తారు. ఇంద్రుడు చెట్లు, నదులు, పర్వతాలు, భూమి, స్త్రీలకు బ్రహ్మహత్యా దోషాన్ని పంచి యిచ్చి పాపరహితుడై నిశ్చింతతో మనస్సు చిక్కపరుచుకొని తన పదవిని పొందడానికి స్వర్గానికి వస్తాడు. అక్కడ వర ప్రభావంతో విర్రవీగుతున్న నహుషుని చూసి భయపడి ఇంద్రుడు అక్కడ నుంచి వెళ్ళిపోయి దాక్కొని అవకాశం కోసం ఎదురు చూస్తూ వుంటాడు. తన భర్త కనిపించకుండా పోయినందుకు శచీదేవి చాలా దుఃఖించి ఉపశ్రుతి అనే పేరు గల రాత్రిదేవిని ఉపాసిస్తుంది. ఉపశ్రుతి ప్రత్యక్షమై శచీదేవిని ఇంద్రుడు దాక్కున్న చోటుకి తీసుకొని వెళ్తుంది. శచీదేవి భర్తను కలుసుకొని స్వర్గానికి వచ్చి నహుషుని బారి నుంచి తనను రక్షింపుమని ఇంద్రుని కోరుతుంది. దానికి ఇంద్రుడు ఋషులు హవ్య కవ్యాలతో నహుషుని బలవంతుని చేసారని అతడు బలహీనుడయితేనే తాను అతని నుంచి ఇంద్ర పదవిని పొందగలనని, అందుకు శచీదేవి నహుషుని వద్దకు వెళ్ళి సప్తర్షుల వాహనం

మీద తన వద్దకు వస్తే తాను అతని వశమవుతానని చెప్పాలని చెబుతాడు. శచీదేవి నహుషుని వద్దకు వెళ్ళి అతన్ని ప్రశంసించి సప్తర్షులు మోస్తున్న పల్లకిలో తన వద్దకు వస్తే అతని కోరిక తీరుస్తానని చెబుతుంది. నహుషుడు దానికి అంగీకరించి సప్తర్షులను ఆజ్ఞాపించి వారిని తన వాహకులుగా చేసుకొని శచీదేవి వద్దకు వస్తూ అగస్త్యుని కాలితో తంతాడు. దానితో అతని తేజస్సు, బలం హరించి పోతాయి. అప్పుడు అగస్త్యుడు పదివేల సంవత్సరాలు భూమి మీద పాము రూపంలో పడి వుండమని నహుషుని శపిస్తాడు. వెంటనే నహుషుడు పెద్ద పాముగా మారిపోయి భూమి మీద పడతాడు. దేవేంద్రుడు స్వర్గానికి వచ్చి శచీదేవితో కలిసి స్వర్గాన్ని పాలిస్తాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథలో భార్య శచీదేవితో పాటు ఇంద్రుడు పడిన కష్టాలు ప్రధానంగా చెప్పబడ్డాయి. ఈ కష్టాలకు కారణం ఇంద్రుడు విశ్వరూపుని, వృత్రుని చంపడం. ఈ కథలో ఇంద్రుడు విశ్వరూపుని చంపడానికి ఉచితమైన కారణం చెప్పబడింది. విశ్వరూపుడు ఇంద్ర పదవిని కోరి తపస్సు చేయడమే అందుకు కారణం. తన పదవిని కోరి ఎవరు తపస్సు చేసినా ఇంద్రుడు వారి తపస్సును భగ్నం చేయడానికి దేవవేశ్యలైన అప్సరసలను పంపిస్తుంటాడు. ఈ కథలో కూడా ఇంద్రుడు విశ్వరూపుని తపస్సును భంగం చేయడానికి అప్సరసలను పంపించాడు. వారు తమ శరీర అందాలను చూపించి, శృంగార భావాలతో విశ్వరూపుని ఆకర్షించే ప్రయత్నం చేసారు. కానీ విశ్వరూపుడు వారి వైపు కన్నెత్తి కూడా చూడలేదు. దీనితో ఇంద్రుడు అతన్ని చంపి, శత్రుశేషం లేకుండా చేసుకున్నందుకు సంతోషిస్తాడు. ఈ కథలో విశ్వరూపుని చంపడం వల్ల ఇంద్రునికి ఎలాంటి బ్రహ్మహత్యా పాపం రాలేదు. ఆ తర్వాత ఇంద్రుడు వృత్రాసురుని చంపిన తర్వాత అసత్య ద్వేషంతో కుంగి పోయాడు.

**"సో న్త మాశ్రిత్య లోకానాం నష్ట సంజ్ఞో విచేతనః**
**న ప్రజ్ఞాయత దేవేంద్ర స్త్వభి భూతః స్వకల్మషైః "**
**(ఉద్యోగ –10 వ అధ్యా. 45 వ శ్లోకం)**

"ఇంద్రుడు లోకాల చివరకు వెళ్ళి స్పృహ, కదలిక కోల్పోయాడు. తన పాపాలతో కించ పడిన అతను ఎక్కడున్నాడో ఎవరికీ తెలియదు". ఈ శ్లోకాన్ని పరిశీలిస్తే బ్రహ్మహత్యా దోషం ఇంద్రుని పట్టుకోలేదని స్పష్టమవుతుంది. ఇంద్రుడు వృత్రునితో శాశ్వతమైన సంధి చేసుకొని అతని మిత్రునిగా నటిస్తూ అతన్ని చంపాడు. ఇది పాపం. శత్రువును శత్రువుగా చంపడం పాపం కాదు. కానీ శత్రువుతో సంధి చేసుకొని మిత్రునిగా నటిస్తూ అతన్ని నమ్మించి అవకాశం చూసుకొని చంపడం చాలా పాపం. ఇది అసత్య దోషం. ఈ దోషంతో ఇంద్రుడు మనసులో కుంగిపోయి ఎవరికీ ముఖం చూపించలేక లోకాల చివరకు వెళ్ళి స్పృహ, చైతన్యం కోల్పోయాడు. ఆ తర్వాత స్పృహ వచ్చినప్పటికీ బురద పాము లాగా నీటిలో దాక్కున్నాడు. అతడు ఎక్కడ ఉన్నది ఎవరికి తెలియదు.

ఇంద్ర పదవి ఖాళీ కావడంతో దేవతలు, ఋషులు కలిసి మానవుడు, క్షత్రియుడు, రాజు అయిన నహుషుని తమ తపోబలంతో బలవంతుని చేసి, వరాలను ఇచ్చి ఇంద్ర పదవి మీద కూర్చోబెడతారు. దేవేంద్ర పదవి వల్ల వచ్చిన స్వర్గసుఖాలను మరిగిన నహుషుడు గొప్ప అందగత్తె అయిన శచీదేవిని కోరడంతో అతన్ని ఆ పదవి నుంచి దింపవలసి వచ్చింది. సింహాసనం మీద కూర్చోబెట్టడం తేలిక కావచ్చు గానీ, దించడం అంత తేలిక కాదు. అందుకోసం దేవతలతోపాటు బృహస్పతి, దేవేంద్రుడు, శచీదేవి కష్టపడి ఒక ప్రణాళిక ప్రకారం వ్యవహరించి నహుషుని అగస్త్యుని శాపానికి గురి చేయించి అతడు పాము రూపంలో భూమి మీద పడిపోయేలాగా చేసి మళ్ళీ ఇంద్రుని ఆ పదవిలో కూర్చో బెడతారు. ఈ విధంగా ఇంద్రుడు అతని భార్య కష్టాల నుంచి విముక్తులయ్యారు. ఈ కథలో నమ్మించి మోసం చెయ్యడం అస్యత దోషంగా చెప్పబడింది. ఈ కథలో ఇంద్రుడు అశ్వమేధ యాగం చేసిన తర్వాత –

**"విభాజ్య బ్రహ్మహత్యాంతు వృక్షేషు చ నదీషు చ**
**పర్వతేషు పృథివ్యాంచ స్త్రీషు చైవ యుధిష్ఠిర"**
**(ఉద్యో. 13 వ అధ్యా. 19 వ శ్లోకం)**

బ్రహ్మహత్యా పాపాన్ని చెట్లు, నదులు, పర్వతాలు, భూమి, స్త్రీలకు పంచి ఇచ్చినట్లు చెప్పబడింది. ఈ శ్లోకం ప్రక్షిప్తం. దీన్ని ఈ కథను రాసిన కవి రాయలేదు. ఎందుకంటే ఈ కథలో ఇంద్రుడు విశ్వరూపుని చంపినప్పుడు కానీ, వృత్రాసురుని చంపినప్పుడు కానీ బ్రహ్మహత్యా పాతకం అతన్ని పట్టుకున్నట్లుగా చెప్పలేదు. ఇంద్రుడు వృత్రుని చంపిన తర్వాత అసత్య దోషంతో కుంగిపోయినట్లుగా చెప్పబడింది. అంటే ఇంద్రుడు ఒక రకంగా మానసిక రోగానికి గురి అయ్యాడని చెప్పవచ్చు. దేవతలు, ఋషులు అతని చేత అశ్వమేధ యాగం చేయించి, విష్ణువును పూజింప జేసి అతనికి మానసిక స్వస్థత కలగ జేసారు. దానితో ఇంద్రుడు ధైర్యాన్ని కూడగట్టుకొని తిరిగి తన ఇంద్ర పదవిని పొందాడు.

ఈ కథ సంస్కృత రామాయణంలోను, భాగవతంలోను వుంది. ముందు రామాయణంలోని కథను పరిశీలించుదాం. ఈ కథ సంస్కృత రామాయణంలో బాలకాండ 24వ సర్గలో 18వ శ్లోకం నుంచి 23వ శ్లోకం వరకు వున్న 5 శ్లోకాల్లో క్లుప్తంగా, కిష్కింధకాండ 24వ సర్గ 14వ శ్లోకంలో సూచనాప్రాయంగా, ఉత్తరకాండ 84, 85, 86 సర్గల్లో 61 శ్లోకాల్లో వివరంగా వుంది. మొదట ఉత్తర కాండలో వివరంగా వున్న కథను పరిశీలించి ఆ తర్వాత మిగిలిన రెండింటిని గురించి తెలుసుకుందాం. ఉత్తరకాండలో ఇంద్రుని బ్రహ్మహత్యాపాతక విభాగం కథను లక్ష్మణుడు రామునికి చెబుతాడు. అశ్వమేధయాగం చాలా పవిత్రమైనదని, మహిమ కలదని, వృత్రాసుర సంహారం వల్ల తనకు సంక్రమించిన బ్రహ్మహత్యా పాతకాన్ని ఇంద్రుడు అశ్వమేధయాగం చేసి పోగొట్టుకున్నాడని చెబుతూ లక్ష్మణుడు ఈ కథను రామునికి ఇలా చెబుతాడు.

దేవతలు, రాక్షసులు స్నేహంగా వుంటున్న పూర్వకాలంలో వృత్రుడు అనే రాక్షస రాజు వుండేవాడు. 300 యోజనాల ఎత్తు, 100 యోజనాల లావు వున్న వృత్రుడు కృతజ్ఞుడు, బుద్ధిశాలి అయి వుండి లోకాల ప్రజలను ధర్మబద్ధంగా పాలించేవాడు. కొంత కాలం తర్వాత ఇతను రాజ్యాన్ని తన జ్యేష్ఠకుమారుడైన మధురునికి అప్పగించి అడవికి వెళ్ళి ఉగ్రతపస్సు చేస్తుంటాడు. ఇతని తపస్సు చూసి ఇంద్రుడు భయపడి దేవతలతో కలిసి విష్ణువు వద్దకు వెళ్ళి అతనితో "మహాబాహూ తపస్సు చేస్తున్న వృత్రుడు అన్ని లోకాలను జయించినవాడు. ధర్మాత్ముడైన అతను చాలా బలవంతుడు. నేను అతణ్ణి శాసించలేను. అతడు ఇంకా తపస్సు చేస్తే ఈ లోకాలన్నీ అవి వున్నంత వరకు అతని అధీనంలోనే వుంటాయి. అతని మీద నీకు స్నేహం వుండటం వల్లనే అతడు లోకాలకు ప్రభువు అయ్యాడు. దేవతలు అందరు అతని సంహారం కోసం ఎదురుచూస్తున్నారు. కాబట్టి వృత్రాసుర సంహారం చేసి వారికి సహాయం చేయవలసినది" అని ప్రార్థిస్తాడు. దానికి విష్ణువు "వృత్రాసురుని మీద స్నేహంచేత నేను అతణ్ణి చంపలేను. ఇంద్రుడే అతణ్ణి చంపే ఉపాయాన్ని చెబుతాను. నేను నా స్వరూపాన్ని మూడుగా విభజించి ఒక భాగాన్ని ఇంద్రునిలో, రెండవ భాగాన్ని వజ్రాయుధంలో, మూడవ భాగాన్ని భూమిలో ప్రవేశపెడతాను. అప్పుడు ఇంద్రుడు వృత్రున్ని చంపుతాడు" అని చెబుతాడు. అందుకు దేవతలు సంతోషించి దేవేంద్రునితో కలిసి తపస్సు చేసుకుంటున్న వృత్రున్ని దగ్గరకు వెళతారు. తపస్సు చేస్తున్న వృత్రుని తేజస్సును, అతని స్వరూపాన్ని చూసి దేవతలు భయపడతారు. అప్పుడు దేవేంద్రుడు వజ్రాయుధాన్ని ప్రయోగించి వృత్రున్ని శిరస్సు ఖండిస్తాడు.

**"కాలాగ్నినేవ ఘోరేణ దీప్తేనేవ మహార్చిషా**
**పతతా వృత్రశిరసా జగత్రాా సముపాగమత్"**
**"అసంభావ్యం వధం తస్య వృత్రస్య విబుధాధిపః**
**చిన్తయానో జగమాశు లోకస్తాన్యం మహాయశాః"**

**(ఉత్తరకాండ - 85వ సర్గ - 14,15 శ్లోకాలు)**

"భయంకరమైన కాలాగ్ని లాగా, మండుతున్న గొప్ప అగ్నిజ్వాల లాగా వృత్రుని శిరస్సు కింద పడుతూ వుండగా జగత్తు మొత్తం భయపడింది. దేవేంద్రుడు వృత్రాసురుడు చనిపోవడం ఉహింప శక్యం కానిదని భావించి వెంటనే లోకాల చివరి ప్రదేశానికి పారిపోవడం ప్రారంభించాడు". అతడు పారిపోతూ వుంటే బ్రహ్మహత్య అతణ్ణి వెంబడించి అతని శరీరంలోకి ప్రవేశిస్తుంది. అతడు స్పృహ కోల్పోతాడు. అప్పుడు దేవతలందరు విష్ణువు వద్దకు వెళ్ళి బ్రహ్మహత్యాపాతకం నుంచి ఇంద్రుని విముక్తి చేయవలసిందిగా ప్రార్థిస్తారు. దానికి విష్ణువు పవిత్రమైన అశ్వమేధయాగం చేసి తనను పూజిస్తే ఇంద్రుడు బ్రహ్మహత్యాపాతకం నుంచి విముక్తుడు అవుతాడని చెబుతాడు. అప్పుడు దేవతలందరు ఋషులతో, ఉపాధ్యాయులతో కలిసి భయంతో మోహితుడై వున్న ఇంద్రుని వద్దకు వెళ్ళి

అతణ్ణి ముందు వుంచుకొని అశ్వమేధ యాగం చేస్తారు. యజ్ఞం పూర్తి అయిన తర్వాత బ్రహ్మహత్య ఇంద్రుని శరీరం నుంచి బయటకు వచ్చి "నాకు ఎక్కడ స్థానం కల్పిస్తారో చెప్పండి" అని దేవతలను ప్రశ్నిస్తుంది. దానికి దేవతలు బ్రహ్మహత్యతో నిన్ను నీవే నాలుగు విభాగాలుగా విభజించుకో అని చెబుతారు. బ్రహ్మహత్య తనను తాను నాలుగు భాగాలుగా విభజించుకొని ఒక భాగం వర్షాకాలం నాలుగు మాసాలు నదులలో పాపాత్ముల దర్పాన్ని తొలగిస్తూ స్వేచ్ఛగా సంచరిస్తూ వుంటానని, రెండువ భాగం భూమిలోని చవిటి నేలలో నివసిస్తానని, మూడవ భాగం యవ్వనవతులు, దర్పంతో వున్న స్త్రీలలో వారి దర్పాన్ని తొలగిస్తూ మూడు రోజులు వుంటానని, నాలుగవ భాగం నిరపరాధులైన బ్రాహ్మణులను వంచన చేత చంపేవారిని ఆశ్రయిస్తానని చెబుతుంది. దానికి దేవతలు అంగీకరించి బ్రహ్మహత్యాపాతకానికి ఏది ఇష్టమైతే అది చేయమని చెబుతారు. దీనితో ఇంద్రుడు బ్రహ్మహత్యాపాతకం నుంచి విముక్తుడై ఎప్పటిలాగా బలవంతుడౌతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథను హేతుబద్ధంగా పరిశీలించుదాం. ఈ కథ అశ్వమేధయాగం మహాత్మ్యాన్ని వివరించడానికి చెప్పబడింది. ఈ కథలో ఇంద్రుడు వృత్రాసురుని చంపడం వల్ల బ్రహ్మహత్యాపాతకం అతన్ని పట్టుకొని పీడించింది. నిజానికి వృత్రాసురుని మరణానికి దేవేంద్రుడు కారకుడు కాదు. అతని మరణానికి ప్రధాన కారకుడు విష్ణువు. విష్ణువు సహాయం లేకుండా దేవేంద్రుడు వృత్రాసురుని సంహరించలేడు. కాబట్టి వృత్రాసురుని సంహారానికి ప్రధాన కారకుడు విష్ణువు. వృత్రాసుర సంహారం వల్ల ఉద్భవించిన బ్రహ్మహత్యాపాతకం అతని సంహారానికి ప్రధాన కారకుడైన విష్ణువును పట్టుకోవాలి. కానీ ఈ కథలో బ్రహ్మహత్యా పాతకం దేవేంద్రుని పట్టుకుంది. విష్ణువు మహిమాన్వితుడు కావడం వల్ల బ్రహ్మహత్య అతన్ని పట్టుకోలేకపోయిందని సమాధానం చెప్పుకోవలసి వుంటుంది. నైతిక దృక్పథంతో చూస్తే వృత్రాసురుని చంపవలసిన అవసరం లేదు. అతడు సన్మార్గుడు, ప్రజలను ధర్మబద్ధంగా పాలించినవాడు, తపస్సు చేస్తున్నవాడు. ఇలాంటి వాణ్ణి చంపవలసిన అవసరం లేదు. ఇలాంటి ధర్మాత్ముని దేవతలు చంపమని విష్ణువుని కోరడం అనుచితం. కానీ ఎవరైనా తపస్సు చేస్తుంటే వారు తన ఇంద్ర పదవికి పోటీగా వస్తారని ఇంద్రుడు భయపడుతూ ఉంటాడు. అందువల్లనే ఇంద్రుడు తపస్సు చేస్తున్న వృత్రుని చంపుమని విష్ణువును ప్రార్థించాడు. విష్ణువు దేవతల పక్షపాతి కాబట్టి దేవతల మాటలు విని వృత్రాసురుని సంహరించడానికి ఇంద్రునికి సహాయం చేశాడు. ఇందుకోసం విష్ణువు తన స్వరూపాన్ని మూడుగా విభజించి ఒక భాగాన్ని ఇంద్రునిలో, రెండవ భాగాన్ని వజ్రాయుధంలో, మూడవ భాగాన్ని భూమిలో ప్రవేశపెడతాడు. ఈ కథకు సంబంధించి విష్ణువు తన స్వరూపంలోని మూడవ భాగాన్ని భూమిలో ప్రవేశపెట్టడం వల్ల కథకు ఎలాంటి ప్రయోజనం లేదు. మొదటి రెండు భాగాలు దేవేంద్రుని, అతని వజ్రాయుధాన్ని చేరడం వల్ల ఇంద్రుడు వృత్రాసుర సంహారం చేయగలిగాడు.

బ్రహ్మహత్యాపాతకం తనను తాను నాలుగు భాగాలుగా చేసుకొని నాలుగు అంశాలలో ప్రవేశించినట్లుగా ఈ కథలో చెప్పబడింది. ఇందులో చెప్పబడ్డ మొదటి మూడు లోకంలో సహజంగా వున్నవే. అవి ప్రకృతిలో భాగంగా వున్నాయి. వర్షా కాలంలో నదులు పొంగి ప్రవహిస్తూ ప్రజలను కష్టపెడుతూ వుంటాయి. ఈ కథలో బ్రహ్మహత్యలోని మొదటి భాగం కారణంగా వర్షాకాలంలో నదులు పొంగి ప్రవహిస్తూ పాపాత్ముల దర్పాన్ని తొలగిస్తున్నట్లుగా చెప్పబడింది. వర్షాకాలంలో నదులు పుణ్యాత్ములు, పాపాత్ములు అనే తేడా లేకుండా అందరిని కష్టపెడుతూ వుంటాయి. ఈ కథలో చెప్పినట్లుగా పాపాత్ముల దర్పాన్ని మాత్రమే తొలగిస్తాయని చెప్పడం వాస్తవం కాదు. రెండవ భాగం భూమిని చేరడం వల్ల భూమిలోని కొన్ని ప్రదేశాల్లో చవిటి నేల ఏర్పడినట్లుగా ఈ కథలో వుంది. భూమిలో చవిటి నేలలు అనేక కారణాల చేత సహజంగా ఏర్పడుతున్నాయి. బ్రహ్మహత్యా పాతకంలోని మూడవ భాగం యవ్వనంలో వున్న స్త్రీలను చేరడంవల్ల వారిలో బహిష్ఠు అనే లక్షణం ఏర్పడి మూడు రోజులపాటు వారి దర్పాన్ని తొలగిస్తున్నట్లుగా చెప్పబడింది. ఇది కూడా ప్రకృతిలో సహజంగా వున్నదే. ప్రకృతిలో సహజంగా వున్న పై మూడు అంశాలు బ్రహ్మహత్యా పాతకంలోని మొదటి మూడు భాగాల వల్ల ఏర్పడ్డాయని ఈ కథలో కల్పించ బడింది. అందువల్ల ఇది కట్టుకథ అవుతూ వుంది. బ్రహ్మహత్య పాపంలోని నాలుగవ భాగం నిరపరాధులైన బ్రాహ్మణులను చంపే వారిని పట్టుకొని పీడిస్తుందని ఇందులో చెప్పబడింది. ఇది పై మూడింటి లాగా ప్రకృతిలో సహజంగా వున్నది కాదు. ఈ కథను కల్పించిన కవి బ్రాహ్మణుడు కాబట్టి కులాభిమానంతో బ్రాహ్మణులను చంపేవారిని బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంటుందని చెప్పాడు. ఈ కథలో వృత్రుడు 300 యోజనాల ఎత్తు, 100 యోజనాల లావు ఉన్నట్లుగా అత్యంతాతిశయోక్తిగా, ఆశ్చర్యకరమైన రీతిలో కవి చెప్పాడు.

ఇదే కథ రామయణం బాలకాండలోని 24వ సర్గలో క్లుప్తంగా 5 శ్లోకాల్లో కొంచెం భిన్నంగా చెప్పబడింది. ఈ కథను విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు తాటక వృత్తాంతాన్ని చెబుతూ ఇలా చెబుతాడు. పూర్వం ఇంద్రుడు వృత్రాసురుని చంపడంచేత బ్రహ్మహత్యాపాపం అతణ్ణి ఆవహిస్తుంది. ఆకారణంచేత ఇంద్రుని అశుచిత్వం, ఆకలి పీడిస్తుంటాయి. దేవతలు, తపోధనులైన మహర్షులు పుణ్య క్షేత్రాల్లోని నీటి చేత, కలశాలలో అభిమంత్రితాలైన ఉదకంచేత స్నానం చేయించి దేవేంద్రుని అశుచిత్వాన్ని, ఆకలిని తొలగించి రెండు ప్రదేశాలకు వాటిని ఇస్తారు. తన అశుచిత్వాన్ని, ఆకలిని స్వీకరించిన ఆ ప్రదేశాలకు ఇంద్రుడు అవి సర్వసమృద్ధాలుగా వుండి మలదము, కరూశము అనే పేర్లతో లోకంలో ప్రసిద్ధి చెందుతాయని వాటికి వరం ఇస్తాడు. ఇంద్రుని వరం కారణంగా ఆ రెండు ప్రదేశాలు ఆ పేర్లతో ప్రసిద్ధాలై అక్కడ వున్న ప్రజలు ఎలాంటి కష్టాలు లేకుండా ధనధాన్యాలతో సుఖంగా వున్నట్లుగా ఈ కథలో చెప్పబడింది.

ఈ రెండు కథల కంటే భిన్నంగా కిష్కింధాకాండలో ఇంద్రుని బ్రహ్మహత్యా పాతకం విభాగం కథ ఒక శ్లోకంలో సూచనామాత్రంగా చెప్పబడింది. సుగ్రీవుని ప్రేరణతో రాముడు వాలిని చంపిన తర్వాత వాలి మరణానికి సుగ్రీవుడు దుఃఖిస్తూ రామునితో ఇలా అంటాడు.

**"పాప్మానిమిన్ద్రస్య మహీజలం చ**
**వృక్షాశ్చ కామం జగృహుః స్త్రియశ్చ**
**కోనామ పాప్మానమిమం సహేత**
**శాఖామృగస్య ప్రతి పత్తుమిచ్ఛేత్"**

**(కిష్కింధాకాండ – 24వ సర్గ – 14వ శ్లోకం)**

"ఇంద్రుడు విశ్వరూపుని చంపడం వల్ల కలిగిన బ్రహ్మహత్యా పాతకాన్ని భూమి, నీరు, వృక్షాలు, స్త్రీలు గ్రహించి వుండవచ్చు, కాని వానరుడనైన నేను చేసిన సోదర హత్యా పాపాన్ని స్వీకరించడానికి ఎవరు అంగీకరిస్తారు? ఎవరు సహిస్తారు?" అన్నది పై శ్లోకం యొక్క భావం. ఈ శ్లోకాన్ని బట్టి ఇంద్రుడు విశ్వరూపుని సంహరించడం వల్ల బ్రహ్మహత్యా పాతకం ఇంద్రుని ఆవహించిందని, దాన్ని నాలుగు భాగాలుగా చేసి భూమి, నీరు, వృక్షాలు, స్త్రీలకు పంచి ఇచ్చాడని చెప్పబడింది. సంస్కృత భాగవతంలోని 6వ స్కంధంలో చెప్పబడిన కథను అనుసరించి ఈ శ్లోకం రచించబడిందని చెప్పవచ్చు. అంటే భాగవతంలోని ఇంద్రుని బ్రహ్మహత్యా పాతకం విభాగం కథను చూచిన తర్వాత ఒక సంస్కృత కవి ఒక శ్లోకరూపంలో రాసి రామాయణంలో ప్రవేశపెట్టాడు.

ఈ విధంగా రామాయణంలోని మూడు కాండల్లో వున్న ఇంద్రుని బ్రహ్మహత్యా పాతకం విభాగం కథ మూడు విధాలుగా చెప్పబడింది. ఈ మూడింటిని వేరువేరు కవులు, వేరువేరు కాలాలలో రాసి రామాయణంలో చొప్పించారని స్పష్టమవుతూ వుంది. ఈ కారణంచేత సంస్కృత రామాయణం మొత్తం వాల్మీకి రాయలేదని, వాల్మీకి తర్వాత కాలంలో చాలామంది సంస్కృత పండితులు తమకు తోచిన పద్ధతిలో ఉపాఖ్యానాలను కల్పించి రామాయణంలో చొప్పించారని స్పష్టంగా చెప్పవచ్చు.

ఇప్పుడు సంస్కృత భాగవతంలోని కథను పరిశీలించుదాం. ఈ కథ భాగవతంలోని ఆరవ స్కంధంలో ఏడవ అధ్యాయం నుంచి పద్నాల్గవ అధ్యాయం వరకు వున్న ఎనిమిది అధ్యాయాల్లో వివరంగా వుంది. ఈ కథను వ్యాసుని కుమారుడైన శుకుడు జనమేజయునికి చెబుతాడు. జనమేజయుడు దేవగురువైన బృహస్పతి దేవతలను పరిత్యజించడానికి కారణం ఏమిటి? దేవతలు అతని పట్ల చేసిన అపరాధం ఏమిటి? అని ప్రశ్నించగా శుకుడు ఈ కథను ఇలా చెబుతాడు.

ఇంద్రుడు సమస్త దేవతాగణంతో సభ తీర్చి వున్నప్పుడు దేవగురువైన బృహస్పతి సభలోకి వస్తాడు. దేవేంద్రుడు తప్ప సభలో వున్న దేవతలందరు బృహస్పతికి నమస్కరిస్తారు.

ముల్లోకాలకు పాలకుడన్న అహంకారంతో దేవేంద్రుడు బృహస్పతిని చూసి అతణ్ణి గౌరవించకుండా అలాగే కూర్చుని వుంటాడు. దీన్ని అవమానంగా భావించిన బృహస్పతి అక్కడ నుంచి వెళ్ళిపోయి తన యోగబలంతో దేవతలకు కనిపించకుండా వెళ్ళిపోతాడు. దీనితో దేవేంద్రుడు తప్పు చేసిన వాడిలాగా పశ్చాత్తాపం చెంది గురువు లేకుండా తనకు రక్షణ వుండదని భావించి ఇతర దేవతలతో కలిసి స్వర్గరక్షణ కోసం ఆలోచన చేస్తాడు. కాని వారికి ఎలాంటి ఉపాయం తోచదు. బృహస్పతి దేవతలను వదలివేసి వెళ్ళిపోయిన విషయం రాక్షసులకు తెలిసి వారు శుక్రాచార్యుని ఆదేశంతో స్వర్గం మీదకు దండెత్తి దేవతలను ఓడించి వారి సంపదను చేజిక్కించుకుంటారు. దానితో దేవేంద్రుడు మొదలైన దేవతలు బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్ళి తమ కష్టాలను గురించి మొరపెట్టుకుంటారు.

బ్రహ్మదేవుడు ఇంద్రునితో ఇలా అంటాడు. "ఐశ్వర్య మదంతో బ్రహ్మజ్ఞాని, జితేంద్రియుడు, బ్రాహ్మణశ్రేష్ఠుడు అయిన బృహస్పతిని నిరాదరించినందుకు కలిగిన ఫలితమిది. ఇంద్రా నీ శత్రువులైన రాక్షసులు కూడా తమ గురువైన శుక్రాచార్యుని అవమానపరిచి బలహీనులయ్యారు. ఆ తర్వాత వారు భక్తిభావంతో శుక్రాచార్యుని సేవించి ధనవంతులు, బలవంతులు అయ్యారు. శుక్రుని ఆరాధ్య దైవ్యంగా భావించే రాక్షసులు బలవంతులై నా బ్రహ్మలోకాన్ని కూడా ఆక్రమిస్తారని నాకు తోస్తూ వుంది. భృగువంశీయులు వారికి అర్థశాస్త్రంలో పూర్తి శిక్షణ ఇచ్చారు. వారి పన్నాగాలను తిప్పికొట్టే మార్గాలు ఎవరికీ తెలియవు. ఇలాంటి స్థితిలో రాక్షసులు స్వర్గాన్నే కాదు, ఏ లోకాన్నైనా జయించగలరు. బ్రాహ్మణులను, గోవిందుని, గోవులను తమ సర్వస్వంగా భావించే రాజులకు ఎన్నటికీ అశుభం కలగదు. కాబట్టి మీరు వెంటనే త్వష్ట పుత్రుడైన విశ్వరూపుని దగ్గరకు వెళ్ళి అతణ్ణి పురోహితునిగా, గురువుగా సేవించండి. అతడు విప్రోత్తముడు, తపస్సంపన్నుడు, జితేంద్రియుడు. కాని అతని తల్లి అసుర కులానికి చెందినది. కాబట్టి మీరు అసురలను క్షమించి విశ్వరూపుని గౌరవిస్తే అతడు మీ పని నెరవేర్చగలడు". బ్రహ్మదేవుని మాటలు విని దేవేంద్రుడు మొదలైన దేవతలు విశ్వరూపుని దగ్గరకు వెళ్ళి అతణ్ణి ప్రశంసించి తమకు ఆచార్యునిగా వుండి పోయిన సంపదలను తిరిగి తెచ్చిపెట్టమని ప్రార్థిస్తారు. విశ్వరూపుడు దానికి అంగీకరించి వైష్ణవ విద్యా ప్రభావంతో రాక్షసులు అపహరించిన ధనాన్ని మళ్ళీ గ్రహించి దేవేంద్రునికి అప్పగిస్తాడు. అంతేగాకుండా వైష్ణవ విద్య అయిన "ఓం నమో నారాయణాయ, ఓం నమో భగవతే వాసుదేవాయ" అనే మంత్రాలు దేవేంద్రునికి ఉపదేశిస్తాడు. తత్ప్రభావంతో దేవేంద్రుడు అసుర సైన్యాన్ని జయిస్తాడు.

విశ్వరూపునికి మూడు తలలు వుంటాయి. అతడు ఒక ముఖంతో సోమరసాన్ని, రెండవ ముఖంతో సురాపానాన్ని, మూడవ ముఖంతో ఆహారాన్ని స్వీకరిస్తుంటాడు. అతడు యజ్ఞం చేసేటప్పుడు మంత్రాలను పఠిస్తూ, దేవతలకు హవ్యభాగాలను అందిస్తూ వుంటాడు. అతని తల్లి అసుర వంశస్థురాలు కావడం చేత తల్లి మీది ప్రేమతో పరోక్షంగా లోలోపల

మంత్రాలను పఠిస్తూ అసురులకు కూడా హవ్యభాగాలను అందిస్తూ వుంటాడు. ఇది దేవేంద్రుడు తమకు అవమానంగా భావించి విశ్వరూపుని మూడు తలలను నరికి వేస్తాడు. అతని శిరస్సుల్లో సోమరసాన్ని తాగే శిరస్సు కౌజుపిట్టగా, సురాపానాన్ని చేసే శిరస్సు పిచ్చుకగా, అన్నాన్ని తినే శిరస్సు తీతువు పిట్టగా మారతాయి. విశ్వరూపుడు బ్రాహ్మణుడు కావడం వల్ల, అతన్ని చంపడం చేత దేవేంద్రునికి బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంటుంది. ఒక సంవత్సరం తరువాత ఇంద్రుడు నేల, నీరు, చెట్లు, స్త్రీలు అనే నలుగురికి తన బ్రహ్మహత్యా పాపాన్ని పంచియిస్తాడు. ఇందుకు ఈ నాలుగు నాలుగు వరాలను దేవేంద్రుని నుంచి పొందుతాయి. భూమి తనపైన ఏర్పడిన గొయ్యి తనంత తానుగా పూడ్చబడాలి అనే వరాన్ని పొంది దేవేంద్రునిలో వున్న బ్రహ్మహత్యా పాతకంలో మొదటి భాగాన్ని స్వీకరిస్తుంది. ఇలా బ్రహ్మహత్యను స్వీకరించడం వల్ల భూమిలో అక్కడక్కడ చవిటినేల ఏర్పడింది. తెగిన కొమ్మ చిగురించాలి అనే వరాన్ని పొంది చెట్లు దేవేంద్రునిలోని బ్రహ్మహత్యా పాతకంలో రెండవ భాగాన్ని స్వీకరిస్తాయి. చెట్టును నరికినప్పుడు అక్కడ నుంచి వచ్చే బంక (జిగురు) రూపంలో ఆ బ్రహ్మహత్యా దోషం కనిపిస్తూ వుంది. ఎల్లప్పుడు పురుష సహవాసాన్ని కలిగి వుండాలనే వరాన్ని పొంది స్త్రీలు బ్రహ్మహత్యా దోషంలో మూడవ భాగాన్ని స్వీకరిస్తారు. తత్ఫలితంగా ప్రతి నెల బహిష్టు కావడం అనే రూపంలో ఆ దోషం కనిపిస్తూ వుంది. నూతుల్లో నీరు తోడేకొద్దీ ఊరుతూ వుండాలి అనే వరాన్ని పొంది జలం నాల్గవ భాగం బ్రహ్మహత్యా దోషాన్ని స్వీకరించింది. ఈ పాపం నీటిలో బుడగలు, నురగలు రూపంలో కనిపిస్తూ వుంది. ప్రజలు నీటిని తీసుకునే సందర్భంలో ఈ బుడగలను, నురగలను పక్కకు తోసివేస్తూ వుంటారు.

దేవేంద్రుడు తన కుమారుని సంహరించినందుకు విశ్వరూపుని తండ్రి అయిన త్వష్ట కోపించి ఒక యజ్ఞాన్ని ఆచరించి దానినుంచి వృత్రాసురుడు అనే రాక్షసుని సృష్టిస్తాడు. ఈ రాక్షసుడు అతి పెద్ద దేహంతో ముల్లోకాలను మింగివేసే వాడిలాగా కనిపిస్తూ దేవతల మీదకి వెళతాడు. దేవతలు దేవేంద్రునితో కలిసి అతని మీద అనేక శస్త్రాస్త్రాలను ప్రయోగిస్తారు. వృత్రుడు వాటన్నింటిని మింగివేస్తాడు. దీనితో దేవతలు భయపడి పారిపోయి విష్ణువును శరణు వేడుతారు. విష్ణువు వారితో దధీచి మహర్షి వద్దకు వెళ్ళి అతని వెన్నెముకను ఆయుధంగా యాచింపుమని చెబుతాడు. దేవతలు దధీచి వద్దకు వెళ్ళి అతని వెన్నెముకను అడుగుతారు. దధీచి మహర్షి తన ప్రాణాన్ని త్యజించి తన వెన్నెముకను దేవేంద్రునికి వజ్రాయుధంగా ఇస్తాడు. దేవేంద్రుడు విష్ణువు సహాయంతో వజ్రాయుధాన్ని ప్రయోగించి వృత్రాసురుని సంహరిస్తాడు. వృత్రాసురుని దగ్గర నుంచి బ్రహ్మహత్యా పాపం ఇంద్రునికి చుట్టుకుంటుంది. బ్రహ్మహత్య చండాల స్త్రీలాగా వుంటుంది. ముసలితనం చేత ఆమె శరీరం వణుకుతూ వుంటుంది. క్షయరోగం ఆమెను పీడిస్తూ వుంటుంది. ఆమె దుస్తులు రక్తంతో తడిసి వుంటాయి. ఆమె తెల్లబడిన వెంట్రుకలను విరబోసుకొని వుంటుంది.

ఆమె పీల్చి విడిచే శ్వాస దుర్గంధ భూయిష్టంగా వుంటుంది. అలాంటి బ్రహ్మహత్య దేవేంద్రుని ఆక్రమించడం చేత అతడు మనశ్శాంతి కోల్పోయి మానససరోవరంలోని ఒక తామరతూడులో దాక్కొని వెయ్యి సంవత్సరాలు గడుపుతాడు. ఆ తర్వాత ఇంద్రుడు శ్రీహరిని ప్రార్థించగా అతని ప్రభావంతో బ్రహ్మహత్యా పాతకం నుంచి విముక్తుడౌతాడు. ఆ తర్వాత దేవేంద్రుడు స్వర్గలోకానికి వచ్చి అశ్వమేధయాగం చేసి వృత్రాసుర సంహారంతో తనకు సంక్రమించిన బ్రహ్మహత్యా పాపం నుంచి పూర్తిగా విముక్తుడౌతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథలో ఇంద్రుడు బ్రాహ్మణుడైన విశ్వరూపుని చంపడంవల్ల బ్రహ్మహత్యా పాతకం ఇంద్రుని చుట్టుకుందని ఇంద్రుడు తనకు చుట్టుకున్న బ్రహ్మహత్యా పాతకాన్ని నాలుగు భాగాలుగా చేసి నేల, నీరు, చెట్లు, స్త్రీలకు ఒక్కొక్క భాగం పంచాడని, అందుకు ప్రతిఫలంగా దేవేంద్రుడు ఆ నాలుగింటికి నాలుగు వరాలు ఇచ్చాడని చెప్పబడింది. బ్రహ్మహత్యా పాతకం తీసుకోవడం వల్ల పై నాలుగింటికి సంక్రమించిన లక్షణాలు, దేవేంద్రుడు ఇచ్చిన వరాల వల్ల పై నాలుగింటికి సంక్రమించిన లక్షణాలు లోకంలో సహజంగా వున్నవే. నేల మీద గొయ్యి తవ్వితే మెల్లమెల్లగా ఆ గొయ్యి పూడ్చుబడుతూ వుంటుంది. అలాగే భూమి మీద అక్కడక్కడ అనేక కారణాల వల్ల చవిటి నేల ఏర్పడుతుంది. చెట్టు కొమ్మ నరికితే నరికిన భాగం చిగురించి మళ్ళీ పెరుగుతుంది. అలాగే చెట్టుకు బంక (జిగురు) రావడం కూడా సహజమైనదే. అలాగే స్త్రీలు పురుషులతో ఎల్లప్పుడూ కలిసి వుండటం, బహిష్టు కావడం సహజంగా జరుగుతున్నవే. అలాగే నూతుల్లో నీరు తోడుతూ వుంటే మళ్ళీ నీరు ఊరడం, నీటిలో నురుగలు రావడం సహజంగా జరుగుతున్నవే. ఈ విధంగా లోకంలో నేల, నీరు, చెట్లు, స్త్రీలకు సహజంగా వున్న లక్షణాలను ఇంద్రుడు వాటికి ఇచ్చిన వరాల వల్ల, బ్రహ్మహత్యా పాతకం వల్ల కలిగాయని కవి కల్పించి చెప్పడం చేత ఇది కట్టుకథ అవుతూ వుంది.

ఈ కథలో విశ్వరూపునికి మూడు తలలున్నట్లుగా అతడు ఒక తలతో సోమరసాన్ని, ఇంకొక తలతో సురాపానాన్ని, వేరొక తలతో ఆహారాన్ని స్వీకరిస్తాడని ఇంద్రుడు అతని మూడు తలలను నరికివేయగా సోమరసాన్ని తాగే శిరస్సు కౌజుపిట్టగా, సురపానాన్ని చేసే శిరస్సు పిచ్చుకగా, ఆహారాన్ని తీసుకొనే శిరస్సు తీతువు పిట్టగా మారాయని చెప్పబడింది. ఇదంతా అద్భుత కల్పన.

ఈ కథలో విశ్వరూపుడు ఓం నమో నారాణాయ, ఓం నమో భగవతే వాసుదేవాయ" అనే వైష్ణవ విద్యా ప్రభావంతో రాక్షసులు అపహరించిన దేవతల ధనాన్ని తిరిగి దేవతలకు అప్పగించినట్లుగా, ఆ విద్యా ప్రభావంతోనే ఇంద్రుడు అసురులను జయించినట్లుగా చెప్పబడింది. అలాగే రెండవసారి తనను పట్టుకున్న బ్రహ్మహత్యా పాతకాన్ని విష్ణువు ప్రభావంతోనూ, అశ్వమేధయాగం చేయడం వల్లనూ దేవేంద్రుడు పోగొట్టుకున్నట్లుగా చెప్పబడింది. భాగవతం విష్ణువు మాహాత్మ్యాన్ని ప్రతిపాదించే గ్రంథం కావడం వల్ల ఈ

గ్రంథంలో వైష్ణవ విద్యా ప్రభావాన్ని విష్ణువు మాహాత్మ్యాన్ని చాటి చెప్పడానికి ఈ కథను కల్పించిన కవి పై అంశాలను చెప్పాడు.

ఈ కథను హేతుబద్ధంగా పరిశీలిస్తే ఆనాటి బ్రాహ్మణ కవి బ్రాహ్మణ కులాభిమానంతో బ్రాహ్మణ మాహాత్మ్యాన్ని చాటిచెప్పడానికి కల్పించిన కథ ఇది అని స్పష్టమౌతుంది. దేవేంద్రుడు మొదలైన దేవతలు బ్రాహ్మణుడైన బృహస్పతిని గురువుగా గౌరవిస్తున్నంతకాలం శత్రువుల బెడద లేకుండా సుఖంగా వున్నారని, దేవేంద్రుడు బృహస్పతిని గౌరవించక పోవటం చేత బృహస్పతి అలిగి దేవతలను వదిలిపెట్టి వెళ్ళిపోయాడని, అది తెలుసుకొని బ్రాహ్మణుడైన శుక్రాచార్యుని గురువుగా సేవిస్తున్న రాక్షసులు శుక్రుని ఆదేశంతో దేవతల మీదకు దండెత్తి వారిని ఓడించి స్వర్గం నుంచి పారద్రోలారని, బ్రహ్మ ఆదేశానుసారం బ్రాహ్మణుడైన విశ్వరూపుని గురువుగా, పురోహితునిగా నియమించుకోవడంచేత దేవతలు తిరిగి బలవంతులై శత్రువులను జయించారని చెప్పబడింది. అంటే దేవతలైనా, రాక్షసులైనా బలవంతులుగా, సంపన్నులుగా విజయం పొందేవారుగా వుండాలంటే బ్రాహ్మణుని గురువుగా చేసుకొని అతణ్ణి గౌరవిస్తూ, పూజిస్తూ అతను చెప్పినట్లుగా నడుచు కోవాలని, అలా చేస్తున్నంత కాలం వారికి ఎలాంటి కష్టనష్టాలు, శత్రు భయాలు వుండవని, బ్రాహ్మణుని గురువుగా సేవించడం మానివేసిన వెంటనే వారి శత్రువులు దండెత్తి వచ్చి యుద్ధంలో ఓడించి వారి సంపదను దోచు కుంటారని చెప్పబడింది. ఇది పూర్తిగా అహేతుకం. యుద్ధంలో విజయం సాధించాలంటే సైన్యబలం, ఆయుధ సంపత్తి, మంచి ప్రణాళిక, నమ్మకస్తులైన సైన్యాధిపతులు, మంత్రాంగం చేయగల మంత్రులు, పటిష్ఠమైన గూఢచార వ్యవస్థ మొదలైనవి వుండాలి. ఇవి లేకపోతే యుద్ధంలో విజయం సాధ్యం కాదు. బ్రాహ్మణుని గురువు సేవిస్తే ఇవి లభించవు. అందువల్ల ఈ కథ పూర్తిగా అహేతుకమైనదని బ్రాహ్మణ కులాభిమానంతో రాయబడినదని స్పష్టంగా చెప్పవచ్చు. బ్రాహ్మణుడైన శుక్రుని ఆరాధ్య దైవంగా భావించడం చేత రాక్షసులు బలవంతులై తన బ్రహ్మ లోకాన్ని కూడా ఆక్రమిస్తారని బ్రహ్మ దేవతలతో చెప్పిన మాటలు ఈ కథలో పరాకాష్ఠ. అంటే దేవతలు, రాక్షసులు, రాజులు మొదలైనవారు ఎవరైనా బలవంతులుగా కావాలంటే బ్రాహ్మణులను గురువులుగా నియమించుకుని వారిని ఆరాధ్య దైవంగా పూజించాలని సృష్టికర్త అయిన బ్రహ్మచేతనే ఈ కథను కల్పించిన కవి ఎలాంటి జంకు, గొంకు లేకుండా చెప్పించాడు. దీన్ని బట్టి ఈ కవికి బ్రాహ్మణకులాభిమానం ఎంత తీవ్రస్థాయిలో వుందో ఊహించవచ్చు.

ఈ కథ ద్వారా ఈ కథను కల్పించిన కవి లోకానికి చెప్పదలచుకున్నది ఏమంటే సాక్షాత్తు దేవేంద్రుడు కూడా బ్రాహ్మణుని చంపడం వల్ల, బ్రాహ్మణుడు సృష్టించిన అసురుని చంపడంవల్ల బ్రహ్మహత్యా పాతకం చుట్టుకొని చాలాకాలం అనేక కష్టాలు పడ్డాడని, అందువల్ల మానవులెవ్వరు కూడా బ్రాహ్మణుల జోలికి రాకూడదని, వస్తే వారికి బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంటుందని, దానివల్ల వారు అనేక కష్టాలు పడవలసి వుంటుందని.

ఈ కథలో కవి బ్రహ్మహత్యా పాతకం స్వరూపాన్ని వివరించాడు. బ్రహ్మహత్యా పాతకం ముసలి చండాల స్త్రీలాగా అసహ్యమైన నల్లని దేహంతో, విరబోసుకున్న తెల్లని జుట్టుతో, క్షయరోగంతో, వణకుతున్న రక్తంతో తడిసిన దేహంతో, దుర్గంధభూయిష్టమైన శ్వాసతో భయంకరంగా అందరూ అసహ్యించుకునే విధంగా వుందని చెప్పబడింది. అంటే బ్రహ్మహత్యా పాతకం చుట్టుకున్న వారు ఇక్కడ చెప్పబడిన బ్రహ్మహత్యలాగా భయంకరంగా, అందరూ అసహ్యించుకునే విధంగా మారిపోతారని ఈ కథకుడు లోకానికి వివరించాడు. ఇదంతా బ్రాహ్మణుల జోలికి ఎవరూ రాకూడదని భయపెట్టడానికి చేసిన కల్పన మాత్రమే.

సంస్కృత భారతంలో రాజులందరూ బ్రాహ్మణ భక్తిని కలిగి వుండి బ్రాహ్మణుని పురోహితునిగా, గురువుగా నియమించుకున్నట్లుగా చాలా చోట్ల చెప్పబడింది. ఉదాహరణకు పాండవులు తల్లితో కలిసి బ్రాహ్మణుల వేషంలో ఏకచక్ర పురంలో కొంతకాలం వుండి, ద్రౌపది స్వయంవరానికి పాంచాల దేశానికి వెళ్తున్నప్పుడు వారిని చిత్రరథుడు అనే గంధర్వుడు అడ్డగిస్తాడు. అర్జునుడు అతణ్ణి ఓడించి, తమను గురించి చెప్పిన తర్వాత చిత్రరథుడు అర్జునునితో స్నేహంచేసి క్షత్రియులు రాజ్యాభివృద్ధికోసం బ్రాహ్మణుని పురోహితునిగా నియమించుకోవాలని ఇలా చెబుతాడు.

**"క్షత్రియేణాభిజాతేన పృథ్వీ జేతుమిచ్ఛతా**
**పూర్వ పురోహితః కార్యః పార్థ రాజ్యాభి వృద్ధయే"**
**(ఆదిపర్వం - 173వ అధ్యాయం - 14వ శ్లోకం)**

"భూమినంతటినీ జయించాలనుకున్న ఉత్తమ క్షత్రియుడు ముందుగా పురోహితున్ని నియమించుకోవాలి. భూమిని జయించాలనుకున్న రాజు బ్రాహ్మణుని ముందు నిల్పుకోవాలి" చిత్రరథుని మాటను పాటించి పాండవులు బ్రాహ్మణుడైన ధౌమ్యుని పురోహితునిగా నియమించుకుంటారు.

వనపర్వం 26వ అధ్యాయంలో బకమహర్షి ధర్మరాజుతో రాజులు బ్రాహ్మణులను గురువులుగా నియమించుకోవలసిన అవసరాన్ని గూర్చి ఇలా చెబుతాడు. "ధర్మరాజా! ఇహపరలోకాలను జయించాలనుకునే రాజు బ్రాహ్మణుడు లేకుండా ఎక్కువకాలం ఉండలేడు. ధర్మార్థాలను బాగా తెలిసి మోహం లేని బ్రాహ్మణుని పొంది రాజు శత్రువులను నాశనం చేస్తాడు. బ్రాహ్మణునితో కలవడం వల్ల బలిచక్రవర్తి రాజ్యాన్ని పొంది అక్షయమైన ఐశ్వర్యాన్ని ఇష్టభోగాలను పొందాడు. అతడే బ్రాహ్మణుల పట్ల దుర్మార్గంగా ప్రవర్తించి నశించాడు. బ్రాహ్మణుని సహాయం లేని క్షత్రియుడు ఈ భూమిని ఎక్కువ కాలం పాలించలేడు. బ్రాహ్మణుని ఉపదేశాలు పొందిన క్షత్రియుడు సముద్ర పర్యంతమైన భూమిని పాలిస్తాడు. యుద్ధంలో మావటీని తొలగిస్తే ఏనుగు బలం నశించినట్లుగా బ్రాహ్మణుల తోడ్పాటు లేని క్షత్రియుని బలం నశిస్తుంది. బ్రాహ్మణుని విచారశక్తి అసమానమైనది. క్షత్రియునిది గొప్పబలం. వారిద్దరూ కలిసి నడిస్తే సమస్త లోకం సుఖంగా ఉంటుంది. గాలితో కూడిన

అగ్ని మహారణ్యాన్ని జయించినట్లుగా బ్రాహ్మణునితో కూడిన క్షత్రియుడు శత్రువును జయిస్తాడు. ధర్మరాజా! అప్రాప్తమైనదాన్ని పొందడానికి, పొందిన దాన్ని వృద్ధి చేసుకోవడానికి అవసరమైన ఉపాయం చెప్పడానికి యశస్వి, పండితుడు, వేదవేత్త అయిన బ్రాహ్మణుని పోషించు. బ్రాహ్మణుల పట్ల నీహృదయం ఎల్లప్పుడూ ఉత్తమమైనదిగా ఉంటుంది. అందువల్ల ప్రశస్తమైన నీకీర్తి అన్ని లోకాల్లోను ప్రకాశిస్తుంది".

ఇందులో బకమహర్షి ధర్మరాజుతో బలిచక్రవర్తి బ్రాహ్మణునితో కలవడం వల్లనే రాజ్యాన్ని పొందాడని, అతడే బ్రాహ్మణులపట్ల దుర్మార్గంగా వ్యవహరించడం వల్ల నశించాడని బలిచక్రవర్తిని ఉదాహరణగా చెప్పి, క్షత్రియుడు ఎంత గొప్ప బలవంతుడయినా తప్పనిసరిగా బ్రాహ్మణుని తోడ్పాటు ఉంటేనే అతడు రానిస్తాడని లేకపోతే నశిస్తాడని చెప్పిన ఇలాంటి మాటలన్ని బ్రాహ్మణుల గొప్పతనాన్ని ప్రకటించడానికి ఆనాటి బ్రాహ్మణకవులు పనిగట్టుకొని రాసినవే.

భారత, రామాయణ, భాగవత గ్రంథాల్లో పైన చెప్పిన బ్రహ్మహత్యా పాతక విభాగం కథలను పరిశీలిస్తే పై మూడింటిలోను వృత్రాసుర సంహారం వల్ల బ్రహ్మహత్యా పాతకం ఇంద్రుని పట్టుకున్నట్లుగా చెప్పబడింది. భారతం శాంతిపర్వంలో ఇంద్రుని పట్టుకున్న బ్రహ్మహత్యా పాతకాన్ని బ్రహ్మ నాలుగు భాగాలుగా విభజించి అగ్ని, చెట్లు, అప్సరసలు, నీరు అనే నాలుగింటికి నాలుగు భాగాలను పంచడం ద్వారా విముక్తుని చేస్తాడు. ఆ తర్వాత బ్రహ్మ అనుజ్ఞతో ఇంద్రుడు అశ్వమేధయాగం చేసి బ్రహ్మహత్యా పాతకం నుంచి పరిశుద్ధుడవుతాడు. భారతంలో బ్రహ్మహత్యా పాతకం నుంచి ఇంద్రుని విముక్తుని చేయడంలో బ్రహ్మదేవుని పాత్ర ముఖ్యమైనదిగా చెప్పబడింది.

ఉద్యోగపర్వంలోని కథలో ఇంద్రుడు విశ్వరూపుని చంపడం వల్ల అతనికి ఎలాంటి బ్రహ్మహత్యా పాతకం సంక్రమించలేదు. అలాగే వృత్రుని సంహరించడం వల్ల కూడా ఇంద్రునికి బ్రహ్మహత్యాపాతకం రాలేదు. అయితే ఇంద్రుడు వృత్రుని మిత్రునిగా నటిస్తూ నమ్మించి మోసం చేసి చంపడం వల్ల అతడు అసత్యదోషంతో కుంగిపోయి లోకాల చివరకు వెళ్ళి నీటిలో బురదపాము లాగ దాక్కున్నాడు. అంటే ఇంద్రుడు ఒక విధమైన మానసిక రోగానికి గురయ్యాడు. దేవతలు ఇంద్రుని ముందుంచుకొని అశ్వమేధయాగం చేసి అతనికి మానసిక స్వస్థత కలుగజేసారు. ఆ తర్వాత వసిష్టుని శాపం వల్ల నహుషుడు పాముగా మారి భూలోకంలో పడిపోవడంతో ఇంద్రుడు స్వర్గానికి వచ్చి తన పదవిని అలంకరిస్తాడు.

రామాయణంలోని బాలకాండ కథలో దేవతలు, ఋషులు పుణ్య క్షేత్రాల్లోని నీటిచేత, కలశాలలో అభిమంత్రితాలైన నీటిచేత దేవేంద్రుని స్నానం చేయించి బ్రహ్మహత్యా పాతకం వల్ల ఇంద్రుని పట్టుకుని పీడిస్తున్న అశుచి, ఆకలి అనే రెండు లక్షణాల నుంచి విముక్తున్ని చేసి ఆ రెండు లక్షణాలను రెండు ప్రదేశాలకు ఇస్తారు. అంటే ఈ కథలో ఇంద్రుని బ్రహ్మహత్యా పాతకం నుంచి విముక్తున్ని చేయడంలో దేవతలు, ఋషులు

ముఖ్యపాత్ర వహించారు. రామాయణం ఉత్తరకాండలోని కథలో బ్రహ్మహత్యా పాతకం పట్టుకోవడంతో స్పృహ కోల్పోయిన ఇంద్రుని రక్షింపుమని దేవతలు విష్ణువును కోరుతారు. విష్ణువు ఇంద్రుని ముందుంచుకొని అశ్వమేధయాగం చేసి తనను పూజించాలని చెబుతాడు. దేవతలు విష్ణువు చెప్పినట్లుగా చేసి ఇంద్రుని బ్రహ్మహత్యా పాతకం నుంచి విముక్తున్ని చేస్తారు. అప్పుడు ఇంద్రుని శరీరం నుంచి బయటకు వచ్చిన బ్రహ్మహత్యా పాతకం తనను తాను నాలుగు భాగాలుగా విభజించుకొని వర్షాకాలం నాలుగు నెలలు నదుల్లోని నీటిలో, భూమిలోని చవిటి నేలలో, యవ్వనవతులైన స్త్రీలలో బహిష్టురూపంలో, నిరుపరాధులైన బ్రాహ్మణులను చంపేవారిలో చేరతానని చెబుతుంది. అంటే ఈ కథలో ఇంద్రుని బ్రహ్మహత్యా పాతకం నుంచి విముక్తుణ్ణి గావించడంలో దేవతలు ప్రధాన పాత్ర వహించారు.

భాగవతంలోని కథలో విశ్వరూపుని హత్యవల్ల ఇంద్రునికి సంక్రమించిన బ్రహ్మహత్యా పాతకాన్ని ఇంద్రుడే నాలుగు భాగాలుగా విభజించి నేల, నీరు, చెట్లు, స్త్రీలకు ఒక్కొక్కరి ఒక్కొక్క వరాన్ని ఇచ్చి ఒక్కొక్క భాగాన్ని పంచి ఇచ్చాడు. అంటే ఇక్కడ ఇంద్రుడు ఎవరి సహాయం తీసుకోకుండా తనంత తానే తనకు సంక్రమించిన బ్రహ్మహత్యా పాతకాన్ని వదిలించుకున్నాడు. రెండవసారి వృత్రాసురుని సంహరించడం వల్ల ఇంద్రుని పట్టుకున్న బ్రహ్మహత్యా పాతకాన్ని విష్ణువు ప్రభావంతోనూ, అశ్వమేధయాగం చేయడం వల్లనూ ఇంద్రుడు పోగొట్టుకున్నాడు. ఇక్కడ గూడా ఇంద్రుడు తన ప్రయత్నం వల్లనే తనకు సంక్రమించిన బ్రహ్మహత్యా పాతకం నుంచి విముక్తుడయ్యాడు.

భారత, రామాయణ, భాగవతాల్లోని ఇంద్ర వృత్రుల కథలకు మూలమని చెప్పదగిన కథలు కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితలో మూడు ఉన్నాయి. కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహిత ద్వితీయాష్టకం చతుర్థ ప్రపాఠకం ద్వాదశానువాకంలో ఒక కథ, ద్వితీయాష్టకం షష్ఠ ప్రపాఠకం షష్ఠోనువాకంలో మరొక కథ, ద్వితీయాష్టకం పంచమ ప్రపాఠకం ద్వితీయోనువాకంలో ఇంకొక కథ ఉన్నాయి. వీటిలో మొదట ద్వితీయాష్టకం పంచమ ప్రపాఠకం ప్రథమోనువాకంలో ఉన్న కథను పరిశీలించుదాం. ఆ కథ ఇది.

**మొదటి కథ:**

త్వష్ట కుమారుడైన విశ్వరూపుడు దేవతలకు పురోహితుడుగా ఉండేవాడు. ఇతనికి మూడు శిరస్సులు ఉంటాయి. వీటిలో సాత్వికమైన శిరస్సు సోమపానాన్ని, రాజసమైన శిరస్సు అన్నాన్ని, తామసమైన శిరస్సు సురాపానాన్ని సేవించేవి. విశ్వరూపుడు రాక్షసులకు మేనల్లుడు. ఇతడు యజ్ఞం చేసేటపుడు ప్రత్యక్షంగా దేవతలకు హవిర్భాగం చెప్పేవాడు. రహస్యంగా హవిస్సును అసురులకు ఇవ్వండి అని చెప్పేవాడు. లోకంలో ప్రత్యక్షంగా అందరికీ తెలిసేటట్లుగా ఒక విషయాన్ని చెప్పి, రహస్యంగా తద్భిన్నంగా చెప్పినపుడు ప్రత్యక్షంగా చెప్పినది హృదయ పూర్వకంగా చెప్పినది కాదని దానిపట్ల విశ్వాసం కలగదు. రహస్యంగా

చెప్పినది హృదయ పూర్వకంగా చెప్పినది అవుతుంది కాబట్టి దానిపట్ల విశ్వాసం కలుగుతుంది. విశ్వరూపుడు ఈ విధంగా స్వామిద్రోహం చేసి తన స్వర్గ రాజ్యాన్ని అసురులకు లభించేటట్లుగా చేస్తాడని ఇంద్రుడు భయపడి విశ్వరూపుని శిరస్సులను వజ్రాయుధంతో ఖండిస్తాడు. విశ్వరూపుని మూడు శిరస్సుల్లో సురాపానం చేసే శిరస్సు కముజుపిట్టగా, అన్నం తినే శిరస్సు తీతువుపక్షిగా, సోమపానం చేసే శిరస్సు పిచ్చుకగా మారిపోతాయి. విశ్వరూపుని సంహరించడం చేత వచ్చిన బ్రహ్మహత్యా పాతకాన్ని ఇంద్రుడు సంవత్సరం పాటు ఎలాంటి ప్రాయశ్చిత్తం లేకుండా భరిస్తాడు. అపుడు సర్వప్రాణులు ఇంద్రుని బ్రహ్మహంత అని సంభోదిస్తూ ఆక్రోశించాయి.

"స పృథివీ ముపాసీద దస్యై బ్రహ్మహత్యాయై తృతీయం ప్రతిగృహాణేతి సా బ్రవీ ద్వరం వృణై ఖాతా త్పరాభవిష్యన్తీ మన్యే తతో మా పరాభూవమితి పురా తే (2) సంవత్సరాదపి రోహదిత్యబ్రవీ త్తస్మాత్పురా సంవత్సరా త్పృథివ్యై ఖాతమపి రోహతి వారేవృతగ్ం హ్యస్యై తృతీయం బ్రహ్మహత్యాయై ప్రత్యగృహ్ణ త్తత్స్వకృత మిరిణ మభవత్తస్మా దాహితాగ్నిః శ్రద్ధాదేవః స్వకృత ఇరిణే నావ స్యేద్బ్రహ్మ హత్యాయై హ్యేష వర్ణః."

అప్పుడు ఇంద్రుడు భూమి వద్దకు వెళ్ళి తనకు కలిగిన బ్రహ్మహత్యలో మూడవ భాగాన్ని స్వీకరించమని భూమిని ప్రార్థిస్తాడు. దానికి భూమి ప్రజలు నన్ను తవ్వి బాధపెడుతున్నారు. తవ్విన ప్రదేశాలు సంవత్సరానికి పూర్వమువి అయినప్పటికీ పూరింపబడాలి అని వరాన్ని కోరుకొని ఇంద్రుని బ్రహ్మహత్యలో మూడవభాగాన్ని స్వీకరిస్తుంది. ఇంద్రుని వరం వల్లనే భూమిలో తవ్విన ప్రదేశం పూరితమవుతూ ఉంది. భూమి స్వీకరించిన బ్రహ్మహత్య భూమిలో ఉప్పు చవిటినేల అయింది. ఇది బ్రహ్మహత్య వల్ల ఏర్పడింది కావడం చేత నిత్యాగ్నిహోత్రుడైన సోమయాజి ఉప్పు చవిటినేలలో నివసించకూడదు. తర్వాత ఇంద్రుడు వృక్షాల వద్దకు వెళ్ళి తనకు కలిగిన బ్రహ్మహత్యలో మూడవ భాగాన్ని స్వీకరించవలసిందిగా వృక్షాలను కోరతాడు. వృక్షాలు "మేము మా ఛిన్నప్రదేశం (నరకబడిన ప్రదేశం) వల్ల బాధపడుతున్నాం. అలా బాధపడకుండా ఉండేటట్లుగా వరం ఇవ్వాలి" అని చెబుతాయి. "మీ ఛిన్న ప్రదేశం నుంచి ఎక్కువ మొలకలు వస్తాయి" అని ఇంద్రుడు వాటికి వరం ఇస్తాడు. వృక్షాలు ఇంద్రుని బ్రహ్మహత్యలో మూడవభాగాన్ని స్వీకరిస్తాయి. ఆ బ్రహ్మహత్య వల్ల వృక్షాల ఛిన్న ప్రదేశం నుంచి స్రవించి, ఘనీభవించిన ద్రవం జిగురు అవుతుంది. అది బ్రహ్మహత్యా ఫలం కాబట్టి అది తినదగినది కాదు. తర్వాత ఇంద్రుడు స్త్రీలు కూర్చొని ఉన్న సభ వద్దకు వెళ్ళి తన బ్రహ్మహత్యా పాతకంలో మూడవభాగం తీసుకోవలసిందిగా వారిని కోరతాడు. దానికి వారు "మేము ఋతు సంబంధమైన వీర్యం వల్ల సంతానాన్ని పొందుతాము. ప్రసవ పర్యంతం కోరికననుసరించి పురుషునితో కలుస్తాం. అలా కలవడం వల్ల గర్భోపద్రవం గానీ నిషిద్ధ దిన కృత ప్రత్యవాయం గానీ మాకు కలగకూడదు." అని వరాన్ని కోరతారు. ఆ వరాన్ని ఇంద్రుడు వారికి ఇస్తాడు. స్త్రీలు ఇంద్రుని బ్రహ్మహత్య యొక్క తృతీయభాగాన్ని స్వీకరిస్తారు. ఇంద్రుడు ఇచ్చిన వరం వల్లనే స్త్రీలు ఋతుసంబంధమైన వీర్యం వల్ల సంతానాన్ని

పొంది, ప్రసవ పర్యంతం కోరికననుసరించి పురుషులతో కలుస్తున్నారు. స్త్రీలు స్వీకరించిన బ్రహ్మహత్య వారిలో రజస్వల అయింది. అందువల్ల రజస్వల అయిన స్త్రీతో మాట్లాడరాదు. కలిసి కూర్చోరాదు. ఇంతటితో ఈ కథ[10] ముగుస్తుంది.

ఈ కథలో విశ్వరూపుడు బ్రాహ్మణుడు కావడం వల్ల అతన్ని చంపడం చేత బ్రహ్మహత్యా పాతకం ఇంద్రునికి సంక్రమించినట్లుగా చెప్పబడింది. ఇంద్రుడు ఎలాంటి ప్రాయశ్చిత్తం లేకుండా సంవత్సరం పాటు దాన్ని భరించాడు. అయితే ప్రాణులన్నీ అతన్ని బ్రహ్మహంత అని నిందించడం చేత ఇంద్రుడు తనకు సంక్రమించిన బ్రహ్మహత్యా పాతకాన్ని వదిలించుకోవడానికి ప్రయత్నించాడు. ఇందులో భాగంగా బ్రహ్మహత్యా పాతకాన్ని మూడు భాగాలుగా చేసి భూమి, వృక్షాలు, స్త్రీలకు ఒక్కొక్కరికీ ఒక్కొక్క భాగం చొప్పున ఇచ్చి ప్రత్యుపకారంగా ఆ మూడింటికీ మూడు వరాలు ఇస్తాడు. ఇంద్రుని బ్రహ్మహత్యా పాతకం స్వీకరించడం వల్ల ఆ మూడింటికి సంక్రమించిన లక్షణాలు, ఇంద్రుడు ఇచ్చిన వరాల వల్ల ఆ మూడింటికీ సంక్రమించిన లక్షణాలు అంతకుముందు నుంచి ప్రకృతిలో ఉన్నాయి. భూమిలో గోతిని తవ్వితే గాలి వల్ల, వర్షం వల్ల ఆ గోతిలో మట్టి, ఆకులు మొదలైనవి చేరి ఆ గోయి దానంతట అదే పూడుకుపోతుంది. అలాగే భూమిలో అనేక కారణాల చేత ఉప్పు, చవిటి నేలలు ఏర్పడుతున్నాయి. చెట్ల కొమ్మలు నరికితే నరికిన దగ్గర అనేక మొలకలు వస్తాయి. అలాగే చెట్టును నరికిన దగ్గర ద్రవం కారి అది గట్టిపడి జిగురుగా మారుతుంది. స్త్రీ ఋతుమతి అయిన తర్వాత పురుషునితో సంభోగించడం వల్ల సంతానవతి అవుతుంది. ప్రసవం తర్వాత స్త్రీలు తమ కోరికననుసరించి పురుషులతో కలుస్తున్నారు. అలాగే స్త్రీలు అనాది నుంచి రజస్వలలు అవుతున్నారు. ఈ విధంగా భూమి, వృక్షాలు, స్త్రీలు ఆది నుంచి ప్రకృతిలో పై లక్షణాలను కలిగి ఉన్నారు. ఈ లక్షణాలన్నీ ఇంద్రుని వరాల వల్ల, అతని నుంచి తీసుకున్న బ్రహ్మహత్యా పాతకం వల్ల భూమి, వృక్షాలు, స్త్రీలకు సంక్రమించినట్లుగా ఈ కథలో కవి కల్పించడం చేత ఇది కట్టు కథ అవుతూ ఉంది.

ఈ కథలో ఇంద్రుడు విశ్వరూపుని చంపడానికి తగిన కారణం చెప్పబడింది. విశ్వరూపుడు దేవతల పురోహితుడు కాబట్టి అతడు వారి హితాన్నే కోరాలి. వారికి మేలు కలిగించే పనులే చేయాలి. దేవతల శత్రువులైన అసురులకు మేలు కలిగించే పనులు అసలు చేయకూడదు. ఈ కథలో విశ్వరూపుడు దేవతలకు చెందవలసిన హవిర్భాగాన్ని వారికి చెందకుండా చేయడమే కాకుండా, వారి శత్రువులైన అసురులకు దొంగచాటుగా చెందేటట్లు చేయడం నిజంగా దేశద్రోహం, స్వామిద్రోహం. ఇలాంటి వారిని క్షమించగూడదు. దేవేంద్రుడు స్వామిద్రోహి అయిన విశ్వరూపుని చంపడంలో ఎలాంటి దోషం, అన్యాయం లేదు. అయినప్పటికీ ఇతని చంపడం వల్ల బ్రహ్మహత్యా పాతకం సాక్షాత్తు దేవతల రాజైన దేవేంద్రునికి సంక్రమించినట్లుగా ఈ కథలో చెప్పబడింది. అంతేకాకుండా సకల ప్రాణులు అతనిని బ్రహ్మహంత అని నిందించినట్లుగా ఈ కథను రాసిన కవి చెప్పాడు. ఇలాంటి రాతలన్నీ ఆనాటి బ్రాహ్మణకవులు స్వార్థంతో రాసినవి. తమ కులానికి చెందినవారు ఎన్ని అన్యాయాలు,

అక్రమాలు, దేశద్రోహాలు, స్వామిద్రోహాలు చేసినప్పటికీ వారిని చంపకూడదని, చంపితే చంపినవాడు ఎంత గొప్పవాడైనప్పటికీ బ్రహ్మహత్యా పాతకం వల్ల బాధపడవలసి ఉంటుందని ప్రజలను భయపెట్టడానికే ఆనాటి బ్రాహ్మణ కవి ఇలాంటి రాతలను రాశాడు.

ఇంద్రుడు తనకు సంక్రమించిన బ్రహ్మహత్యా పాతకాన్ని ఇతరులకు పంచి ఇచ్చినట్లుగా ఈ కథలో చెప్పడం ఉచితంగా లేదు. ఎందుకంటే పుణ్యమైనా పాపమైనా అది చేసినవాడే అనుభవించాలని మన కర్మ సిద్ధాంతం చెబుతూవుంది. అలాంటప్పుడు ఇంద్రుడు తనకు సంక్రమించిన బ్రహ్మహత్యాపాతకాన్ని తానే అనుభవించాలి గాని ఏ పాపం చేయని భూమి, చెట్లు, స్త్రీలకు తన పాపాన్ని పంచి ఇవ్వడం దుర్మార్గం, కర్మసిద్ధాంతానికి వ్యతిరేకం. ఇందువల్ల ఇంద్రుడు తన బ్రహ్మహత్యను ఇతరులకు పంచి ఇచ్చినట్లుగా చెప్పిన ఈ భాగం ఉచితంగా లేదని చెప్పవచ్చు.

దీని కొనసాగింపు కథ ఈ కథకంటే ముందు ఉన్న చతుర్థప్రపాఠకం ద్వాదశానువాకంలో ఉంది. ఆ కథ ఇది.

**రెండవ కథ:**

ఇంద్రుడు తన కుమారుడైన విశ్వరూపుని సంహరించడం చేత త్వష్ట కోపించి ఇంద్ర రహిత సోమయాగం చేయడానికి ఉపక్రమిస్తాడు. యాగానికి తనను ఆహ్వానించమని ఇంద్రుడు త్వష్టకు చెబుతాడు. నువ్వు నా కుమారుని చంపావు కాబట్టి నిన్ను ఆహ్వానించనని త్వష్ట ఇంద్రునికి చెబుతాడు. ఇంద్రుడు త్వష్ట యాగానికి విఘాతం కలిగించి బలవంతంగా సోమరసం తాగుతాడు. ఇంద్రుడు తాగగా మిగిలిన అల్పమైన సోమరసాన్ని త్వష్ట తీసుకొని అభిచారహోమాన్ని చేయడానికి ఆహవనీయాగ్ని దగ్గరకు వెళ్ళి ఇంద్రుని చంపగల శత్రువును సృష్టింపదలచి అగ్నిని ప్రవర్తింపజేసి "స్వాహేన్ద్రశత్రు ర్వర్ధస్వ" అనే మంత్రాన్ని ఆద్యుదాత్త స్వరంతో ఉచ్చరిస్తాడు. నిజానికి ఆ మంత్రాన్ని అంత్యోదాత్త స్వరంతో ఉచ్చరించాలి. అంత్యోదాత్త స్వరంతో ఉచ్చరిస్తే తత్పురుష సమాసం అవుతుంది. ఆద్యుదాత్త స్వరంతో ఉచ్చరిస్తే బహువ్రీహి సమాసం అవుతుంది. "స్వాహేన్ద్రశత్రు ర్వర్ధస్వ" అనేదానికి తత్పురుష సమాసంలో ఇంద్రుని యొక్క శత్రువు వృద్ధినొందుగాక అనే అర్థం వస్తుంది. ఇంద్రుని శత్రువు తానే కాబట్టి తన కోరిక నెరవేరుతుంది. బహువ్రీహి సమాసమైతే శమింపజేయు ఇంద్రుడు గలవాడు వృద్ధినొందుగాక అనే అర్థం వస్తుంది. ఇది త్వష్టకు హానికరం. ఈ స్వరాపరాధం వల్ల ఊర్ధ్వముఖంగా ప్రజ్వలిస్తున్న అగ్ని అణిగిపోతుంది. ఇది యజమాని (యజ్ఞం చేసేవాని) కార్యసిధ్యభావాన్ని సూచిస్తుంది. ఆద్యుదాత్త స్వరంతో మంత్రాన్ని ఉచ్చరించడం వల్ల బహువ్రీహి సమాసార్థాన్ని పురస్కరించుకొని ఆ అగ్ని ఇంకొక పురుషరూపంలో ఉద్భవించి బాణపాత మగునంత మేరకు (విల్లునుంచి వదలివేయబడిన బాణం వెళ్ళినంత వరకూ) వ్యాపించి ప్రతిదినం సర్వదిక్కులకు వ్యాపిస్తూ అన్ని లోకాలను ఆవరిస్తాడు. కాబట్టి ఆ పురుషునికి వృత్ర అనే పేరు వస్తుంది.

అలాంటి వృత్రుని చూసి ఇంద్రుడు భయపడతాడు. వృత్రుడు లోకాలన్నింటిని ఆవరించడం చేత తనకు కూడా స్థానం లేదని త్వష్ట భయపడతాడు. అప్పుడు త్వష్ట వృత్రుని సంహరించడానికి ఇంద్రునితో మైత్రి చేసుకొని వజ్రాయుధానికి అస్త్రసిద్ధి కోసం అభిమంత్రించిన జలంతో క్షాళనం చేసి ఇంద్రునికి ఇస్తాడు. అభిమంత్రణ మహిమ చేత ఆ వజ్రాయుధం తపోరూపమే అవుతుంది. అయితే ఇంద్రుడు వజ్రాయుధాన్ని ప్రయోగించడానికి సమర్థుడు కాలేదు. అపుడు ఇంద్రుని ఎదుట విష్ణువు అనే ఇంకొక దేవత ప్రత్యక్షమవుతాడు. ఇంద్రుడు అతనితో "ఓ విష్ణూ ! వృత్రుని సామర్థ్యాన్ని స్మరించి భయపడిన నా చేయి వజ్రాయుధాన్ని కదల్చలేకపోతూ ఉంది. వృత్రుడు ఏ సామర్థ్యం చేత ఈ జగత్తులో వ్యాపించాడో ఆ సామర్థ్యాన్ని అపహరించుదాము రా" అని అంటాడు. అప్పుడు విష్ణువు ముల్లోకాలను రక్షించడానికి తన మూర్తిని మూడుభాగాలుగా చేసి ఒక భాగాన్ని భూలోకంలో, ఇంకొక భాగాన్ని అంతరిక్షలోకంలో, మూడవ భాగాన్ని ద్యులోకంలో స్థాపిస్తాడు. ఇంద్రుడు భూలోకంలో ఉన్న విష్ణు దేవత శరీర తృతీయభాగంతో కలిసి విష్ణువుకు వెనుక నిలబడి వృత్రుని చంపడానికి వజ్రాయుధాన్ని ఎత్తుతాడు. అప్పుడు వృత్రుడు భయపడి "ఓ ఇంద్రా! నా శరీరాన్ని వధింపకు పృథివిని ఆక్రమించడానికి తగిన నా సామర్థ్యమంతటినీ నీకిస్తాను" అని చెబుతాడు. ఇంద్రుడు వృత్రుని నుంచి ఆ సామర్థ్యాన్ని స్వీకరించి " ఓ విష్ణు నన్ను ధరింపజేయుము" అని పలుకుతూ ఆ సామర్థ్యాన్ని విష్ణువుకు ఇస్తాడు. విష్ణువు "మనలో ఇంద్రుడు ఈ సామర్థ్యాన్ని ధరించుగాక" అని అభిలషించి ఇంద్రుని నిమిత్తం ఆ సామార్థ్యాన్ని స్వీకరిస్తాడు. తర్వాత ఇంద్రుడు అంతరిక్షంలో ఉన్న విష్ణు దేవత రెండవభాగంతో కలిసి విష్ణువు వెనుక ఉండి వజ్రాయుధాన్ని ఎత్తుతాడు. దానికి వృత్రుడు భయపడి " ఓ ఇంద్రా! నా శరీరాన్ని వధింపవద్దు. నేను ఏ సామర్థ్యంతో ఈ అంతరిక్షలోకాన్ని ఆక్రమించానో ఆ సామర్థ్యాన్ని నీకిస్తాను అని ఇంద్రునికి చెప్పి ఆ సామర్థ్యాన్ని ఇంద్రునికి ఇస్తాడు. ఇంద్రుడు దాన్ని గ్రహించి విష్ణువుకు ఇస్తాడు. "మనలో ఇంద్రుడు ఈ సామర్థ్యాన్ని ధరించుగాక" అని అభిలషించి ఇంద్రుని నిమిత్తం ఆ సామర్థ్యాన్ని స్వీకరిస్తాడు. తర్వాత ఇంద్రుడు ద్యులోకంలో ఉన్న విష్ణు దేవతా శరీరభాగంతో కలిసి విష్ణువు వెనుక ఉండి వృత్రుని మీదికి వజ్రాయుధాన్ని ఎత్తుతాడు. వృత్రుడు భయపడి "ఇంద్రా! నా శరీరాన్ని వధింపవద్దు. నేను ఏ సామర్థ్యంతో ఈ ద్యులోకాన్ని ఆక్రమించానో ఆ సామర్థ్యాన్ని నీకిస్తాను" అని చెప్పగా, ఇంద్రుడు వృత్రుని ఆసామర్థ్యాన్ని స్వీకరించి విష్ణువుకు ఇస్తాడు. విష్ణువు దానిని ఇంద్రుని కోసం స్వీకరిస్తాడు. ఈ విధంగా ఇంద్ర వృత్తులు సంధి చేసుకుంటారు.

సంధి చేసుకున్న తర్వాత వృత్రుడు "ఇంద్రా! నేను నీలో ప్రవేశిస్తాను" అని అంటాడు. "వృత్రా! నీవు నాలో ప్రవేశించి నన్ను భుజిస్తావా?" అని ఇంద్రుడంటాడు. దానికి వృత్రుడు "నేను నిన్ను భుజింపను. ఉదారాగ్ని పాటవం చేత నిన్ను దీపింపజేస్తాను. అది నీకు బహువిధాన్న భోగం కోసం ఉపయోగపడుతుంది" అని చెప్పి వృత్రుడు ఇంద్రునిలో ప్రవేశించి అతని ఉదరంగా (పొట్టగా) మారతాడు. లోకంలో కూడా మానవుని ఉదరంలో ఉన్న ఆకలి

ఎక్కువ బాధ కలిగించే సహజ శత్రువు. ఈ ఉదర ఆవిర్భావ వృత్తాంతాన్ని తెలుసుకున్నవాడు శత్రువైన ఆకలిని నశింపజేస్తాడు. ఇంతటితో ఈ కథ[11] ముగుస్తుంది.

ఈ కథలో వేదమంత్రాల మాహాత్మ్యం వివరింపబడింది. వేదమంత్రాలను నిర్దిష్టమైన స్వరంతో ఉచ్చరించాలి. స్వరభేదంతో ఉచ్చరిస్తే దానివల్ల అర్థభేదం కలిగి ఆశించిన ప్రయోజనం నెరవేరకపోగా తద్వతిరేకమైన ఫలితం వచ్చే అవకాశం ఉందని వైదికులు చెబుతారు. ఈ కథలో త్వష్ట ఇంద్రుని సంహరించగల శక్తివంతున్ని సృష్టింపదలచి ఆహవనీయాగ్ని దగ్గరికి వెళ్ళి "స్వాహేన్ద్ర శత్రు ర్వర్ధస్వ" అనే మంత్రాన్ని స్వరభేదంతో ఉచ్చరించడం వల్ల యజ్ఞగుండం నుంచి వృత్రుడు ఉద్భవించి ముల్లోకాలను ఆక్రమిస్తాడు. అతన్ని చూసి అతన్ని సృష్టించిన త్వష్టకూడా భయపడి అతన్ని సంహరించడానికి తన శత్రువైన ఇంద్రునితో కలిసి ప్రయత్నించవలసి వస్తుంది. ఈ ప్రయత్నంలో భాగంగా త్వష్ట వజ్రాయుధానికి అస్త్రసిద్ధి కలిగించడానికి దాన్ని అభిమంత్రించిన జలంతో క్షాళనం చేసి వృత్రుని మీద ప్రయోగించమని ఇంద్రునికి ఇస్తాడు. తపోరూపమైన వజ్రాయుధాన్ని ఇంద్రుడు వృత్రుని మీద ప్రయోగించడానికి ఎత్తలేడు. అంటే అభిమంత్రించిన జలం యొక్క మాహాత్మ్యం చాలా గొప్పదని ఈ కథలో చెప్పబడింది. అప్పుడు ఇంద్రునికి సహాయం చేయడానికి విష్ణువు ప్రత్యక్షమై తనమూర్తిని మూడు భాగాలుగా చేసి ఒకభాగాన్ని భూలోకంలో, రెండవ భాగాన్ని అంతరిక్షలోకంలో మూడవభాగాన్ని ద్యులోకంలో స్థాపిస్తాడు. ఇంద్రుడు భూలోకం, అంతరిక్షలోకం, ద్యులోకం లో ఉన్న విష్ణువు భాగంతో కలిసి వజ్రాయుధంతో ముల్లోకాల్లో వ్యాపించిన వృత్రుని శరీరాన్ని సంహరించే ప్రయత్నం చేయగా వృత్రుడు భయపడి ఆయా లోకాల్లో ఉన్న తన సామర్థ్యాన్ని ఇంద్రునికిచ్చి ఇంద్రునితో సంధి చేసుకుంటాడు. ఇలా సంధి చేసుకున్నట్లుగా చెప్పిన ఈ కథ సమంజసంగా లేదు. వృత్రవధలో ఇంద్రునికి సహాయం చేయడానికి పిలవకుండా వచ్చిన విష్ణువు ప్రయత్నం ఇంద్రవృత్రులు సంధి చేసుకోవటంతో నిష్ఫలమైంది.

వృత్రుడు తన సామర్థ్యం మొత్తాన్ని ఇంద్రునికిచ్చిన తర్వాత అతను ఇంద్రునిలో ప్రవేశించి పొట్టగా మారిపోతాడు. అంటే అంతకుముందు ఇంద్రునికి ఉదరం లేదన్నమాట. ఉదరం లేకపోవడం వల్ల ఆకలి దప్పికల సమస్య ఉండదు. అంటే ఒకరకంగా వృత్రుడు ఇంద్రుని ఉదరంగా మారి అతనికి ఆకలి దప్పికలు సృష్టించి ఇంద్రుని మీద తన పగను సాధించాడు. అప్పటినుంచే మానవులకు కూడా ఉదరం ఏర్పడింది. ఈ భాగంలో కట్టుకథా లక్షణం ఉంది. మనుషులకు మిగిలిన అన్ని ప్రాణులకు ఉదరభాగం ఉండడం, దానివల్ల ఆకలి దప్పికలు ఏర్పడడం, ఆకలి దప్పికల కోసం ఆహారం, నీరు తీసుకోవడం ఉంది. దీన్ని గమనించిన కవి ఈ కథలో వృత్రుడు ఇంద్రుని పొట్టగా మారినట్లుగా కల్పించడం చేత ఇది కట్టుకథ అవుతూ ఉంది. ఈ కథలో వృత్ర వధ చెప్పబడలేదు. ఇందులో ఇంద్రుడు, వృత్రుడు సంధి చేసుకున్నట్లుగా చెప్పబడింది. ద్వితీయాష్టకం పంచమ ప్రపాఠకం ద్వితీయోనువాకంలో వృత్రవధ కథ చెప్పబడింది. ఆ కథ ఇది.

**మూడవ కథ:**

ఇంద్రుడు తన కుమారుడైన విశ్వరూపుని సంహరించడం చేత త్వష్ట కోపించి ఇంద్ర రహిత సోయయాగం చేయడానికి ఉపక్రమిస్తాడు. యాగానికి తనను ఆహ్వానించమని ఇంద్రుడు త్వష్టకు చెబుతాడు. నువ్వు నా కుమారుని చంపావు కాబట్టి నిన్ను ఆహ్వానించనని త్వష్ట ఇంద్రునికి చెబుతాడు. ఇంద్రుడు త్వష్ట యాగానికి విఘాతం కలిగించి బలవంతంగా సోమరసం తాగుతాడు. ఇంద్రుడు తాగగా మిగిలిన అల్పమైన సోమరసాన్ని త్వష్ట తీసుకొని అభిచారహోమాన్ని చేయడానికి ఆహవనియాగ్ని దగ్గరకు వెళ్ళి ఇంద్రుని చంపగల శత్రువును సృష్టింపదలచి అగ్నిని ప్రవర్తింపజేసి "స్వాహేన్ద్రశత్రు ర్వర్ధస్వ" అనే మంత్రాన్ని స్వరంతో ఉచ్చరిస్తాడు. వెంటనే అగ్ని నుంచి ఇంద్రుని శత్రువు పురుషరూపంలో ఉద్భవించి బాణపాత మగునంత మేరకు (విల్లునుంచి వదలివేయబడిన బాణం వెళ్ళినంత వరకూ) వ్యాపించి ప్రతిదినం సర్వదిక్కులకు వ్యాపిస్తూ అన్ని లోకాలను ఆవరిస్తాడు. కాబట్టి ఆ పురుషునికి వృత్ర అనే పేరు వస్తుంది.

అలాంటి వృత్రుని చూసి ఇంద్రుడు భయపడి ప్రజాపతి వద్దకు వెళ్ళి తనకు శత్రువు కలిగాడని చెబుతాడు. ప్రజాపతి వజ్రాన్ని మంత్రజలంతో ప్రోక్షించి ఈ వజ్రంతో శత్రువులను సంహరింపుమని ఇంద్రునికి ఇస్తాడు. ఇంద్రుడు వజ్రాన్ని తీసుకొని వృత్రుని సంహరించడానికి వస్తాడు. "ఓ ఇంద్రా! మేము వృత్రుని ముఖంలో ఉన్నాము, కాబట్టి అతన్ని సంహరించవద్దు" అని అగ్నిసోములు ఇంద్రునితో చెబుతారు. "మీరు నాకు సంబంధించినవారు, కాబట్టి నా వద్దకు రండి" అని ఇంద్రుడు వారితో చెబుతాడు. అపుడు అగ్నిసోములు హవిర్భాగాన్ని కోరతారు. ఇంద్రుడు పూర్ణమాస యాగంలో అగ్నీ షోమ దేవతాకమును ఏకాదశకపాల సంస్కృతము అయిన పురోడాశమును అగ్నిసోములకు ఇస్తాడు. "అగ్నీషోమీయ మేకాదశ కపాలం నిర్వపేత్" అనే విధి ఇక్కడ స్ఫురిస్తున్నది. అపుడు అగ్ని సోములు "మేము వృత్రుని నోటిలో ఉన్న దంతాల వరుసల చేత రెండువైపులా కొరకబడుతున్నాము. కాబట్టి మేము వెలుపలికి రావడానికి అశక్తులము" అని చెబుతారు. అపుడు ఇంద్రుడు శీతజ్వరాన్ని, దానివల్ల వచ్చే తాపాన్ని పుట్టించి వృత్రుని మీదికి పంపిస్తాడు. శీతజ్వర తాపాలచేత నశింపజేయబడుతున్న వృత్రుని నోటినుంచి అగ్నిసోములు వెలుపలికి వస్తారు. అపుడు ఇంద్రుడు వృత్రుని సంహరించడానికి పూనుకుంటాడు. ఆ సమయంలో ద్యావా భూములు " వృత్రుని చంపవద్దు. ఇతడు భూమి నుంచి దివి వరకూ మమ్ములను వ్యాపించి ఉన్నాడు" అని ఇంద్రునితో చెబుతాయి. అందుకు ఇంద్రుడు సుముఖంగా లేడని గ్రహించి వరాన్ని కోరతాయి. "నేను నక్షత్రాల చేత అలంకృతనై ఉంటాను" అని దివి పలుకుతుంది. "నేను మనుష్య పశు వృక్ష నగ నది సముద్రం మొదలైనవాటి చేత అలంకృతనౌతాను" అని పృథివి కోరుతుంది. ఇంద్రుడు వాటికి ఆ వరాలను ఇస్తాడు. ఈ కారణం చేతనే దివి నక్షత్రాల చేత అలంకరింపబడింది. భూమి మనుష్యులు మొదలైనవారిచేత అలంకరింపబడింది. ఆ తర్వాత ఇంద్రుడు వృత్రుని సంహరిస్తాడు.

అపుడు ఇంద్రుని పక్కన ఉన్న దేవతలందరూ ఇంద్రునితో కలిసి వృత్రుని సంహరించి తమకోసం హవిస్సును వహించాలని వృత్రుని ముఖం నుంచి బయటకు వచ్చిన అగ్నిసోములను అడుగుతారు. దానికి అగ్నిసోములు తాము చిరకాలం వృత్రుని దంతాలచేత కొరకబడి తేజస్సును కోల్పోయామని, ఆ తేజస్సు వృత్రునిలోనే ఉన్నదని చెబుతారు. అపుడు దేవతలందరూ వృత్రుని నుండి ఆ తేజస్సును తీసుకొని రావలసిందిగా గోవును కోరతారు. అపుడు గోవు దేవతలను "అగ్నిసోములకు సంబంధించిన తేజస్సును వృత్రుని శరీరం నుంచి తీసుకొని వస్తాను. ఆ తేజస్సు నాయందే ఉండాలి. అలా ఉన్న ఆ తేజస్సుతో భోజనం నిర్వర్తించాలి" అని వరాన్ని కోరి, ఆ వరాన్ని పొంది గోవు తేజస్సును తెస్తుంది. ఈ వరం కారణంగానే లోకంలో గోవు వల్ల వచ్చే పాలు, నెయ్యిలను ప్రజలు భోజనంగా ఏర్పరుచుకున్నారు. పయస్సు(పాలు) సోముని తేజస్సు, ఘృతం(నెయ్యి) అగ్ని తేజస్సు. ఇంతటితో ఈ కథ[12] ముగుస్తుంది.

కృష్ణయజుర్వేదం ప్రధానంగా యజ్ఞయాగాల విధి విధానాలకు సంబంధించినది. పూర్ణమాస యాగంలో అగ్నిసోములకు( అగ్ని ,చంద్రుడు) ఏకాదశ కపాల సంస్కృతమైన పురోఢాశాన్ని (11పిడతల్లో పురోఢాశాన్ని) ఇవ్వటం సంప్రదాయం. ఈ సంప్రదాయానికి అనుగుణంగా పై కథలో అగ్నిసోములు హవిర్భాగాన్ని కోరుకోగా ఇంద్రుడు వారికి పూర్ణమాసయాగంలో ఏకాదశకపాల సంస్కృతమైన పురోఢాశాన్ని వరంగా ఇచ్చినట్లు ఈ కథలో కల్పించబడింది. అందువల్ల ఈ కథలోని ఈ భాగంలో కట్టుకథా లక్షణం ఉంది.

అలాగే అగ్నిసోములు వృత్రుని నోట్లో నుంచి బయటికి రావడానికి ఇంద్రుడు శీతజ్వర తాపాలను పుట్టించి వృత్రుని మీదకు ప్రయోగించగా నశింపజేయబడుతున్న వృత్రుని నోటినుంచి అగ్నిసోములు బయటికి వచ్చినట్లుగా ఈ కథలో చెప్పబడింది. లోకంలో జ్వరం, దానివల్ల వచ్చే తాపం వల్ల మనుషులు బాధపడుతూ నోరు తెరుస్తారు. దీన్ని గమనించిన పండితకవి ఈ కథలో ఇంద్రుడు జ్వరతాపాలను పుట్టించి వృత్రుని మీదికి ప్రయోగించినట్లుగా కల్పించి చెప్పాడు. అందువల్ల ఈ భాగం కూడా కట్టుకథ అవుతుంది.

ఈ కథలో ఇంద్రుడు ఇచ్చిన వరాల వల్ల ఆకాశం నక్షత్రాల చేత అలంకరించబడినట్లు, భూమి మనుషులు, పశువులు, వృక్షాలు, కొండలు, నదులు, సముద్రాల చేత అలంకరించబడినట్లు చెప్పబడింది. ఆకాశంలో నక్షత్రాలు, భూమి మీద మనుషులు, పశువులు, వృక్షాలు మొదలైనవి ఉండడం గమనించిన ఈ కవి భూమ్యాకాశాలు ఇంద్రుని వరాల వల్ల పై వాటిని పొందినట్లుగా కల్పించడం చేత ఇది కట్టుకథ అవుతూ ఉంది.

అలాగే గోవు చనిపోయిన వృత్రుని నుంచి అగ్నిసోముల తేజస్సును తెచ్చి తనలో ఉంచుకున్నట్లుగా వాటిలో సోముని తేజస్సు వల్ల పాలు, అగ్ని తేజస్సు వల్ల ఘృతం పొంది వాటిని ప్రజలకు ఆహారంగా చేసినట్లు ఈ కథలో కల్పించబడింది. లోకంలో గోవు పాలు, పాలనుండి తీసిన నెయ్యి ప్రజలకు ఆహారంగా ఉండడం గమనించిన కవి ఈ కథలో అవి రెండూ వృత్రుని శరీరం నుంచి తెచ్చిన అగ్నిసోముల తేజస్సుగా కల్పించడం చేత ఇది కట్టుకథ అవుతూవుంది.

భారతంలోని ఇంద్ర వృత్రుల కథలను కృష్ణయజుర్వేదీయ తైత్తరీయ సంహితలోని ఇంద్ర వృత్ర కథలతో పోల్చి పరిశీలించాలి. కృష్ణయజుర్వేదంలోని రెండవ కథలో త్వష్ట దేవేంద్రుని సంహరించగల శత్రువును సృష్టింపగోరి స్వరాపరాధంతో మంత్రోచ్చారణ చేయడం వల్ల వృత్రుడు ఉద్భవించి తన శరీరాన్ని సర్వదిక్కులకు వ్యాపింపజేసి సర్వలోకాలను ఆవరించినట్లుగా చెప్పబడింది. దీన్ని అనుసరించి శాంతిపర్వంలోని కథను కల్పించిన కవి వృత్రుడు 500యోజనాల ఎత్తు, 300 యోజనాల లావు ఉన్నట్లుగా చెప్పాడు. కృష్ణ యజుర్వేదంలోని కథలో బ్రాహ్మణుడైన విశ్వరూపుని చంపడం వల్ల దేవేంద్రునికి బ్రహ్మహత్య సంక్రమించినట్లుగా చెప్పబడగా భారతంలోని కథలో వృత్రాసురుని దేవేంద్రుడు చంపడం వల్ల అతనికి బ్రహ్మహత్యా పాతకం చుట్టుకున్నట్లుగా చెప్పబడింది. ఈ కల్పన సమంజసంగా లేదు. ఎందుకంటే బ్రహ్మహత్యా పాతకం బ్రాహ్మణుని చంపడం వల్ల మాత్రమే సంక్రమిస్తుందని మన ప్రాచీన గ్రంథాల్లో ఉంది. వృత్రుడు బ్రాహ్మణుడు కాడు. అసురుడు. ఇతన్ని చంపడం వల్ల బ్రహ్మహత్యా పాతకం వచ్చే అవకాశం లేదు. అందువల్ల శాంతిపర్వంలోని కథలో చెప్పిన ఈ విషయం సమంజసంగా లేదని చెప్పవచ్చు. కృష్ణయజుర్వేదంలో దేవేంద్రుడు తన బ్రహ్మహత్యా పాతకాన్ని మూడుభాగాలుగా చేసి భూమి, చెట్లు, స్త్రీలకు పంచి ఇచ్చినట్లుగా చెప్పబడింది. శాంతిపర్వంలోని కథలో ఇంద్రుని బ్రహ్మహత్యా పాతకాన్ని బ్రహ్మ నాలుగు భాగాలుగా చేసి అగ్నికి వృక్షాలు ఓషధులు తృణాలకు, అప్సరసలకు, నీటికి పంచి ఇచ్చినట్లుగా చెప్పబడింది. ఏదైనా ఒక అంశాన్ని మూడుభాగాలుగా చేయడం కంటే నాలుగు భాగాలుగా చేయడం సులభం. ఈ విషయాన్ని గమనించి భారత కవి తను కల్పించిన శాంతిపర్వం కథలో ఇంద్రుని బ్రహ్మహత్యా పాతకాన్ని నాలుగు భాగాలుగా చేసినట్లుగా కల్పించాడు. ఈ కల్పన సమంజసంగానే ఉంది. శాంతిపర్వంలోని ఈ కథలో విశ్వరూపుని ప్రసక్తి లేదు.

భారతం ఉద్యోగపర్వంలోని కథలో త్వష్ట అనే ప్రజాపతి దేవేంద్రుని మీది కోపంతో మూడు తలలు గల విశ్వరూపుడు అనే కొడుకును సృష్టించినట్లుగా, ఈ విశ్వరూపుడు దేవేంద్ర పదవిని కోరి తపస్సు చేస్తున్నట్లుగా, ఇంద్రుడు వజ్రాయుధంతో అతన్ని చంపివేసినట్లుగా, త్వష్ట దానికి కోపించి వృత్రాసురుని సృష్టించి ఇంద్రుని మీదకు పంపించినట్లుగా చెప్పబడ్డది. కృష్ణయజుర్వేదం కథలో విశ్వరూపుడు దేవతలకు ద్రోహం చేయడం వల్ల ఇంద్రుడు అతన్ని చంపినట్లుగా ఉంది. బ్రాహ్మణుడైన విశ్వరూపుడు దేవతలకు ద్రోహం చేశాడని చెప్పడం ఇష్టంలేక భారతం ఉద్యోగపర్వంలోని కథను కల్పించిన బ్రాహ్మణకవి విశ్వరూపుడు ఇంద్రపదవిని కోరి తపస్సు చేస్తున్నట్లుగా కల్పించాడు. ఈ కల్పన సమంజసంగానే ఉంది. ఎందుకంటే దేవేంద్రుడు తనపదవిని కాపాడుకోవడానికి ఎలాంటి పనికైనా సిద్ధపడతాడని మన ప్రాచీన గ్రంథాల్లో చాలా కథలు తెలుపుతున్నాయి. ఆ కథలన్నింటికీ భారతంలోని ఈ కథ మూలమని చెప్పవచ్చు.

ఉద్యోగ పర్వంలోని ఇంద్ర వృత్రుల కథలో ఇంద్రుడు తన కుమారుడైన విశ్వరూపుని చంపడం చేత త్వష్ట కోపించి యజ్ఞం నుంచి వృత్రుని సృష్టించి ఇంద్రుని మీదికి పంపించినట్లు,

ఇంద్రుడు వృత్రుని చేతిలో ఓడిపోయి విష్ణువును శరణు జొచ్చినట్లు, తాత్కాలికంగా ఇంద్రుడు వృత్రునితో సంధి చేసుకోవాలని విష్ణువు ఇంద్రునికి చెప్పినట్లు, ఇంద్రునితో సంధికి వృత్రుడు కొన్ని వరాలు కోరినట్లు దేవతలు వాటికి అంగీకరించి సంధి చేసుకున్నట్లు, ఆ తర్వాత ఇంద్రుడు సమయం చూసుకొని సముద్రపు నురగలో వజ్రాయుధాన్ని ప్రవేశపెట్టి విష్ణువు సాయంతో వృత్రుని సంహరించినట్లు కల్పన చేసాడు. ఈ కల్పనకు మూలం కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ బ్రాహ్మణం ప్రథమకాండ, సప్తమ ప్రపాఠకం ప్రథమోనువాకంలోని ఇంద్ర నముచిల కథ. ఆ కథ ఇది.

ఇంద్రుడు వృత్రుని వధించిన తరువాత ఇతర రాక్షసులను కూడా పరాభవించి నముచి అనే పేరు గల అసురునితో మల్లయుద్ధానికి పూనుకుంటాడు. ఆ యుద్ధంలో నముచిది పై చేయి అవుతుంది. ఇంద్రుడు మూర్ఛపోయే దశలో ఉంటాడు. అది చూసి నముచి దయ కలిగిన వాడై "ఇంద్రా! మనం పరస్పరం అంగీకారంతో సంధి చేసుకుంటే నిన్ను విడిచి పెడతాను. ఎండినది కానీ, తడసినది కానీ, పగటి పూట గానీ, రాత్రిపూట గానీ నువ్వు నన్ను చంపకూడదు." అని చెబుతాడు. ఇంద్రుడు దానికి అంగీకరించి సంధి చేసుకుంటాడు. ఆ తర్వాత ఇంద్రుడు నీటి నురగను ఆయుధంగా భావన చేసి సూర్యోదయానికి ముందు కాలంలో నముచి మీద ప్రయోగించి చంపుతాడు. నీటి నురగ ఎండినది కాదు, తడిది కాదు. అప్పటికి తెల్లవారింది కాబట్టి రాత్రి కాదు. సూర్యోదయం కాలేదు కాబట్టి పగలు కాదు. అందువల్ల ఇంద్రుడు మాట తప్పలేదు. ఇంతటితో ఈ కథ[13] ముగుస్తుంది.

ఈ కథను గ్రహించి భారతం ఉద్యోగపర్వంలోని కథను కల్పించిన కవి ఇంద్రుడు నముచికి మారుగా వృత్రుని చంపినట్లుగా చెప్పాడు. ఉద్యోగ పర్వంలోని ఈ కథకు కవి నహుషుని కథను జోడించి కథను మరింత ఆసక్తికరంగా చేసాడు. ఇంద్రుడు విష్ణువు సాయంతో వృత్రుని చంపిన తర్వాత ఇంద్రుడు అసత్య దోషంతో కుంగిపోయి లోకాల చివరికి పారిపోయి బురదపాము లాగా నీటిలో దాక్కోవడం దేవతలు, ఋషులు నహుషుని ఇంద్రపదవిలో నిలుపగా అతడు శచీదేవిని కామించడం, సప్తఋషులను వాహనంగా చేసుకొని తన వద్దకు వస్తే అతని కోరిక తీరుస్తానని శచీదేవి నహుషునికి చెప్పడం, నహుషుడు వశిష్టుడు మొదలైన సప్తఋషులను వాహనంగా చేసుకొని శచీదేవి వద్దకు వెళ్తూ వశిష్టుని కాలుతో తన్నడం, వశిష్టుడు నహుషుని పాముగా మారి భూలోకంలో పడి ఉండుమని నహుషుని శపించడం మొదలైన కథ అంతా భారతంలో ఈ కథను చొప్పించిన కవి కల్పించాడు. ఈ కథకు మూలం ఎక్కడ ఉన్నది తెలియడం లేదు.

సంస్కృత రామాయణంలోని ఇంద్ర వృత్రుల కథలను కృష్ణయజుర్వేదంలోని కథలతో పరిశీలించుదాం.

సంస్కృత రామాయణం ఉత్తరకాండలోని ఇంద్ర వృత్రుల కథ అశ్వమేధయాగ మహాత్మ్యాన్ని వివరించడానికి చెప్పబడింది. ఈ కథలో వృత్రుడు మూడు వందల యోజనాల

ఎత్తు, వంద యోజనాల లావు ఉన్న ధర్మబద్ధమైన పాలకుడు. ఇంద్రుని ఆజ్ఞకు లోబడనివాడు. కృష్ణ యజుర్వేదం రెండవ కథలో వృత్రుడు యజ్ఞ గుండంలో పుట్టి సర్వలోకాలకు వ్యాపించినట్లుగా చెప్పడం చేత ఉత్తరకాండ కథలోని కవి వృత్రుడు మూడు వందల యోజనాల ఎత్తు, వంద యోజనాల లావు ఉన్నట్లుగా చెప్పాడు. కృష్ణ యజుర్వేదం రెండవ కథలో విష్ణువు తన మూర్తిని మూడు భాగాలుగా చేసి ఒక భాగాన్ని భూలోకంలో, ఇంకొక భాగాన్ని అంతరిక్షలోకంలో, మూడవ భాగాన్ని ద్యులోకంలో స్థాపించినట్లుగా చెప్పబడింది. దీన్ని అనుసరించి ఉత్తరకాండ కథలో కవి విష్ణువు తన స్వరూపాన్ని మూడు భాగాలుగా చేసి ఒక భాగాన్ని ఇంద్రునిలో, ఇంకొక భాగాన్ని వజ్రాయుధంలో, మూడవ భాగాన్ని భూమిలో ప్రవేశపెట్టినట్లుగా రాశాడు. కృష్ణయజుర్వేదంలోని రెండవ కథలో ఇంద్రుడు వృత్రుని చంపడానికి విష్ణువు సాయం తీసుకొని చంపకుండా వృత్రునితో సంధి చేసుకుంటాడు. ఇది సముచితంగా లేదని భావించి ఉత్తరకాండ కథ కవి విష్ణువు సాయంతో ఇంద్రుడు వృత్రుని సంహరించినట్లుగా రాశాడు. వృత్రుడు ధర్మాత్ముడు, తపస్సు చేసుకుంటున్నవాడు. అలాంటి వాడ్ని చంపడం చేత బ్రహ్మహత్యాపాతకం ఇంద్రుని పట్టుకొని పీడిస్తుంటే దేవతలు విష్ణువు సలహానసుసరించి, ఇంద్రుని ముందుంచుకొని అశ్వమేధయాగం చేసి విష్ణువును పూజించగానే బ్రహ్మహత్యాపాతకం ఇంద్రుని శరీరం నుంచి బయటకు వచ్చి తనను తాను నాలుగు భాగాలుగా విభజించుకొని ఒక భాగం నాలుగు మాసాలు నదుల్లో పాపాత్ముల దర్పాన్ని తొలగిస్తూ, స్వేచ్ఛగా ఉన్నట్లు, రెండవ భాగం భూమిలోని చవిటి నేలలో నివసిస్తున్నట్లు, మూడవ భాగం యవ్వన వతులైన స్త్రీలలో వారి దర్పాన్ని తొలగిస్తూ మూడు రోజులు ఉన్నట్లు, నాల్గవ భాగం నిరపరాధులైన బ్రాహ్మణులను వంచన చేత చంపేవారిని ఆశ్రయించినట్లు చెప్పబడింది.

బాలకాండలోని కథలో వృత్రవధ వల్ల ఇంద్రునికి సంక్రమించిన బ్రహ్మహత్యాపాతకం వల్ల అతనికి ఆకలి, అశుచిత్వం పట్టుకొని పీడిస్తున్నట్లు, దేవతలు, ఋషులు పుణ్యక్షేత్రాల్లోని నీటి చేత కలశాలలో అభిమంత్రితాలైన ఉదకం చేత స్నానం చేయించి దేవేంద్రుని అశుచిత్వాన్ని, ఆకలిని తొలగించి ఆ రెండింటిని మలదము, కరూశము అనే రెండు ఊర్లకు ఇచ్చినట్లుగా చెప్పబడింది. ఈ కల్పన పై వాటి కంటే భిన్నంగా ఉంది. పుణ్యక్షేత్రాల్లోని నీటి మహాత్మ్యం, అభిమంత్రితమైన నీటి మహాత్మ్యం చెప్పడానికి కవి ఈ కల్పన చేసినట్లుగా భావించవచ్చు.

సంస్కృత భాగవతంలోని ఇంద్ర వృత్రుల కథను కృష్ణయజుర్వేదం కథలతో పరిశీలించుదాం. భాగవతంలో ఈ కథను కల్పించిన కవి మొదట దేవ గురువైన బృహస్పతి గొప్పతనాన్ని చెప్పాడు. బృహస్పతి ఇంద్రుని సభలోనికి ప్రవేశించినపుడు ఇంద్రుడు అతనికి నమస్కరించకుండా కూర్చొని ఉన్నట్లు, బృహస్పతి దాన్ని అవమానంగా భావించి దేవతలను వదిలి వెళ్ళిపోయినట్లు, ఈ విషయాన్ని తెలుసుకున్న రాక్షసులు శుక్రాచార్యుని ఆదేశంతో స్వర్గం మీదికి దండెత్తి దేవేంద్రుడు మొదలైన దేవతలను ఓడించినట్లు, దేవతలు బ్రహ్మదేవుని

శరణు జొచ్చినట్లు, బ్రహ్మ బ్రాహ్మణుడైన బృహస్పతిని అవమానించడం వల్ల దేవతలు బలహీనులయ్యారని రాక్షసులు బ్రాహ్మణుడైన శుక్రాచార్యుని సేవించడం వల్ల బలవంతులై దేవతలను జయించినట్లు, దేవతలు బ్రహ్మ సలహాను అనుసరించి బ్రాహ్మణుడు, త్వష్ట కుమారుడు అయిన విశ్వరూపుని ఆచార్యునిగా స్వీకరించి బలవంతులై తిరిగి రాక్షసులను జయించి స్వర్గాన్ని చేజిక్కించుకున్నట్లు రాసిన ఈ కథ అంతా బ్రాహ్మణ మహాత్మ్యాన్ని చాటి చెప్పటానికి బ్రాహ్మణ కవి కల్పించాడు.

ఆ తర్వాత ఈ కథలో విశ్వరూపుని గురించి చెప్పబడింది. విశ్వరూపునికి మూడు తలలు ఉండడం అతడు యజ్ఞం చేసేటపుడు మంత్రాలను పఠిస్తూ దేవతలకు హవ్య భాగాలను అందిస్తూనే, అతని తల్లి అసుర వంశస్తురాలు కావడం చేత ఆమె మీది ప్రేమతో పరోక్షంగా లోలోపల మంత్రాలను పఠిస్తూ అసురులకు కూడా హవ్య భాగాలను అందిస్తున్నట్లు, దేవేంద్రుడు అందుకు కోపించి విశ్వరూపుని చంపినట్లుగా చెప్పబడింది. ఇది కృష్ణయజుర్వేద తైత్తిరీయ సంహితలోని మొదటి కథను అనుసరించి చెప్పబడింది. కృష్ణయజుర్వేదంలో దేవేంద్రుడు విశ్వరూపుని చంపడం వల్ల తనకు వచ్చిన బ్రహ్మహత్యా పాతకాన్ని భూమికి, వృక్షాలకు, స్త్రీలకు పంచి ఇచ్చినట్లుగా చెప్పబడింది. భాగవతంలో దేవేంద్రుడు తనకు సంక్రమించిన బ్రహ్మహత్యాపాతకాన్ని నేల, నీరు, చెట్లు, స్త్రీలు అనే నలుగురికీ పంచి ఇచ్చినట్లుగా చెప్పబడింది.

తర్వాత భాగవతంలో దేవేంద్రుడు తన కుమారుడైన విశ్వరూపుని చంపినందుకు త్వష్ట కోపించి యజ్ఞం నుంచి వృత్రాసురుని సృష్టిస్తాడు. ఇది కృష్ణయజుర్వేదంలో రెండవ కథను అనుసరించి చెప్పబడింది. వృత్రాసురుడు అతి పెద్ద దేహంతో దేవేంద్రుని మీదకి యుద్ధానికి వెళ్ళి దేవేంద్రుని మిగిలిన దేవతలను గురించి ఓడించగా దేవతలందరూ విష్ణువును శరణు కోరతారు. కృష్ణయజుర్వేదంలో దేవేంద్రునికి సాయంగా విష్ణువే స్వయంగా వచ్చినట్లుగా ఉంది. అంటే ఇక్కడ భాగవత కవి కొంత మార్చాడు. భాగవతంలో తనను శరణుజొచ్చిన దేవతలకు విష్ణువు దధీచి మహర్షి వద్దకు వెళ్ళి అతని వెన్నెముకను ఆయుధంగా అర్థించవలసిందిగా చెబుతాడు. దేవేంద్రుడు, దేవతలు దధీచి వద్దకు వెళ్ళి వెన్నెముకను అడుగగా దధీచి మహర్షి తన ప్రాణాన్ని త్యజించి వెన్నెముకను దేవేంద్రునికి వజ్రాయుధంగా ఇస్తాడు. దేవేంద్రుడు వజ్రాయుధంతో వృత్రుని సంహరిస్తాడు. ఈ కథకు[14] మూలం కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహిత పంచమ సంపుటంలోని పంచమాష్టకం ఆరవ ప్రపాఠం షష్ఠోనువాకంలో ఉంది. "**ప్రజాపతిర్వా అథర్వాగ్నిరేవ దధ్యఙ్ఞా థర్వణ స్తస్యేష్టకా అస్థాన్యేతగ్ం హ వావ తదృషిరభ్యనూవాచేన్ద్రో దధీచో అస్థభిరితి యదిష్ట కాభిరగ్నిం చినోతి సాత్మానమేవాగ్నిం చినుతే**" అథర్వుడు అను ఋషి ప్రజాపతి. అతడి కుమారుడైన దధ్యఙ్ అనే అతడు అగ్ని. అగ్ని దగ్గర ఉపధానం చేయబడిన ఇష్టకలు దధీచి అస్థికల వంటివి. ఈ విషయాన్ని "**ఇన్ద్రో దధీచో అస్థభి:**" అనే మంత్రం చెప్పింది. ఇది మంత్రం యొక్క ప్రతీక మాత్రమే. "**ఇన్ద్రో దధీచో అస్థభి:**। వృత్రాణ్య ప్రతిష్కుత:। జఘాన నవతీర్నవ" అనేది సంపూర్ణ మంత్రం. దధీచి యొక్క ఎముకలచేత ఇంద్రుడు వృత్రాసురుని సంహరించెనని ఈ మంత్రం యొక్క అర్థం.

ఈ భాగంలోని కథను భాగవత కవి తీసుకొని భాగవతంలోని తన కథలో చొప్పించాడు. భాగవతంలో ఇంద్రుడు వృత్రుని సంహరించడం చేత అతనికి బ్రహ్మహత్యాపాతకం సంక్రమిస్తుంది. ఇంద్రుడు శ్రీహరిని ప్రార్థించగా అతని ప్రభావంతో బ్రహ్మహత్యాపాతకం నుంచి విముక్తుడవుతాడు. ఆ తర్వాత ఇంద్రుడు స్వర్గలోకానికి వచ్చి అశ్వమేధయాగం చేసి వృత్రాసుర సంహారం వల్ల తనకు సంక్రమించిన బ్రహ్మహత్యాపాతకం నుంచి పూర్తిగా విముక్తుడవుతాడు. భాగవతం విష్ణు మాహాత్మ్యాన్ని వివరించే గ్రంథం కావడం చేత ఈ కథలో విష్ణువు దేవేంద్రునికి సంక్రమించిన బ్రహ్మహత్యాపాతకాన్ని తొలగించినట్లుగా చెప్పబడింది.

ఈ విధంగా కృష్ణయజుర్వేదంలో చెప్పబడిన ఇంద్ర వృత్రులకు సంబంధించిన మూడు కథలను భారత, రామాయణ, భాగవత కవులు తమకు నచ్చినట్లుగా కొన్ని మార్పులు చేర్పులు చేసి ఆయా గ్రంథాల్లో చొప్పించారు.

ఋగ్వేదంలో ఇంద్రుని వైదిక ఋషులు అనేక రకాలుగా వర్ణించారు. ఋగ్వేద సంహిత ప్రథమ సంపుటం, ప్రథమ మండలం, 32వ సూక్తంలోని 1,2,6,7,8,10,11 మంత్రాల్లో హిరణ్యస్తూపుడు అనే ఋషి ఇంద్రుని ఇలా వర్ణించాడు.

**1) "ఇంద్రస్యను వీర్యాణి ప్రవోచం యానిచకార ప్రథమాని వజ్రీ।**
**అహ న్నహి మన్వపా స్తదర్ద ప్రవక్షణా అభిన త్పర్వతానాం॥"**

వజ్రధారి అయిన ఇంద్రుడు చేసిన ముఖ్యమైన పరాక్రమ కృత్యాలను చెబుతున్నాను. అతడు మేఘాన్ని బద్దలు కొట్టాడు. తర్వాత దాని నుంచి జలం భూమి మీద పడేటట్లు చేశాడు. పర్వతాలకు సంబంధించిన జలౌఘాలు నదులుగా ప్రవహించేటట్లు చేశాడు.

**2) "అహ న్నహిం పర్వతే శిశ్రియాణం త్వష్టాస్తై వజ్రం స్వర్యం తతక్ష।**
**వాశ్రా ఇవ ధేనవ: స్యందమానా అంజ: సముద్ర మవ జగ్ము రాప:॥"**

ఈ ఇంద్రునికి త్వష్ట చక్కగా ప్రయోగింపదగిన వజ్రాయుధాన్ని చేసి ఇచ్చాడు. దానితో ఇంద్రుడు పర్వతాన్ని ఆశ్రయించి ఉన్న మేఘాన్ని భేదించాడు. దానివల్ల భూమి మీద పడి ప్రవహిస్తున్న జలాలు అంబారవ మొనరుస్తూ ధేనువులు తమ దూడలను చేరునట్లుగా సముద్రాన్ని చేరుతున్నాయి.

**6) అయోద్ధేవ దుర్మద అహిజు హ్వే మహావీరం తువిబాధ మృజీషమ్।**
**నాతారీదస్య సమృతిం వధానాం సం రుజానా: పిపిష ఇంద్ర శత్రు:॥**

దుర్మదుడైన వృత్రుడు తనకు ప్రతివీరుడు లేడనే గర్వంతో భయంకరుడైన ఇంద్రుని యుద్ధానికి పిలిచాడు. కాని వాడు ఇంద్రుడు చేసే వధను తప్పించుకోలేకపోయాడు. చివరకు ఇంద్రుని చేతిలో చనిపోయి నదుల్లో పడి వాటిని కలచి వేసి వాటి గట్లను విరిచి వేశాడు.

**7) అపాద హస్తో అపృతన్యదింద్రమాస్య వజ్రమధిసానౌ జఘాన।**
**వృషోవధ్రి: ప్రతిమానం బుభూషన్ పురుత్రా వృత్రో, అశయద్ వ్యస్త:॥**

కాళ్లు, చేతులు తెగిన వృత్రుడు మళ్లీ లేచి ఇంద్రునితో యుద్ధం చేయాలనుకున్నాడు. అపుడు ఇంద్రుడు కొండ చరియలాంటి వాని రొమ్ము మీద వజ్రంతో కొట్టాడు. దానితో అవయవ హీనుడైన వృత్రుడు కొజ్జావాడు వీర పురుషునితో సమానత్వాన్ని కోరి అశక్తుడైనట్లుగా వ్యర్థుడై కింద పడ్డాడు.

**8) నదం భిన్నమముయా శయానం మనో రుహాణా అతి యంత్యాప:।**
**యాశ్చిద్ వృత్రో మహినా పర్యతిష్టత్ తాసా మహి: పత్సుత:శీర్బభూవ॥**

వర్షం లేకపోవడం చేత ఖిన్నులైన ప్రజలకు ఆనందాన్ని కలిగించినట్టి జలాలు ప్రవాహ వేగంతో గట్లు తెగిన సింధు నదిని అతిక్రిమించి పోవునట్లే చచ్చి పడి ఉన్న వృత్రుని దాటిపోతున్నాయి. ఏ వృత్రుడు బతికి ఉన్నపుడు ఏ జలాలను నిరోధించాడో ఇపుడు మేఘరూప వృత్రుడు ఆ జలాల కాల కిందనే పడిన వాడయ్యాడు.

**10) అతిష్ఠంతీ నామ నివేశనానాం కాష్ఠానాం మధ్యే నిహితం శరీరమ్।**
**వృత్రస్య నిణ్యం వి చరంత్యాపో దీర్ఘం తమ ఆశయ దింద్ర శత్రు:॥**

నిలకడ లేక నిత్యమూ ప్రవహిస్తున్నట్టి నీళ్లలో పడి మునిగిపోవడం చేత పేరు తెలియకుండా పోయిన వృత్రుని దేహాన్ని జలాలు ఆక్రమించి ప్రవహిస్తున్నాయి. వృత్రుడు దీర్ఘమైన నిద్రాత్మక మరణాన్ని పొంది అదృశ్యమయ్యాడు.

**11) దాస పత్నీరహిగోపా అతిష్ఠన్ నిరుద్రా ఆప: పణినేవ గావ:।**
**అపాం బిల మవిహితం యదాసీద్ వృత్రం జఘన్వాగ్ం అవతద్ వవార॥**

వర్షం లేకుండా చేసి లోకానికి హాని కలిగించిన వృత్రుడు ఫణి అనే పేరు గల రాక్షసుడు గోవులను అరికట్టినట్లుగా నీటిని నిరోధించాడు. అపుడు ఇంద్రుడు వృత్రుని చంపి మూసివేసిన జల ద్వారాన్ని తెరిచాడు.

పై ఏడు మంత్రాల్లో ఇంద్రుడు చేసిన వృత్ర వధను మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారు తమ సంస్కృత వాఙ్మయ చరిత్రలో ఇలా వివరించారు.

“ఇట్లు వృత్ర వధ రూపమయిన యింద్రుని కృత్యమును వర్ణించెడి యా సూక్తమందు, అహిశబ్దము మేఘపరముగా గొన్నిచోట్లను, వృత్రపరముగా నొకచోటను గనవచ్చుచున్నది. ఎనిమిదవ ఋక్కులో అహి వృత్ర శబ్దములు రెండును బ్రయోగింపబడినవి. ఆ రెండును మేఘపరముగానే వ్యాఖ్యానము చేయబడినవి. దీనిని బట్టియు నీ సూక్తమందలి యహి వృత్ర శబ్దములకు భాష్యకారులు వ్రాసిన యర్థ వివరణములను బట్టియు వృత్రుడనగా మేఘుడనియు మేఘత్వమును బ్రచ్ఛన్నము గావించి యసురత్వమును గల్పించుట చమత్కార కారిణియైన ప్రాచీన మహర్షుల శైలియనియు దెలియవచ్చుచున్నది. మరియు, వృత్రుడసురుడయినట్లును వాడు క్రూరకృత్యము లొనర్చినట్లును, ఇంద్రుడు దేవుడయినట్లును శూరుడయిన యతుడు వృత్రుని సంహరించినట్లును యజ్ఞాది రక్షకుడయినట్లును వివిధ వర్ణన లీవేదమందు లేకపోలేదు గాని, పై సూక్తమందలి విషయమును విమర్శింపగా బౌరాణికుల

యింద్రవృత్రుల వలె వైదికర్షుల యింద్ర వృత్రులు దేవాసురులు గారని తెలియుచున్నది. ఇందుకు యాస్కముని యేమి చెప్పెనో చూతము.

"తత్కోవృత:? మేఘ ఇతి నైరుక్తా:, త్వాష్ట్రోసుర ఇత్యై తిహాసికా:, అపాంచ జ్యోతిషశ్చ మిశ్రీభావకర్మణో వర్ష కర్మజాయతే, తత్రోపమార్థేన యుద్ధవర్ణా భవంతి। అహివత్తు ఖలు మంత్రవర్ణా బ్రాహ్మణవాదాశ్చ। వివృద్ధ్యా శరీరస్య స్రోతాంసి నివారయాంచకార। తస్మిన్ హతే ప్రసస్యందిర ఆప:" (యాస్కుని నిరుక్తము పుట 144-146)

అట్లయిన వృత్రుడెవరు? మేఘుడని నైరుక్తులందురు. త్వష్ట కొడుకైన యసురుడని యైతిహాసికులందురు. మేఘుడే వృత్రుడయితే మంత్రముల వల్ల వినవచ్చు యుద్ధము మాటయేమి? చెప్పెద వినుము. మేఘోదరగతములయిన జలములకును వైద్యుత జ్యోతిస్సునకును గలిగిన సంఘర్షణము వల్ల వర్షము పుట్టుచున్నది. మారుతావేష్టితమైన యింద్రాఖ్యమగు వైద్యుత జ్యోతిస్సుచే తాడ్యమానములయిన యుదకములు వర్షభావము నొందుచున్నవి. ఇట్లు పరస్పర ప్రతి ద్వంద్వీభూతములయిన తేజో జలముల కింద్ర వృత్ర రూపకల్పనచే యుద్ధ కల్పనము చేయబడినది. అంతేకాని యిచ్చట నిజమైన సంగ్రామము లేదు. ఇంద్రునకు శత్రువులే లేరని 'యదచరస్తన్వా' యనెడి ఋక్కే చెప్పుచున్నది. సరేకాని, యుద్ధకల్పనములు వృత్రుడున్నట్లే కనబడుచున్నవా? వృత్రుడున్నట్లును, అహి యున్నట్లును గూడ మంత్రలింగములు కలవు. శాఖాంతర బ్రాహ్మణ వచనములును గలవు. అందుచే నహి వృత్ర శబ్దములకు మేఘుడర్థమగుట సముచితమగుచున్నది. దానంజేసి మేఘరూపవృత్రుడు స్వశరీరాభివృద్ధిచే జలములను నివారించెననియు, వైద్యుత జ్యోతి స్స్వరూపుడైన యింద్రుడు వానిని గొట్టగానే యుదకములు స్రవించెననియు స్పష్టమగుచున్నది. ఈ విషయమున, వైదిక శబ్దార్థములకు వన్నెలు చిన్నెలు కల్పించి కథలల్లిన యైతిహాసికుల కంటే బ్రాచీన సంప్రదాయము ననుసరించి వానిని జక్కగా నిర్వచించిన నిరుక్తకారులే యెక్కువ ప్రామాణికులగుదురు గావున, వైదిక మహర్షులు జ్యోతిర్మేఘ స్వరూపములను వర్ష కారణములను జక్కగా నెఱిగియే ప్రరోచనార్థములయిన యింద్రవృత్ర సంగ్రామ కల్పనములు గావించి వర్ణించియుండిరని గ్రహింపదగును."[15]

మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి పై వివరణను బట్టి ఋగ్వేదంలో చెప్పబడిన వృత్ర శబ్దానికి మేఘుడు అని అర్థమని, ఇంద్రుడు మేఘాన్ని కొట్టి వర్షం కురిపించిన విషయాన్ని ఋషులు ఋగ్వేదంలో ఇంద్రుడు చేసిన ఘనకార్యంగా చెప్పారని, దాన్ని కృష్ణయజుర్వేద తైత్తిరీయ సంహితలో మూడు కథలను రాసిన కవులు వృత్రశబ్దాన్ని నామవాచకంగా తీసుకొని అతనిని రాక్షసునిగా చిత్రించి దేవేంద్రుడు అతన్ని చంపినట్లుగా కథలను అల్లారని స్పష్టమవుతుంది. భారత, రామాయణ, భాగవత కవులు ఈ కథలను తీసుకొని వాటికి కొన్ని మార్పులు చేర్పులు చేసి ఆయా గ్రంథాల్లో చొప్పించారని స్పష్టమవుతూ ఉంది. దీన్నిబట్టి ఇంద్ర వృత్ర సంబంధమైన కథలన్నీ పూర్తిగా కవుల కల్పనలే అని తెలుస్తూ ఉంది.

సంస్కృత భారతంలో శాంతిపర్వంలో ఉన్న బ్రహ్మహత్యా విభాగం కథను తిక్కన శాంతిపర్వంలో పంచమాశ్వాసంలోని 423వ పద్యం నుంచి 432 వ వచనం వరకూ ఉన్న 10 గద్యపద్యాల్లో క్లుప్తంగా రాశాడు. మూలంలో బ్రహ్మ అగ్నిని, వృక్షాలనూ, అప్సరసలను, నీటినీ ఒక్కొక్కరినీ వేరువేరుగా పిలిచి దేవేంద్రుని బ్రహ్మ హత్యాపాతకాన్ని నాల్గు భాగాలుగా చేసి పంచినట్లుగా ఉంది. తిక్కను ఈ విషయాన్ని చాలా క్లుప్తంగా వచనంలో –
"అగ్నినోషధి వృక్ష తృణంబులను వనితా జనంబులను జలంబులను దలంపున రావించి వృత్రుని వలన వాసవునకుం బాటిల్లిన బ్రహ్మహత్య చతుర్భాగంబులు సేసితి. మీర లొక్కొక్క పాలుగై కొనుండని పనిచె!" అని క్లుప్తంగా రాశాడు. మూలంలో నాలుగు భాగాల్లో ఒక భాగాన్ని అప్సరసలు కిచ్చినట్లు ఉండగా తిక్కన దాన్ని స్త్రీలకిచ్చినట్లుగా మార్చి రాశాడు. ఈ మార్పు ఔచిత్య వంతంగా ఉంది.

## 17. వృత్రాసురుని రక్తం నుండి పుట్టగొడుగులు పుట్టడం:

ఈ వృత్తాంతం శాంతిపర్వంలో బ్రహ్మహత్యా పాతక విభాగం అనే పై కథ చివర చెప్పబడింది. బ్రహ్మ ఇంద్రునికి సంక్రమించిన బ్రహ్మహత్యా పాతకాన్ని నాల్గు విభాగాలుగా చేసి పంచి ఇచ్చిన కథను భీష్ముడు ధర్మరాజుకు చెప్పి ఆతర్వాత

**"వృత్రస్య రుధిరాచ్చైవ శిఖండాః పార్థ జజ్ఞిరె**
**ద్విజాతిభి రభక్ష్యాస్తే దీక్షితైశ్చ తపోధనైః"**
**(శాంతి. 282 – 60వ శ్లోకం)**

"వృత్రుని రక్తం నుంచి పుట్ట గొడుగులు పుట్టాయి. వాటిని ద్విజన్ములైన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు తినగూడదు. దీక్షితులైన తపస్సులు కూడా తినగూడదు" అని చెబుతాడు.

వృత్రాసురుని కథ కల్పితమైంది. కాబట్టి ఈ కథ కూడా కల్పితమైనదే. అందువల్ల ఇది కట్టుకథ అవుతూ ఉంది. ఇది జానపద కట్టుకథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ. పుట్టగొడుగుల పుట్టుకకు సంబంధించి ఒక జానపద కథ ప్రచారంలో ఉంది. కథ క్లుప్తంగా ఇది. ఒక ఊర్లో అత్తా కోడళ్ళు ఉంటారు. అత్త కోడలును అత్తరికంతో పెత్తనం చెలాయిస్తూ ఉంటుంది. కోడలు ఒకరోజు అత్తలేని సమయంలో తనకు ఇష్టమైన కోడికూర వండుకుంటూ ఉంటుంది. అదే సమయంలో అత్త ఇంటికి వస్తుంది. కోడలు అత్తకు భయపడి కోడికూరను పెరటిలో ఉన్న పుట్టలో పారబోస్తుంది. మరుసటి రోజుకు ఆ ప్రదేశంలో పుట్టగొడుగులు మొలుస్తాయి.

పుట్టగొడుగుల కూర కోడికూర వాసన, కోడికూర రుచిని కలిగి ఉంటుంది. ఇలా పుట్టగొడుగుల కూర కోడికూర వాసన కోడికూర రుచి కల్గి ఉండడం చేతనే జానపద కవి పుట్టగొడుగులు కోడికూర నుంచి పుట్టినట్లుగా పై కట్టుకథను కల్పించాడు. అందువల్ల ఇది కట్టుకథ అయ్యింది.

## 18. జ్వరం పుట్టుక కథ:

ఈ కథ శాంతిపర్వంలోని మోక్షధర్మపర్వం అనే ఉపపర్వంలో 283వ అధ్యాయంలో 63 శ్లోకాల్లో ఉంది. ఈ కథను భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. "జ్వరంతో మోహితుడైన వృత్రాసురుని ఇంద్రుడు వజ్రాయుధంతో చంపాడని చెప్పారు. మహాప్రాజ్ఞా! ఆ జ్వరోత్పత్తిని గురించి సంపూర్ణంగా వినాలను కుంటున్నాను" అని ధర్మరాజు భీష్మునితో అంటాడు. దానికి సమాధానంగా భీష్ముడు ఈ కథను చెబుతాడు.

సుమేరు పర్వతం మీద ఈశ్వరుడు తన భార్య అయిన సతీదేవితో కలిసి నివసిస్తుంటాడు. అనేక మంది దేవతలు, యక్షులు, గంధర్వులు, మహర్షులు వారిని సేవిస్తూ ఉంటారు. ఒకరోజు దేవతలు విమానాలు ఎక్కి దక్షుడు చేస్తున్న అశ్వమేధ యాగానికి వెళ్తుంటారు. వారిని చూసి ఉమాదేవి వారెక్కడికి వెళ్తున్నారని ఈశ్వరుని అడుగుతుంది. దానికి ఈశ్వరుడు దక్ష ప్రజాపతి చేస్తున్న అశ్వమేధ యాగానికి వారు వెళ్తున్నారని చెబుతాడు. అపుడు పార్వతి "మీరు ఎందుకు వెళ్ళటంలేదు" అని ఈశ్వరుని ప్రశ్నిస్తుంది. ఆ ప్రశ్నకు ఈశ్వరుడు "దేవతలు పూర్వం నిశ్చయించిన ప్రకారం అన్ని యజ్ఞాలలోనూ నాకు భాగం కల్పించ లేదు. దాని ప్రకారం ఈ యజ్ఞంలో కూడా నాకు భాగం ఇవ్వలేదు" అని చెబుతాడు. అపుడు ఉమ ఈశ్వరునితో

**"భగవాన్ సర్వభూతేషు ప్రభావాభ్యధికో గుణైః**
**అజయ్యశ్చా ప్రధృష్యశ్చ తేజసా యశసా శ్రియా"**
**"అనేన తే మహాభాగ ప్రతిషేదేన భాగతః**
**అతీవ దుఃఖ ముత్పన్నం వేపథుశ్చ మమానఘ"**
**(శాంతి. 283 - 28,29 శ్లోకాలు)**

"భగవంతుడా! మీరు సర్వ భూతాల్లో ప్రభావం చేత గుణాల చేత అధికులు. మిమ్ము ఎవరూ జయించ లేరు. తేజస్సు చేత, కీర్తి చేత, సంపద చేత నిన్ను మించిన వారు లేరు. అలాంటి నీకు భాగం ఇవ్వకుండా నిషేధించడం నాకు చాలా దుఃఖం కల్గుతుంది. శరీరం కంపిస్తూ ఉంది" అని పలికి కోపంతో మాట్లాడ లేకపోతుంది. భార్య మనసు గ్రహించిన మహాదేవుడు తన యోగ బలంతో భయంకరమైన అనుచరులను సృష్టించి దక్షుని యజ్ఞాన్ని ధ్వంసం చేయిస్తాడు. ఈశ్వరుని అనుచరులు సింహనాదాలు చేస్తూ వికటాట్టహాసాలు చేస్తూ యజ్ఞ గుండంలో రక్తం చల్లుతారు. కొంత మంది యూపస్థంబాలు పెకలిస్తారు. మరికొంత మంది అనుచరులు యజ్ఞ పరిచారకులను ఇతరులను మింగివేస్తారు. ఈ వినాశనాన్ని చూసి యజ్ఞం మృగరూపం ధరించి ఆకాశంలోకి వెళ్ళిపోతుంది. వెంటనే శివుడు ధనుర్బాణాలు ధరించి మృగం వెంటపడతాడు. అపుడు రుద్రుని నుదుటి నుంచి పెద్ద చెమట బిందువు పడుతుంది. అది భూమి మీద పడగానే ప్రళయాగ్నిలాగా మండుతూ ఉంటుంది. అందులో నుంచి పొట్టిగా ఎర్రటి కళ్ళతో కపిల గడ్డంతో భయంకరంగా ఉన్నవాడు, నిక్కపొడిచిన

రోమాలు వంటినిండా ఉన్నవాడు, నల్లని శరీరంతో ఎర్రని వస్త్రాలు ధరించినవాడు అయిన ఒక పురుషుడు పుడతాడు. అతడు దక్షుని యజ్ఞాన్ని దహించి వేసి, యజ్ఞానికి వచ్చిన దేవతల వైపు, ఋషుల వైపు పరిగెడతాడు. వెంటనే వారు భయపడి అన్ని దిక్కులకు పారిపోతారు. ఆ పురుషుడు అలా తిరుగుతూ ఉంటే భూమి కంపించిపోతుంది. సర్వజగత్తూ హాహాకారాలు చేస్తుంది. అపుడు బ్రహ్మ ఈశ్వరునితో ఇలా అంటాడు.

"ప్రభూ ! దేవతలు యజ్ఞంలో నీకు కూడా భాగం ఇస్తారు. కోపాన్ని ఉపసంహరించు. నీ క్రోధం వల్ల ఋషులు, దేవతలు శాంతి పొందలేక పోతున్నారు. నీ స్వేదం నుంచి పుట్టిన ఈ పురుషుడు జ్వరం అనే పేరుతో లోకంలో ప్రచారం పొందుతాడు. ఇతడు ఒక్కడుగా ఉంటే అతని తేజస్సును భూమి భరించ లేదు. అందువల్ల అతణ్ణి అనేక విధాలుగా విభజించు" అని పలికి బ్రహ్మ మహాదేవునికి యజ్ఞంలో భాగం కల్పిస్తాడు. దాంతో శివుడు సంతోషించి సర్వ ప్రాణుల శాంతి కోసం జ్వరాన్ని ఇలా విభజించాడు.

**"శీర్షాభితాపో నాగానాం పర్వతానాం శిలాజతు**
**అపాం తు నీలికాం విద్యాన్నిర్మోకం భుజగేషుచ"**
**"ఖోరకః సౌరబేయాణా మూషరం పృథివీతలే**
**పశూనా మపి ధర్మజ్ఞ దృష్టి ప్రత్యవరోధనమ్"**
**"రంధ్రాగత మథాశ్వానాం శిఖోద్ భేదశ్చ బర్హిణామ్**
**నేత్రరోగః కోకిలస్య జ్వరః ప్రోక్తో మహాత్మనా"**
**"అవీనాం పిత్తభేదశ్చ సర్వేషా మితి నః శ్రుతమ్**
**శుకానామపి సర్వేషాం హిక్కికా ప్రోచ్యతే జ్వరః**
**"శార్దూలేష్వథ ధర్మజ్ఞ శ్రమో జ్వర ఇహోచ్యతే**
**మానుషేషు తు ధర్మజ్ఞ జ్వరో నామైష భారత"**
**(శాంతి. 283 – 52 నుంచి 56 శ్లోకాల వరకు)**

"జ్వరం ఏనుగులకు శిరస్తాపం అయింది. పర్వతాలకు శిలాజతు రూపం (రాళ్ళు పగిలి కింద పడటం) అయింది. నీటికి నాచు, పాములకు కుబుసం అయింది. ఆవులకు ఖోరకం (గిట్టల్లో కలిగే వ్యాధి) అయింది. భూమికి చవిటినేల, పశువులకు చూపు మందగించడం జ్వరం, గుర్రాలకు కంఠరోగం జ్వరం, నెమలికి పింఛం ఊడిపోవడం జ్వరం, కోకిలలకు నేత్ర రోగం జ్వరం, గొర్రెలకు పిత్తభేదం జ్వరం, చిలుకలకు హిక్కిక రోగం (వెక్కిళ్ళు, తుమ్ము) జ్వరం, శార్దూలాలకు శ్రమయే జ్వరం, మనుషులకు జ్వరమే జ్వరం".

ఈ జ్వరం ఈశ్వరుని తేజోరూపం. ఇది మానవులకు మరణ సమయం లోనూ, స్త్రీలకు ప్రసవ సమయంలోనూ వస్తుంది. మధ్యలో గూడా వస్తుంది. దీనికి ప్రాణులన్నీ

నమస్కరించాలి, గౌరవించాలి. ఇలాంటి జ్వరం వృత్రాసురుని ఆక్రమించింది. ఆ స్థితిలో ఇంద్రుడు వజ్రాయుధాన్ని ప్రయోగించి అతణ్ణి చంపాడు అని భీష్ముడు ధర్మరాజుకు జ్వరోత్పత్తిని గురించి చెప్పాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథ ప్రసిద్ధి చెందిన దక్షయజ్ఞం ధ్వంసం కథకు కొంత భిన్నంగా ఉంది. దక్షయజ్ఞం ధ్వంసం కథలో సతీదేవి తన తండ్రి యజ్ఞానికి పిలవని పేరంటంగా వెళ్తుంది. అక్కడ దక్షుడు ఈశ్వర నింద చేయడం విని దాన్ని సహించలేక సతీదేవి యజ్ఞ గుండంలో దూకి చనిపోతుంది. దానికి కోపించిన మహాదేవుడు వీరభద్రుని సృష్టించి అతణ్ణి దక్షయజ్ఞ ధ్వంసానికి పంపిస్తాడు. వీరభద్రుడు దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేయడమే కాకుండా దక్షుని తలను నరికి వేస్తాడు. భారతంలోని ఈ జ్వరోత్పత్తి కథలో సతీదేవి దక్షుని యజ్ఞానికి వెళ్ళినట్లుగా లేదు. దేవతలు ఈశ్వరునికి యజ్ఞంలో భాగం కల్పించక పోవడం ఆమెకు కోపాన్ని కల్గించినట్లుగా ఈ కథలో ఉంది. అంతేకాకుండా ఈ కథలో ఈశ్వరుని చెమట బిందువు నుంచి భయంకరమైన పురుషుడు పుట్టి దక్షుని యజ్ఞానికి వచ్చిన దేవతలను ఋషులను భయ భ్రాంతులను చేసినట్లు, ఆ పురుషుడే తర్వాత జ్వరంగా రూపొందినట్లు, ఆ జ్వరాన్ని ఈశ్వరుడు అనేక రకాలుగా విభజించి ఒక్కొక్క ప్రాణికి ఆ జ్వరం ఒక్కొక్క విధమైన బాధను కల్గించినట్లుగా ఈ కథలో ఉంది. లోకంలో జ్వరం అనే వ్యాధి ఉంది. జ్వరం మనుషుల శరీరానికి వేడిని కల్గించి శరీరాన్ని బాధ పెడుతుంది. అలాగే ఏనుగులు, పర్వతాలు, పాములు, ఆవులు మొదలైన వాటికి వేడి కల్గటం చేత అవి శరీర తాపంతో అనేక రకాలుగా బాధ పడుతుంటాయి. దీన్ని గమనించిన పండిత కవి దక్షాధ్వర ధ్వంసం సమయంలో జ్వరం భయంకరమైన పురుషునిగా శివుని చెమట బిందువు నుంచి పుట్టినట్లుగా, దాన్ని శివుడు అనేక రకాలుగా విభజించి అనేక ప్రాణులకు అనేక బాధలు కల్గిస్తున్నట్లుగా కల్పించి చెప్పాడు. అంటే లోకంలో జ్వరం వల్ల మనుషులు, నెమళ్ళు మొదలైన ప్రాణులు అనేక బాధలు పడుతున్న విషయం గమనించిన పండిత కవి ఆ జ్వరం పుట్టుకకు ఒక కారణాన్ని కల్పించి పై కథా రూపంలో చెప్పాడు. అందువల్ల ఈ కథ కట్టుకథ అవుతూ ఉంది. ఇందులో జానపద కట్టుకథాంశ ఉంది.

ఈ కథ ఏ మాత్రం సమంజసంగా లేదు. ఈశ్వరుడు గూండాల నాయకుని లాగా, అతని అనుచరులు గూండాల లాగా దౌర్జన్యం చేసినట్లుగా చిత్రించబడ్డారు. తనకు యజ్ఞంలో భాగం కావాలని ఈశ్వరుడు భావిస్తే ఆ విషయాన్ని దేవతలకు చెప్పి శాంతియుత మార్గంలోనే దాన్ని పొందవచ్చు. దాని కోసం తన అనుచరుల్ని పంపించి దక్షుని యజ్ఞాన్ని నాశనం చేయవలసిన అవసరం లేదు. సాక్షాత్తు పరమేశ్వరునే దౌర్జన్యకారునిగా చిత్రించిన ఈ కథ సముచితమైనది కాదు.

తిక్కన ఈ వృత్తాంతాన్ని శాంతిపర్వం పంచమాశ్వాసంలోని 437వ పద్యం నుంచి 444వ పద్యం వరకు ఉన్న 8 పద్యగద్యాల్లో క్లుప్తంగా చెప్పాడు.

## 19. శుక్రుని కథ:

ఈ కథ శాంతిపర్వంలోని మోక్షధర్మపర్వం అనే ఉపపర్వంలో 289వ అధ్యాయంలో 38 శ్లోకాల్లో ఉంది. దీన్ని భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. "మహా మేధావి, దేవర్షి, కవి అయిన ఉశనుడు అసురులకు మేలు చేసేవాడు, దేవతలకు శత్రువు ఎందుకయ్యాడు? ఉశనునికి శుక్రుడు అనే పేరు ఎందు కొచ్చింది?" తెలుపవలసిందిగా ధర్మరాజు భీష్ముని కోరతాడు. అపుడు భీష్ముడు ఈ కథను ఇలా చెబుతాడు.

ఉత్తమ నియమాలను దృఢంగా పాటించేవాడు, ముని శ్రేష్ఠుడు, భృగు కుమారుడు అయిన ఉశనుడు ఒక ప్రత్యేక కారణం వల్ల దేవతలకు శత్రువయ్యాడు. ఆ సమయంలో ముల్లోకాలకు అధిపతి అయిన ఇంద్రుని కోశాగారానికి కుబేరుడు అధిపతిగా ఉంటాడు. యోగసిద్ధుడూ, మహాముని అయిన ఉశనుడు తన యోగబలంతో కుబేరునిలో ప్రవేశించి అతణ్ణి తన వశం చేసుకొని అతని ధనమంతా అపహరిస్తాడు. ఉశనుడు చేసిన ఈ అన్యాయాన్ని కుబేరుడు ఈశ్వరునికి చెబుతాడు. ఆ విషయాన్ని విన్న ఈశ్వరుడు ఉశనుని మీద కోపించి త్రిశూలం పట్టుకొని ఉశనుని కోసం వెదకడం ప్రారంభిస్తాడు. పరమేశ్వరునికి తన మీద కోపం వచ్చిన విషయాన్ని గ్రహించిన ఉశనుడు పరమేశ్వరుని ఎదుట ఎప్పుడు ఉండవచ్చునో, ఎప్పుడు ఉండగూడదో తెలిసిన వాడు కావడం చేత ప్రస్తుతానికి శివునికి దూరంగా వెళ్ళిపోతాడు. ఆ తర్వాత ఉశనుడు ఉగ్ర తపస్సుతో పరమేశ్వరుని ధ్యానించి అతని శూలాగ్రం మీద కనిపిస్తాడు. శివుడు వెంటనే ఉశనుని పట్టుకొని నోట్లో వేసుకొని మింగుతాడు. పరమేశ్వరుని కుక్షిలోకి వెళ్ళిన ఉశనుడు అక్కడ అంతటా కలయ తిరుగుతూ ఉంటాడు. అపుడు శివుడు కొన్ని కోట్ల సంవత్సరాలు తపస్సు చేస్తాడు. ఆ సమయంలో ఉశనుడు శివుని కుక్షిలో ఉండడం చేత శివుని తపః ప్రభావం వల్ల ఉశనుని తపస్సు కూడా పెంపొందుతుంది. పరమేశ్వరుడు తపస్సు మానివేసిన తర్వాత అతని కుక్షిలో ఉన్న ఉశనుడు అందులో నుంచి బయట పడడానికి అనేక ప్రయత్నాలు చేస్తాడు. అతని ప్రయత్నాన్ని ఈశ్వరుడు వ్యర్థం చేస్తాడు. అపుడు ఉశనుడు తన మీద దయచూపి బయటికి వచ్చేలాగా చేయమని పరమేశ్వరుని ప్రార్థిస్తాడు. పరమేశ్వరుడు "నీవు నా మూత్ర ద్వారం గుండా మాత్రమే బయటికి రావాలి" అని పలికి తన ఇతర ద్వారాలను మూసి వేస్తాడు. అన్ని మార్గాలు మూసుకు పోవడంతో ఉశనుడు చేసేది లేక శివుని మూత్రద్వారం నుంచి బయటికి వస్తాడు. ఉశనుని చూసి ఈశ్వరుడు కోపంతో శూలాన్ని అతని మీదికి ఎత్తుతాడు. వెంటనే పార్వతి పరమేశ్వరునితో

**"హింసనీయస్త్వయా నైవ మమ పుత్రత్వ మాగతః**
**న హి దేవోదరాత్ కశ్చిత్ నిస్సృతో నాశమృచ్ఛతి"**
**(శాంతి. 289 – 35వ శ్లోకం)**

"దేవా! ఇపుడు ఇతడు నా కుమారుడు అయ్యాడు కాబట్టి ఇతణ్ణి నాశనం చేయకూడదు. నీ కుక్షి నుంచి బయటికి వచ్చిన వ్యక్తి నశించడానికి వీలులేదు" అని ప్రార్థిస్తుంది. ఆమె

ప్రార్థనను మన్నించి ఈశ్వరుడు ఉశనుని వెళ్ళమని చెబుతాడు. శివుని మూత్ర ద్వారం గుండా బయటకు వచ్చిన వాడు కావడం చేత ఉశనుడు అప్పటి నుంచి శుక్రుడు అని లోకంలో ప్రసిద్ధి చెందాడు. ఇంతటితో ఈ వృత్తాంతం ముగుస్తుంది.

ఈ కథ ఏ మాత్రమూ హేతుబద్ధమైనది కాదు. ప్రాచీన గ్రంథాల్లో భృగు వంశం చాలా గొప్ప వంశంగా చెప్పబడింది. భృగువు సాక్షాత్తుగా విష్ణువును శపించిన వాడు. అలాంటి వంశంలో జన్మించిన ఉశనుడు దొంగతనంగా కుబేరుని ధనం అపహరించాడని చెప్పడం ఔచిత్యంగా లేదు. ఒకవేళ అపహరించి నప్పటికీ ఉశనుడు ఈశ్వరుని ఎదుట ఎప్పుడు పడాలో ఎప్పుడు పడగూడదో తెలిసిన వాడని ఈ కథలో చెప్పబడింది. అలాంటివాడు తనకు తానుగా కోపంగా ఉన్న ఈశ్వరుని త్రిశూలం మీద ఉండి ఈశ్వరునికి కనిపించి అతని చేత పట్టుబడి మింగబడ్డాడు అని చెప్పడం మరింత అనౌచిత్యంగా ఉంది. ఒకవేళ మింగబడినా ఈశ్వరుడు కొన్ని కోట్ల సంవత్సరాలు తపస్సు చేశాడని, అన్ని కోట్ల సంవత్సరాలు ఉశనుడు అతని కడుపులో ఉన్నాడని చెప్పడం ఏ మాత్రం నమ్మశక్యం కాని అంశం. ఒకవేళ ఈశ్వరునికి ఉశనుని మీద కోపం ఉండి అతనిని చంపాలనుకుంటే కడుపులో ఉన్న ఉశనుని చంపడం చాలా సులభం. అలా చేయకుండా అతణ్ణి మూత్ర ద్వారం గుండా బయటికి వచ్చేలాగా చేయడం ఆ కారణం చేత అతనికి శుక్రుడు అనే పేరు వచ్చిందని చెప్పడం హేతుబద్ధమైన అంశం కాదు. ఇన్ని అనౌచిత్యాలున్న ఈ కథ ఏ మాత్రం నమ్మదగినదిగా లేదు. బృహస్పతి, వశిష్ఠుడు, అగస్త్యుడు మొదలైన మహర్షుల పేర్లలాగానే శుక్రుడు అనేది కూడా శుక్రునికి మొదటి నుంచి ఉన్న పేరే. అయితే ఈ శుక్రుడు దేవతలకు శత్రువులైన రాక్షసులకు కులగురువుగా ఉండడం చేత అతనిమీది కోపంతో అతణ్ణి కించపరుస్తూ పండితుడైన కవి ఈ కథను కల్పించి చెప్పాడు. అందువల్ల ఈ కథ కట్టుకథ అవుతూ ఉంది. ఇది జానపద కట్టుకథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ.

ఈ కథను తిక్కన శాంతిపర్వం పంచమాశ్వాసంలోని 468వ పద్యం నుంచి 476వ పద్యం వరకూ ఉన్న 9 పద్యగద్యాల్లో క్లుప్తంగా చెప్పాడు.

## 20. బృహస్పతి శాపం వల్ల జలంలో జలప్రాణులు ఏర్పడడం:

భారతంలో ఈ వృత్తాంతం శాంతి పర్వంలోని మోక్షధర్మ పర్వం అనే ఉపపర్వంలో 342వ అధ్యాయంలో 27వ వచనంలో ఉంది. ఈ విషయాన్ని శ్రీకృష్ణుడు అర్జునునికి బ్రాహ్మణ మహిమను వర్ణిస్తూ చెబుతాడు.

అమృతం ఉత్పన్నమైనప్పుడు అంగిరసుని కుమారుడైన బృహస్పతి సముద్ర జలంతో ఆచమనం చేస్తాడు. సముద్రపు నీటిని మంథర పర్వతంతో చిలకటం వల్ల నీరు మురికిగా ఉంటుంది. అందుకు దేవ గురువైన బృహస్పతి కోపించి నేను ఆచమనం చేసిన సమయంలో నీ నీరు మురికిగా ఉంది కాబట్టి నీవు ఇప్పటి నుంచి మురికిగా, మలినంగా

ఉంటావు. చేపలు, మొసళ్ళు, తాబేళ్ళు మొదలైన జల జంతువులతో నీవు కలుషితమౌతావు" అని శపిస్తాడు. అప్పటి నుంచి జలాల్లో జల జంతువులు ఉన్నాయి. ఇంతటితో ఈ వృత్తాంతం ముగుస్తుంది.

ఏమాత్రం తెలివి ఉన్న వారికైనా పై కథ కట్టుకథ అని ఇట్టే తెలిసిపోతుంది. భూగ్రహం మీద మొట్టమొదట జీవి ఉద్భవించింది నీటిలోనే. పరిణామం ద్వారా సముద్రంలో అనేక రకాల జీవులు కాలక్రమంలో రూపొందాయి. భారతం ఆదిపర్వం 18వ అధ్యాయంలో సముద్ర మథనం కథ ఉంది. దేవ దానవులు మందర పర్వతాన్ని సముద్రంలో వేసి చిలుకుతున్నప్పుడు అందులోని ప్రాణులు చనిపోయి నట్లుగా చెప్పబడింది.

**"తత్ర నానాజలచరా వినిష్పిష్టా మహాద్రిణా**
**విలయం సముపాజగ్ముః శతశౌ లవణాంభసి"**
**"వారుణానిచ భూతాని వివిధాని మహీధరః**
**పాతాలతల వాసీని విలయం సముపానయత్"**
**(ఆది. 18 – 20, 21 శ్లోకాలు)**

"మందర పర్వత సంఘర్షణ చేత సముద్రంలోని జల జంతువులన్నీ ఉప్పు నీటిలో విలయం పొందాయి. ఆ పర్వతం వల్ల సముద్రం అడుగున ఉన్న పాతాలం లోని ప్రాణులన్నీ నశించాయి". ఈ శ్లోకాలను బట్టి సముద్ర మథనం నాటికే సముద్రంలో చాలా జలచరాలు ఉన్నట్లుగా స్పష్టమౌతుంది. కాబట్టి బృహస్పతి శాపంవల్ల నీటిలో చేపలు, మొసళ్ళు, తాబేళ్ళు మొదలైన జల జంతువులు ఉద్భవించాయని చెప్పడం కట్టుకథ ఔతుంది.

తిక్కన శాంతిపర్వంలో ఈ వృత్తాంతాన్ని అనువదించకుండా వదిలేశాడు.

## 21. ఎ.బంగారం పుట్టుక కథ:
## బి. కప్ప , ఏనుగు, చిలుకలకు దేవతలు వరాలివ్వడం:

ఈ కథలు అనుశాసన పర్వం 84, 85 అధ్యాయాల్లో 250 శ్లోకాల్లో ఉన్నాయి. వీటిని భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. "దానాలన్నింటిలో సువర్ణ దానం ఉత్తమమైనదని శృతి వచనం. అది ఎందువల్ల ఉత్తమ దానమైంది? అది ఏ సమయంలో పుట్టింది? దాని స్వరూపమేమిటి? భూమి కన్నా, గోవుల కన్నా బంగారం ఎలా పవిత్రమైనది? మొదలైన విషయాలు తెలుప వలసిందిగా ధర్మరాజు భీష్ముని కోరినపుడు భీష్ముడు పై కథలను ఇలా చెబుతాడు.

వీరుడైన పరశురాముడు 21 సార్లు క్షత్రియుల మీదికి దండెత్తి వారందరినీ చంపివేసి ఆ పాపాన్ని పోగొట్టు కోవడానికి అశ్వమేధ యాగాన్ని చేస్తాడు. ఆ యాగ ఫలంతో అతడు పాప విముక్తి పొందలేకపోయాడు. అపుడు పరశురాముడు వశిష్ఠ, అగస్త్య, కాశ్యపుల దగ్గరికి వెళ్ళి "నేను పవిత్రుడను కావాలి. ఏ కర్మచేత లేదా ఏ దానం

చేత పవిత్రుడను కాగలను? నన్ననుగ్రహించి చెప్పండి” అని వారిని కోరతాడు. దానికి వారు “పాపకర్మలు చేసిన నరులు బ్రాహ్మణులకు సువర్ణ దానం చేస్తే వారి పాపం పోతుంది. సువర్ణం అగ్ని నుంచి పుట్టింది. పవిత్రమైన అన్ని వస్తువుల కంటే బంగారం పరమ పవిత్రమైనదిగా భావింపబడుతూ ఉంది. అది భూమి కంటే గోవుల కంటే రత్నాల కంటే పవిత్రమైనది. ఉత్తమ పావన సువర్ణాన్ని బ్రాహ్మణోత్తములకు దానం చేస్తే సర్వ దానాలనూ చేసిన వారవుతారు. అంతేకాదు సువర్ణదానం చేసినవారు దేవతలను కూడా దానం చేసినట్లే. ఎందుకంటే అగ్ని సర్వదేవతా స్వరూపుడు. సువర్ణం అగ్ని స్వరూపం. అందువల్ల సువర్ణ దానం సర్వ దేవతల దానంతో సమానం. కాబట్టి సువర్ణదానం చేయమని ఋషులు పరశురామునికి చెబుతారు.

తర్వాత వశిష్ఠుడు సువర్ణం పుట్టుకను గురించి పరశురామునికి ఇలా చెబుతాడు. పార్వతీ పరమేశ్వరులకు వివాహం జరిగిన తర్వాత వారిద్దరి సమాగమం జరుగుతున్నప్పుడు దేవతలు అక్కడికి వచ్చి ఈశ్వరునికి శిరసా నమస్కరించి అతనితో “దేవా ! దేవితో ఈ నీ సమాగమం తపస్వినితో తపస్వికి, తేజస్వినితో తేజస్వికి జరిగిన సమాగమం. నీ తేజస్సు అమోఘమైనది. ఉమ తేజస్సు కూడా అమోఘమైనదే. ఇలాంటి మీ ఇద్దరికీ కలిగిన సంతానం చాలా బలిష్ఠమైనది అవుతుంది. అది మూడు లోకాల్లో దేనినీ మిగల్చదు. కాబట్టి నీ పాదాలను శరణు కోరిన మాకు త్రిలోక హితాన్ని కోరి ఒక వరాన్ని ఇవ్వాలి. నీకు పార్వతి వల్ల కుమారుడు జన్మించకూడదు. జన్మిస్తే అతడు దేవతలను కూడా ఓడించగలడు. నీ తేజస్సును భూమి, ఆకాశం, స్వర్గం అన్నీ కలిసి కూడా భరించ లేవు. కాబట్టి ప్రజ్వలిస్తున్న నీ ఉత్తమ తేజస్సును ధైర్యంతో నిగ్రహించు” అని ప్రార్థిస్తారు. వారి ప్రార్థనను మన్నించి ఈశ్వరుడు తన రేతస్సును పైకి పంపి ఊర్ధ్వరేతస్కుడు అవుతాడు. అయినప్పటికీ దానిలో కొంచెం జారి అక్కడి నేలపై పడుతుంది. ఆ తేజస్సు అగ్నిలో పడుతుంది. అపుడు తనకు సంతాన భంగం కలిగినందుకు పార్వతి కోపించి దేవతలతో

**“యస్మాదపత్యకామో వై భర్తామే వినివర్తితః**
**తస్మాత్ సర్వే సురా యూయమనపత్యా భవిష్యథ”**
**(అనుశాసన. 84 – 72వ శ్లోకం)**

“సంతానాపేక్ష గల నా భర్తను మీరు దాని నుంచి విరమింప జేసి నాకు సంతానం కలగకుండా చేశారు. కాబట్టి మీకెవ్వరికీ సంతానం కలగదు” అని శపిస్తుంది. ఉమ ఇచ్చిన ఆ శాపం వల్ల దేవతలు సంతాన హీనులవుతారు. అయితే ఆ శాప సమయంలో అగ్ని అక్కడ లేదు.

అదే సమయంలో తారకుడు అనే పేరు గల రాక్షసుడు పుట్టి దేవతలను ఋషులను హింసిస్తూ ఉంటాడు. అపుడు దేవతలందరూ బ్రహ్మ వద్దకు వెళ్ళి తారకాసురుని వల్ల తాము పడుతున్న బాధలను వివరించి అతడు చనిపోయే మార్గాన్ని తెలుపవలసిందిగా

కోరతారు. దానికి బ్రహ్మ "కామంచేత జారిన రుద్రుని తేజస్సు అగ్నిలో పడింది. అగ్ని దాన్ని గ్రహించి గంగలో ప్రతిష్ఠించి కుమారుని పుట్టిస్తాడు. ఆ కుమారుడు తారకాసురుని సంహరిస్తాడు. పార్వతి దేవతలను శపించిన సమయంలో అగ్ని అక్కడ లేడు కాబట్టి ఆ శాపం అగ్నికి వర్తించదు. కాబట్టి మీరు వెళ్ళి అగ్నిని వెదకి అతనిలో ఉన్న శివుని రేతస్సును గంగలో ప్రతిష్ఠింప జేసి కుమారుడు కలిగేలాగా చూడండి" అని చెప్పి వారిని పంపిస్తాడు. దేవతలు ముల్లోకాల్లో అగ్ని కోసం వెదుకుతూ ఉంటారు. అగ్ని తన తేజస్సును నీటిలో కలిపి ఎవరికీ కనిపించకుండా రసాతలంలో ఉంటాడు. దేవతలు అగ్ని కోసం నీటిలో వెదుకుతున్నప్పుడు ఒక కప్ప వారికి కనిపించి "దేవతలారా! అగ్ని రసాతలంలో ఉన్నాడు. ఆ అగ్ని నుంచి పుట్టిన తేజస్సు వల్ల నేను తపించిపోతున్నాను. మీకు అగ్నితో పని ఉంటే అగ్నిని చూడదలచుకుంటే రసాతలానికి వెళ్ళండి" అని చెబుతుంది. కప్ప తన ఉనికిని దేవతలకు చెప్పినట్లుగా అగ్ని గ్రహించి కప్ప వద్దకు వచ్చి "మీకు రుచి తెలియకుండు గాక" అని దాన్ని శపించి అక్కడి నుంచి వేగంగా మరొక చోటికి వెళ్ళిపోతాడు. అపుడు దేవతలు కప్పల మీద దయ వహించి అగ్ని శాపం వల్ల రుచి కోల్పోయిన కప్పలకు కింది విధంగా వరాలనిస్తారు.

**"అగ్ని శాపాద జిహ్వాపి రసజ్ఞాన బహిష్కృతాః**
**సరస్వతీం బహు విధాం యూయముచ్చార యిష్యథ"**
**"బిలవాసం గతాంశ్చైవ నిరాహారా నచేతసః**
**గతాసూనపి సంశుష్కాన్ భూమిః సంధార యిష్యతి"**
**"తమో ఘనాయా మపి వై నిశాయాం విచరిష్యథ**
**ఇత్యుక్త్వా తాం స్తతో దేవాః పునరేవ మహీ మిమామ్"**
**(అనుశాసన. 85 - 31, 32, 33 శ్లోకాలు)**

"అగ్ని శాపం వల్ల నాలుకను కోల్పోయి రస జ్ఞానానికి దూరమైనప్పటికీ మీరు అనేక విధాలైన మాటలను ఉచ్చరించగల్గుతారు. మీరు బిలంలో నివసించే సమయంలో ఆహారం లేకుండా, అచేతనంగా, ప్రాణరహితంగా ఉండి ఎండి పోయినప్పటికీ భూమి మిమ్ములను ధరించి ప్రాణాలతో నిలుపుతుంది. దట్టమైన చీకటి ఉన్న రాత్రి సమయాల్లో కూడా మీరు సంచరించగలరు" అని దేవతలు కప్పలకు వరాలనిచ్చి, అగ్నికోసం భూమి మీద వెదుకుతూ ఉంటారు. అపుడు ఐరావతం లాంటి ఒక ఏనుగు అగ్ని అశ్వత్థ వృక్షంలో ఉన్నాడని దేవతలకు చెబుతుంది. అపుడు అగ్ని కోపంతో "మీ నాలుక వెనుకకు తిరిగి ఉంటుంది" అని ఏనుగులనన్నింటినీ శపించి అశ్వత్థ వృక్షం నుంచి బయటికి వచ్చి శమీ వృక్షంలో ప్రవేశస్తాడు. అపుడు దేవతలు ఏనుగుల వద్దకు వచ్చి "మీ నాలుక వెనుదిరిగి ఉన్నప్పటికీ మీరు అన్ని ఆహారాలను తీసుకొన గలరు. ఆ నాలుకతోటే అస్పష్టమైన మాటలను పెద్దగా మాట్లాడగలరు" అని వాటిని అనుగ్రహించి అగ్నిని అన్వేషించడానికి వెళ్తారు. అపుడు ఒక

చిలుక అగ్ని శమీవృక్షంలో ఉన్నట్లు దేవతలకు చెబుతుంది. దానికి అగ్ని కోపించి "మీకు మాటలు రాకుండుగాక" అని చిలుకలను శపించి దాని నాలుకను తిరగ వేస్తాడు. అపుడు దేవతలు దయామయులై చిలుకతో "నీవు చిలుకగా ఉన్నప్పటికీ నీ వాక్కు పూర్తిగా నశించదు. నాలుక తిరగబడి నప్పటికీ నీ మాట మధురంగానే ఉంటుంది. పిల్లల మాటలు పెద్దలకు మధురంగా ఉన్నట్లుగా నీ మాట అవ్యక్త మధురంగా అద్భుతంగా ఉంటుంది" అని అంటారు. ఆ తర్వాత దేవతలు శమీ వృక్షంలో ఉన్న అగ్నిని చూసి అతనితో తాము వచ్చిన పనిని గురించి చెబుతారు. అగ్ని వారు చెప్పిన పని చేయడానికి అంగీకరిస్తాడు.

తర్వాత అగ్ని గంగానది దగ్గరకు వెళ్ళి గంగతో కలుస్తాడు. గంగ గర్భాన్ని ధరిస్తుంది. అగ్ని ప్రతిష్ఠించిన తేజోవంతమైన గర్భం గంగలో పెరుగుతూ ఉంటుంది. అయితే తేజోవంతమైన ఆ గర్భాన్ని గంగ భరించలేకపోతుంది. అదే సమయంలో ఒక రాక్షసుడు అక్కడికి వచ్చి భయంకరంగా అరుస్తాడు. ఆ శబ్దానికి గంగకు భయంతో కళ్ళు తిరుగుతాయి. శరీరమంతా వణుకుతుంది. దానితో ఆమె గర్భాన్ని భరించలేక దాన్ని మేరు పర్వతం మీద విడిచి పెడుతుంది. అపుడు అగ్ని దాన్ని దర్శించి గంగతో

**"పప్రచ్ఛ సరితాం శ్రేష్ఠాం కచ్చిత్ గర్భః సుఖోదయః**
**కీదృగ్వర్ణోపి వా దేవి కీదృగ్రూపశ్చ దృశ్యతే**
**తేజసా కేన వా యుక్తః సర్వమేతద్ బ్రవీహిమే"**

**(అనుశాసన. 85 – 71వ శ్లోకం)**

గర్భం నీకు సుఖాన్ని కల్గించిందా? దాని వర్ణమేది? దాని రూపమేది? దాని తేజస్సు ఎలాంటిది?" అని అడుగుతాడు. దానికి గంగ

**"జాతరూపః స గర్భో వై తేజసా త్వమివానఘ**
**సువర్ణో విమలో దీప్తః పర్వతం చావభాషయత్"**

**(అనుశాసన. 85 – 72వ శ్లోకం)**

అనఘా! ఆ గర్భం సువర్ణం, తేజస్సులో అది నీతో సమానమైనది. అది బంగారం లాగా వెలుగొందుతూ పర్వతాన్ని ప్రకాశింపజేసింది.

**"తేజసా తస్య గర్భస్య భాస్కరస్యేవ రశ్మిభిః**
**యద్ద్రవ్యం పరిసంస్పృష్టం పృథివ్యాం పర్వతేషుచ"**
**"తత్సర్వం కాంచనీభూతం సమన్తాత్ ప్రత్యదృశ్యత**
**పర్వధావత శైలాం శ్చ నదీః ప్రస్రవణాని చ"**

**(అనుశాసన. 85 – 74,75 శ్లోకాలు)**

సూర్యకిరణాలు తాకినట్లుగా ఆ గర్భం యొక్క తేజోకిరణాలు ఆ పర్వతాల మీద ఉన్న పదార్థాలను తాకగానే అదంతా బంగారమై అన్ని వైపుల నుండి కనిపించింది.

"వ్యాదీపయం స్తేజసా చ త్రైలోక్యం సచరాచరమ్
ఏవంరూపః స భగవాన్ పుత్రస్తే హవ్యవాహన
సూర్య వైశ్వానర సమః కాంత్యా సోమ ఇవాపరః"
(అనుశాసన. 85 - 76వ శ్లోకం)

"హవ్యవాహనా! ఆ బాలుడు ముల్లోకాలనూ తన తేజస్సు చేత ప్రకాశింప జేస్తూ పర్వతాలవైపు, నదులవైపు, సెలయేర్లవైపు పరిగెత్తాడు. అతడు సూర్యునితో, అగ్నితో సమానమైన తేజోరూపం కల్గినవాడు. కాంతిలో చంద్రునివంటి వాడు" అని పలికి గంగ అంతర్ధానమవుతుంది. దేవతల పనిని నెరవేర్చిన అగ్ని కూడా అక్కడి నుంచి వెళ్ళిపోతాడు. ఈ కర్మల వల్ల, గుణాల వల్ల ఋషులూ, దేవతలూ అగ్నిని హిరణ్య కేతుడు అని వ్యవహరిస్తారు. ఆ హిరణ్యాన్ని ధరించినందు వల్లనే భూమిని "వసుమతి" అని అంటారు. అగ్ని నుంచి, గంగ నుంచి పుట్టిన గొప్ప తేజస్సు గల ఆ బాలుడు దివ్యమైన రెల్లుపొద మీద నిలిచి పెరుగుతూ ఉంటాడు. ఆ బాలకుని కృత్తికలు చూసి తమ కుమారునిగా భావించి చను బాలనిచ్చి పోషిస్తారు. ఆ కారణం చేత ఆ బాలుడు కార్తికేయుడు అయ్యాడు. జారిన శివుని వీర్యం నుంచి పుట్టడం వల్ల స్కందుడయ్యాడు. గుహలో నివసించడం వల్ల గుహుడయ్యాడు. ఈ విధంగా అగ్ని సంతానంగా సువర్ణం పుట్టింది. ఇది పవిత్రమైన వాటిలో పవిత్రమైనది. ఈశ్వర స్వరూపం, అగ్ని స్వరూపం, సోమ స్వరూపం కూడా. అలాంటి సువర్ణాన్ని బ్రాహ్మణులకు దానం చేస్తే మీ పాపాలన్నీ నశిస్తాయని వసిష్టుడు పరశు రామునికి చెబుతాడు. తర్వాత పరశురాముడు బ్రాహ్మణులకు సువర్ణాన్ని దానం చేసి పాప విముక్తి పొందినట్లుగా భీష్ముడు ధర్మరాజుకు చెప్పి నీవు కూడా బ్రాహ్మణులకు సువర్ణాన్ని పుష్కలంగా దానం చెయ్యి, నీవు కూడా సర్వపాపాల నుంచీ విముక్తి పొందగలవని చెబుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

జగత్పితరులైన పార్వతీపరమేశ్వరుల సంభోగం సమయంలో దేవతలు వారి వద్దకు వచ్చి వారిద్దరికీ కలిసి పుత్రుడు జన్మించకుండా చూడాలని శివుని వరం కోరారని చెప్పడం చాలా అనుచితం. శివుడు వారి కోరికను మన్నించి వీర్యాన్ని స్కలించకుండా పైకి పంపాడని, అయితే కొంత వీర్యం అక్కడ నేల మీద పడిందని, అగ్ని దాన్ని భరిస్తూ ఉన్నాడని చెప్పడం మరింత అనుచితం. పార్వతీ పరమేశ్వరుల వద్దకు దేవతలు వచ్చినప్పుడు వారిలో అగ్నిలేడు. నేలమీద పడిన శివుని వీర్యం అగ్ని అక్కడ లేనప్పుడు అది అగ్నిలో ఎలా పడుతుంది. అంతే గాకుండా హేతుబద్ధంగా చూస్తే అగ్నిదేవుడు కాడు. దహనం చేయగల ఒక ప్రకృతిశక్తి. అగ్ని తనలో పడిన దేన్నయినా దహించివేస్తుంది. అగ్ని తనలో పడిన శివుని వీర్యాన్ని కొంత కాలం భరించిన తర్వాత దేవతల కోరికను అనుసరించి గంగా గర్భంలో ప్రవేశపెట్టడం, గంగ దాన్ని తన గర్భంలో కొంత కాలం ధరించిన తర్వాత మేరుపర్వతం మీద విడిచి పెట్టడం, ఆ సమయంలో కుమారస్వామితో పాటు

సువర్ణం పుట్టిందని చెప్పడం హేతుబద్ధమైనది కాదు. లోకంలో బంగారం విలువైనదిగా పరిగణింపబడుతూ ఉంది. బంగారం పసుపు పచ్చరంగులో వెలుగుతూ ఉంటుంది. అగ్ని కూడా పసుపుపచ్చ రంగులో వెలుగుతూ ఉంటుంది. ఈ రెండింటి పోలికను గమనించిన కవి విలువైన బంగారం అగ్ని దేవతా స్వరూపంగా గంగా గర్భంనుంచి కుమారు స్వామితోపాటు ఉద్భవించిందని కల్పించి చెప్పాడు. అందువల్ల ఇది కట్టుకథ అవుతూ ఉంది. ఇది జానపద కట్టుకథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ.

సంస్కృత భారతం శల్యపర్వంలోని గదాయుద్ధపర్వం అనే ఉపపర్వంలో 44, 45, 46 అధ్యాయాల్లో కుమారస్వామి కథ 276 శ్లోకాల్లో వివరంగా ఉంది. 44వ అధ్యాయంలో కుమారస్వామి పుట్టుక క్లుప్తంగా ఇలా ఉంది. శివుని వీర్యం జారి అగ్నిలో పడింది. సర్వ భక్షకుడైన అగ్ని అక్షయమైన ఆ వీర్యాన్ని దగ్ధం చేయలేదు. దానితో కాంతిమంతుడైన అగ్ని అమిత తేజస్వి అయి తేజోమయమైన గర్భాన్ని ధరిస్తాడు. తర్వాత బ్రహ్మ ఆదేశాన్ననుసరించి అగ్ని ఆ గర్భాన్ని గంగలో విడుస్తాడు. గంగ ఆ గర్భాన్ని ధరించలేక హిమగిరి మీద రెల్లు పొదలో విడుస్తుంది. ఆ అగ్ని కుమారుడు లోకాలన్నింటా వ్యాపించి అక్కడ వృద్ధి చెందుతాడు. గంగ స్కందుని విడిచిన ఆ పర్వతం పూర్తిగా స్వర్ణమయమై ప్రకాశిస్తుంది. వర్ధిల్లుతున్న ఆ శిశువు ఆ భూమిని ప్రకాశింప జేశాడు. అందువల్ల అక్కడి పర్వతాలన్నీ సువర్ణమయాలయ్యాయి" ఈ కథలో స్కంధుని వల్ల అతడున్న హిమగిరి సువర్ణమయంగా ప్రకాశించినట్లుగా చెప్పబడింది. అంతేగాని స్కందునితోపాటు బంగారం గంగా గర్భం నుంచి పుట్టినట్లుగా చెప్పబడలేదు. ఈ కారణం చేత గూడా అనుశాసన పర్వంలోని బంగారం పుట్టుక కథ కట్టుకథ అని స్పష్టమవుతూ ఉంది.

సంస్కృత భారతం వనపర్వంలోని మార్కండేయ సమస్యాపర్వం అనే ఉపపర్వంలో 225 అధ్యాయం నుంచి 232 వరకు వున్న 7 అధ్యాయాల్లో 346 శ్లోకాల్లో కుమారస్వామి వృత్తాంతం వివరంగా ఉంది. ఈ వృత్తాంతంలో కుమార స్వామి పుట్టుకకు సంబంధించిన కథ అనుశాసనపర్వం, శల్యపర్వంలోని కథల కంటే భిన్నంగా ఉంది. క్లుప్తంగా ఆ కథ ఇది.

సప్తర్షులు తమ భార్యలతో కలిసి యజ్ఞం చేస్తున్నప్పుడు అద్భుతుడు అనే పేరు గల అగ్ని మహర్షులు సమర్పించే హవ్యాలను ఆయా దేవతలకు సమర్పించడానికి వచ్చి సప్తర్షుల భార్యలను చూచి మోహించి వారిని మళ్ళీ మళ్ళీ చూడాలని భావించి గార్హపత్యాగ్నిలో ప్రవేశించి బంగారు కాంతి గల ఋషి పత్నులను చూస్తూ, స్పృశిస్తూ సంతోషిస్తూ కామవశు డవుతాడు. అయితే ఋషి పత్నులను పొందాలన్న అతని కోరిక ఫలించదు కాబట్టి అతడు తన శరీరాన్ని విడిచి పెట్టడానికి అడవికి వెళతాడు. దక్షుని కూతురైన స్వాహాదేవి అగ్నిదేవుని చాలా కాలంగా ప్రేమిస్తూ అతని పొందును ఆశిస్తూ ఉంటుంది. ఈమె అగ్నిదేవుని సప్తర్షుల భార్యల మీది విరహ వేదనను గమనించి సప్తర్షుల భార్యల వేషంలో తాను

అగ్నిదేవుని పొందాలని ఆలోచించి మొదట అంగిరసుని భార్య అయిన శివ అనే ఆమె రూపాన్ని ధరించి అగ్నిదేవుని పొంది పర్వత శిఖరం మీద ఉన్న ఒక బంగారు కుండలో అగ్ని వీర్యాన్ని వదులుతుంది. తర్వాత స్వాహాదేవి అరుంధతీ రూపాన్ని తప్ప మిగిలిన అయిదుగురు ఋషి పత్నుల రూపాన్ని ధరించి అగ్నిదేవునితో సంభోగించిన అనంతరం అగ్నిదేవుని వీర్యాన్ని పాడ్యమినాడు ఆ కుండలో వదులుతుంది. స్కలితమైన ఆ అగ్నితేజస్సు తేజస్వి అయిన కుమారుడుగా మూడు రోజులకు రూపొందుతాడు. ఆ కుమారుడే స్కందుడు. కార్తికేయుడు, కుమారుస్వామి పేర్లతో పిలువబడతాడు.

వనపర్వంలోని కుమారస్వామి పుట్టుకకు సంబంధించిన ఈ కథలో శివుని ప్రమేయం, గంగ ప్రమేయం లేదు. దీన్ని బట్టి అనుశాసన పర్వంలోని కథను రాసిన కవి, శల్యపర్వంలోని కథను రాసిన కవి వనపర్వంలోని కథను రాసిన కవి వేరు వేరు వ్యక్తులని స్పష్టమవుతూ ఉంది. ఈ కవులు కుమారస్వామికి సంబంధించిన కథను తమకు తోచినట్లుగా కల్పించి రాసినట్లుగా మనం గమనించవచ్చు. కాబట్టి ఈ కథలన్నీ కట్టుకథలుగానే భావించాలి.

అనుశాసన పర్వంలోని కథలో బ్రహ్మదేవుని ఆజ్ఞతో దేవతలు అగ్నికోసం వెదుకుతున్నప్పుడు కప్ప, ఏనుగు, చిలుకలు అగ్నిదేవుని ఆచూకి చెప్పినట్లుగా అందుకు కోపించిన అగ్నిదేవుడు వాటిని శపించినట్లుగా, తమకు ఉపకారం చేసి శపించబడిన ఆ ప్రాణులకు దేవతలు వరాలు ఇచ్చినట్లుగా చెప్పబడింది. అగ్నిశాపం వల్ల రసజ్ఞానం కోల్పోయిన కప్పలకు దేవతలు కప్పలు అనేక విధాలైన మాటలను ఉచ్చరించగలడం, భూమి రంధ్రాల్లో అవి ఆహారం లేకుండా అచేతనంగా ప్రాణరహితంగా ఎండిపోయి ఉన్నప్పుడు భూమి వాటిని ధరించి ప్రాణాలతో నిలుపు తుందని, దట్టమైన చీకటి గల రాత్రి వేళల్లో గూడా అవి సంచరిస్తాయని వరాలను ఇస్తారు. భూమి మీద నీళ్ళు ఉన్నప్పుడు కప్పలు బెకబెకమంటూ అనేక రకాలుగా అరుస్తూ సంతోషంగా ఉంటాయి. నీళ్ళు లేనప్పుడు అవి భూమిరంధ్రాల్లో, రాళ్ళ కింది దాక్కుని బయటికి రాకుండా వర్షం కోసం ఎదురు చూస్తూ ఆహారం లేకుండా చిక్కిపోయి ఎండి పోయినట్లుగా కన్పిస్తాయి. వర్షం పడగానే అవి బయటకి వచ్చి సంతోషంగా అరుస్తూ ఎగురుతూ ఉంటాయి. అలాగే రాత్రి సమయంలో కప్పలు తిరుగుతూ ఉంటాయి. దాన్ని గమనించిన కవి ప్రకృతి కప్పలకు ప్రసాదించిన సౌకర్యాన్ని దేవతలు కప్పలకు ఇచ్చిన వరంగా కల్పించి చెప్పాడు. అలాగే ఏనుగులు, చిలుకల విషయంలో గూడా వరాలుగా ఇచ్చినట్లుగా కవి కల్పించాడు. అందువల్ల ఈ కథ కట్టుకథ అవుతూ ఉంది. ఇందులో జానపద కట్టుకథాంశ ఉంది.

తిక్కన ఈ కథను అనుశాసన పర్వం తృతీయాశ్వాసంలోని 128 వ పద్యం నుంచి 154 వ పద్యం వరకూ ఉన్న 27 పద్యగద్యాల్లో రచించాడు. ఔచిత్యా న్ననుసరించి ఈ కథలో కొన్ని మార్పులు జేశాడు. మూలంలో పార్వతీ పరమేశ్వరుల సమాగమ

సమయంలో దేవతలు వచ్చి శివుని వరం కోరినట్లు ఉంది. ఇది అశ్లీలం, అనౌచిత్యమని భావించి తిక్కన "కొండొక కాలంబునకు నయ్యాదిమ గృహస్థుని తేజంబాపరమ గృహిణి నిమిత్తంబుగా రేతోధాతు రూపంబునం బ్రసన్నంబై యమ్మహేశ్వరు మానసవృత్తింజేసి అగ్నియందు నిలిచియుండ" (కొంత కాలానికి మొదటి గృహస్థుడైన శివునికి దొడ్డ యిల్లాలైన పార్వతి కారణంగా వీర్యం వెలువడింది. శివుడు దాన్ని భావన శక్తి చేత అగ్ని యందు నిలిపి వుంచాడు). అని మార్చి రాసి మూలంలోని అశ్లీలాన్ని అనౌచిత్యాన్ని తొలగించాడు.

సంస్కృత భారతంలో అగ్నిదేవుడు దేవతలకు కనిపించకుండా ఉండడానికి కారణం చెప్పబడలేదు. తిక్కన తన భారతంలో "నిద్రాతిశయము నూని ప్రచ్ఛన్నుడై యుండుట వారలు గానక యున్నంత" (ముంచుకొచ్చిన నిద్రవల్ల అగ్ని దేవతలకు కన్పించ కుండా ఉన్నట్లుగా) మార్చి రాశాడు. అలాగే కప్పలు, ఏనుగులు, చిలుకలకు దేవతలు ఇచ్చిన వరాల విషయంలో గూడా తిక్కన ఉచితమైన మార్పులు చేశాడు.

**"..................... బొక్కలెండనెండి**
**చచ్చియును నీరు వచ్చిన జీవు బొంకు**
**సేసి యెలుగులు సెలగగ జెలగ వరము**
**వారు కప్పలకిచ్చిరవార్య తేజ"**

**(3వ ఆ. 143 వ పద్యం)**

కప్పలు బొరియల్లో ఎండలకు ఎండి చనిపోయినప్పటికీ నీరు రాగానే చావును అబద్ధం చేసి బెకబెకమని అరుస్తూ విజృంభిస్తాయి.

"గజంబులు ప్రతీప జిహ్వాంబులయ్యును సర్వరస జ్ఞానంబు గలిగి మాననీయంబులగు వరంబులం జేసి రాజితంబులగు నట్లుగా ననుగ్రహించి యగ్గజంబు విషాదంబు మాన్చి" (ఏనుగులు తిరుగబడిన నాలుకలు కలవి అయినప్పటికీ అవి అన్ని రుచులను చక్కగా గ్రహించేటట్లుగా వాటికి వరాలను ఇచ్చి ఏనుగు చింతను దేవతలు పోగొట్టారు).

**'జిహ్వ మరల బడగ జిలుకల నగ్ని శ**
**పించె, సురలు సెవులకించు నట్టి**
**పలుకు వానికొసగి చిలుక నానందింప**
**జేసి....................................."**

**( 3వ ఆ. 147వ పద్యం)**

చిలుకల నాలుకలు తిరుగుబడి ఉండేటట్లుగా అగ్ని శపించాడు. దేవతలు వాటికి చెవుల కింపైన పలుకులు ఉండే విధంగా వరం ఇచ్చి ఆనందింపజేశారు.

తిక్కన మూలంలో చెప్పినట్లుగా గంగా గర్భం నుంచి కుమార స్వామితో పాటు బంగారం ఉద్భవించినట్లుగా రాయలేదు.

"అనిన బ్రసన్నత నట్టులు చేసెద
నూరదుండని వారి నూఱడించి
తనయందు వెలుగు శంభుని వీర్యమిడియె గం
గా గర్భరూపంబుగాగ నాత
డది యతి పరివృద్ధమగుటయు ధరియింప
నోర్వక నిర్ఝర పర్వతంబు
తటమున శరవణస్థంబుగా గంగ యు
త్సృష్టమొనర్చ నా శిఖరి సతరు
తే॥ వల్లరీగుల్మకముగ సువర్ణమయత
వెలుగ బాలుడై వెలిగె నవ్వీరగర్భ
మచ్చటికి..........................."

(3వ ఆ. 150వ పద్యం)

"దేవతలు అలా చెప్పగానే అగ్ని అలాగే చేస్తాను అని వారిని ఊరడించి తనలో వెలుగుతున్న శివుని రేతస్సును గంగలో గర్భ రూపంగా వదిలాడు. అది చాలా పెద్దగా పెరగడం చేత గంగ దాన్ని మోయలేక మేరుపర్వతం దగ్గర ఉన్న రెల్లుతోటలో వదిలింది. దానితో చెట్లతో, తీగలతో, పొదలతో నిండి ఆ పర్వతం బంగారు రంగుతో వెలిగిపోయింది. ఆ వీరగర్భం ఒక బాలుని రూపంలో ప్రకాశించింది" అని తిక్కన కుమారస్వామి జన్మించినప్పుడు మేరు పర్వతం బంగారు రంగులో వెలిగిపోయి నట్లుగా రాశాడు. అంతేగానీ మూలంలో చెప్పినట్లుగా కుమారస్వామితోపాటు గంగాగర్భం నుంచి బంగారం పుట్టినట్లుగా రాయలేదు. ఈ విధంగా తిక్కన ఈ కథలో కొన్ని సముచితమైన మార్పులను చేశాడు.

## 22. గొడుగు, చెప్పుల పుట్టుక కథ:

సంస్కృత భారతంలో గొడుగు, చెప్పుల కథ అనుశాసన పర్వంలోని దానధర్మపర్వం అనే ఉపపర్వంలో 95, 96 అధ్యాయాల్లో 50 శ్లోకాల్లో చెప్ప బడింది. ఈ కథను అంపశయ్య మీద ఉన్న భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. ధర్మరాజు భీష్మునితో శ్రాద్ధకర్మల సందర్భంలోను, ఇతర పుణ్య కార్యాల సందర్భంలోను గొడుగు, చెప్పులను దానం చేస్తుంటారు. ఇలా ఎందుకు చేస్తుంటారు? లోకంలో ఇది ఎలా ప్రారంభమైంది? ఎలా పుణ్యప్రదమైంది? తెలుప వలసిందిగా కోరుతాడు. దానికి సమాధానంగా భీష్ముడు, జమదగ్ని మహర్షికి సూర్యునికి మధ్య జరిగిన సంవాదాన్ని చెబుతానని ఈ గొడుగు, చెప్పుల కథను ఇలా చెబుతాడు.

ఒకప్పుడు భృగువంశస్థుడైన జమదగ్ని వినోదంతో విలువిద్యను సాధన చేస్తుంటాడు. అతడు బాణాలను ఎక్కుపెట్టి వదులుతూ వుంటే అతని భార్య రేణుక అతడు వదిలిన బాణాలను తెచ్చియిస్తూ ఉంటుంది.

**"అథ తేన స శబ్దేన జ్యాయా శ్చైవ శరస్య చ**
**ప్రహృష్టః సంచిచిక్షేప సా చ ప్రత్యాజహారతాన్"**
**(అనుశాసన. 95 – 8వ శ్లోకం)**

"అల్లెతాటి ధ్వనికి దూసుకుపోతున్న బాణాల చప్పుళ్ళకు అతడు బాగా ఆనందిస్తూ ఉత్సాహంతో బాణాలను వేస్తూ వుంటాడు". రేణుక వాటిని తెచ్చి యిస్తూ వుంటుంది. ఇలా మధ్యాహ్నం వరకు జమదగ్ని సాధన చేస్తుంటాడు. మధ్యాహ్నం ఎండకు కింద కాళ్ళు, పైన తల కాలుతూ వుండడం చేత రేణుక అలసిపోయి బాణాలను తీసుకొని రావడానికి వెళ్ళి ఒక చెట్టు నీడలో కొంతసేపు నిలబడి కొంచెం ఆలస్యంగా తెచ్చి యిస్తుంది. జరిగిన ఆలస్యానికి జమదగ్ని కోపించి ఎందుకు ఆలస్యమైంది? అని ఆమెను రెట్టించి అడుగుతాడు. అందుకామె –

**"శిర స్తావ త్ప్రదీప్తం మే పాదౌ చైవ తపోధన**
**సూర్యతేజో నిరుద్ధాహం వృక్షచ్ఛాయాం సమాశ్రితాః"**
**(అనుశాసన. 95 –16వ శ్లోకం)**

"తపోధనా! సూర్యుని ప్రతాపానికి నా తల, కాళ్ళు కాలిపోతుంటే భరించలేక చెట్టునీడలో కొంతసేపు నిలబడ్డాన" ని జమదగ్నికి చెబుతుంది. వెంటనే జమదగ్ని కోపం సూర్యుని మీదికు మళ్లి తన వేడి కిరణాలతో రేణుకను బాధపెట్టినందుకు సూర్యుని దండించాలని అతడి మీదకు బాణాలను ఎక్కుపెట్టే ప్రయత్నం చేస్తాడు. వెంటనే సూర్యుడు బ్రాహ్మణ రూపంలో జమదగ్ని వద్దకు వచ్చి జమదగ్నితో ఇలా పలుకుతాడు. "సూర్యుడు నీకేమి ద్రోహం చేశాడని అతని మీదకి బాణాలను వదులుతున్నావు. సూర్యుడు తన కిరణాలతో నీటిని గ్రహించి ఆ జలాన్ని వర్షిస్తున్నాడు. వర్షంవల్ల ప్రాణులకు ఆహారం లభిస్తూ వుంది. అన్నమే ప్రాణమని వేదాలు చెబుతున్నాయి. వర్షం వల్ల ఓషధులు, లతలు చివురిస్తున్నాయి. పుష్పిస్తున్నాయి. జాతకకర్మలు, వ్రతాలు, ఉపనయనాలు, గోదానాలు, వివాహాలు, యజ్ఞకార్యాలు, శాస్త్రాలు, దానాలు, ప్రజల కలయికలు, ధనరాసులు మొదలైనవన్నీ అన్నం వల్లనే సాగుతున్నాయి. ఇదంతా నీకు తెలుసు, ఇలాంటి మహోపకారి అయిన సూర్యుని పడగొట్టి నీవు సాధించే ప్రయోజనమేమిటి?" అతని మాటలను విని జమదగ్ని శాంతించడు. అపుడు సూర్యుడు చేతులు జోడించి వినయంగా జమదగ్నితో "సూర్యుడు ఎల్లప్పుడు చలిస్తూ ఉంటాడు. అలాంటి సూర్యుని నువ్వు ఏవిధంగా ఛేదించగలవు?" అని ప్రశ్నిస్తాడు. దానికి జమదగ్ని వచ్చినవాడు సూర్యుడని గ్రహించి, "నీవు స్థిరంగా వున్నా కదులుతున్నా జ్ఞాననేత్రంతో తెలుసుకొని నిన్ను శిక్షించ గలను. మధ్యాహ్న సమయంలో అర నిమిషం పాటు నువ్వు స్థిరంగా ఉంటావు. ఆ సమయంలో నిన్ను బాణంతో కొడతాను" అని చెబుతాడు. అందుకు సూర్యుడు

**"అసంశయం మాం విప్రర్షే భేత్స్యసే ధన్వినాం వర**
**అపకారిణం మాం విద్ధి భగవఞ్ఛరణాగతమ్"**
**(అనుశాసన. 96 – 7వ శ్లోకం)**

నీవు నన్ను కొట్టగలవు, నేను తప్పు చేశాను, శరణు కోరుతున్నాను అని విన్నవిస్తాడు. అందుకు జమదగ్ని పెద్దగా నవ్వి "సూర్యుడా! నీవు భయపడ వద్దు, శరణు కోరిన వారిని నేను చంపను, కానీ నీవు అపరాధం చేశావు. దానికి సమాధానమేమిటి? నీ కిరణాలతో వేడెక్కిన మార్గం సుఖంగా నడువదగినదిగా ఎలా అవుతుందో అలోచించు" అని సూర్యునితో పలుకుతాడు. వెంటనే సూర్యుడు గొడుగు, చెప్పులను సృష్టించి వాటిని జమదగ్నికి ఇచ్చి

**"మహర్షే శిరసస్త్రాణం ఛత్రం మద్రశ్మివారణమ్**
**ప్రతిగృహ్ణీష్వ పద్భ్యాం చత్రాణార్థం చర్మపాదుకే"**
**"అద్యప్రభృతి చైవేహ లోకే సంప్రచరిష్యతి**
**పుణ్యకేషు చ సర్వేషు పరమక్షయ్య మేవచ"**
**(అనుశాసన. 96 – 14,15 శ్లోకాలు)**

"ఈ గొడుగు నా కిరణాలనడ్డుకొని తలను రక్షిస్తుంది, చర్మంతో చేసిన ఈ చెప్పులు పాదాలకు రక్షణగా పని చేస్తాయి. నేటి నుండి ఇవి లోకంలో అందరికి ఉపయోగ పడతాయి. పుణ్యకార్యాలన్నింటిలోనూ వీటిని దానం చేయడం వల్ల దానం చేసిన వారికి అక్షయమైన ఉత్తమ లోకాలు కల్గుతాయి" అని చెబుతాడు.

ఈ కథను భీష్ముడు ధర్మరాజుకు చెప్పి ఈ గొడుగు, చెప్పులను సూర్యుడు ప్రవర్తింప జేశాడు. వీటిని బ్రాహ్మణులకు దానం చేయడం ముల్లోకాల్లో పుణ్యప్రదం అని చెబుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఇది జానపద కట్టు కథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ. ఈ కథను చెప్పులు కుట్టడం వృత్తిగా కలిగిన దళిత కవి సృష్టించి ఉండవచ్చు. చెప్పులు కుట్టడం నీచమైన పని కాదు, అది గొప్ప పవిత్రమైన వృత్తి, చెప్పులను మొట్టమొదట సూర్యదేవుడు సృష్టించి ఇచ్చాడు అని చాటి చెప్పటానికి ఈ కథను చెప్పి ఉండవచ్చు. ఈ కథలో సూర్యుడు, జమదగ్ని, రేణుక అనే మూడు పాత్రలున్నాయి. మొదటి పాత్ర సూర్యుడు. హేతుబద్ధంగా ఆలోచిస్తే సూర్యుడు దేవుడు కాడు, ఒక గ్రహం. భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతూ ఉంది. ఈ కారణం చేతనే భూమి మీద రాత్రిం బవళ్ళు ఏర్పడుతున్నాయి. సూర్యుని వల్ల లోకంలో ప్రాణులకు వేనవేల ప్రయోజనా లున్నాయి. అసలు ప్రాణులకు జీవనాధారమైన పంటలు పండడానికి ప్రధాన కారణం సూర్యుడే. అందువల్లనే మన ప్రాచీనులు కృతజ్ఞతా భావంతో సూర్యుని ఒక దేవునిగా భావించి పూజించారు. కాబట్టి గ్రహమైన సూర్యుడు గొడుగు, చెప్పులను కల్పించి ఇచ్చాడు అని చెప్పడం కుదరదు.

ఈ కథలో మరొక పాత్ర జమదగ్ని. ఇతడు పరశురాముని తండ్రి. పరశు రాముడు బ్రాహ్మణుడైనప్పటికి గొప్ప యుద్ధవీరుడుగా పురాణాల్లో చెప్పబడ్డాడు. అతని తండ్రి అయిన జమదగ్ని గొప్ప ఋషి. ఋషులు వేదాధ్యయనం, యజ్ఞయాగాలు, తపస్సు

మొదలైనవి చేస్తారు. ఐతే జమదగ్ని మొదట క్షాత్ర ధర్మాన్ని పాటించి, ఆ తరువాత బ్రాహ్మణ కర్మలను చేసినట్లుగా ప్రాచీన గ్రంథాల వల్ల తెలుస్తుంది. అందువల్లనే జానపద కవి జమదగ్ని విలువిద్యా సాధన చేసినట్లుగా కల్పించాడు. ఐతే జమదగ్ని విలువిద్యా సాధన చేసినప్పటికీ తను వేసిన బాణాలను తెచ్చి యివ్వడానికి అతడు తన భార్యను నియోగించడు. అతని దగ్గర చాలా మంది శిష్యులుంటారు. ఆ శిష్యుల్లో కొంతమందిని ఆపనికి నియోగిస్తాడు. ఒకవేళ జమదగ్ని తన భార్యనే తను వేసిన బాణాలను తీసుకురావడానికి నియోగించినప్పటికీ ఆమెను ఎండకు కష్టపెడ్డటం సూర్యుని తప్పు గాదు. అది జమదగ్ని అపరాధమే. మధ్యాహ్న కాలంలో సూర్యకిరణాలు వేడిగా ఉండడం సహజమైన విషయం. ఈ సహజమైన విషయాన్ని సూర్యుని తప్పుగా భావించి సూర్యుని మీద కోపగించి, అతణ్ణి శిక్షించాలనుకోవడం మూర్ఖత్వం. జమదగ్ని లాంటి ఋషి ఇంత మూర్ఖంగా ఆలోచించాడని చెప్పడం సరియైనది కాదు.

పై కారణాల చేత ఈ కథలో ఎలాంటి హేతుబద్ధతా లేదని చెప్పవచ్చు. భూమి మీద ప్రస్తుతమున్న వస్తువులన్నీ మానవుడు తయారు చేసినవే. ఆ వస్తువులను మొదట కనుక్కొని తయారు చేసిన వారు వాటిని చాలా ప్రాథమిక పద్ధతిలో తయారు చేస్తారు. కాలం గడిచే కొద్దీ వస్తువును తయారు చేయడంలో మార్పులు జరుగుతూ వుంటాయి. ఏ వస్తువూ మొదట పరిణతి చెందిన దశలో తయారు కాదు. అంతేగాకుండా ఏ వస్తువు ఒకే రూపంలో స్థిరంగా ఉండదు. శాస్త్రవిజ్ఞానం అభివృద్ధి చెందే కొద్దీ ఆ వస్తువులో మార్పులు జరిగి మరింత సౌకర్యంగా ఉపయోగపడేలాగా తయారవుతుంది. ఇప్పుడు మనం వాడే వస్తువులన్నీ ఇలా తయారవుతున్నవే. అదే విధంగా గొడుగు చెప్పులు కూడా మొదట ప్రాథమికమైనవిగా తయారు చేయబడి కాలక్రమంలో అనేక మార్పులకు లోనవుతూ మరింత సౌకర్యంగా వాడేందుకు వీలుగా తయారవుతున్నాయి. కాబట్టి గొడుగు చెప్పులను సూర్యుడు సృష్టించి ఇచ్చాడని చెప్పడం అహేతుకం.

గతంలో వేరే ప్రాంతానికి సామాన్యప్రజలు కాలి నడక ద్వారానే వెళ్లవలసి ఉండేది. ఆనాడు ఇప్పటిలాగ దారులు మంచిగా, నడవడానికి సౌకర్యంగా ఉండేవి కావు. పగటిపూట ఎండ, రాత్రిపూట చీకటి ప్రయాణానికి చాలా ఇబ్బందిగా ఉండేది. ఆ ఇబ్బందిని చాలావరకు చెప్పులు, గొడుగు తొలగిస్తాయి. గొడుగు కాలినడకతో వెళ్లేవారికి ఎండ, వాన నుంచి రక్షణ కలిగిస్తుంది. చెప్పులు ఎండకు కాళ్ళు కాలకుండా చేయడమే గాకుండా కంప, పురుగు పుట్ర నుంచి రక్షణ కలిగిస్తాయి. ఈ కథాకాలం నాటికి గొడుగు, చెప్పులు వాడుకలో ఉన్నాయి. వాటివల్ల కలుగుచున్న ప్రయోజనాలు గమనించిన కవి గొడుగు, చెప్పుల మీద అభిమానంతో ఈ కథను కల్పించాడు. అందువల్ల ఇది కట్టుకథ అవుతూ ఉంది.

ప్రాచీన కాలంలోని జానపదులకు దైవభక్తి మెండు. వారి దృష్టిలో భూమి మీద ఉన్న వస్తువులన్నీ దేవుడు ఇచ్చినవే. అంతేగాకుండా వారికి ఆధునిక కాలంలోని

మనలాగా హేతుబద్ధంగా ఆలోచించేటంత విజ్ఞానముండదు. ప్రకృతిలో వారికి తెలిసిన విషయాలు చాలా తక్కువ. వారి ఆలోచనా పరిధి కూడా చిన్నదే. జానపద కవులు కూడా ఇలాంటి మనస్తత్వమున్న వారే. వారు తమ ఆలోచనా పరిధిలో తమకు తెలిసిన తక్కువ జ్ఞానంతో ఇలాంటి కట్టుకథలు కల్పించి లోకం మీద విడిచి పెడతారు. అవి జానపదుల చేత విశ్వసింపబడి, మౌఖిక ప్రచారంలో వ్యాపిస్తాయి. ఇలాంటి కథలను పండిత కవులు సంస్కరించి రామాయణ, భారత, భాగవతాది శిష్టగ్రంథాల్లో చొప్పించారు.

భారతంలో ఈ కథ చివర భీష్ముడు ధర్మరాజుతో శుభ్రమైన, నూరు ఊచలు కల్గిన గొడుగును బ్రాహ్మణునికి దానం చేసినవాడు చనిపోయిన తర్వాత స్వర్గ లోకంలో అప్సరసలతో, దేవతలతో గొప్పగా గౌరవించబడతాడని, ఎండకు కాలి పోతున్న కాళ్ళు గల విప్రునికి పాదరక్షలను దానం చేసిన వాడు మరణించిన తర్వాత దేవతలు గొప్పగా మన్నించే గోలోకానికి వెళ్తాడని బ్రాహ్మణులకు గొడుగు, చెప్పులను దానం చేస్తే కలిగే పుణ్యాన్ని గురించి చెప్పాడు. గతంలో చదువుకున్న వారు, కవిత్వం చెప్పగల పాండిత్యమున్న వారు బ్రాహ్మణులే. కాబట్టి వీరు తమ కులం గొప్పతనాన్ని, తమ కులస్తులకు దానం చేయడం వల్ల కలిగే గొప్ప పుణ్యాన్ని గురించి స్వార్థబుద్ధితో ఇలాంటి మాటలను చెప్పారు. జానపద కథల్లో ఇలాంటి ముగింపు ఉండదు. ఇలాంటి ముగింపు బ్రాహ్మణ కులానికి చెందిన పండిత కవి కల్పించినదే.

## 23 . గోవుల మలమూత్ర స్థానాల్లో లక్ష్మి నివాసం:

ఈ కథ సంస్కృత భారతంలోని అనుశాసన పర్వంలో దానధర్మ పర్వం అనే ఉపపర్వంలోని 82వ అధ్యాయంలో 47 శ్లోకాల్లో ఉంది. ఈ కథను భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. “ఆవు పేడ లక్ష్మి నివాసమని నేను విన్నాను. దాన్ని గురించి తెలుపవలసిందిగా” ధర్మరాజు భీష్ముని కోరినప్పుడు భీష్ముడు ఈ కథను ఇలా చెప్పాడు.

లక్ష్మిదేవి కాంతులీనుతున్న శరీరంతో గోవుల వద్దకు వెళ్ళి తనను గురించి పరిచయం చేసుకొని తనను ఆశ్రయించడం వల్ల ఇంద్రుడు, సూర్యుడు మొదలైన దేవతలు సుఖసంతోషాలతో ఆనందంగా ఉన్నారని తాను దైత్యులను వదలి వేయడం వల్ల వారు నశించారని, తన ఆశ్రయంలో ఋషులు దేవతలు సిద్ధి పొందుతున్నారని, ధర్మార్థకామాలు తనతో కలిపి ఉన్నప్పుడు సుఖ ప్రదాలవుతా యని తన గొప్పతనాన్ని గోవులకు చెప్పి “మీరు శుభాలను కలిగించేవారు నేను ఎల్లప్పుడూ మీలో ఉండాలని కోరుకుంటున్నాను. మీరు నన్నాశ్రయించి శ్రీమంతులు కండి” అని చెబుతుంది. లక్ష్మి మాటలను గోవులు తిరస్కరిస్తూ ఆమె స్థిరత్వంలేని చపలురాలని, ఆమె తమకు అవసరం లేదు కాబట్టి ఆమెను వెళ్ళిపోవలసిందిగా కోరతాయి. గోవుల మాటలకు లక్ష్మి బాధపడి “గోవులారా ఇలా మాట్లాడడం తగదు. దేవతలు, దానవులు, గంధర్వులు, మానవులు మొదలైన వారందరూ

తీవ్రమైన తపస్సుచేసి నన్ను సేవిస్తుంటారు. మీ గొప్పతనాన్ని గ్రహించి నేనే మీ వద్దకు వచ్చి అడుగుతుంటే నన్ను తిరస్కరించి అవమానించ తగదు" అని బ్రతిమాలుతుంది. అయినప్పటికీ గోవులు ఆమె తమకు అవసరంలేదని గట్టిగా చెబుతాయి. అప్పుడు లక్ష్మి గోవులతో "ఇతరులను గౌరవించే మీరు నన్ను తిరస్కరిస్తే లోకమంతా నన్ను అగౌరవ పరుస్తుంది. మీరు సౌభాగ్యవతులు, మీ శరణుకోరి వచ్చాను, ఎల్లప్పుడూ మిమ్ములను సేవించేదానను. మీ శరీరంలో చెడ్డది అంటూ ఏదీలేదు. మీ శరీరంలో ఏదో ఒక అంగంలో నివసించాలనుకుంటున్నాను. నేను ఎక్కడ నివసించాలో చెప్పండి" అని ప్రార్థిస్తుంది. అప్పుడు గోవులు అన్నీ కలిసి ఆలోచించి

**"అవశ్యం మాననా కార్యా తవా స్మాభి ర్యశస్విని**
**శకృ న్మూత్రే నివసత్వం పుణ్యమేతద్ధి నః శుభే"**

**(అనుశాసన. 82 – 24వ శ్లోకం)**

"నిన్ను మేము తప్పకుండా గౌరవించాలి. నువు మా మల మూత్రాల్లో నివసించు. మా ఈ రెండు పవిత్రమైనవి" అని చెబుతాయి. లక్ష్మి దానికి సంతోషంగా అంగీక రిస్తుంది. అందువల్లనే ఆవు పేడ లక్ష్మీ నివాసమైందని భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

మన ప్రాచీనులు గోవును గోమాతగా పూజించారు. గోవును సర్వ దేవతా స్వరూపంగా భావించి గోవును పూజిస్తే సర్వ దేవతలనూ పూజించినట్లుగా, గోప్రదక్షిణ భూప్రదక్షిణగా పేర్కొన్నారు. దీనికి కారణం గోవు వల్ల మానవులకు అనేక ప్రయోజనాలుండడమే. మన వారికి ఆహారం వ్యవసాయం ద్వారా వస్తూ వుంది. భారతదేశం ప్రధానంగా వ్యావసాయక దేశం. భారతీయులు వ్యవసాయాన్ని ప్రధానంగా ఎద్దులతో చేస్తారు. అందువల్లనే మనవారు ఎద్దును బసవదేవునిగా కొలిచారు. ఆవు పాలు స్వచ్ఛమైనవి. తల్లి పాల వంటివి. పాల నుంచి వచ్చే పెరుగు, వెన్న, నెయ్యి, మజ్జిగ మొ॥వాటిని మానవులు ఆహారంగా స్వీకరిస్తున్నారు. అంతేగాదు వీటిలో అనేక ఔషద గుణాలున్నాయి. సాధారణంగా మనం విసర్జించే మల మూత్రాలను అశుద్ధంగా భావిస్తుంటాము. కానీ స్వచ్ఛమైన గడ్డి తినే ఆవు మల మూత్రాల్లో అనేక ఔషద గుణాలున్నాయి. వైద్యులు వాటిని అనేక వ్యాధులకు ఔషదులుగా ఉపయోగిస్తున్నారు. అంతేగాక గోవు మల మూత్రాలు మంచి ఎరువుగా ఉపయోగపడి పంటలు బాగా పండడానికి ఉపయోగ పడుతున్నాయి. అవి పంటలకు సోకే చీడపీడలకు క్రిమిసంహారాలుగా ఉపయోగపడుతున్నాయి. ఆవు పేడతో ఇంటి ముందు కళ్ళాపి చల్లితే సూక్ష్మక్రిములు నశించి ఇంట్లోని వారందరూ ఆరోగ్యంగా ఉంటారు. రైతులు విత్తనాలను గోమూత్రంతో శుద్ధి చేసి ఆరబెట్టి విత్తేవారు. దీనివల్ల విత్తనాలు ఎలాంటి చీడపీడ సోకకుండా అవి బాగా మొలకెత్తి పెరిగి మంచి పంటనిచ్చేవి. ఈవిధంగా గోవు మలమూత్రాల వల్ల చెప్పలేనన్ని ప్రయోజనాలున్నాయి.

ఈ కారణం చేతనే మన వారు గోవు ఒక్కొక్క అవయవం ఒక్కొక్క దేవతకు స్థానంగా చెబుతూ మల మూత్రాలను విసర్జించే గోవు అవయవాలను లక్ష్మీనివాసంగా పేర్కొన్నారు. దాన్ని గమనించిన కవి లక్ష్మీదేవి గోవులను బ్రతిమాలి వాటి మలమూత్రాల్లో స్థానం సంపాదించు కున్నట్లుగా ఈ కథను కల్పించాడు. అందువల్ల ఇది కట్టుకథ అవుతూ ఉంది. ఇది జానపద కట్టుకథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ.

తిక్కన ఈ కథను అనుశాసనికపర్వం తృతీయాశ్వాసంలోని 113 వ వచనం నుంచి 118 వరకు ఉన్న ఆరు పద్య గద్యాల్లో క్లుప్తంగా చెప్పాడు. సంస్కృత భారతంలో లక్ష్మీదేవి తన గొప్పతనం గురించి చెప్పడం గోవులు ఆమెను తిరస్కరించడం చాలా వివరంగా చక్కని సంభాషణలతో ఉంది. దాన్ని తిక్కన ఒకే సీసపద్యంలో క్లుప్తంగా ఇలా చెప్పాడు.

**"సిరి ధేనువులలోని కరిగిన నెవ్వతె**
**వని యవి యడిగిన నమ్మహాత్మ**
**శ్రీ నేను మీలో వసింపగా వచ్చితి**
**ననవుడు జంచలవైన నిన్ను**
**నొల్లము మాలోన నునుపగా ననియె న**
**గ్గోవులు దాని కద్దేవి వగచి**
**యేను బాసిన సర్వదానవ కులము గీ**
**డ్పడియె బొందిన సురల్ ప్రభుత నొంది**
**రేను వచ్చుట గోరి కాదే తపంబు**
**లాచరింతురు నన్నిట్టు లభిభవించు**
**టుఅవె మీకన్న నధ్రువ మొల్లమనుట**
**యభిభవమె నీకు బోలిన యచట కరుగు"**

**(అనుశాసనిక పర్వం, తృతీయాశ్వాం 114వ పద్యం)**

ఒకసారి లక్ష్మి ఆలమందలోకి వెళ్ళింది. నువ్వు ఎవరివి? అని ఆవులు అడుగుతాయి. నేను లక్ష్మిని మీతో కలిసి ఉందామని వచ్చాను అని ఆమె చెబుతుంది. చంచల స్వభావం ఉన్న నిన్ను మాలో ఉంచుకోవడానికి మేము అంగీకరించం అని గోవులు చెబుతాయి. దానికి ఆమె దుఃఖంతో నేను రాక్షసులను వదలి వేయడం వల్ల వారు నశించారు. నేను దేవతలను చేరడం వల్ల వారు ప్రభుత్వాన్ని పొందారు. నా కోసం అందరూ తపస్సు చేస్తుంటారు. అలాంటి నన్ను మీరు ఇలా అవమానించడం న్యాయమా? అని లక్ష్మి అంటుంది. చంచలమైన నిన్ను అంగీకరించమని చెప్పడం అవమానించడ మవుతుందా? నీకు ఇష్టమైన చోటికి వెళ్ళు అని ఆవులు లక్ష్మికి చెబుతాయి. దీన్నిబట్టి తిక్కన ఈ కథను ఎంత క్లుప్తంగా రాశాడో స్పష్టమవుతుంది.

## 24. దుర్వాసుని వరాల వల్ల శ్రీకృష్ణుడు పూజనీయుడు కావడం:

ఈ కథ అనుశాసన పర్వం 159వ అధ్యాయమైన దుర్వాసుని కథలో 56 శ్లోకాల్లో ఉంది. ఈ కథను కృష్ణుడు ధర్మరాజుకు చెబుతాడు. ధర్మరాజు "బ్రాహ్మణ పూజ వల్ల కలిగే అభ్యుదయాన్ని గురించి చెప్పు" అని శ్రీకృష్ణుని అడుగగా, కృష్ణుడు ధర్మరాజుతో బ్రాహ్మణుల చేత కోపింపబడిన ప్రద్యుమ్నుడు, బ్రాహ్మణులను పూజించడం వల్ల ఎలాంటి ఫలితం కలుగుతుంది? ఇహపరాల్లో బ్రాహ్మణులు ఎందుకు శ్రేష్ఠులుగా చెప్పబడుతున్నారు? అని గతంలో నన్ను అడిగాడు. ఆనాడు అతనికి చెప్పిన దాన్ని ఇప్పుడు నీకు వివరిస్తాను అని ఇలా చెబుతాడు.

"బ్రాహ్మణులు ఇహపరాల్లో సుఖదు:ఖాలను ఇవ్వడానికి సమర్థులు. బ్రాహ్మణులను పూజించడం వల్ల ఆయుస్సు, కీర్తి, యశస్సు, బలం పెరుగుతాయి. అన్ని లోకాలు, లోకాధీశ్వరులు అందరూ బ్రాహ్మణులను పూజించినవారే. ఈ లోకంలోనూ, పరలోకంలోనూ కూడా బ్రాహ్మణులే గొప్ప ప్రాణులు. అన్నింటినీ ప్రత్యక్షంగా దర్శించగల వీరు కోపిస్తే లోకాన్ని భస్మం చేయగలరు. కొత్త లోకాలను లోకపాలకులను సృష్టింపగలరు. వారిని గురించి తెలిసిన వారు వారి పట్ల వినయంతో ఉంటారు. ఒకసారి ద్వారకానగరానికి వచ్చిన దుర్వాసుని మా ఇంట్లో అతిథిగా ఉంచుకున్నాను. అతనికి కోపం ఎక్కువ. అతడు ఒకసారి వేలమందికి సరిపడే ఆహారాన్ని ఒక్కడే తింటాడు. ఒక్కొక్కసారి చాలా తక్కువ తింటాడు. ఒకసారి అకస్మాత్తుగా పెద్దగా నవ్వుతాడు. అంతలోనే హఠాత్తుగా పెద్దపెట్టున ఏడుస్తాడు. అతడు తన విడిది గృహానికి వెళ్లి అక్కడున్న పడకను, దాని మీద పరిచిన పరుపులను అలంకరించబడిన కన్యలను అందరినీ కాల్చేసి ఎక్కడికో వెళ్లిపోయాడు. అటు తర్వాత తిరిగి వచ్చి కృష్ణా ! నేను పాయసం తినాలను కుంటున్నాను తొందరగా తెప్పించు! అన్నాడు. నేను మహర్షి మనసును గ్రహించినవాడిని కాబట్టి అంతకుముందే పాయసాన్ని చేయించి ఉంచాను. సిద్ధంగా, బాగా వేడిగా ఉన్న పాయసాన్ని అతనికి నివేదించాను. అతడు దాన్ని తాగి మిగిలిన పాయసాన్ని నా శరీరానికి పూసుకోమని ఆజ్ఞాపించాడు. నేను ఏమీ ఆలోచించకుండా అతడు ఎంగిలిచేసిన పాయసాన్ని నా శరీరానికి, శిరస్సుకు బాగా పూసుకున్నాను. పక్కనే ఉన్న రుక్మిణి వైపు ఆ మహర్షి చూశాడు. అతని భావం గ్రహించి నేను పాయసాన్ని ఆమె శరీరానికి పట్టించాను. ఆ తర్వాత దుర్వాస మహర్షి రుక్మిణిని రథానికి కట్టి చర్నకోలతో నేను చూస్తుండగానే కొట్టాడు. రుక్మిణి రథాన్ని లాగుతూ వీధిలోకి వెళ్లింది. మహర్షి చేసిన ఈ పని నాకు ఏమాత్రం కోపం తెప్పించలేదు. ఆ తరువాత ఆ బ్రాహ్మణుడు చాలా కోపించి రథం నుంచి దిగి నడుస్తున్నాడు. నేను అతని వెంట పరిగెత్తుకొని వెళ్లి భగవంతుడా! అనుగ్రహించు అని ప్రార్థించాను. అప్పుడు తేజస్వి

అయిన ఆ బ్రాహ్మణుడు నన్ను చూసి ఇలా అన్నాడు. "కృష్ణా! నీవు స్వభావ సిద్ధంగానే కోపాన్ని జయించావు. నీవు నా పట్ల ఎలాంటి అపరాధం చేయలేదు. నీ పట్ల నేను ప్రసన్నున్ని అయ్యాను. నీకు కావలసిన వరాన్ని కోరుకో. దీని వల్ల లభించే అభ్యుదయాన్ని చూడు. ప్రపంచంలో మనుషులకు అన్నం పట్ల ఆసక్తి ఉన్నట్లుగా నీ మీద భక్తిభావం ఉంటుంది. లోకాలు ఉన్నంత వరకూ నీకీర్తి ప్రకాశిస్తుంది. ముల్లోకాల్లోనూ నీవు ప్రత్యేకతను పొందుతావు. అన్ని లోకాల వారికి ఇష్టుడవు అవుతావు. పాయసాన్ని నీ శరీరమంతా పూసుకున్నావు కాబట్టి నీకు మృత్యుభయం లేదు. నువ్వు కోరుకున్నప్పుడే మృత్యువు వస్తుంది. నీ అరికాళ్లకు పాయసాన్ని నీవు ఎందుకు రాసుకోలేదు? ఇది నాకు నచ్చలేదు" అని నాతో చెప్పగానే నా శరీరం ఎంతో కాంతివంతమయింది. తర్వాత దుర్వాసుడు రుక్మిణితో "స్త్రీలందరిలో నువ్వు గొప్ప కీర్తిని పొందుతావు. నీకు వార్ధక్యం, రోగం, రంగు తగ్గడం ఏదీ ఉండదు. ఎప్పుడూ ఇలాగే ఉంటావు. కేశవుని 16 వేల మంది భార్యలలో నీవు శ్రేష్ఠురాలవు అవుతావు" అని చెప్పి దుర్వాస మహర్షి వెంటనే అంతర్ధానమయ్యాడు. ఆ తరువాత నేను మహర్షి విడిది చేసిన ఇంటిలోకి ప్రవేశించాను. ఇల్లంతా కొత్తగా ఉంది. మహర్షి తగులబెట్టినవన్నీ కొత్తగానూ, గట్టిగాను ఉన్నాయి. ఆనాటి నుంచి బ్రాహ్మణుడు ఏమి చెప్పినా దానిని తప్పక నెరవేరుస్తూ వారిని ఆరాధిస్తునే ఉన్నాను. ధర్మరాజా! నాలాగే నీవు కూడా బ్రాహ్మణులను మాటలతో దానాలతో ఎల్లప్పుడూ పూజించు. ఈ విధంగా బ్రహ్మణానుగ్రహం వల్ల నేను అభ్యుదయాన్ని పొందాను" అని కృష్ణుడు ధర్మరాజుకు చెబుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

భారతదేశంలో అనాదిగా అసామాన్యమైన వ్యక్తులను పూజించడం వుంది. ఈ వ్యక్తి పూజ కాలాంతరంలో దేవతారాధనగా పరిణమిస్తుంది. తన అసమాన ప్రజ్ఞాపాటవాలతో బుద్ధి విశేషంతో పాటు ధైర్యసాహసాలతో, పౌరుష పరాక్రమాలతో సమకాలపు రాజకీయాల్లో చక్రం తిప్పి గొప్ప రాజనీతిజ్ఞుడుగా పేరుపొందిన చారిత్రక పురుషుడైన శ్రీకృష్ణుడు తర్వాత కాలంలో పూజనీయుడుగా పరిగణింపబడుతూ క్రమంగా దేవుడిగా ప్రసిద్ధిలోకి వచ్చి విష్ణువు దశావతారాల్లో ఒకడుగా చేర్చబడ్డాడు. దీన్ని గమనించిన పండితుడయిన బ్రాహ్మణ కవి ఈ కథలో దుర్వాసుని వరాల వల్ల ప్రజల్లో కృష్ణుని పట్ల భక్తి భావం ఏర్పడిందని, అది క్రమంగా పెరుగుతూ ఉంటుందని లోకాలు ఉన్నంతకాలం ప్రజలు కృష్ణుని పూజిస్తుంటారని, ఇలా ఉండటానికి దుర్వాసముని కృష్ణునికి ఇచ్చిన వరాలు కారణమని కల్పించడం చేత ఇది కట్టుకథ అవుతూ ఉంది. ఇది జానపద కట్టుకథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ.

మన ప్రాచీన గ్రంథాల్లో దుర్వాసుడు అతి కోపిష్ఠిగా చెప్పబడ్డాడు. భారతంలోని ఈ కథలో దుర్వాసుడు శ్రీకృష్ణుని సహనాన్ని అనేక రకాలుగా పరీక్షించాడు. దుర్వాసుడు

ఏమి చేసినా చివరకు రుక్మిణిని రథానికి కట్టి చర్మకోలతో కొట్టి రథం లాగించినప్పటికీ కృష్ణుడు ఏమాత్రం కోపించకుండా అతణ్ణి భక్తితో సేవించడం వల్ల దుర్వాసుడు కృష్ణుడి పట్ల ప్రసన్నుడై అతనికి వరాలు ఇచ్చినట్లుగా చెప్పబడింది. బ్రాహ్మణుడైన దుర్వాసుడు అనుగ్రహిస్తే సాక్షాత్తు శ్రీకృష్ణునికి కూడా వరాలు ఇవ్వగల మహిమోపేతుడని కవి అతని మాహాత్మ్యాన్ని గొప్పగా చాటిచెప్పాడు. దుర్వాసుడు ఎవరి ఇంటికైనా వచ్చినప్పుడు అతడు ఎంత క్రూరంగా, అసహ్యంగా ప్రవర్తించినప్పటికీ సహించి అతని అడుగులకు మడుగులొత్తుతూ భక్తి గౌరవాలతో సేవించాలని, అలా సేవిస్తే దుర్వాసుడు ప్రసన్నుడై గొప్ప వరాలు ఇస్తాడని, ఆ వరాల వల్ల మానవులు దేవతలుగా మారిపోతారని ఆనాటి బ్రాహ్మణ కవి ఈ కథలో బ్రాహ్మణ మాహత్మ్యాన్ని చెప్పాడు. అంతేకాకుండా దుర్వాసుని ఎంగిలి పాయసాన్ని కృష్ణుడు తన శరీరానికి పూసుకోవడం వల్ల అతనికి మృత్యు భయం లేకుండా పోయిందని, కృష్ణుడు తన అరికాలికి పాయసం పూసుకోకపోవడం వల్లనే అరికాలికి బాణం దెబ్బ తగిలి కృష్ణుడు చనిపోయాడని కవి ఈ కథలో పరోక్షంగా చెప్పాడు. ఈ కథ ప్రారంభంలో బ్రాహ్మణులు ఇహ పరాలలో సుఖదుఃఖాలను ఇవ్వడానికి సమర్థులని, బ్రాహ్మణులను పూజించడం వల్ల ఆయుస్సు కీర్తి యశస్సు బలం పెరుగుతాయని, ఈ లోకంలోనూ పరలోకంలోను బ్రాహ్మణులే గొప్ప ప్రాణులని బ్రాహ్మణుల గొప్పతనాన్ని కృష్ణుని చేత కవి చెప్పించాడు. విష్ణ్వవతారుడైన కృష్ణుడు చెబితే ప్రజలు కిమ్మనకుండా నమ్ముతారనే ఉద్దేశంతో బ్రాహ్మణ కవి ఇలా చెప్పించాడు.

బ్రాహ్మణ మాహాత్మ్యాన్ని చెప్పే ఇలాంటి కథలు భారతంలో ఇంకా చాలా ఉన్నాయి. వన, శాంతి, అనుశాసన, అశ్వమేధపర్వాల్లో ఇలాంటి కథలున్నాయి. అనుశాసనపర్వం 33 వ అధ్యాయంలో చెప్పబడిన "బ్రాహ్మణ మాహాత్మ్య వర్ణన"ను ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు. ఈ విషయాన్ని భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. ధర్మరాజు భీష్మునితో "రాజులకు పనులన్నింటిలోనూ ఏ పని గొప్పది? రాజు ఏ పని చేస్తే ఇహపరలోకాల్లో సుఖంగా ఉండగలడు? చెప్పవలసిందిగా కోరతాడు. భీష్ముడు ధర్మరాజుకు ఈ విషయాన్ని ఇలా చెబుతాడు.

"పట్టాభిషక్తుడైన రాజుకు బ్రాహ్మణులను సేవించడమే ప్రధానమైన పని. పరమ సుఖాన్ని కోరుకునే రాజశ్రేష్ఠులకు ఇదే ఉత్తమమైన కర్తవ్యం. వేదపండితులైన బ్రాహ్మణులను, వృద్ధులను రాజు ఎల్లప్పుడూ పూజించాలి. అనునయ వచనాలతో భోగభాగ్యాలను ఇస్తూ నమస్కారాలతో అర్చించాలి. రాజు దీన్నే ప్రధాన కర్తవ్యంగా ఎల్లప్పుడూ గుర్తించాలి. తనను, తన బిడ్డలను కాపాడుకున్నట్లుగా రాజు బ్రాహ్మణులను రక్షించాలి. తల్లిదండ్రులను పూజించినట్లుగా వారిని పూజించాలి. బ్రాహ్మణులు శాంతంగా ఉంటే ఆ రాజ్యమంతా

ప్రకాశిస్తుంది. ప్రాణుల జీవనం ఇంద్రుని మీద ఆధారపడినట్లుగా లోకయాత్ర పూర్తిగా బ్రాహ్మణుల మీదనే ఆధారపడి ఉంది. సత్య పరాక్రములైన బ్రాహ్మణులు కోపగిస్తే మనస్సంకల్పం చేతనే దహించి వేస్తారు. వారికి హద్దు అనేది లేదు. దిక్కులు కూడా వారికి తలుపులు మూయవు. వారు కోపిస్తే దావాగ్ని జ్వాలల లాగా చూపు మాత్రం చేతనే దహింపగలరు. వారి గుణాలకు మితిలేదు. వారిలో కొందరు గడ్డితో కప్పిన బావుల వంటివారు. కొందరు నిర్మలమైన ఆకాశం వంటివారు. కొందరు మొండివాళ్లు కొందరు దూదిలాగా మృదు స్వభావులు. వారిలో సాధువులను గౌరవించాలి. అసాధువులను నిందించకూడదు. వీరిలో కొందరు వంచకులు. కొందరు తపస్వులు. కొందరు దొంగలు, కొందరు అబద్ధాల కోరులు, అలాగే మరికొందరు నటులు ఉన్నారు. కొందరు వ్యవసాయం, పశుపాలన చేస్తారు. కొందరు రాజుల దగ్గర, ఇతరుల దగ్గర అన్ని పనులను చేస్తారు. బ్రాహ్మణులు వివిధ ఆకారాలు ధరించి వివిధ కర్మలను చేస్తూ వివిధ వృత్తులతో జీవితాన్ని గడుపుతూ ఉన్నారు. వీరిందరినీ రాజు నిత్యం కీర్తించాలి. అనాదిగా దేవతలకు, మనుషులకు, నాగులకు, రాక్షసులకు, ఇతరులకు కూడా ఈ బ్రాహ్మణులు పూజింపదగినవారు. వీరిని పైవారు ఎవరూ జయించలేరు. వీరు దేవత కాని వారిని దేవతగా చేయగలరు. దేవతను దేవత కాకుండా చేయగలరు. వారు ఇష్టపడిన వారే రాజు. వారికి ఇష్టం లేకపోతే ఆ రాజుకు పరాభావం తప్పదు. బ్రాహ్మణులను నిందిస్తే నిస్సంశయంగా నశిస్తారు. బ్రాహ్మణులు తమను ద్వేషించే వారి మీద కోపిస్తారు. అలాంటి వారు నశిస్తారు. బ్రాహ్మణులను ప్రశంసించే వారు వృద్ధి పొందుతారు. బ్రాహ్మణులు శపించిన వారు క్షణకాలంలో అవమానింపబడతారు. శకులు, యవ్వనులు, కాంబోజులు, ద్రావిడులు, కళింగులు, పులిందులు, ఉశీనరులు, కోలిసర్పులు, మాహిషకులు మొదట క్షత్రియ జాతికి చెందిన వారే. కానీ బ్రాహ్మణుల అనుగ్రహం లేనందువల్ల వారు శూద్రులయ్యారు. బ్రాహ్మణులను గెలవడం కన్నా వారిచేత ఓడిపోవడమే శ్రేయస్కరం. జగత్తును అంతటినీ చంపినా ఒక్క బ్రాహ్మణుని చంపిన ఫలంతో సమానం కాదు. బ్రాహ్మణ హత్య మహాపాపమని మునులు చెప్పారు. బ్రాహ్మణ నిందను ఏ విధంగాను వినకూడదు. ఒకవేళ వినవలసి వస్తే తలవంచి మౌనంగా కూర్చోవాలి. లేదా అక్కడ నుండి వెళ్లిపోవాలి. ఈ లోకంలో బ్రాహ్మణులతో విరోధించి సుఖంగా జీవించిన వారు ఇంత వరకూ పుట్టలేదు. ఇక ముందు పుట్టబోడు. గాలిని పిడికిలితో పట్టలేనట్టుగా చంద్రుని చేతితో తాకలేనట్టుగా, భూమిని తల మీద మోయలేనట్టుగా బ్రాహ్మణులను గెలవలేము” అని భీష్ముడు ధర్మరాజుతో చెబుతాడు.

పైన చెప్పిన విషయాన్ని గమనిస్తే దీన్ని రాసిన ఆనాటి బ్రాహ్మణ కవికి ఎంత తీవ్రమైన బ్రాహ్మణ కులపిచ్చి ఉందో, పచ్చి అబద్ధాలతో, అత్యంతాతిశయోక్తులతో జంకు,

గొంకు ఏమాత్రం లేకుండా ఎవ్వరు ఏమనుకున్నా నాకు లెక్క లేదు అనే కులోన్మాద రీతిలో తమ కులం గురించి గొప్పలు చెప్పుకున్నట్లుగా అర్థమౌతుంది. అలాగే ఆనాడు బ్రాహ్మణుల్లో మంచివారితో పాటు దొంగలు మోసగాండ్రు, అబద్ధాలకోరులు, వ్యవసాయదారులతో పాటు అనేక వృత్తులు చేసేవారు ఉండేవారని స్పష్టమౌతూ ఉంది.

చారిత్రక పురుషుడైన కృష్ణుడు తర్వాత కాలంలో పూజనీయుడయ్యాడనే విషయాన్ని కొంతమంది పరిశోధకులు చెప్పారు. పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు తమ మహాభారత చరిత్రము అనే గ్రంథంలో ఇలా రాశారు. "శాకటాయను"డను ప్రసిద్ధ వ్యాకరణశాస్త్ర కర్తయు "పాణిని" యను లోక ప్రసిద్ధ వ్యాకరణ శాస్త్ర కర్తయు "పతంజలి" యను పాణిని వ్యాకరణ భాష్యకర్తయు "వాసుదేవార్జునుల' యందు భక్తిగల వారుండిరని చెప్పియున్నారు. పతంజల్యాదులు ఋషులుగానె పరిగణింపబడిరి. (వైదిక ఋషులు కారు). పతంజలి క్రీ.పూ. 3వ శతాబ్దముననను, శాకటాయనుడు క్రీ.పూ. 12వ శతాబ్ద ప్రాంతమున నుండిరి. శాకటాయనుని కాలమున వాసుదేవార్జునులను వీరులనగా మాత్రమే తలచి భక్తి సేయు వారుండిరి. పాణిని కాలమునకు వారిని భగవదవతారముగా దలచుచుండిరి. పతంజలి కాలమున వాసుదేవుని భగవంతునిగా దలుచుచుండిరి. కాని, యర్జును నటుల దలపరైరి."[16]

క్రీ.పూ. 12వ శతాబ్దానికి చెందిన శాకటాయనుని కాలంనాడు కృష్ణార్జునులను వీరులుగా భావించి పూజించేవారని, క్రీ.పూ. 3వ శతాబ్దానికి చెందిన పతంజలి కాలంనాడు కృష్ణుని భగవంతునిగా పూజించేవారని, అర్జునుని కేవలం వీరునిగా మాత్రమే భావించేవారని సుబ్రహ్మణ్య శాస్త్రిగారి పై వాక్యాల వల్ల స్పష్టమవుతూ ఉంది. సుబ్రహ్మణ్య శాస్త్రిగారు పై విషయాలను మరింత స్పష్టంగా చెప్పడానికి మహాభారత చరిత్రము గ్రంథంలో అథస్సూచికలో కింది విషయాన్ని ఇచ్చారు.

''శాకటాయనుడు ''భక్తి'' అను అధికార సూత్రమునకు బిమ్మట "వాసుదేవార్జునావాద్వుఞ్" (8-1-124) అని చెప్పెను. శబ్ద నిష్పత్తిలో వాసుదేవుని భక్తుడు వాసుదేవకుడు, అర్జునుని భక్తుడు అర్జునకుడు అగుననెను. పాణిన్యాచార్యులు కూడ తన యష్టాధ్యాయిలో "వాసుదేవార్జునాభ్యాం వున్" (4-3-98) అని చెప్పెను. దీనివలన గూడ పై విధముననే రూపనిష్పత్తి యగును. కాని శాకటాయనుడు "వుఞ్" అనగా, పాణిని "వున్" అనెను. స్థూలదృష్టిచే రెంటికి రూపనిష్పత్తిలో నర్థ మొక్కటియే, స్వరమున గూడ భేదము లేదు. కాని "పతంజలి" మహాభాష్యమున జెప్పిన యీక్రింది వాక్యములచే శాకటాయనుని వాసుదేవార్జున భక్తులను "పాణిని" యొక్క వాసుదేవార్జున భక్తులకును భేదము కలదని తెలియనగును. మహాభాష్యమ్(4-3-98) కిమర్థం వాసుదేవా శబ్దాత్ "వున్" విధీయతే? "గోత్ర క్షత్రియాభ్యేభ్యో బహులం వుఞ్ " ఇత్యవసిద్ధం. న హ్యస్తి విశేషః వాసుదేవ శబ్దాత్

“వుఞోవా, వునోవా?” తదేవరూపం. స ఏవ స్వర: ఇదం తర్హిప్రయోజనం వాసుదేవ శబ్దస్య, పూర్వనిపాతం వక్ష్యామితి అథవా దైషా క్షత్రియాఖ్యా, సం జైషా తత్ర భగవత:”

తా॥ ఎందుకొఱకు వాసుదేవ శబ్దముకంటె వున్ విధింపబడెను? “గోత్ర క్షత్రియోఖ్యేభ్యో బహులం వుఞ్” (4-3-99) అను సూత్రము చేతనే యారూపము సిద్ధించునుగదా! విశేష మేమియులేదు. “వుఞ్” అనినను “వున్” అనినను “రూపము, స్వరము” సమానమే. అయితే ప్రయోజన మొకటి కలదు. వాసుదేవశబ్దమునకు బూర్వనిపాతము కలదని, లేక క్షత్రియ శబ్దమాత్రము జెప్పునది కాక, భగవంతునిజెప్పు శబ్దపరమై యున్నదని పై భాష్యవాక్యములు బట్టి, “వుఞ్” క్షత్రియ మాత్రుని యందుండు భక్తిని “వున్” భగవత్పరముగా నగు భక్తిని జెప్పునని స్పష్టమగుచున్నది. శాకటాయనుడు “వుఞ్” వాడుటచే నాతని కాలమున వాసుదేవార్జునులను క్షత్రియవీరులుగా దలుచుచు వారియందు భక్తిసేయువా రుండిరనియు, అపుడు వాసుదేవుడు భగవంతుడుగా దలపబడలే దనియు, పాణిని కాలమునకు వాసుదేవార్జునులు (నరనారాయణులు) భగవదంశా సంభూతులుగా దలుపబడి రనియు పతంజలి కాలమునకు వాసుదేవుడు కేవల భగవంతుడుగానె తలంపబడుచుండె ననియు సూక్ష్మముగా నాలోచించిన స్పష్టమగును. పతంజలి అర్జున శబ్దము పేరైన దలపెట్టకుండుటచే నర్జునుడు భగవత్పదవినుండి నాటివారిచే దొలగింపబడెనని స్పష్టమగుచున్నది”.[17]

సుబ్రహ్మణ్య శాస్త్రిగారి పై వాక్యాలను పరిశీలిస్తే క్రీ.పూ. 12వ శతాబ్దానికి చెందిన శాకటాయనుని కాలంలో వాసుదేవార్జునులను కేవలం క్షత్రియ వీరులుగా పూజించేవారని, పాణిని కాలం నాడు వారిద్దరూ దైవాంశసంభూతులుగా పూజలందుకునేవారనీ, పతంజలి కాలం నాడు కేవలం వాసుదేవుడు మాత్రమే భగవంతునిగా పూజింపబడేవాడని స్పష్టమవుతూ ఉంది. దీన్ని బట్టి కృష్ణుడు చారిత్రక పురుషుడనీ, తర్వాతకాలంలో అతను భగవంతునిగా పూజనీయుడై దశావతారాల్లో ఒకరుగా చేర్చబడ్డాడనీ చెప్పవచ్చు.

ఈ విభాగంలో చెప్పిన 24 కథలు పూర్తిగా కట్టు కథాంశ కథలే. అంటే ఇవన్నీ జానపద కట్టుకథల ప్రభావంతో పండిత కవులు కల్పించినవి.

# 3. మహాభారతంలో ప్రాణి కథాంశ కథలు

మానవులను పాత్రలుగా చేసి కథలు చెప్పడం ఒక పద్ధతి. మావవేతర ప్రాణులైన పశుపక్ష్యాదులను పాత్రలుగా చేసి కథలు చెప్పడం మరొక పద్ధతి. మొదటి పద్ధతి కంటే రెండవ పద్ధతిలో కథలు చెబితే ఆ కథలు మరింత ఆసక్తికరంగా ఉంటాయి. దీన్ని గమనించిన మన జానపద కవులు ప్రాచీన కాలం నుంచి మానవేతర ప్రాణులైన పశు పక్ష్యాదులను పాత్రలుగా చేసి అనేక కథలను చెప్పారు. వీటిని ప్రాణి కథలు అంటారు. ఆంగ్లంలో వీటిని Animal Tales అంటారు. ప్రాణికథలు అంటే ప్రాణులకు సంబంధించిన కథలు. వీటిని తిర్యక్కథలు అని కూడా అంటారు. తిర్యక్కులు అంటే పశు వులు, పక్షులు అని అర్థం. అంటే ఇవి పశువులు, పక్షులు, క్రిమి కీటకాలు మొదలైన వాటికి సంబంధించిన కథలు. మనిషి రెండు కాళ్ళ ప్రాణి కాబట్టి కొన్ని కథల్లో మనుషులు గూడా పాత్రలుగా ఉంటారు. మరి కొన్ని కథల్లో మనుషులతోపాటు దేవతలు కూడా పాత్రలుగా ఉంటారు. మనుషులు, దేవతలు పాత్రలుగా ఉన్నప్పటికీ ఈ కథల్లో వీరికి ప్రాధాన్యత ఉండదు. పశుపక్షులకు మాత్రమే ప్రాధాన్యత ఉంటుంది. ఈ కథల్లో పశు పక్షి క్రిమికీటకాదుల మానవీకరణ ఉంటుంది. అంటే ఇవి మానవుల లాగా మాట్లాడటం, ఇతర పాత్రలతో సంఘర్షణ పడడం మొదలైనవి ఉంటాయి. మానవుల్లో మంచివారు, చెడ్డవారున్నట్లుగా పశుపక్షుల్లో గూడా మంచివి చెడ్డవి ఉంటాయి. జంతువుల్లో సింహం, పులి, తోడేలు క్రూరమైనవిగా, నక్క క్రూరత్వంతోపాటు మోసకారిగా, గోవు, గొర్రె, మేక, జింక, కుందేలు మొదలైనవి సాధు స్వభావం కలిగినవిగా చెప్పబడతాయి. పక్షుల్లో డేగ, కాకి మొదలైనవి క్రూరమైనవిగా, పావురం, చిలుక, పిట్ట మొదలైనవి సాధువులుగా చెప్పబడతాయి. ప్రాణి కథల్లో ప్రాణుల మనస్తత్వాలు, ప్రాణుల మధ్య సంఘర్షణ ప్రధానంగా చెప్పబడుతుంది. దానితోపాటు నీతి గూడా ఈ కథల్లో ఉంటుంది. ప్రాణి కథలు సరళంగా సంక్షిప్తంగా ఉంటాయి. సంస్కృత భారతంలో తొమ్మిది ప్రాణి కథలున్నాయి. ఆదిపర్వంలో రెండు, సభా, కర్ణ పర్వాల్లో ఒక్కొక్కటి, శాంతిపర్వంలో నాలుగు, అనుశాసన పర్వంలో ఒక్కటి ఉన్నాయి. ఈ కథల పేర్లు ఇవి. 1.జరిత–పిల్లల కథ, 2. తెలివైన నక్క కథ, 3. దుర్మార్గపు హంస కథ, 4. హంస–కాకి కథ, 5. వ్యాఘ్ర–గోమాయు సంవాదం కథ, 6. ఉష్ట్రగ్రీవోపాఖ్యానం, 7. మూషిక–మార్జాల సంవాదం కథ, 8. గృధ్ర–గోమాయు సంవాదం కథ, 9. చిలుక కథ

పైకథలను 1. అడవి జంతువుల కథలు 2. అడవి జంతువులు – మనుషులు – దేవతలు ఉన్న కథలు 3. పక్షుల కథలు 4. అడవి ప్రాణులు – మనుషులు ఉన్న కథలు 5. పక్షులు, దేవతలు ఉన్న కథలు అనే అయిదు రకాలుగా విభజించవచ్చు. తెలివైన నక్కకథ, వ్యాఘ్ర గోమాయు సంవాదం కథ,ఉష్ట్రగ్రీవం కథ అనే మూడు అడవి జంతువుల కథల విభాగానికి చెందుతాయి. గృధ్ర గోమాయు సంవాదం కథ అడవి జంతువులు –

మనుషులు - దేవతలు ఉన్న కథల విభాగానికి చెందుతుంది. దుర్మార్గపు హంస కథ, హంస కాకి కథ పక్షుల కథల విభాగానికి చెందుతాయి. మూషిక మార్జాల సంవాదం కథ అడవి ప్రాణులు - మనుషుల కథల విభాగానికి చెందుతుంది. చిలుక కథ పక్షులు, దేవతలు ఉన్న కథల విభాగానికి చెందుతుంది.

## 1. జరిత - పిల్లల కథ:

ఈ కథ సంస్కృత భారతం ఆదిపర్వంలోని ఖాండవ దహనపర్వం అనే ఉపపర్వంలో 229వ అధ్యాయం నుంచి 233వ అధ్యాయం వరకూ ఉన్న 5వ అధ్యాయాల్లో 130 శ్లోకాల్లో ఉంది. ఈ కథను జనమేజయునికి వైశంపాయనుడు చెబుతాడు. అగ్నిదేవుడు కృష్ణార్జునుల సహాయంతో ఖాండవ వనాన్ని దహనం చేసిన తర్వాత ఖాండవ వనంలో దహనం కాకుండా బతికిపోయిన నాలుగు శారంగ పక్షుల పిల్లలు ఎలా బతికాయి అని జనమేజయుడు ప్రశ్నించినపుడు వైశంపాయనుడు ఈ జరిత-పిల్లల కథను ఇలా చెబుతాడు.

మందపాలుడు అనే ఋషి కఠినమైన బ్రహ్మచర్యాన్ని పాటించి స్వాధ్యాయ పరుడై గొప్ప తపస్సు చేసి దేహం విడిచిపెట్టి పితృలోకానికి వెళ్తాడు. అయితే అక్కడ తన తపస్సుకు, సత్కర్మలకు తగిన ఫలాన్ని పొందలేక యమధర్మరాజు వద్దకు వెళ్ళి తాను చేసిన సత్కర్మలకు తగిన ఫలాన్ని ఎందుకు పొందలేక పోతున్నానని అక్కడి దేవతలను అడుగుతాడు. దానికి వారు మానవులు ఋణగ్రస్తులై భూలోకంలో పుడతారని యజ్ఞకర్మలు, బ్రహ్మచర్యం, సంతానం అనే మూడు ఋణాలు తీరిపోయి దేహాన్ని వదలివేసిన తర్వాత పై లోకాల్లో సత్కర్మల ఫలితాన్ని అనుభవిస్తారని, మందపాలుడు బ్రహ్మచర్యాన్ని పాటించి సంతానం పొందక పోవడం చేత అతడు తన సత్కర్మలకు తగినట్లుగా ఫలాన్ని పొందలేక పోయాడని అందువల్ల భూలోకానికి వెళ్ళి సంతానం పొందమని చెబుతారు. దానితో మందపాలుడు తిరిగి భూలోకానికి వచ్చి తక్కువ కాలంలో సంతానాన్ని పక్షులు ఇస్తాయని భావించి జరిత అనే శారికతో శారికుడై జత కడతాడు. తత్ఫలితంగా జరిత నాలుగు గుడ్లు పెడుతుంది. మందపాలుడు ఆమెను వదిలి పెట్టి లపిత అనే మరొక శారిక వద్దకు వెళ్ళి దానితో జత కడతాడు. కొంత కాలం తర్వాత జరిత గుడ్లను పొదిగి జరితారి, సారిసృక్కుడు, స్తంబమిత్రుడు, ద్రోణుడు అనే నాలుగు పిల్లలను పెడుతుంది. అదే సమయంలో ఖాండవ వనాన్ని దహించడానికి అగ్నిదేవుడు వస్తాడు. అది గమనించిన మందపాలుడు ఇంకా రెక్కలు రాని తన నలుగురు కుమారులను రక్షించమని అగ్నిదేవుని ప్రార్థిస్తాడు. అగ్నిదేవుడు దానికి అంగీకరిస్తాడు.

ఈ విషయం తెలియని జరిత ఖాండవ వనాన్ని అగ్ని దహిస్తుండడం చూసి రెక్కలు రాని తన కుమారులను ఎలా రక్షించుకోవాలో తెలియక కలవర పడుతూ ఉంటుంది. ఆమె నలుగురు పిల్లలు తమను వదిలిపెట్టి ఆమె ఎగిరి వెళ్ళిపోవాలని, అలా

చేస్తే ఆమె మళ్ళీ పిల్లలను కనవచ్చునని అలా చేయకుంటే అందరూ అగ్నికి ఆహుతి కావలసివస్తుందని చెబుతారు. అప్పుడు జరిత అక్కడ కన్నంలో ఉన్న ఎలుకను గద్ద చంపి వేసిందని నలుగురు పిల్లలూ ఆ కన్నంలోకి వెళ్తే ధూలితో తాను ఆ కన్నాన్ని మూసి వేసి అగ్ని బారి నుంచి రక్షిస్తానని, అగ్ని వెళ్ళిపోయిన తర్వాత తాను వచ్చి ధూలిని తీసివేసి వారిని విడిపిస్తానని పిల్లలకు చెబుతుంది. దానికి పిల్లలు అంగీకరించక రెక్కలు లేని మాంసపు ముద్దలైన తమను ఆ కలుగులో ఉన్న మిగిలిన ఎలుకలు తినివేస్తాయని ఎలుకలతో చంపబడడం కంటే అగ్నికి ఆహుతి కావడం ఉత్తమమైనదని, అందువల్ల తమను వదలివేసి వెళ్ళిపొమ్మని తల్లిని గట్టిగా కోరతారు. చేసేది లేక జరిత అక్కడి నుంచి ఎగిరిపోయి తన ప్రాణాన్ని కాపాడు కుంటుంది. ఆ తర్వాత తీవ్రమైన అగ్నిజ్వాలలు అక్కడికి వస్తాయి. ఆ నలుగురు పిల్లలు అగ్నిదేవుని అనేక రకాలుగా ప్రస్తుతించి తమను రక్షించ వలసిందిగా వేడుకుంటారు. వారి స్తుతికి ప్రసన్నుడైన అగ్నిదేవుడు తాను వారి తండ్రి అయిన మందపాలునికి వారిని రక్షిస్తానని మాట యిచ్చానని, అందువల్ల వారిని తాను దహించనని చెబుతాడు. అప్పుడు పక్షి పిల్లలు అక్కడ ఉన్న పిల్లి పిల్లలు తమను ఎప్పుడూ బాధిస్తున్నాయని వాటిని బంధుమిత్ర సహితంగా నాశనం చేయమని కోరతారు. అగ్ని వారు కోరినట్లుగానే పిల్లి పిల్లలను దహించి వేస్తాడు.

లపితతో వుంటున్న మందపాలుడు తన కుమారులు, వారి తల్లి అగ్ని వల్ల ఎన్ని కష్టాలు పడుతున్నారో అని లపితతో చెప్పి బాధపడతాడు. లపిత అసూయతో అతని పుత్రులను రక్షిస్తానని అగ్నిదేవుడు మాట యిచ్చాడు, కాబట్టి అతడు వారి కోసం చింతించనవసరం లేదని, తన శత్రువైన జరితపట్ల, ఆమె పిల్లలపట్ల చూపిస్తున్న ప్రేమ అతనికి తన మీద లేదని అందువల్ల అతణ్ణి జరిత దగ్గరికే వెళ్ళమని, తాను దుష్టుని ఆశ్రయించిన స్త్రీలాగా ఒంటరిగా ఉంటానని చెబుతుంది. దానితో మందపాలుడు తన పిల్లల దగ్గరికి వస్తాడు. అప్పటికే అగ్నిదేవుడు ఖాండవ వనాన్ని దహించి వెళ్ళిపోయి ఉంటాడు. అగ్ని వెళ్ళిపోయిన తర్వాత జరిత తన పిల్లల దగ్గరికి వచ్చి వారు జీవించివున్నందుకు ఎంతగానో సంతోషించి అక్కున చేర్చుకుంటుంది. అదే సమయంలో మందపాలుడు అక్కడికి వస్తాడు. కష్ట కాలంలో తమ వద్ద వుండకుండా మరొక పక్షి వద్దకు వెళ్ళిపోయినందుకు జరిత ఆమె పిల్లలు మందపాలునితో మాట్లాడరు. అపుడు మందపాలుడు తన పిల్లలను రక్షింపుమని అగ్నిదేవుని కోరానని, అతను అలాగే రక్షిస్తానని మాటయిచ్చాడని, అందువల్లనే తాను వారిని రక్షించడానికి రాలేదని వారిని ఊరడించి ఆ తర్వాత అక్కడి నుంచి వెళ్ళిపోతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

సంస్కృతభారతంలో ఈ కథ చాలా వివరంగా ఉంది. పితృలోకానికి వెళ్ళిన మందపాలునితో దేవతలు సంతానం ఆవశ్యకతను గురించి చెప్పడం, ఖాండవ వన దహనానికి వెళ్తున్న అగ్నిని మందపాలుడు అతని గొప్పతనాన్ని గురించి అనేక విధాలుగా

స్తుతించడం, జరిత, ఆమె నలుగురు పిల్లలు అగ్నికి ఆహుతి కాకుండా ఉండడం కోసం చర్చించుకోవడం, జరిత నలుగురు కుమారులు తమ సమీపానికి వచ్చిన అగ్నిదేవుని ప్రస్తుతించడం మొదలైన విషయాలు చాలా వివరంగా ఉన్నాయి. ఇది జానపద ప్రాణి కథల ప్రభావంతో పండితకవి కల్పించిన ప్రాణికథ.

ఈ కథలో రెండు శారిక పక్షులు, శారిక పక్షి నాలుగు పిల్లలు, మందపాలుడు అనే ఋషి పాత్రలుగా ఉన్నారు. మందపాలుడు చాలా స్వార్థపరుడుగా కనిపిస్తాడు. అతడు సంతానం పొందడం కోసం మగ శారిక రూపాన్ని ధరించి జరిత అనే ఆడ శారికతో జతకట్టి, ఆడ శారిక నాలుగు గుడ్లు పెట్టే వరకూ ఆమెతో ఉంటాడు. గుడ్ల నుంచి పిల్లలు రావడానికి శారిక గుడ్లను పొదగాలి. గుడ్ల నుంచి పిల్లలు బయటికి వచ్చే వరకు మగ శారిక ఆడ శారికకు రక్షణగానూ, దానికి ఆహారం తెచ్చియిచ్చేది గానూ ఉండాలి. కానీ స్వార్థపరుడు, మగశారిక రూపంలో ఉన్న మందపాలుడు ఆమెకు రక్షణగా, తోడుగా ఉండకుండా లపిత అనే మరొక శారికతో జత కట్టడానికి వెళ్తాడు. ఇలా వెళ్ళడం పచ్చి బాలింతరాలుగా ఉన్న భార్యను వదిలివేసి కాముకుడై మరొక స్త్రీ దగ్గరికి వెళ్ళడం లాంటిది. సాధారణ మానవుల్లో నిర్దయులు కఠినాత్ములు కూడా ఇలాంటి పని చేయరు. కరడు కట్టిన స్వార్థపరుడు మాత్రమే ఈ పని చేయగలడు. కాబట్టి మందుపాలుడు కరడు గట్టిన స్వార్థపరుడని చెప్పక తప్పదు. ఈ కథలో జరిత తమ పిల్లల పట్ల ఎంతో ప్రేమ కలది. అగ్నిదేవుని బారి నుంచి ఇంకా రెక్కలురాని తన పిల్లలను రక్షించు కోవడానికి ఆమె ఎంతో ప్రయత్నం చేస్తుంది. కానీ అది తనకు మించిన పనికావడం చేత పిల్లలను రక్షించు కోలేని తన అశక్తతను గురించి ఇలా దు:ఖిస్తుంది.

**"ఆదాయ చ న శక్నోమి పుత్రాంస్తరితు మాత్మనా**
**న చ త్యక్తు మహం శక్తా హృదయం దూయతీవ మే"**
**"కం తు జహ్యామహం పుత్రం కమాదాయ వ్రజామ్యహమ్**
**కిం ను మే స్యాత్ కృతం కృత్వా మన్యధ్వం పుత్రకాః కథమ్"**
**"చింతయానాం విమోక్షం వో నాధి గచ్ఛామి కించన**
**ఛాదయిష్యామి వో గాత్రై: కరిష్యే మరణం సహ'**
**(ఆది. 230 – 6, 7,8 శ్లోకాలు)**

"రెక్కలు రాని ఈ పిల్లలు నాతో ఎగరలేవు, ఈ పిల్లలను తీసుకొని నేను ఎగరలేను. అలాగని వీరిని విడిచిపెట్టి పోలేను. నా హృదయం ఎంతగానో కలవర పడుతూ ఉంది. నేను నా కుమారుల్లో ఎవరిని తీసుకొని ఎగురుతాను. ఎవరిని విడిచి పెడతాను. ఏమి చేసి నాపిల్లలను రక్షించుకుంటాను. కుమారులారా నాకు ఉపాయాన్ని చెప్పండి. ఎంత సేపాలోచించినా మిమ్ములను రక్షించే ఉపాయం నాకు కనిపించడం లేదు. నా రెక్కలతో మిమ్మల్ని కప్పి మీతో సహా మరణిస్తాను" అని జరిత ఎంతగానో దు:ఖిస్తుంది. ఈ కథలో

జరిత పిల్లలు ఎంతో విశాలమైన దృక్పథం కల్గినవి. ఇవి తమ తల్లితో

**"న చోపకృతమస్మాభినం చాస్మాన్ వేత్థ యే వయమ్**
**పీడ్యమానా బిభర్ష్యస్మాన్ కా సతీ కేవయం తవ"**
**"తరుణీ దర్శనీయాసి సమర్థా భర్తురేషణే**
**అనుగచ్ఛ పతిం మాత: పుత్రానాప్స్యసి శోభనాన్"**
**(ఆది. 231-13,14 శ్లోకాలు)**

"మేము నీకు ఏ ఉపకారమూ చేయలేదు. ఇంతకు ముందు మేము ఎవరమో కూడా నీకు తెలియదు. నీవు అనేక కష్టాలు పడి మమ్ములను రక్షించాలని ఎందుకు ప్రయత్నిస్తున్నావు. మేము నీకు ఏమౌతాము. నీవు యవ్వనంలో ఉన్నావు. అందంగా ఉన్నావు. భర్తను అన్వేషించగల దానవు. అందువల్ల అమ్మా! నీవు నీ భర్త దగ్గరకు వెళితే మళ్ళీ నీవు కుమారులను కనగలవు" అని చెబుతారు. ఇలా చెప్పడానికి ఎంతో విశాలమైన హృదయం ఉండాలి.

ఈ కథను నన్నయ ఆదిపర్వం అష్టమాశ్వాసంలోని 293వ వచనం నుంచి 311వ వచనం వరకు ఉన్న 24 పద్యగద్యాల్లో క్లుప్తంగా చెప్పాడు. నన్నయ ఈ కథలో ఎలాంటి మార్పులు చేయలేదు.

## 2. తెలివైన నక్క కథ :

సంస్కృత భారతంలో ఈ కథ ఆదిపర్వంలోని సంభవపర్వం అనే ఉపపర్వంలో 140వ అధ్యాయంలో 24వ శ్లోకం నుంచీ 49వ శ్లోకం వరకూ ఉన్న 26 శ్లోకాల్లో ఉంది. ఈ కథను ధృతరాష్ట్రుడు "శత్రువును సామ, దాన, భేద, దండోపాయాలతో ఎలా చంపగలమో నాకు చెప్పు" అని కణికుడు అనే తన మంత్రిని అడుగుతాడు. దానికి సమాధానంగా కణికుడు నీతిశాస్త్రవేత్త అయిన ఒక నక్క కథ చెబుతాను విను అని ఈ కథను ఇలా చెబుతాడు.

ఒక అడవిలో స్వార్థ కార్యసాధనలో నైపుణ్యం కల్గిన తెలివైన నక్క ఉండేది. దానికి పులి, తోడేలు, నెమలి, ఎలుక మిత్రులు. అవి బలిష్టమైన, వేగంగా పరుగెత్త గల ఒక జింకను చూసి దాన్ని చంపడానికి ఉపాయం ఆలోచిస్తాయి. నక్క తన ఉపాయాన్ని ఇలా చెబుతుంది. "జింక నిద్ర పోయేటప్పుడు ఎలుక దాని పాదాలను కొరకాలి. అప్పుడది వేగంగా పరిగెత్తలేదు. ఆ సమయంలో పులి దాన్ని పట్టుకొని చంపాలి. అపుడు అందరూ కలిసి దాన్ని తినవచ్చు" నక్క చెప్పినట్లుగానే ఎలుక జింక కాళ్ళను కొరికి గాయం చేయగా పరుగెత్తలేని స్థితిలో ఉన్న ఆ జింకను పులి చంపి వేస్తుంది. అపుడు నక్క తన మిగిలిన మిత్రులతో "స్నానం చేసి వచ్చి ఈ జింకను తిందాం, మీరందరూ వెళ్ళి స్నానం చేసిరండి. అప్పటి దాకా నేను దీన్ని కాపాడుతూ ఉంటాను" అని చెబుతుంది.

దానికి సమ్మతించి అవన్నీ స్నానం చేయడానికి నదికి వెళ్తాయి. స్నానం చేసి ముందుగా పులి వస్తుంది. అది వచ్చేటప్పటికి నక్క ఆలోచిస్తూ ఉంటుంది. దాన్ని చూసి పులి "ఏమి ఆలోచిస్తున్నావు" అని అడుగుతుంది. అపుడు నక్క పులితో ఇలా అంటుంది.

**"శృణు మేత్వం మహాబాహెూ యద్ వాక్యం మూషికో బ్రవీత్**
**ధిగ్ బలం మృగరాజస్య మయాద్యామయం మృగోహతః"**
**"మద్బాహు బలమాశ్రిత్య తృప్తిమద్య గమిష్యతి**
**గర్జమానస్య తస్యైవమతో భక్ష్యంన రోచయే"**

**(ఆది. 140 – 36,37 శ్లోకాలు)**

"మహాబాహూ! ఎలుక నాతో ఒక మాట అంది. ఈ పులిది ఏమి బలం, ఈ రోజు జింకను నేనే చంపాను. నా బాహుబలం మీద ఆధారపడి ఈ రోజు పులి తన ఆకలి తీర్చుకుంటుంది అని ప్రగల్భాలు పలికింది. అలాంటి ఎలుక సహాయంతో పొందిన ఈ జింక మాంసం నాకు తినాలనిపించడం లేదు" అని అంటుంది. నక్క మాటలను విని పులి "ఎలుక ఆ విధంగా అని ఉంటే నన్ను అది సకాలంలో మేల్కొల్పినదే అవుతుంది. నేను నా బాహుబలంతో చంపిన జంతువుల మాంసాన్నే తింటాను" అని పలికి అడవిలోకి వెళ్ళిపోతుంది. ఆ తర్వాత ఎలుక అక్కడికి వస్తుంది. దానితో నక్క "ఎలుకా! నీకు శుభంకలగాలి. నెమలి జింక మాంసాన్ని తినననీ ఎలుకను తింటానని నాతో చెప్పింది" అని అంటుంది. వెంటనే ఎలుక అక్కడి నుంచి పారి పోతుంది. ఆ తర్వాత స్నానం చేసి తోడేలు వస్తుంది. దానితో నక్క "పులి నీమీద బాగా కోపంగా ఉంది. అది భార్యను తీసుకొని రావడానికి వెళ్ళింది. నీకు పులి వల్ల కీడు కలగబోతోంది" అని దాన్ని బెదిరిస్తుంది. వెంటనే తోడేలు అక్కడి నుంచి పారిపోతుంది. చివరగా నెమలి స్నానం చేసి వస్తుంది. దానితో నక్క "నా బాహు బలానికి ఓడిపోయి మిగిలిన వారందరూ పారిపోయారు. నీకు జింక మాంసం కావాలంటే నాతో యుద్ధం చేసి నన్ను గెలవాలి" అని అంటుంది. దానికి నెమలి "పులిని తోడేలును, తెలివైన ఎలుకను ఓడించిన నీవు మహావీరునివి, నీతో యుద్ధం చేసే ఉత్సాహం నాకు లేదు" అని అక్కడి నుంచి వెళ్ళిపోతుంది. ఈ విధంగా నక్క సామదానభేద దండోపాయాలతో మిగిలిన వాటిని అక్కడి నుంచి వెళ్ళిపోయే లాగా చేసి ఒంటరిగా సంతోషంగా జింక మాంసాన్ని తింటుంది. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

కణికుడు ఈ కథను చెప్పి రాజు కూడా నక్క లాగానే పిరికి వారిని భయపెట్టాలి. తన కన్నా బలవంతులను మొక్కి లొంగ దీసుకోవాలి. పేరాశ గల వారిని ధనంతో వశపరుచుకోవాలి. తన కంటే బలం తక్కువ వారిని, తనతో సమానమైన బలం కలవారిని పరాక్రమంతో లొంగదీయాలి అని చెబుతాడు.

ఇది జానపద ప్రాణికథల ప్రభావంతో పండితకవి కల్పించిన కథ. ఈ కథలో ఉన్న నక్కపులి, తోడేలు, నెమలి, ఎలుక అన్ని అడవి ప్రాణులే, వీటిలో నక్క చాలా

తెలివైనది. అది తన తెలివి తేటలతో బలమైన జింకను చంపిస్తుంది. నక్క జింక మాంసం మొత్తాన్ని తానే తినాలనే స్వార్థంతో చక్కటి ప్రణాళికను రచిస్తుంది. పులి, తోడేలు, నక్క కంటే బలమైనవి. నెమలి, ఎలుక నక్క కన్నా బలహీన మైనవి. నక్కకు మిగిలిన ప్రాణుల మనస్తత్వాలు బాగా తెలుసు. అందువల్లనే అది ముందుగా జింక వద్ద తాను కాపలా ఉండి మిగిలిన వాటిని స్నానం చేసి రమ్మని నది వద్దకు పంపిస్తుంది. పులి జింకను తినాలన్న తొందరలో అన్నిటి కంటే ముందుగా వస్తుంది. పులికి ఆత్మాభిమానం ఎక్కువ. దానికి తాను చాలా బలవంతుణ్ణనే గర్వం ఉంది. అందువల్లనే నక్క దాని ఆత్మాభిమానం మీద, గర్వంమీద దెబ్బతీస్తూ ఎందకూ కొరగాని ఎలుక సాయంతో పులి జింకను చంపిందని ఎలుక పలికినట్లుగా చాలా వినయంగా పులితో చెబుతుంది. ఆ మాట తన ఆత్మాభిమానానికి దెబ్బ తగిలినట్లుగా పులి భావించి ఎలుక సహాయంతో చంపిన జింక మాంసం తనకు అవసరం లేదని తన పరాక్రమంతో చంపిన జంతువును తింటానని వెళ్ళిపోతుంది. ఎలుకకు నెమలి శత్రువు కనుక నక్క నెమలి పేరు చెప్పి ఎలుకను భయపెట్టి అది పారిపోయేలాగా చేస్తుంది. అలాగే పులి పేరు చెప్పి తోడేలును భయపెట్టి అది పారిపోయేలాగా చేస్తుంది. ఇక చివరగా మిగిలింది నెమలి. నెమలి నక్కను జయించలేదు. అందువల్లనే నక్క జింక మాంసం కావాలంటే తనతో యుద్ధం చేసి గెలవాలని చెబుతుంది. అది సాధ్యం కాదు. కాబట్టి నెమలి జింక మీద ఆశ వదలుకొని వెళ్ళిపోతుంది. ఇలా నక్క చక్కటి ప్రణాళికతో తన తోటి అడవి ప్రాణులను వెళ్ళగొట్టి జింక మాంసాన్ని తానొక్కతే తింటుంది. ఇలా చేయడం స్నేహ ధర్మానికి వ్యతిరేకమైంది. స్వార్థంతో కూడు కున్నది, కుటిలమైనది. ఈ కథను చెప్పిన కణికుడు కుటిల రాజనీతిజ్ఞుడు, ఈ కథను విన్న ధృతరాష్ట్రుడు స్వార్థపరుడు. వీరిద్దరికీ తగినట్లుగానే కవి కుటిలబుద్ధి కల్గిన నక్కకథకు ఒకరిని శ్రోతగా, ఒకరిని వక్తగా పెట్టాడు.

నన్నయ ఈ కథను రాయకుండా వదలివేశాడు.

## 3. దుర్మార్గపు హంస కథ:

ఈ కథ సంస్కృత భారతం సభాపర్వంలో శిశుపాల వధ పర్వం అనే ఉపపర్వంలో ఉంది. ధర్మజుని అశ్వమేధయాగం పరిసమాప్తిలో శ్రీకృష్ణుని అగ్రపూజార్హతను ప్రశ్నిస్తూ శిశుపాలుడు భీష్మునితో ఈ కథ ఇలా చెబుతాడు.

పూర్వం సముద్ర తీరంలో ఒక ముసలి హంస ఉండేది. అది ఆహారం కోసం వెళ్ళలేక ధర్మపన్నాలతో సమీపంలో ఉన్న పక్షులను ఆకర్షిస్తుంది. దాని మాటలను విని పక్షులు దానికి ఆహారాన్ని తెచ్చి ఇస్తుంటాయి. అంతే గాకుండా తమ గుడ్లను హంస దగ్గర నమ్మకంగా భద్రంగా పెట్టి వెళ్ళిపోతుంటాయి. దుర్మార్గపు హంస ఆ గుడ్లను తినడం ప్రారంభిస్తుంది. రోజురోజుకు గుడ్లు తరిగిపోతుండడం గమనించిన ఒక తెలివి గల పక్షి

హంసను అనుమానించి దాని మీద కాపు వేసి హంస గుడ్లను తినడం గమనించి మిగిలిన పక్షులకు చెబుతుంది. పక్షులన్నీ హంస తమ గుడ్లను తినడం చూసి అన్నీ కలిసి హంస మీద దాడిచేసి చంపివేస్తాయి. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఇది జానపద ప్రాణికథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ. ఈ కథ చాలా చిన్నది. ఈ కథలోని పాత్రలన్నీ పక్షులే. జానపద కథల్లో గద్ద, కాకి, కొంగ మొదలైనవి దుర్మార్గపు పక్షులుగా చెప్పబడుతూ ఉంటాయి. హంస అరుదైన పక్షి. హంసకు శిష్ట సాహిత్యంలోను, జానపద సాహిత్యంలోనూ ఉత్తమమైనదిగా పేరుంది. జానపద సాహిత్యంలోని పక్షులు పాత్రలుగా కలిగిన కథలను చూసి పండిత కవి ఈ కథను కల్పించినట్లుగా మనం భావించాలి. భారతంలో ఈ కథను చెప్పిన వ్యక్తి శిశుపాలుడు. అతడు దుర్మార్గుడు, కృష్ణుని మహాత్మ్యాన్ని తెలుసుకోలేని మూర్ఖుడు, కృష్ణునికి బద్ధ శత్రువు. ఈ కారణం చేతనే భీష్ముని సలహాతో శ్రీకృష్ణునికి అగ్రపూజను చేస్తున్న ధర్మరాజును, చేయించు కుంటున్న కృష్ణుని తిరస్కరిస్తూ మాట్లాడతాడు. అతని మాటలను వారించిన భీష్ముని దూషిస్తూ శిశుపాలుడు చెప్పిన కథ ఇది. ఈ కథలో ఉత్తమమైనదిగా భావింప బడుతున్న హంస దుర్మార్గమైనదిగా చెప్పబడింది. ఈ హంస ముసలిది. ఈ హంసను వృద్ధుడైన భీష్మునికి ప్రతీకగా శిశుపాలుడు చెప్పాడు. భీష్ముడు సజ్జనుడు, జ్ఞాని, శాంత స్వభావుడు, వివేచనా జ్ఞానం కలవాడు. భీష్ముడు దుర్మార్గుడైన శిశుపాలునికి దుర్జనుడుగా కనిపించాడు. దీన్నిబట్టి శిశుపాలుని స్వభావాన్ని, అతని వ్యక్తిత్వాన్ని గ్రహించవచ్చు. నన్నయ ఈ కథను సభాపర్వం ద్వితీయాశ్వాసంలోని 44వ వచనంలో క్లుప్తంగా చెప్పాడు.

## 4. హంస - కాకి కథ:

ఈ కథ సంస్కృత భారతంలోని కర్ణపర్వంలో 41 వ అధ్యాయంలో 78 శ్లోకాల్లో ఉంది. దీన్ని కర్ణునికి రథసారథిగా ఉన్న శల్యుడు కర్ణునితో చెబుతాడు. కర్ణుడు యుద్ధంలో తన శక్తి సామర్థ్యాలను గురించి గొప్పగా చెప్పుకొని అర్జునుని గురించి తక్కువ చేసి చెప్పినప్పుడు శల్యుడు కర్ణునికి ఈ కథను ఇలా చెబుతాడు.

సముద్ర తీరంలోని ఒక రాజు రాజ్యంలో ధనవంతుడైన ఒక వైశ్యుడు ఉంటాడు. అతనికి చిన్న వయస్సులో ఉన్న పుత్రులున్నారు. వారు వేసిన ఎంగిలి మెతుకులను తిని బతికే కాకి ఒకటి అక్కడ ఉండేది. వైశ్యుని పిల్లలు కాకికి మాంసాహారం, పాలు, పెరుగు, పాయసం మొదలైనవి పెట్టడం చేత కాకి బాగా బలిసి పొగరెక్కి తనతో సాటివచ్చే పక్షులు ఏవీ లేవని భావించి మిగిలిన పక్షులన్నిటినీ అవమానిస్తూ ఉంటుంది. ఇలా ఉండగా ఒకరోజు ఆకాశంలో ఎగురుతూ కొన్ని హంసలు కనిపిస్తాయి. వాటిని చూసి వైశ్యుని పిల్లలు కాకితో "అన్ని పక్షుల్లోకి నీవు శ్రేష్ఠమైన దానివి, గొప్పశక్తి గల దానివి, అలాంటి నీవు హంసలతో పోటీ పడగలవు" అని చెబుతారు. మూర్ఖత్వం వల్ల, గర్వంవల్ల

వారి మాటలను నిజమేనని కాకి భావించి హంసలతో పోటీగా ఎగురదలచి వాటి వద్దకు వెళ్ళి వాటిలో శ్రేష్ఠమైన దానిని ఎంచుకొని 'ఎగురుదాం రా' అని దానితో పందెం వేస్తుంది. దాని మాటలకు హంసలు పగలబడి నవ్వి కాకి అల్పత్వాన్ని తమ సామర్థ్యాన్ని గురించి చెబుతాయి. మూర్ఖపు కాకి తన గురించి గొప్పలు చెప్పుకుంటూ తాను ఆకాశంలో నూటొక్క రకాలుగా ఎగురగలనని, ధైర్యముంటే తనతో పోటీకి రమ్మని హంసను పిలుస్తుంది. దానికి హంస తనకు నూటొక్క రకాలు తెలియదని, తనకు తెలిసింది ఒక్కటే రకమని చెప్పి కాకితో పోటీకి సిద్ధమవుతుంది. కాకి, హంస సముద్రం మీదుగా ఎగురుతూ పోటీ పడతాయి. హంస ఒకే గమనంతో ఎగురుతూ వెళ్తూ ఉంటుంది. గర్విష్ఠి అయిన కాకి భిన్న రకాలుగా అనేక విన్యాసాలు చేస్తూ కావుకావుమని అరుస్తూ వేగంగా వెళ్తూ ఉంటుంది. దాన్ని చూసి మిగిలిన కాకులు తమ కాకిని మెచ్చుకుంటూ హంసలను హేళన చేస్తాయి. ఇలా రెండు ఘడియలు గడిచేటప్పటికి కాకికి ఆయాసం వచ్చి అలసిపోతుంది. ఈలోగా మందగమనంతో వెనుకబడిన హంస కాకిని దాటి ముందుకు వెళ్తూ ఉంటుంది. మరికొంత సేపటికి కాకి పూర్తిగా అలసిపోయి, ఆయాసపడుతూ వాలడానికి ఎలాంటి సాధనాలు లేకపోవడం చేత సముద్రపు నీటిలో పడిపోయే స్థితిలో ఉంటుంది. దీన్ని గమనించి హంస వెనుకకు మళ్లి కాకి దగ్గరకు వచ్చి కాకితో "నీవు అనేక గతుల్లో ఎగురుతానని చెప్పావు, సముద్రంలో పడిపోతున్న ఈ గతిని ఏమంటారు?" అని అడుగుతుంది. అప్పుడు కాకి "మేము కాకులం ఊరికే కా, కా అని అరుస్తూ ఉంటాం. ఎగరడం మాకేం తెలుసు" అని పలికి తనను రక్షించి ఒడ్డుకు చేర్చమని ప్రాధేయ పడుతుంది. సముద్రంలో పడిపోయి మునిగిపోతున్న కాకిని చూసి ఉత్తమమైన ఆ హంస జాలిపడి తన కాళ్ళతో కాకిని పైకెత్తి వీపు మీదకు ఎక్కించుకొని ఒడ్డుకు తీసుకొని వచ్చి దాన్ని ఊరడించి వెళ్ళిపోతుంది. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథను శల్యుడు కర్ణునికి చెప్పి వైశ్య బాలకులు వేసిన ఎంగలి మెతుకులు తిని పొగరు బట్టిన కాకి తన శక్తి సామర్థ్యాలు తెలుసుకోకుండా హంసను గేలి చేసినట్లుగా నువ్వు కౌరవులు వేసిన ఎంగిలి మెతుకులు తిని గర్వించి అర్జునుని శక్తి సామర్థ్యాలు తెలుసుకోకుండా హేళనగా మాట్లాడుతున్నావని చెబుతాడు. ఈ కథలో కాకులు, హంసలు పాత్రలుగా ఉన్నాయి. హంసలు మానస సరోవరంలో ఉంటాయి. అవి ఆకాశంలో చాలా పైన ఎగురుతూ, చాలా దూరం ఒకే గమనంతో వెళ్ళగల సామర్థ్యం కలిగినవి. కాకులు గ్రామాల్లో ఉంటూ మనుషులు వేసే ఎంగిలి మెతుకులు తింటూ కావు కావుమని అరుస్తూ ఉంటాయి. ఇవి ఎక్కువ దూరం ఎగురలేవు. అంతేగాకుండా ఆకాశంలో పైకి కూడా వెళ్ళలేవు. గ్రామాల్లో ఆ చెట్టు మీద నుంచి ఈ చెట్టు మీదకు, ఆ యింటి మీద నుంచి ఈ యింటి మీదకు మాత్రమే ఎగురుతూ ఆహారాన్ని అన్వేషిస్తుంటాయి. సాధారణంగా కాకులను ఎవరూ పెంచుకోరు. దానికి కారణం కాకిని మనవారు దుశ్శకునంగా భావించడమే. కాకి

ఇంట్లోకి వస్తే అశుభంగా భావిస్తారు. అయితే కాకి ఇంటిగోడ మీద వాలి కా, కా అని అదే పనిగా అరిస్తే ఆ యింటికి చుట్టాలు వస్తారనే నమ్మకం గ్రామీణుల్లో ఉంది. పిల్లలు కాకిమీద ప్రేమతో తాము తినే వస్తువులను కాకికి వేస్తుంటే వాటిని తిని బాగా బలిసిన కాకి అహంకారంతో ఎలా మెలుగుతుందో ఈ కథలో కాకి ఋజువు చేసింది.

ఇది అచ్చమైన జానపద కథ. లోకంలో మౌఖిక ప్రచారంలో ఉన్న ఈ కథను తీసుకుని దానికి ఆసక్తికరమైన సంభాషణలను, మంచి వర్ణనలను చక్కటి పాత్ర చిత్రణను జోడించి పండిత కవి భారతంలో ప్రవేశపెట్టాడు. ఈ కథలో చక్కటి నీతి ఉంది. మనుషుల్లో ఉత్తములు, నీచులు ఉన్నట్లుగా పక్షుల్లో కూడా ఉంటాయి. హంస ఉత్తమజాతికి చెందిన పక్షి. అలాగే నీచులైన మానవులు ఎంగిలి మెతుకులు తిని బలిసి కొవ్వెక్కి తమ శక్తి సామర్థ్యాలు తెలుసు కోకుండా ఉత్తములను హేళన చేయడమే కాకుండా వారితో పోటీకి దిగి తక్కువ సమయంలోనే అలసిపోయి ఓడిపోతానరనే నీతిని ఈ కథ తెలుపుతూ ఉంది. ఇందులో పాత్రలన్నీ పక్షులే.

భారతంలో ఈ కథను చెప్పిన శల్యుడు కర్ణునికి సారథ్యం చేస్తూ అతణ్ణి తక్కువ చేసి చెబుతూ మానసికంగా హింసించే ప్రయత్నం చేస్తాడు. అలా చేయాలని ధర్మరాజు కురుక్షేత్ర యుద్ధానికి ముందు శల్యుని కోరతాడు. అలాగే చేస్తానని ధర్మరాజుకు శల్యుడు మాట యిస్తాడు. దాని ప్రకారం శల్యుడు కర్ణునికి సారథ్యం చేస్తూ అతని గొప్పతనాన్ని తక్కువ చేసి చెబుతూ అర్జునుని ప్రశంసిస్తూ కర్ణుని మానసికంగా దెబ్బ తీసే ప్రయత్నం చేస్తాడు. ఇదే లోకంలో శల్యసారథ్యంగా ప్రచారంలో ఉంది. శల్యసారథ్యం అనే పదం ఒక జాతీయంగా ఏర్పడింది. నిజానికి కర్ణుడు గొప్ప యుద్ధవీరుడు. అతడు అర్జునుని ప్రతిస్పర్థిగా భావించి ఎలాగైనా అర్జునుని చంపాలని త్రికరణ శుద్ధిగా ప్రయత్నిస్తూ ఉంటాడు. అలా చేయడం అతనికి తలకు మించిన పని అని తెలిసినప్పటికీ ప్రయత్నం మాత్రం శక్తివంచన లేకుండా చేస్తాడు. అయితే అతని కోరిక నెరవేరదు. చివరకు అర్జునుని చేత మరణిస్తాడు. అందుకు చాలా కారణాలున్నాయి. అలాంటి కారణాల్లో శల్య సారథ్యం కూడా ఒకటి.

ఈ కథను తిక్కన కర్ణపర్వంలోని ద్వితీయాశ్వాసంలో 54వ పద్యం నుంచి 81వ వచనం వరకు ఉన్న 28 గద్యపద్యాల్లో క్లుప్తీకరించి చెప్పాడు. మూలంలో కాకి హంసతో పోటీపడి ఎగురుతున్నప్పుడు అనేక విన్యాసాలు చేసినట్లుగా ఉంది. తిక్కన తన భారతంలో కాకి గర్వపు చేష్టలను ఇలా చక్కగా వర్ణించాడు.

**"ఎలమి గడచిపోవు బిలుచు గ్రమ్మఱి వచ్చి**
**ముక్కు ముక్కు మీద మోపు జుట్టు**
**నేచి తిరుగు నీకలీకలతో రాయు**
**నొరయు జిత్రగతుల మురియు నవ్వు"**

**(కర్ణ–2–66)**

కాకి హంసను దాటిపోయి మళ్ళీ వెనుకకు వచ్చి హంసను తనతోబాటు వేగంగా ఎగురమని పిలుస్తుంది. కొన్నిసార్లు దాని ముక్కు మీద తన ముక్కు మోపేది. తన ఈకలను హంస ఈకలతో రాసేది. విజృంభించి హంస చుట్టూ తిరిగేది. చిత్రంగా ఎగురుతూ వచ్చి హంసను తాకేది. తాను ఎలాగైనా గెలుస్తానని హంస వెనుకబడి పోతుందని గర్వంతో తనలో తాను మురిసిపోతూ నవ్వుకునేది. తిక్కన కాకి చేసిన ఈ ఎగురుబాటును వర్ణించడంలో మాత్రమే మూలానికి కొంత మార్పు చేసి రచించాడు. మిగిలిన కథ అంతా మూలంలో ఉన్నదే.

## 5.వ్యాఘ్ర - గోమాయు సంవాదం కథ:

గోమాయువు అంటే నక్క, వ్యాఘ్రుం అంటే పులి. అంటే ఇది నక్క పులి కథ. ఈ కథ సంస్కృత భారతం శాంతిపర్వంలో రాజధర్మానుశాసన పర్వం అనే ఉపపర్వంలో 111 వ అధ్యాయంలో 90 శ్లోకాల్లో వివరంగా ఉంది. దీన్ని "క్రూరులు సౌమ్యంగానూ, సౌమ్యులు క్రూరంగానూ కనిపిస్తూ ఉంటారు. అలాంటి వారిని ఎలా తెలుసుకోగలం" అని ధర్మరాజు శరతల్పగతుడైన భీష్ముని అడుగుతాడు. దానికి భీష్ముడు "ఈ విషయానికి సంబంధించి పెద్దలు వ్యాఘ్ర గోమాయు సంవాదం అనే కథను చెబుతూ ఉంటారు, దాన్ని విను" అని ఈ కథను ఇలా చెబుతాడు.

పూర్వం పురిక అనే పేరుగల పట్టణాన్ని పౌరికుడు అనే పేరుగల దుర్మార్గుడైన రాజు పాలిస్తూ ఉండేవాడు. అతడు ఇతరులను హింసిస్తూ వినోదించేవాడు. అతడు చనిపోయి మరుసటి జన్మలో నక్కగా జన్మించాడు. అయితే ఆ నక్కకు పూర్వ జన్మ స్మృతి ఉంది. ఆ కారణంచేత అది నక్క సహజ లక్షణాలైన మోసకారి తనం, మాంసాహారాన్ని తినడం మొదలైనవి లేకుండా సత్యవాక్పాలన వ్రతాన్ని పాటిస్తూ చెట్ల నుంచి రాలిన పండ్లను నియమిత సమయాల్లో ఫలహారంగా స్వీకరిస్తూ శ్మశానంలో జీవిస్తూ ఉండేది. దాని జీవన విధానాన్ని చూసి తోటి నక్కలు తమలాగా మాంసాహార భోజనం చేయమని, అనవసరమైన సదాచారాలు మానమని చెబుతాయి. దానికి నక్క మృదువైన మాటలతో మధురంగా యుక్తి యుక్తంగా "కులం యొక్క యశస్సును పెంపొందించే మంచి కర్మలనే నేను చేయాలను కుంటున్నాను. మీరందరూ స్వార్థంతో కేవలం తినడం మీదనే ఆసక్తి చూపిస్తున్నారు. దానివల్ల వచ్చే పాపాన్ని మీరు గమనించడం లేదు. ఇహ పరలోకాల్లో అనిష్టాన్ని కల్గించే మీ ప్రవర్తనను నేను మెచ్చను" అని చెబుతుంది. ఆ అడవిలో ఉన్న ఒక శార్దూలం నక్క ప్రవర్తన గురించి విని దాని దగ్గరకు వచ్చి తనకు మంత్రిగా ఉండి హితాన్ని ఉపదేశిస్తూ తనతోపాటు పుష్కలమైన భోగాలను అనుభవిస్తూ జీవించమని చెబుతుంది. నక్క వినయంగా తలవంచి శార్దూలంతో ఇలా పలుకు తుంది. "మహా సామ్రాజ్యాన్ని పాలించడానికి స్వామి భక్తి తత్పరుడూ, నీతి కుశలుడూ అయిన మంత్రి

అవసరం. నేను భోగాలను గానీ ఐశ్వర్యాన్ని గానీ కోరను. నా యీ స్వభావంతో మీ పాతసేవకుల స్వభావం సరిపోదు. దుర్మార్గులైన వారు నిన్ను నన్ను విడదీస్తారు. మీరు పరాక్రమవంతులు, ఇతరులకు ఆశ్రయమిచ్చేవారు. తప్పులు చేసిన వారిని కూడా దయ దలిచేవారు, అమోఘంగా పనులు నెరవేర్చేవారు. కానీ నాకు ఏమీ లేకపోయి నప్పటికీ సంతుష్టిగా ఉన్నాను. కష్టమైన వ్రతాన్ని పాటిస్తున్నాను. సేవ చేయడం తెలియని వాడిని. స్వేచ్ఛగా అడవిలో తిరిగేవాడిని. రాజాశ్రయంలో ఉన్న వారికి రాజుకు సంబంధించిన దోషాలన్నీ అంటుతాయి. రాజుగారి పిలుపు అందుకున్న వారికి మనసులో భయముంటుంది. అసత్యమైన అపరాధాలు ఆరోపించబడి రాజల చేత మరణ దండన విధింప బడిన సేవకులు చాలా మంది ఉన్నారు. అయినప్పటికీ నేను నీ దగ్గర మంత్రిగా ఉండాలని భావిస్తే ఒక నియమం విధించాలను కుంటున్నాను. దాని ప్రకారం నీవు నా వారిని గౌరవించాలి. నేను చెప్పే హితోక్తులను వినాలి. నీ ఇతర మంత్రులతో కలిసి మంత్రాంగం చేయను. నేను ఒక్కడిని ఏకాంతంగా నిన్ను కలిసి రహస్యంగా మంచి మాటలను చెబుతాను. నాతో ఆలోచన చేసిన తర్వాత దోషులైన నీ మంత్రులకు మరణ దండన విధించ వద్దు. అలాగే నా వారిని కూడా కోపంతో దండించవద్దు" నక్క మాటలను విని పెద్దపులి అలాగే జరుగుతుంది అని చెప్పి దాన్ని మంత్రిగా నియమిస్తుంది. అప్పటి నుంచి నక్క రాజుకు మంచి మాటలను చెబుతూ మంచి పనులను చేస్తూ సన్మానాలు పొందుతూ ఉంటుంది. ఇది రాజు దగ్గర వున్న సేవకులకు నచ్చదు. వారు అంతకు ముందు ఇతరుల ధనాన్ని అపహరించే వారు. నక్క అవన్నీ కట్టడి చేయడంతో వారు నక్కకు ధనాన్ని ఆశ చూపి మభ్యపెట్టే ప్రయత్నం చేస్తారు. నక్క వాటికి లొంగదు. ఈ కారణం చేత నక్కను ఎలాగైనా చంపించాలని ప్రయత్నిస్తారు. ఒకరోజు పెద్దపులికి ఆహారంగా తయారుగా ఉంచబడిన మాంసాన్ని తీసుకుని వెళ్ళి నక్క నివాసంలో పెడతారు. ఆకలితో వున్న పెద్దపులి తన ఆహారం దొంగిలించిన దొంగను కనిపెట్టమని తన సేవకులను ఆజ్ఞాపిస్తుంది. వారు ఆ దొంగ అతని మంత్రి నక్క అని చెబుతారు. వెంటనే శార్దులం పట్టరాని కోపంతో నక్కను చంపాలనుకుంటుంది. అపుడు అతని సేవకులు అందరూ కలిసి నక్క మీద అనేక నిందలను మోపుతారు. అంతేగాకుండా నక్క నివాసంలో పెట్టిన మాంసాన్ని తెచ్చి రాజుకు చూపిస్తారు. దానితో పెద్దపులి గోమాయువును చంపమని ఆదేశిస్తుంది.

శార్దూలం మాటలు విని దాని తల్లి మంచి మాటలతో ఇలా పులికి చెపుతుంది. "మలిన మనస్కులైన వారు నిర్దోషులను దోషిగా చూస్తారు. వీరు ఇతరుల ఔన్నత్యాన్ని సహించ లేరు. గోమాయువు మాంసాన్ని ఇచ్చినా ముట్టదు. కాబట్టి ప్రత్యక్షంగా చూసినప్పటికీ క్షుణ్ణంగా పరిశీలించి నిర్ధారించు కోవాలి". తల్లి మాటలను విని వ్యాఘ్రం తన సేవకులు చెప్పిన మాటలను నమ్మకుండా నక్కను గురించి బాగా విచారించి వాస్తవం తెలుసుకొని నక్కను పిలిపించి స్నేహ భావంతో కౌగలించుకుంటుంది. గోమాయువు రాజు తనను అనుమానించి అవమానించినందుకు బాధపడి ప్రాయోపవేశం చేయాలనుకుంటుంది.

శార్దూలం గోమాయువును పూజలతో బాగా సత్కరించి అతని ప్రాయోపవేశాన్ని వారిస్తుంది. అపుడు నక్కరాజుకు నమస్కరించి గద్గద  స్వరంతో ఇలా చెబుతుంది.

**"పూజితో హం త్వయా పూర్వం పశ్చా చ్చైవ విమానితః**
**పరేషామాస్పదం నీ తో వస్తుం నార్హామ్యహం త్వయి"**
**(శాంతి. 111- 76వ శ్లోకం)**

"రాజా! మొదట మీరు నన్ను సత్కరించారు, తర్వాత మరణదండన విధించి అవమానించారు. నేను నీ వద్ద ఉండడానికి తగను". ఒకసారి స్థాన భ్రష్టత పొంది అవమానానికి గురైన నన్ను విశ్వసించలేరు. నేను మీ దగ్గర ఉండలేను. నన్ను సమర్థుడని చేరదీసి పరీక్షించి ఒప్పందం చేసుకొని పదవిని ఇచ్చి ఆ తర్వాత ఒప్పందాన్ని ఉల్లంఘించి నన్ను అవమానించారు. ఇలా అవమానం పాలైన నాకు విశ్వాసం ఉండదు. నా మీద మీకు విశ్వాసం పోయింది. నీవు సందేహిస్తున్నావు. నేను భయపడుతున్నాను. ఇతరులలో తప్పులు వెదికేవారు ఇక్కడ ఉన్నారు.

**"దుఃఖేన శ్లిష్యతే భిన్నం శ్లిష్టం దుఃఖేన భిద్యతే**
**భిన్నా శ్లిష్టాతు యా ప్రీతి ర్న సా స్నేహేన వర్తతే"**
**(శాంతి. 111 – 85వ శ్లోకం)**

" పగిలినది అతకడం కష్టం.  అతికినది విచ్చిపోవడం కష్టం. పగిలి అతికిన ప్రీతి స్నేహంతో నిలవదు". యోగ్యులైన పురుషులను గురించి తెలుసుకోవడం రాజులకు కష్టం. వారి మనసు చంచలంగా ఉంటుంది. అకస్మాత్తుగా గౌరవించడం, అకస్మాత్తుగా అవమానించడం, గొప్పదనం కల్పించి కిందికి దిగజార్చడం మొదలైన వన్నీ రాజులు చేస్తారు". ఇలా చెప్పి నక్క అడవికి వెళ్ళి  ప్రాయోపవేశం చేసి స్వర్గాన్ని పొందుతుంది. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఇది జానపద కథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ.   ఈ కథలో ఉన్న జంతువులన్నీ అడవి జంతువులే. రాజు  దగ్గర స్వార్థపరులు చాలా మంది ఉంటారు. అలాంటి రాజు దగ్గర నిస్వార్థపరుడూ, సత్య వాక్పాలకుడు అయిన మంత్రి ఉండలేడు. అలాంటి మంత్రి రాజుగారి వద్ద ఉంటే మిగిలిన సేవకులకు వారి స్వార్థానికి కంటగింపుగా ఉంటుంది. ఎలాగైనా రాజుకు అతనికి భేదం కల్పించి చంపించే  ప్రయత్నం చేస్తారు. రాజులు కూడా చపల బుద్ధులే. వారికి ఒకసారి ఉన్న మనసు మరొకసారి ఉండదు. మంచివాడని సన్మానించిన వ్యక్తినే దుర్మార్గునిగా భావించి రాజులు దండిస్తారు. కాబట్టి రాజు సహవాసం పాము పడగ నీడ లాంటిది. అందువల్ల సన్మార్గులు, సౌమ్యులు రాజాశ్రయం కోరకూడదు అనే నీతిని పై కథ తెలియజేస్తుంది.

ఈ కథలో రాజనీతి, లోకుల స్వభావం, రాజుల మనస్తత్వం చక్కగా వివరింప బడింది. ఇందులో పాత్రల మనస్తత్వాన్ని తెలియజేసే మంచి సంభాషణలు ఉన్నాయి.

భారతంలో దీన్ని రాసిన కవి పాత్రల స్వభావాన్ని, రాజనీతిని, రాజుల చంచల మనస్తత్వాన్ని తెలిపే చక్కటి సంభాషణలను కల్పించి సన్నివేశాన్ని బాగా రక్తి కట్టించాడు.

ఈ కథను తిక్కన శాంతిపర్వం తృతీయాశ్వాసంలో 52వ పద్యం నుంచి 79వ పద్యం వరకూ 28 పద్య గద్యాల్లో క్లుప్తీకరించి చెప్పాడు. తిక్కన ఎలాంటి మార్పులు చేయలేదు.

## 6. ఉష్ట్రగ్రీవోపాఖ్యానం:

ఉష్ట్రగ్రీవం అంటే ఒంటె. అంటే ఇది ఒంటె కథ. ఇది సంస్కృత భారతంలోని శాంతిపర్వంలో రాజ ధర్మానుశానస పర్వం అనే ఉపపర్వంలో 112వ అధ్యాయంలో 22 శ్లోకాల్లో ఉంది. "రాజు ఏమి చేయాలి? ఏమి చేస్తే రాజు సుఖంగా ఉంటాడు? తెలుపవలసిందిగా" భీష్ముని ధర్మరాజు కోరతాడు. దానికి భీష్ముడు ఒక ఒంటె కథను చెబుతాను ఆ ఒంటెలాగా ఎప్పటికీ ప్రవర్తించవద్దు" అని చెప్పి ఈ కథను చెబుతాడు.

సత్యయుగంలో ఒక గొప్ప ఒంటె ఉండేది. అది కఠోర నియమాలతో దేవుని గురించి గొప్ప తపస్సు చేస్తుంది. దేవుడు దాని తపస్సుకు మెచ్చి ప్రతక్షమై వరం కోరుకోమంటాడు. ఒంటె –

**"భగవన్ త్వత్ప్రసాదాన్మే దీర్ఘా గ్రీవా భవేది యం**
**యోజనానాం శతం సాగ్రం గచ్ఛామి చరితుం విభో"**
**(శాంతి. 112 – 6వ శ్లోకం)**

"నా మెడ చాలా పొడవుగా ఉండాలి, దాని వల్ల 100 యోజనాల వరకూ మెడను సాచి మేయగలను" అని కోరుతుంది. దేవుడు ఆ వరాన్ని ఇచ్చి అదృశ్యమవుతాడు. ఆ తర్వాత ఒంటె మెడ అది కోరుకున్నట్లుగానే పెద్దదవుతుంది. అది మేయడానికి ఎక్కడికీ వెళ్ళకుండా సోమరిదై మెడను మాత్రం 100 యోజనాల వరకూ సారించి మేయడం ప్రారంభిస్తుంది. ఒకరోజు పెద్ద గాలి, వాన వస్తుంది. ఒంటె తన తలను మెడను ఒక గుహలో దాచుకొని ఉండిపోతుంది. అదే సమయంలో ఒక నక్క దాని భార్యతో కలిసి వర్షంలో తడిసి చలికి వణుకుతూ గుహలోకి వస్తుంది. ఆకలితో ఉన్న ఆ రెండు నక్కలు ఒంటె మెడను తినడం ప్రారంభిస్తాయి. ఒంటె బాధతో మెడను అటు ఇటు కదిలిస్తుంది. అయినప్పటికీ నక్కలు వదలకుండా ఒంటె మెడను కొరికి చంపి తింటాయి. ఈ విధంగా బుద్ధిలేని ఒంటె సోమరితనంతో చనిపోయింది. కాబట్టి రాజు అయిన వాడు సోమరితనాన్ని విడిచిపెట్టి, ఇంద్రియ నిగ్రహం కలిగి మసలుకోవాలి అని భీష్ముడు చెబుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఇది జానపద ప్రాణికథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ. ఈ కథలో ఒంటె, రెండు నక్కలు ఉన్నాయి. ఈ మూడూ అడవి జంతువులే. ఈ కథలో ఒంటె

అజ్ఞాని, మూర్ఖపుది. ఇది కష్టపడి తపస్సు చేసి దేవుడు ప్రత్యక్షమైన తర్వాత తాను ఉన్న చోటనే ఉండి కదలకుండా ఆహారాన్ని సంపాదించు కోవడానికి వీలుగా తన మెడను పొడవుగా చేయమని దేవుణ్ణి కోరుతుంది. ఏ అవయవమైనా సహజమైన పద్ధతిలో ఉండాలి. జంతువుల్లో ఒంటెకు మెడ పొడవుగా ఉంటుంది. ఈ ఒంటె ఆ పొడవును కాదని మరింత పొడవుగా తన మెడ సాగాలని తద్వారా పడుకున్న చోట నుంచి కదలకుండా ఆహారాన్ని తినాలనే ఆశతో దేవుని వరం వల్ల తన మెడను పొడవు చేసుకుంటుంది. అయితే అదే దాని మరణానికి కారణమవుతుంది. కష్టపడి దేవుని గురించి తపస్సు చేసి అతడు ప్రత్యక్షమై వరం కోరుకోమంటే తనతోపాటు పదిమందికి మంచి కలిగేది కోరుకోవాలి గానీ ప్రమాదాన్ని తెచ్చే వరం కోరుకోగూడదనే నీతిని ఈ కథ వివరిస్తూ ఉంది.

ఈ కథను తిక్కన శాంతిపర్వంలోని తృతీయాశ్వాసంలో 82వ వచనం నుంచి 85వ వచనం వరకూ ఉన్న నాలుగు పద్య గద్యాల్లో క్లుప్తంగా వివరించాడు.

## 7.మూషిక– మూర్జాల సంవాదం కథ :

ఈ కథ సంస్కృత భారతంలోని శాంతిపర్వంలో ఆపద్ధర్మపర్వం అనే ఉప పర్వంలో 138వ అధ్యాయంలో 221 శ్లోకాల్లో ఉంది. "చాలా మంది శత్రువులకు చిక్కిన రాజు ఎలా ప్రవర్తించాలి? బలవంతు లందరూ కలసి బలహీనుడైన ఒంటరి వానిని చంపడానికి ప్రయత్నించినపుడు ఆరాజు ఏవిధంగా ప్రవర్తిస్తాడు? అలాంటి వాడు మిత్రుని, శత్రువును ఎలా పొందుతాడు? అతడు శత్రు మిత్రుల మధ్య ఎలా ప్రవర్తించాలి" చెప్పవలసిందిగా భీష్ముని ధర్మరాజు కోరతాడు. దానికి సమాధానంగా భీష్ముడు ఈ కథను చెబుతాడు.

ఒక దట్టమైన అడవిలో పెద్ద కొమ్మలతో పలు రకాల తీగలతో నిండిన పెద్ద మర్రిచెట్టు ఉంది. దాన్ని ఆశ్రయించుకొని ఎన్నో పక్షులు, జంతువులు జీవిస్తున్నాయి. ఆ మర్రిచెట్టు మొదట్లో నూరు దారులు కల్గిన కలుగు తవ్వకొని అందులో పలితం అనే పేరు గల ఒక తెలివైన ఎలుక నివసిస్తూ ఉంది. చెట్టు మీద లోమశం అనే పిల్లి కూడా సుఖంగ నివసిస్తూ ఉంది. ఒక వేటగాడు ప్రతిరోజూ సాయంత్రం మర్రిచెట్టు కింద ఒక బోను ఏర్పాటు చేసి, సన్నని నరాలతో అల్లిన వలలను పరిచి ఇంటికి వెళ్ళిపోయి తెల్లవారిన తర్వాత వచ్చి బోనులో, వలలో చిక్కుకున్న జంతువులను పక్షులను పట్టుకొని జీవిస్తుంటాడు. ఒకరోజు పిల్లి వలలో చిక్కుకుంటుంది. తనకు ప్రధాన శత్రువైన పిల్లి వలలో చిక్కడం చూసిన పలితం భయం లేకుండా దాని ముందు తిరుగుతూ ఆహారం కోసం అన్వేషిస్తూ ఉంటుంది. అదే సమయంలో ఎలుకకు మరో శత్రువైన ముంగిస అక్కడికి వస్తుంది. దగ్గరలో ఒక కొమ్మ మీద గుడ్లగూబ ఎలుకను చూసి దాన్ని తినడానికి ఉబలాటపడుతూ ఉంటుంది. ముంగిస గుడ్లగూబలను చూసి ఎలుక చాలా భయపడి ఇలా ఆలోచిస్తుంది. "నాకు అన్ని వైపులా శత్రువులే ఉన్నారు. నాలాంటి తెలివైన వాడు ఇలాంటి సమయంలో భయపడకూడదు. చావు వచ్చే వరకు జీవించడానికి యుక్తితో ప్రయత్నిస్తాను.

**"నహి బుద్ధ్యాన్వితః ప్రాజ్ఞో నీతిశాస్త్ర విశారదః**
**నిమజ్జ త్యాపదం ప్రాప్య మహతీం దారుణా మపి"**
**(శాంతి. 138 – 40వ వచనం)**

"నీతిశాస్త్ర విశారదుడైన బుద్ధిమంతుడు, తెలివి గలవాడు ఎంత గొప్ప ఆపద కల్గినా కుంగిపోడు". ప్రస్తుతం నాకు కష్టంలో ఉన్న శత్రువైన పిల్లిని మించి వేరే దారి లేదు. నేను దీనికి సాయం చేయవలసి ఉంది. ఇపుడు ముగ్గురు శత్రువులు నన్ను తినాలని చూస్తున్నారు. నేను జీవించడానికి శత్రువైన పిల్లిని ఆశ్రయించి దానికి హితం ఉపదేశిస్తాను. ఆపదలో ఉంది కాబట్టి ఇది నాతో సంధి చేసుకోవచ్చు. ఆపదలో ఉన్న బలవంతుడు కూడా జీవించడానికి దగ్గరి శత్రువుతో కలవడమే మంచిదని పెద్దలు చెబుతారు. మూర్ఖుడైన మిత్రుని కంటే పండితుడైన శత్రువే తగినవాడు. నా జీవితం ప్రస్తుతం శత్రువైన పిల్లి మీద ఆధారపడి ఉంది" ఇలా ఆలోచించి ఎలుక మృదువైన మాటలతో పిల్లితో ఇలా అంటుంది. "మార్జాలమా! మంచి మనసుతో అడుగుతున్నాను, బాగున్నావా? నేను ఎప్పుడూ నీ హితం కోరుతూ ఉంటాను. భయపడకు, నీవు నన్ను చంపకుండా వుంటే నేను నిన్ను ఉద్ధరిస్తాను. కొంచెం కష్టమైనా నాకు ఒక ఉపాయం తోస్తూ ఉంది. దీనివల్ల నీవు విముక్తి పొందుతావు. నాకూ మేలు కలుగుతుంది. అది నీకు నాకూ కూడా శ్రేయస్కరం. ముంగిస, గుడ్లగూబ నన్ను తినాలని చూస్తున్నాయి. నిన్ను చూసి నన్ను బెదిరించడం లేదు.

**"సతాం సాప్తపదం మైత్రం స సఖా మే అసి పండితః**
**సాంవాస్యకం కరిష్యామి నాస్తి మే భయ మద్య వై॥"**
**(శాంతి. 138 – 56వ శ్లోకం)**

"సజ్జనులతో స్నేహం ఏడు పదాలతో కలుగుతుంది. పండితుడవైన నీవు నాకు స్నేహితుడవయ్యావు. నీతో కలిసి నివసిస్తాను. ఇంక నాకు భయమే లేదు". నేను లేకుండా నీవు పాశం తెంచుకోలేవు. నీవు నన్ను తినకుండా ఉంటానంటే నీ పాశాలు నేను కొరికేస్తాను. ఇద్దరమూ చాలా కాలంగా ఈ చెట్టును ఆశ్రయించి ఉంటున్నాం. అందువల్ల మన ఇద్దరికీ ప్రీతి, స్నేహం పెరగాలి. నేను నీ జీవితాన్ని కోరుతున్నాను. నీవు నా జీవితాన్ని కోరుతున్నావు. మన కలయిక ఇలాంటిది. ముందు ముందు ఇది ఇంకా విస్తరిస్తుంది కూడా".

మంచి యుక్తితో కూడిన, స్వీకరింపదగిన ఎలుక మాటలను విన్న పిల్లి మెల్లగా తల పైకెత్తి ఎలుకను చూసి "సౌమ్యుడా సంతోషం. నేను జీవించాలని నీవు కోరుతున్నావు. నేను పెద్ద ఆపదలో ఉన్నాను. అంతకన్నా పెద్ద ఆపదలో నీవున్నావు. ఆపదలో ఉన్నవారికి సంధి కలుగుతుంది. ఆలస్యం చేయకు. నీకు ప్రయోజనం కలిగించే పని సమయం వచ్చినప్పుడు నేను చేస్తాను. ఈ ఆపద నుంచి నేను బయటపడితే నీవు చేసిన సహాయం ఊరకే పోదు, నేను నీ భక్తుణ్ణి, శిష్యుణ్ణి, నీకు మేలు చేసేవాణ్ణి, నీ ఆజ్ఞ పాటించేవాణ్ణి, నీకు

శరణాగతుడను" అని పలుకుతుంది. పిల్లి తనకు వశమైనట్లుగా పలికేటప్పటికి పలితం (ఎలుక) అర్ధవంతమైన హితమైన మాటలను ఇలా చెబుతుంది. "ఉదారంగా నీవు పలికిన మాటలు నీలాంటి వారికి కొత్త కాదు. నీ హితం కోసం నేను అనుసరించే మార్గం చెబుతాను. నాకు ఈ ముంగిస వల్ల చాలా భయంగా ఉంది. నేను నీ దగ్గరకు వస్తాను. నన్ను చంపకు. నీచమైన గుడ్లగూబ నన్ను తినాలనుకుంటూ ఉంది. దాని నుంచి నన్ను రక్షించు, నేను నీ పాశాలను కొరికివేసి నిన్ను రక్షిస్తాను. ఒట్టు వేసి చెబుతున్నాను".

సముచితమైన ఎలుక మాటలను లోమశం విని సంతోషంగా ఎలుక వైపు చూసి దాన్ని ప్రశంసిస్తూ ఇలా అంటుంది. "తొందరగా రా నీకు శుభం కల్గుతుంది. నీవు నాకు ప్రాణ సఖుడవు. నీ దయతో నేను జీవిస్తాను. ఇది ఇలా జరిగితే నువ్వు ఏది చెబితే అది చేస్తాను. ఆజ్ఞాపించు మిత్రమా! మనకు సంధి కలుగుగాక! ఈ ఆపద నుంచి బయటపడి నేను నా బంధుమిత్రులతో కలిసి నీకు ప్రియ, హిత కార్యాలన్నీ చేస్తాను, సత్కారం చేస్తాను". ఇలా పలుకగానే ఎలుక పిల్లికి దాని ప్రయోజనాన్ని ఎరగా పెట్టి దాన్ని నమ్మించి తనకు పిల్లి కీడు చేసేది అయినప్పటికీ దాని ఒడిలోకి చేరుతుంది. పిల్లి దాన్ని ఊరడిస్తుంది. తెలివైన ఎలుక తల్లి తండ్రుల ఒడిలో ఉన్నట్లుగా పిల్లి రొమ్ము మీద విశ్వాసంతో నిద్రిస్తుంది. ఇది చూసి ముంగిస గుడ్లగూబలకు ఆశ్చర్యం, భయం కలుగుతాయి. అవి రెండూ ఎలుక మీద ఆశను వదులుకొని వాటి నివాసాలకు వెళ్ళిపోతాయి. ఆ తర్వాత దేశ కాలాలు ఎరిగిన ఎలుక కాలం కోసం నిరీక్షిస్తూ మెల్ల మెల్లగా కొద్ది కొద్దిగా పిల్లి వల తాళ్ళను కొరుకుతూ ఉంటుంది. వలలో కష్టపడుతున్న పిల్లి ఎలుకను తొందర పెడుతూ – 'సౌమ్యుడా! తొందరపడవేమి? నీ పని తీరిందని నన్నవమానిస్తున్నావా? వేటగాడు రాకముందే త్వరగా తాళ్ళను కొరుకు" అని అంటుంది.

పిల్లి మాటలను విన్న తెలివైన ఎలుక తెలివి తక్కువ పిల్లితో తనకు ప్రియము, హితము అయిన మాటలను ఇలా పలుకుతుంది. 'పిల్లీ! తొందరపడకు, కంగారు పడకు, మనం కాలం తెలిసినవాళ్ళం. కాలం మించిపోలేదు.

**"అకాలే కృత్యమారబ్ధం కర్తుర్నార్థాయ కల్పతే**
**తదేవ కాల ఆరబ్ధం మహతేర్థాయ కల్పతే**
**(శాంతి. 138 – 95వ శ్లోకం)**

"అకాలంలో ప్రారంభించిన పని కర్తకు ప్రయోజనాన్ని కల్గించదు. తగిన కాలంలో ప్రారంభించిన పనే గొప్ప ప్రయోజనాన్ని కల్గిస్తుంది". నీవు అకాలంలో విడుదల అయితే నీ వల్లనే నాకు భయం కలుగవచ్చు. అందువల్ల కాలం కోసం నిరీక్షించు మిత్రమా! ఎందుకు తొందర పడతావు? ఆయుధం ధరించి వచ్చే వేటగాణ్ణి చూసిన తర్వాత నీ పాశాలను కొరికి వేస్తాను. అపుడు విడుదల పొంది ప్రాణం దక్కించు కోవడానికి నీవు చెట్టు ఎక్కుతావు. భయంతో నీవు తప్పించుకున్న తర్వాత నేను కన్నంలో దూరుతాను" తన

మేలు కోసం పలితం (ఎలుక) ఇలా మాట్లాడిన వెంటనే బతుకు మీద ఆశ కలిగిన పిల్లి "మిత్రుల పనులను సంతోషంగా చేసే సజ్జనులు ఇలా చేయరు. త్వరపడి నేను నిన్ను వెంటనే కష్టం నుంచి తప్పించాను గదా! అలాగే నాకు హితమైన కార్యం నీవు గూడా త్వరగా చేయాలి. అలా కాకుండా పూర్వశత్రుత్వాన్ని తలచుకొంటూ కాలం గడపాలని అనుకుంటున్నావా? అలా చెడ్డపని చేద్దామనుకుంటే ..... చూడు ఇప్పటికే నీకు ఆయువు మూడి ఉండేది. ఒకవేళ నేను తెలియక చెడ్డపని చేసి ఉంటే దాన్ని మనసులో పెట్టుకోవద్దు. అలాగే నేను నిన్ను క్షమిస్తాను. నన్ను అనుగ్రహించు" అని అంటుంది.

మంచి తెలివి, శాస్త్రబుద్ధి ఉన్న ఎలుక పిల్లితో హితంగా ఇలా పలుకుతుంది. "మార్జాలమా నీ ప్రయోజనాన్ని కోరుకునే నీ మాట విన్నాను. బలవంతునితో సంధి చేసుకున్న తర్వాత తన్ను తాను రక్షించు కోవాలి. లోకంలో ఎవడూ ఎవరికీ మిత్రుడూ కాడు, శత్రువూ కాడు. మిత్రులు కానీ, శత్రువులు కానీ ప్రయోజనాన్ని బట్టి ఏర్పడతారు. ఏనుగులతోనే అడవి ఏనుగులను పట్టుకుంటారు. అలాగే ప్రయోజనాలతోనే ప్రయోజనాలు కట్టుబడతాయి. పని పూర్తి అయిన తర్వాత ఎవడూ కర్తను పట్టించుకోడు. అందువల్ల పనులన్నీ పూర్తిగా చేయకుండా కొద్దిగా మిగిలి ఉండేటట్లు చేయాలి. చివరి నిమిషంలో నీవు వేటగాడు వస్తున్నాడనే భయంతో పారి పోవడానికే ప్రయత్నిస్తావు గానీ నన్ను పట్టుకోవడానికి శక్తుడవు కావు. చాలా తాళ్ళను కొరికి వేశాను. ఒక్క పోగు మాత్రమే మిగిలి వుంది. దాన్ని కూడా త్వరగానే కొరుకుతాను. లోమశా! సుఖంగా వుండు".

ఆపదలో చిక్కుకున్న ఆ రెండూ ఇలా మాట్లాడుకుంటూ ఉండగానే రాత్రి గడచిపోతుంది. తెల్లవారుతుండగానే ఆయుధం పట్టుకొని వేటగాడు వస్తుంటాడు. అతని చుట్టూ కుక్కల గుంపు ఉంది. పిల్లికి భయం పట్టుకుంది. ఈ భయంకర దృశ్యం, గందరగోళం చూసి ముంగిస గుడ్లగూబ కూడా చాలా భయపడి నిరాశ పడ్డాయి. అవి రెండూ బలం కలవి, తెలివి కలవి. అయినప్పటికీ కార్య నైపుణ్యం గలిగిన పిల్లి ఎలుకలను తమ శరీర బలంతో దెబ్బ తీయలేక పోయాయి. ప్రయోజన దృష్టితో సంధి చేసుకున్న పిల్లి ఎలుకలను చూసి ముంగిస గుడ్లగూబ తమ నివాసాలకు వెళ్ళిపోతాయి. వెంటనే పిల్లి యొక్క వలతాడును ఎలుక కొరుకుతుంది. పిల్లి వల నుండి బయటపడి ఒక్క దూకులో చెట్టు ఎక్కుతుంది. ఎలుక కన్నంలో దూరుతుంది. వేటగాడు వల తీసుకొని నిరాశతో అక్కడి నుండి వెళ్ళిపోతాడు.

వేటగాడు వెళ్ళిపోయిన తర్వాత భయం తీరిపోయిన పిల్లి మళ్ళీ జీవితాన్ని పొంది కన్నంలో ఉన్న ఎలుకతో ఇలా అంటుంది. "ఒక్కమాట కూడా చెప్పకుండా ఒక్కసారిగా కలుగులోకి దూరిపోయావు. కృతజ్ఞురాలిని. మిత్రమా నీచేత ఉపకారం పొందాను. నేను, నా మిత్రులూ, బంధువులూ అందరూ నిన్ను పూజిస్తారు. బతుకు నిచ్చినవాణ్ణి కృతజ్ఞుడు పూజించకుండా ఉంటాడా? నా శరీరానికి గృహానికి, సంపదలకూ అన్నింటికీ నీవే స్వామివి. జీవితం మీద ఒట్టు వేసి చెబుతున్నాను నా వల్ల నీకు భయం లేదు. నీవు బుద్ధిచేత సాక్షాత్తుగా శుక్రాచార్యునివి" అని పిల్లి ప్రశాంతంగా పలుకుతుంది.

ఇతరుల ఊహలు తెలిసిన ఎలుక తనకు హితకరంగా పిల్లితో ఇలా చెబుతుంది. "లోమశా! నీవు చెప్పినదంతా విన్నాను. నాకు తోచిందేదో నేను చెబుతాను, విను. మిత్రులను తెలుసుకోవాలి. శత్రువులను కనిపెట్టాలి. శత్రు రూపంలో మిత్రులుంటారు. అలాగే మిత్రరూపంలో శత్రువులుంటారు. శత్రువని ఎవడూ ఉండడు. అలాగే మిత్రుడూ ఉండడు. ప్రయోజనాన్ని బట్టి మిత్రులూ శత్రువులూ ఏర్పడతారు. స్థిరమైన మైత్రి గానీ, స్థిరమైన శత్రుత్వం గానీ ఉండవు. కొంత కాలమయ్యే సరికి మిత్రుడు శత్రువు కావచ్చు, శత్రువు మిత్రుడు కావచ్చు. ఇందులో స్వార్థమే బలవత్తరం. ఈ జీవ లోకమంతా ప్రయోజనాన్నే కోరుతుంది. ఒకే తల్లికి పుట్టిన అన్నదమ్ములకు గానీ, దంపతులకు గానీ ఒకరి పట్ల మరొకరికి ఉండే సఖ్యత ఇలాంటిదే. కారణం లేని ప్రీతి ఈ లోకంలో నాకు ఎక్కడా కనపడదు. మానవుడు ప్రయోజనం వల్లనే ప్రీతి పొందుతాడు. మన ఇద్దరికీ ఒక కారణం వల్ల ప్రీతి ఏర్పడింది. నీవు సమర్థుడవైనప్పటికీ కాలం కలిసిరాక నాతో స్నేహం చేశావు. ఆ కాలం పోయేసరికి మన మైత్రి కూడా పోయింది. నీవు నాకు జాతి చేత శత్రువువు. ప్రయోజనం వల్ల మిత్రుడివయ్యావు. ఆ ప్రయోజనం తీరిన తర్వాత సహజమైన శత్రుత్వమే ఉంటుంది. మన ఇద్దరి అన్యోన్య సహాయం అయిపోయింది. నేను చేసిన మంచి పనిని స్మరించే టట్లయితే స్వస్థుడవై నాకు శుభం కలగాలని కోరుకో. దుష్టుడైన శత్రువు ఆకలితో ఉండి ఆహారం కోసం వెదుకుతున్న సమయంలో వాని దగ్గరికి బుద్ధిమంతుడు ఎవడూ వెళ్ళడు. నేను నీతో కలవను, నా సొమ్ము పూర్తిగా ఇమ్మంటే ఇస్తాను గానీ నన్ను మాత్రం నీకు అర్పించను" అని ఎలుక స్పష్టంగా గద్దించి పలికేటప్పటికి పిల్లి సిగ్గుపడి ఎలుకతో ఇలా అంటుంది.

"నిజంగా ఒట్టువేసి చెబుతున్నాను. నీవు నన్ను మిత్రద్రోహీ! అని నిందించావు. అది నీ తెలివి అని అనుకుంటున్నాను. నీవు నాకు ప్రాణ దానం చేశావు, దానితో కృతజ్ఞురాలిని అయ్యాను. నీ మీద భక్తి కలదానిని, నీవు కూడా నా మీద అదే భావంతో ప్రవర్తించు. నీవు నన్ను నిందిస్తే నా బంధువులతో కలసి నేను ప్రాణాలు విడుస్తాను. నీవు నన్ను శంకించవద్దు" ఇలా పిల్లి ప్రశంసిస్తూ పలికినప్పటికీ గంభీర భావం కలిగిన ఎలుక పిల్లితో ఇలా అంటుంది. "నీవు మంచి దానివి, నీ మీద నాకు ప్రీతి ఉంది. కానీ నిన్ను నమ్మలేను. ఈ స్తుతులతోనూ ధన రాసులతోనూ నీవు నన్ను వశపరచుకో లేవు. ఈ విషయంలో శుక్రాచార్యుడు బోధించిన రెండు మాటలు ఉన్నాయి.

**"శత్రు సాధారణే కృత్యే కృత్వా సంధిం బలీయసా**
**సమాహిత శ్చరేద్ యుక్త్యా కృతార్థశ్చ న విశ్వసేత్"**
**(శాంతి. 138 -193వ శ్లోకం)**

"సమానమైన కార్యంలో బలవంతుడైన శత్రువుతో సంధి చేసుకొని ఉపాయంతో, మెలకువతో మెలగాలి. ప్రయోజనం పొందిన తర్వాత నమ్మగూడదు".

**"న విశ్వసే దవిశ్వస్తే విశ్వస్తే నాతి విశ్వసేత్**
**నిత్యం విశ్వాసయే దన్యాన్ పరేషాం తు న విశ్వసేత్"**
**(శాంతి. 138 -194వ శ్లోకం)**

"నమ్మరాని వారిని నమ్మ గూడదు. నమ్మదగిన వానిని కూడా మితిమీరి నమ్మ గూడదు. ఇతరులకు నమ్మకం కల్గించాలి కానీ ఇతరులను నమ్మగూడదు' అందుచేత సర్వకాల సర్వావస్థలలోనూ తన జీవితాన్ని రక్షించుకోవాలి. బతికి ఉంటే అన్నీ సమకూరుతాయి. నన్ను నేను నీవంటి వారి నుంచి సదా రక్షించుకోవాలి. జాతిచేత పాపాలు చేసే వేటగాడి నుంచి నిన్ను నీవు కాపాడుకో".

ఇలా ఎలుక అంటూ ఉండగానే భయ సంభ్రమాలు కలిగి పిల్లి కొమ్మ మీది నుంచి పారిపోతుంది. ఇలా శాస్త్రార్థ తత్వాలు తెలిసిన ఎలుక తన బుద్ధి సామర్థ్యం వినిపించి ఇంకో కన్నంలోకి వెళ్ళిపోతుంది. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

భీష్ముడు ఈ కథను ధర్మరాజుకు చెప్పి తెలివైన ఎలుక బలం లేకపోయినా ఒంటరిదైనా బుద్ధిబలంతో చాలా మంది బలవంతులైన శత్రువులను మోసగించింది. ఎలుక, పిల్లి ఒకదానికొకటి ఆశ్రయించుకొని ఆపద నుంచి బయటపడ్డాయి అని చెబుతాడు.

ఇది జానపద ప్రాణి కథల ప్రభావంతో పండిత కవి కల్పించిన కథ. ఈ కథ చాలా చిన్నది. కానీ సంవాదాలు సుదీర్ఘంగా ఉన్నాయి. దీన్ని రాసిన కవి తనకు తెలిసిన నీతిశాస్త్రాన్ని ఎలుక ద్వారా చెప్పించాడు. ఈ సంభాషణల కారణంగా ఇందులోని కథా గమనానికి ఆటంకం ఏర్పడింది. ఇందులో ఎలుక, పిల్లి, ముంగిస, గుడ్లగూబ ఉన్నాయి. ఇవన్నీ అడవిలోని ప్రాణులు. వేటగాడు (మనిషి) ఉన్నప్పటికీ అతనికి ఎలాంటి ప్రాధాన్యత లేదు.

తిక్కన ఈ కథను శాంతిపర్వం తృతీయాశ్వాసంలో 202వ వచనం నుంచి 243వ పద్యం వరకూ ఉన్న 42 గద్యపద్యాలలో క్లుప్తంగా చెప్పాడు. మూలంలోని సుదీర్ఘ సంభాషణలను తిక్కన చాలా వరకు కుదించాడు. ఉదాహరణకు ఎలుక తన శత్రువులైన ముంగిస, గుడ్ల గూబలను చూసి తాను ఆపదలో చిక్కుకున్నానన్న విషయాన్ని గ్రహించి ఆపద నుండి బయట పడడానికి వలలో చిక్కిన పిల్లితో తామిద్దరమూ ఒకరినొకరు సహాయం చేసుకొని ఆపద నుంచి బయట పడాలని ఎలుక చెబుతుంది. ఈ విషయం సంస్కృత భారతంలో 15 శ్లోకాల్లో ఉంది. తిక్కన ఈ భాగాన్ని కేవలం రెండు కంద పద్యాల్లో ఇలా రాశాడు.

**"ఉరిద్రెవ్వ గొఱికి యిప్పుడు**
**వెరవారగ నీకు నేను విడుగర సేయం**
**దొరకొనుట నీదు భాగ్యం**
**బరిత్వము దొఱంగి మైత్రి యలవఱుపు మదిన్"**

"ముంగికి గూబకు నగపడి
యంగంబులు వడకుచున్నయవి నా కిమ్మై
సంగతి గలిగిన నీ యు
త్సంగంబున నుండి భయము దక్కుదు నేనున్"

**(శాంతిపర్వం – తృతీయాశ్వాసం – 205, 206 పద్యాలు)**

"ఓ రోమశా! నేను నేర్పుతో నీ ఉరులను తెంచివేసి నిన్ను బంధ విముక్తుని చేస్తాను. నేను ఇలా చేయడం నీ అదృష్టంగా భావించు. మనసులో నామీద పగను మానివేసి స్నేహభావాన్ని అలవరచుకో. ముంగిస, గుడ్లగూబలను చూసినప్పటి నుంచి నా శరీరం భయంతో వణుకుతూ ఉంది. నీవు నాతో స్నేహం చేస్తే నేను నీ ఒడిలో పడుకొని భయాన్ని పోగొట్టుకుంటాను" అని ఎలుక పిల్లితో చెప్పినట్టుగా తిక్కన రాశాడు. ఇలాగే మిగిలిన కథ అంతా తిక్కన క్లుప్తీకరించి చెప్పాడు.

## 8. గృధ్ర–గోమాయు సంవాదం కథ :

ఈ కథ సంస్కృత భారతంలో శాంతిపర్వంలోని ఆపద్ధర్మానుశాసన పర్వం అనే ఉపపర్వంలో 153వ అధ్యాయంలో 122 శ్లోకాల్లో ఉంది. ధర్మరాజు "తాతా! ఏ వ్యక్తి అయినా మరణించి తిరిగి జీవించినట్లు నీవు విన్నావా? లేక చూశావా? అని భీష్ముని అడిగినపుడు భీష్ముడు అతనితో పూర్వం నైమిశారణ్యంలో గద్ద, నక్కల మధ్య జరిగిన సంవాదం చెబుతాను విను అని ఈ కథను చెబుతాడు.

ఒక బ్రాహ్మణునికి లేకలేక ఒక అందమైన కుమారుడు కలిగాడు. అయితే అతడు ఇంకా యవ్వనంలోకి అడుగు పెట్టక ముందే బాల్యంలోనే మరణిస్తాడు. బాలుని తల్లిదండ్రులు బంధువులు ఆ పిల్లవాని అకాల మరణానికి ఎంతగానో దుఃఖిస్తూ మృతదేహాన్ని శ్మశానానికి తీసుకొని వెళ్ళి ముద్దులు మూటగట్టే అతణ్ణి వదిలిపెట్టి రాలేక అక్కడే ఉంటారు. వారి ఏడ్పు విని ఒక గద్ద అక్కడికి వచ్చి వారితో ఇలా అంటుంది. "మానవులారా! ఈ మృతబాలుని వదలి మీరు వెళ్ళండి. ఈ శ్మశానంలో మీరు ఎంత సేపు ఉన్నా ప్రయోజనం లేదు. మరణించినవాడు తిరిగి జీవించడు. మానవ లోకంలో జన్మించిన ప్రతి ప్రాణీ మరణించవలసిందే. సూర్యుడు అస్తమిస్తున్నాడు. కాబట్టి పిల్లవాని మీద మమకారాన్ని వదలివేసి మీ ఇళ్ళకు వెళ్ళండి".

గద్ద మాటలు విని ఆ బంధువులు నిరాశపడి శవాన్ని వదిలిపెట్టి తమ ఇళ్ళకు బయలుదేరుతారు. ఇంతలో నల్లటిరంగు గల ఒక నక్క అక్కడికి వచ్చి వారితో "బాలుని మీద మమకారాన్ని వదులుకోవద్దు. ఈ పిల్లవాడు ఏదో ఒక సుముహూర్తంలో మళ్ళీ బతకవచ్చు. ముద్దులు మూటగట్టే ఈ బాలకుని శ్మశానంలో వదిలివేసి ఎలా వెళతారు? పశువులు పక్షులు కూడా తమ పిల్లల మీద ఎంతో ప్రేమను కలిగి ఉంటాయి. కానీ మీరు

మనుషులై ఉండి వంశోద్ధార కుడైన ఈ బాలకుని వదలివేసి వెళ్తున్నారు. ఈ పసివాని కోసం చాలా సేపు కన్నీరు కార్చండి.

**"త్యక్త్వా కథం గచ్ఛ థేమం పద్మలోలాయతా క్షికమ్**
**యథా నవోద్వాహ్యకృతం స్నాన మాల్య విభూషితమ్"**
**(శాంతి. 153 – 30వ శ్లోకం)**

స్నానం చేయించి పుష్పమాలలతో అలంకృతమైన ఈ బాలుని దేహం పెళ్ళి కుమారుని శరీరం లాగా ఉంది. ఇలాంటివాణ్ణి వదిలిపెట్టి ఎలా వెళ్ళగలరు?" అని పలుకుతుంది. నక్కమాటలు విని బంధువులు ఆక్రందన చేస్తూ తిరిగి శవం దగ్గరకు వస్తారు. అప్పుడు గద్ద వారితో "క్రూరమైన నీచమైన నక్క మాటలు విని మీరు తిరిగి వెనక్కు వచ్చారా? ఈ బాలుడు చనిపోయి ఎండిపోయిన కర్ర లాగా ఉన్నాడు. ఇతని కోసం ఎందుకేడుస్తారు. బతికివున్న మిమ్మల్ని గురించి ఆలోచించుకోండి. జీవుడు పూర్వజన్మ కర్మానుసారంగా సుఖదుఃఖాలను పొందుతాడు. కాబట్టి శోకాన్ని, దైన్యాన్ని వదలివేసి ఈ పిల్లవాణ్ణి ఇక్కడ వదలి వెళ్ళండి. దుఃఖించి మీరు ఇతణ్ణి బతికించ గలరా? పోయిన వాని కోసం ఎందుకు ఏడుస్తారు. మృత్యువు అందరికీ ఒక్కటే" అని పల్కుతుంది.

గద్ద మాటలు విని నక్క ఆ బంధువులతో "అల్పబుద్ధి అయిన ఈ గద్ద పిల్లవాని మీద మీకు ఉన్న మమకారాన్ని తగ్గించివేస్తూ ఉంది. పుత్ర ప్రేమతో మీరు తగిన విధంగా దుఃఖిస్తున్నారు. మీ దుఃఖం చూస్తుంటే నాకు కన్నీళ్ళు వస్తున్నాయి. ఈ పిల్లవాడు మీ రక్తమాంసాల వల్ల ఏర్పడ్డాడు. ఇతడు మీ వంశాభివృద్ధికి కర్త. ఇలాంటి వాణ్ణి వదలిపెట్టి వెళ్ళవద్దు. సూర్యుడు అస్తమించే దాకా ఇక్కడే ఉండండి" అని చెబుతుంది. అపుడు గద్ద మానవులారా ఇంతవరకూ చనిపోయిన వారెవరూ బతకలేదు. ఎంతో మంది మనుషులు చనిపోయిన తమ బంధువులను ఇక్కడికి తెచ్చి వదలిపెట్టి వెళ్ళిపోయారు. ఇంతకుముందు ఈ శరీరంలో ఉన్న జీవుడు ఇప్పుడు లేడు. ఈ శవం కళ్ళతో చూడలేదు. చెవులతో వినలేదు. కాబట్టి ఇతణ్ణి వదిలి పెట్టి మీ ఇళ్ళకు వెళ్ళండి" అని బంధువులతో పలుకుతుంది. గద్ద మాటలు విని బంధువులు ఇంటిదారి పడతారు. అపుడు నక్క బంధువులతో "గతంలో రాముడు శంబూకుడనే శూద్రుని చంపడం వల్ల కలిగిన ధర్మ ప్రభావంతో మరణించిన బ్రాహ్మణుని కుమారుడు తిరిగి జీవించాడు. అలాగే స్వేతుడు అనే రాజు తన కుమారుడు చనిపోగా తిరిగి బతికించుకున్నాడు. అలాగే ఒక సిద్ధుడు గానీ, ముని గానీ, దేవత గానీ ఇక్కడికి వచ్చి మీ దుఃఖాన్ని విని మీ మీద దయ చూపవచ్చు" అని చెప్పేటప్పటికి బంధువు లందరూ పుత్ర వాత్సల్యంతో శోకార్తులై వెనక్కి తిరిగి వచ్చి మృత బాలకుని శిరస్సును తొడ మీద వుంచుకొని పెద్దగా ఏడుస్తుంటారు. అప్పుడు గద్ద వారితో "మీ కన్నీటితో ఈ బాలుని శరీరం తడిసిపోయింది. మొండి పట్టుదలతో మాటి మాటికి మీరు వెనక్కి తిరిగి వచ్చి దుఃఖించడం వల్ల ఏమీ ప్రయోజనం లేదు. మరణించిన వాడు జీవించడం అసంభవం.

శివుడు, కుమార స్వామి, బ్రహ్మ, విష్ణువు వీరిలో ఎవరైనా వరమిస్తే ఈ బాలుడు జీవించవచ్చు. వేల కొలది నక్కలు తమ శరీరాన్ని వదలి పెట్టినప్పటికీ ఈ బాలుని జీవింపజేయలేవు. మీరు ఎంతసేపు దుఃఖించినా చేయగలిగింది ఏమీలేదు" అని చెబుతుంది. దాని మాటలు విని బంధువులు బాలుని నేల మీద వదిలిపెట్టి దుఃఖ పరవశులై ఇళ్ళకు బయల్దేరుతారు. అప్పుడు నక్క బంధువులతో "మానవులారా! పాపి, అపవిత్ర హృదయమున్న ఈ గద్ద మాటలు మీరు ఎందుకు వింటారు. సుఖదుఃఖాలు ఒక దాని తర్వాత ఒకటి వస్తూ ఉంటాయి. నాకు చూడగా ఈ బాలుడు సజీవంగానే ఉన్నాడు. ఇతనికి నాశనం లేదు. ఈ బాలుని వల్ల మేము సుఖపడతాము అనే దృఢమైన ఆశతో ఇక్కడే ఉండండి" అని పల్కుతుంది.

ఈ విధంగా గద్ద, నక్క ఆ బంధువులకు చెబుతూ ఉంటే వారు వెళ్ళబోతూ, తిరిగి మళ్ళీ వెనక్కి వచ్చి దుఃఖిస్తూ ఉంటారు. ఆ రెండింటి మధ్య ఇలా వివాదం జరుగుతూ ఉండగా పార్వతి ప్రేరణతో పరమేశ్వరుడు వారికి ప్రతక్షమై వరం కోరుకోమంటాడు. బంధువులు మరణించిన తమ కుమారుని తిరిగి బతికించమని కోరతారు. శివుడు ఆ బాలుని బతికించి అతనికి నూరు సంవత్సరాల ఆయుస్సును ఇస్తాడు. అంతే కాకుండా నక్క, గద్దలకు ఆకలి తీరే విధంగా వరమిస్తాడు. అందరూ పరమేశ్వరునికి నమస్కరించి ఆనందంతో వెళ్ళిపోతారు అని భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథలో గద్ద, నక్క అనే అడవి ప్రాణులు కొంత మంది మనుషులు పాత్రలుగా ఉన్నారు. ఇది అచ్చమైన జానపద కథ. ఈ కథలో గద్ద, నక్క చనిపోయిన బాలుని శవాన్ని తానే తినాలన్న స్వార్థంతో తమకు తెలిసిన ధర్మపన్నాలను చెబుతూ బంధువులను ఆయోమయంలో పడవేసే ప్రయత్నం చేస్తాయి. గద్ద రాత్రి పూట సంచరించ లేదు. అందువల్ల అది సూర్యాస్తమయం కాక ముందే బంధువులను పంపించి శవాన్ని తినాలనుకుంటుంది. నక్క రాత్రి పూట కూడా సంచరించగలదు. పగలు గద్ద శవాన్ని తినడంలో తనకు పోటీగా వస్తుంది. రాత్రి అయితే గద్ద అక్కడ ఉండదు. ఈ కారణం చేత నక్క బంధువులను సూర్యాస్తమయమయ్యే వరకూ మరణించిన బాలుని దగ్గర ఉంచేటట్టుగా ప్రయత్నం చేస్తుంది. బంధువులకు తాము ఏమి చేయాలో అర్థంకాని పరిస్థితి. అందువల్ల వారు గద్ద మాటలు విని ఇంటికి వెళ్ళబోతూ, నక్క మాటలు విని తిరిగి శవం దగ్గరకు వస్తూ ఉంటారు. జానపద కథల్లో ఆత్మీయుల మృతికి హృదయ విదారకంగా మానవులు దుఃఖిస్తూ ఉన్నప్పుడు పార్వతీ పరమేశ్వరులు ఆకాశమార్గంలో వెళ్తూ ఉన్నట్లుగా, పార్వతి వారి దుఃఖాన్ని విని వారికి సహాయం చేయమని శివుని బలవంతం చేసినట్లుగా, శివుడు పార్వతి మాట కాదనలేక దుఃఖిస్తున్న వారి దగ్గరకు వచ్చి వారి కోరిక తీర్చినట్లుగా చెప్ప బడుతూ ఉంటుంది. అలాగే ఈ కథలో గూడా బాలకుని మరణంతో ఆక్రందన చేస్తున్న బంధువులకు పార్వతీ ప్రేరితుడై శివుడు ప్రత్యక్షమై బాలుని బతికించి బంధువులకు ఆనందాన్ని

కల్గించడమే కాకుండా గద్ద నక్కలకు ఆకలి తీరే విధంగా వరాన్ని ఇచ్చి అందరినీ ఆనందింపజేస్తాడు. ఈ కథలో చక్కని సంభాషణలు, మానవుల పుత్రప్రేమ, గద్ద, నక్కల స్వార్థపరత్వం చక్కగా వివరించబడ్డాయి. ఇది జానపద ప్రాణికథల ప్రభావంతో పండితకవి కల్పించిన కథ.

ఈ కథను తిక్కన శాంతిపర్వం తృతీయాశ్వాసంలోని 366వ పద్యం నుంచి 381 వ పద్యం వరకూ ఉన్న 16 పద్యగద్యాల్లో రచించాడు. తిక్కన ఈ కథలో ఎలాంటి మార్పు చేయకుండా మూలంలో ఉన్నది ఉన్నట్లుగా రచించాడు.

## 9. చిలుక కథ :

ఈ కథ సంస్కృత భారతంలో అనుశాసనపర్వంలోని దానధర్మపర్వం అనే ఉపపర్వంలో 5వ అధ్యాయంలో 32 శ్లోకాల్లో ఉంది. ఈ కథను ధర్మరాజు "స్వామిభక్తి కలిగిన దయాళువు గుణగణాలను వినాలనుకుంటున్నాను. వాటిని గురించి చెప్పమని" భీష్ముని కోరినప్పుడు భీష్ముడు ఈ కథను ఇలా చెబుతాడు.

కాశీరాజు రాజ్యంలో ఒక బోయవాడు అడవికి వేటకు వెళ్ళి విషం పూసిన బాణంతో ఒక మృగాన్ని చంపే ప్రయత్నం చేస్తాడు. ఆ బాణం గురి తప్పి ఒక చెట్టుకు గుచ్చుకుంటుంది. విషప్రభావంతో ఆ చెట్టు ఆకులు పళ్ళు రాలిపోయి ఎండిపోతుంది. ఆ చెట్టు తొర్రలో చాలా కాలం నుంచి ఒక చిలుక ఉంటుంది. ధార్మిక బుద్ధి, కృతజ్ఞత ఉన్న ఆ చిలుక చెట్టు ఎండి పోయినప్పటికీ దాన్ని వదలి వెళ్ళకుండా చెట్టు తొర్రలోనే ఉంటూ ఆహారం లేక చిక్కిపోయి చెట్టుతోపాటే ఎండిపోతూ ఉంటుంది. దాన్ని చూసి ఇంద్రుడు బ్రాహ్మణ రూపాన్ని ధరించి చిలుక వద్దకు వచ్చి ఈ చెట్టు ఎండిపోయి పక్షులకు నివాసయోగ్యంగా లేదు. ఈ అడవిలో నివాసయోగ్యమైన చెట్లు ఎన్నో ఉన్నాయి. దీన్ని వదలిపెట్టి మంచి వృక్షాన్ని ఆశ్రయించు" అని చెబుతాడు. చిలుక తన తపోశక్తితో వచ్చిన వాడు దేవేంద్రుడని గ్రహించి అతనికి స్వాగతం పలికి దీనంగా

**"అస్మి న్నహం ద్రుమే జాతః సాధుభి శ్చ గుణై ర్యుతః**
**బాలభావేన సంగుప్తః శత్రుభి శ్చ న ధర్షితః"**
**"కి మనుక్రోశ్య వైఫల్యం ఉత్పాదయసి మే నఘ**
**ఆనృశంస్యాభియుక్తస్య భక్తస్యా నన్యగస్య చ"**
**(అనుశాసన. 5 – 22, 23 శ్లోకాలు)**

"నేను ఈ చెట్టు మీదనే పుట్టి ఇక్కడే మంచి గుణాలను అలవరచుకున్నాను. ఇది నన్ను పసిబిడ్డలాగా రక్షించింది. శత్రువులు నా మీదికి రాకుండా చూసింది. కాబట్టి నేను దీని భక్తుడను, దయాగుణంతో ఉన్న నేను ఇంకొక చోటుకి వెళ్ళలేను" అని పల్కుతుంది. ఆ చిలుక సౌమ్య వచనాలకు దాని దయా గుణానికి ఆనందించిన ఇంద్రుడు వరం కోరుకోమని

చిలుకతో అంటాడు. చిలుక ఆ చెట్టు ఎప్పటి లాగా పత్ర పుష్పాలతో విరాజిల్లాలని కోరుకుంటుంది. ఇంద్రుడు చిలుక భక్తికి, శీల సంపదకు సంతోషించి, చెట్టు మీద అమృతాన్ని చిలకరిస్తాడు. వెంటనే చెట్టు పచ్చని ఆకులు, కొమ్మలు, పండ్లతో అందంగా శోభిస్తుంది. దయాగుణం కల ఆ చిలుక మరణించిన తర్వాత ఇంద్రలోకాన్ని పొందుతుంది. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఇది జానపద కథల ప్రభావంతో పండిత కవి రాసిన కథ. ఈ కథలో చిలుక ఇంద్రుడు పాత్రలుగా ఉన్నారు. ప్రాచీన గ్రంథాల్లో ధర్మ దయా గుణాలు ఉన్న వారిని ఇంద్రుడు పరీక్షించినట్లుగా కవులు రాశారు. ఉదాహరణకు శిబి చక్రవర్తి దయాగుణాన్ని ఇంద్రాగ్నులు పరీక్షించిన విషయం సువిదితమే. పక్షుల్లో పావురం, చిలుక, హంస మొదలైనవి ఉత్తమమైనవిగా, సాధు స్వభావం కల్గినవిగా జానపద కథల్లో చెప్పబడుతుంటాయి. ఈ కథలో చిలుక ఉత్తమమైనది, గొప్ప స్వామిభక్తి దయాగుణం కల్గినది. అది తాను పుట్టి పెరిగిన చెట్టు మీద గొప్ప ప్రేమాభిమానాలు భక్తి ఏర్పరచుకుంది. అందువల్లనే ఆ చెట్టు ఎండిపోయినప్పటికీ దాన్ని వదిలిపెట్టి వెళ్ళకుండా ఆ చెట్టు తొర్రలోనే ఉంటూ దానితోపాటు కృశించిపోతూ ఉంటుంది. చిలుకలోని ఈ గొప్పతనాన్ని చూసిన ఇంద్రుడు దాని స్వామి భక్తికి దయాగుణానికి ఆశ్చర్యపోయి, బ్రాహ్మణ వేషంలో వచ్చి దాన్ని పరీక్షించే ప్రయత్నం చేస్తాడు. చిలుక ఆ పరీక్షలో నెగ్గి ఇంద్రుని చేత తిరిగి ఆ చెట్టును పచ్చగా వికసించేటట్లు చేయిస్తుంది.

ఏ ఎండకు ఆ గొడుగు పట్టే స్వార్థపరులున్న నేటి కాలంలోని మనుషులకు ఈ చిలుక కథ గొప్ప నీతిని బోధిస్తూ ఉంది. చెట్టు పచ్చగా ఉన్నప్పుడు చిలుక తోపాటు ఇంకా చాలా పక్షులకు అది ఆశ్రయాన్ని ఇచ్చి ఉంటుంది. చెట్టు ఎండిపోవడంతో మిగిలిన పక్షులన్నీ పచ్చగా ఉన్న ఇతర చెట్లను ఆశ్రయించాయి. కృతజ్ఞతా గుణం, దయాగుణం పుష్కలంగా ఉన్న ఈ చిలుక మిగిలిన పక్షుల లాగా చెట్టును వదలి వెళ్ళకుండా దానితోపాటు ఉండిపోయింది. చిలుకలాగే కృతజ్ఞత, మానవత్వం, దయాగుణం మొదలైనవి నేటి మానవులు అలవరచుకోవాలని ఈ కథ తెలుపుతుంది.

తిక్కన ఈ కథను అనువదించకుండా వదలివేశాడు.

ఈ ప్రకరణంలో చెప్పబడిన హంస–కాకి కథ, గృధ్ర–గోమాయు సంవాదం కథ అనేవి రెండు అచ్చమైన జానపద కథలు. మిగిలిన ఏడు కథలు జానపద ప్రాణికథల ప్రభావంతో పండిత కవులు కల్పించినవి. వీటిలో జానపద ప్రాణి కథాంశాలు ఉన్నాయి. అందువల్ల ఈ కథలన్నీ జానపద కథాంశ కథలు.

# 4. మహాభారతంలో నీతి కథాంశ కథలు

ప్రాణి కథలలాగా నీతి కథలు కూడా సరళంగా సంక్షిప్తంగా ఉంటాయి. ప్రాణి కథలే తర్వాత కాలంలో నీతి కథలుగా పరిణామం చెంది వుంటాయని కొందరు జానపద విద్వాంసుల అభిప్రాయం. ప్రాణి కథల్లో నీతి ఉండవచ్చు. కానీ అది ప్రధానం కాదు. కానీ నీతి కథల్లో నీతి ప్రధానమైనది. నీతి కథ చివర కథా సారాంశాన్ని ఒక చిన్న నీతి వాక్యం రూపంలో చెప్పడం జరుగుతుంది. ఈ వాక్యం తర్వాత కాలంలో మొదట సుభాషితంగా తర్వాత కొంత కాలానికి సామెతగా పరిణమిస్తుంది.

జానపదులు నీతికి నిలబడతారు. వారు చదువు లేనివారు కావచ్చు. కానీ నీతి లేనివారు కాదు. జానపద సమాజం మత, నీతి నేపథ్యంలో నిర్మితమవుతుంది. జానపద సమాజం అవినీతిని, అవినీతిపరులను సహించదు. అలాంటి వారిని వెలివేసి తగిన విధంగా శిక్షిస్తుంది. సమాజం నీతివంతంగా ఉన్నప్పుడే అది బలంగా ఆరోగ్యంగా ఉంటుంది. అందువల్లనే కవులు, కళాకారులు తమ కళల ద్వారా నీతిని బోధించేవారు. సుమతీ శతకకర్త

**"లావు గలవానికంటెను**
**భావింపగ నీతిపరుడు బలవంతుడౌ**
**గ్రావంబంత గజంబును**
**మావటి వాడెక్కినట్లు మహిలో సుమతీ"**

అని శారీరకమైన బలం బలం కాదని నీతిని కలిగి ఉండడమే నిజమైన బలమని చెప్పాడు. వేమన మొదలైన కవులు తమ పద్యాల్లో అనేక నీతులను సుభాషితాలను చెప్పారు. సమాజానికి నీతి చాలా అవసరమన్న విషయాన్ని గుర్తించిన జానపద కవులు అనేక రకాల నీతులను వివరించే కథలను కల్పించి లోకం మీద వదలివేశారు. వాటిని జానపదులు చెప్పుకుంటూ నీతులను ప్రచారం చేస్తున్నారు. ఇలాంటి వాటిలో కొన్నింటిని శిష్ట కవులు తమ గ్రంథాల్లో చేర్చుకున్నారు. సంస్కృత భారతంలో కూడా కొన్ని నీతికథలు కాలాంతరంలో చొప్పింప బడ్డాయి. సంస్కృత భారతంలో ఎనిమిది నీతి కథలున్నాయి. వీటిలో ఒకటి ద్రోణ పర్వంలో ఉంది. మిగిలిన ఏడు శాంతి పర్వంలో ఉన్నాయి. వాటి పేర్లు ఇవి. 1. సువర్ణష్ఠీవి కథ 2. సరిత్సాగర సంవాదం కథ 3. ఋషి–శ్వానం కథ 4.మూడు చేపల కథ 5. పూజని – బ్రహ్మదత్త సంవాదం కథ 6. కపోత–లుబ్ధక కథ 7. పవన – శాల్మలీ సంవాదం కథ 8. కృతఘ్నుని కథ. వీటిలో ఋషి–శ్వానం కథ అచ్చమైన జానపద కథ. మిగిలిన ఏడు జానపద నీతి కథల ప్రభావంతో పండిత కవులు కల్పించినవి.

## 1. సువర్ణష్ఠీవి కథ :

సంస్కృత భారతంలో ఈ కథ ద్రోణపర్వంలో అభిమన్యు వధ పర్వం అనే ఉపపర్వంలో 55వ అధ్యాయంలో 18వ శ్లోకం నుంచి 50వ శ్లోకం వరకూ 33 శ్లోకాల్లో ఉంది. ఈ కథను వ్యాసుడు ధర్మరాజుకు చెబుతాడు. పద్మ వ్యూహంలో అభిమన్యుడు

మరణించినందుకు ధర్మరాజు పుత్రశోకంతో దుఃఖిస్తూ ఉన్నప్పుడు అతణ్ణి ఓదారుస్తూ ఈ సువర్ణష్ఠీవి కథను ఇలా చెబుతాడు.

సృంజయుడు అనే పేరు గల రాజు పుత్ర సంతానం కోరి సద్బ్రాహ్మణులకు అనేక దానధర్మాలను చేస్తాడు. ఒకసారి నారద మహర్షి సృంజయుని దగ్గరకు వచ్చినప్పుడు బ్రాహ్మణు లందరూ సృంజయరాజుకు పుత్రుని ప్రసాదించ వలసిందిగా నారదుణ్ణి కోరతారు. దానికి నారదుడు ఎలాంటి కుమారుడు కావాలో కోరుకోమని సృంజయునితో అంటాడు. సృంజయుడు నారదునికి నమస్కరించి

**"యశస్వినం కీర్తిమంతం తేజస్వినమరిందమమ్**
**యస్యమూత్రం పురీషం చ క్లేదః స్వేదశ్చ కాంచనమ్"**
**(ద్రోణ. 55 – 23వ శ్లోకం)**

"యశస్వి తేజస్వి, శత్రునాశకుడు, ఉత్తమ గుణాలు కలవాడు అయిన కొడుకు కావాలి. ఆ కుమారుని మల మూత్రాలు, ఉమ్మి, చెమట ఇంకా అతని శరీరం నుంచి వచ్చేవన్నీ బంగారం కావాలి" అని కోరతాడు. అతడు కోరుకున్నట్లుగానే జరుగు తుందని నారదుడు చెబుతాడు. ఆ తర్వాత కొద్దిరోజులకు ఆ రాజుకు ఒక కొడుకు పుడతాడు. ఆ బాలుడు విసర్జించే మల మూత్రాలు, ఏడ్చేటప్పుడు అతని కన్నుల నుంచి కారే కన్నీరు, ఉమ్మి, చెమట మొదలైనదంతా బంగారంగా మారుతూ ఉంటుంది. అందువల్లనే ఆ బాలునికి సురవష్ఠీవి అనే పేరు ఏర్పడింది. ఇలా బాలుడు విసర్జించేదంతా బంగారం కావడంచేత సృంజయరాజు సంపద అమితంగా పెరుగుతుంది. రాజు తన భవనాలను, ప్రాకారాలను, కోటలను, బ్రాహ్మణ గృహాలను ఇంకా అతనికి అవసరమైన మంచాలు, కుర్చీలు, వాహనాలు, బిందెలు, చెంబులు, పాత్రలు మొదలైన అన్ని వస్తువులను బంగారంతో తయారు చేయిస్తాడు. రోజు రోజుకు అతని సంపద ఇంకా పెరుగుతూ ఉంటుంది. కొందరు దోపిడీ దొంగలు రాజు వైభవానికి ధన సంపదకు కన్ను కుట్టి అతని సంపదకు కారకుడైన సువర్ణష్ఠీవిని అపహరించాలనుకొని రాజ భవనంలోకి ప్రవేశించి సువర్ణష్ఠీవిని బలవంతంగా ఎత్తుకొని ఒక అడవిలోకి తీసుకొనిపోయి అతణ్ణి చంపి బంగారం కోసం అతని కడుపు చీలుస్తారు. కానీ అందులో బంగారం కనిపించదు. మూర్ఖులైన దొంగలు పరస్పరం ఒకరి మీద ఒకరు నిందారోపణలు చేసుకొని కొట్టుకొని చనిపోతారు. తన ధన సంపదకు మూల కారకుడైన తన కుమారుడు చనిపోయినందుకు సృంజయరాజు ఎంతగానో దుఃఖిస్తాడు. అతని దుఃఖాన్ని విని నారదుడు వచ్చి షోడశరాజుల చరిత్రలను చెప్పి అంతటి గొప్పరాజులే మరణించారని, పుట్టిన మనిషి మరణించక తప్పదని అందువల్ల కుమారుని కోసం దుఃఖించవద్దని సృంజయునితో చెబుతాడు. నారదుని మాటలను విని సృంజయుడు పుత్ర శోకం నుంచి కొంతవరకు తేరుకుంటాడు. అపుడు నారదుడు సువర్ణష్ఠీవిని తిరిగి బతికిస్తాడు. రాజు పరమానంద భరితుడవుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఇది జానపద నీతి కథల ప్రభావంతో పండిత కవి కల్పించినది. ఈ కథ బాతు – బంగారు గుడ్డు కథను పోలి ఉంది. బాతు–బంగారు గుడ్డు కథలో ప్రతిరోజూ ఒక బంగారు గుడ్డును పెడుతున్న బాతును దొంగలు దొంగిలించి, దాని కడుపులో చాలా బంగారం ఉంటుందని భావించి దాని కడుపు కోసి చూస్తారు. అయితే కడుపులో కొంచెం కూడా బంగారముండదు. ఈ సువర్ణష్ఠీవి కథలో కూడా దొంగలు సువర్ణష్ఠీవిని ఎత్తుకొనిపోయి బంగారం కోసం అతని కడుపు చీల్చి చూస్తారు. మానవులు దురాశాపరులు. అలాగే సృంజయరాజు కూడా దురాశతోనే తన కొడుకు విసర్జించే మల మూత్రాదులన్నీ బంగారం కావాలని కోరుకున్నాడు. తత్కారణంగా అతడు గొప్ప ధనవంతుడవుతాడు. మానవుల్లో అసూయాపరులు కూడా ఎక్కువ మందే ఉంటారు. ఎలాంటి కష్టం లేకుండా రాజుకు బంగారం వస్తున్నందుకు అసూయపడిన దోపిడిదొంగలు రాజకుమారుని ఎత్తుకొని వచ్చి చంపివేస్తారు. అలాంటి కుత్రవానికి ఎప్పటికైనా తోటి మానవుల చేత ప్రమాదముంటుంది. అందువల్ల తండ్రి అయినవాడు అలాంటి పుత్రుడు కావాలని కోరుకో కూడదు. దురాశతో అలాంటి పుత్రుడు కావాలని కోరుకుంటే అతడు ఆ పుత్రుని కోల్పోక తప్పదు. పుత్రశోకాన్ని అనుభవించక తప్పదు. ప్రాణికథల్లో ఒంటె దేవుని గురించి తపస్సు చేసి తన మెడ చాలా పొడవు పెరగాలని కోరుకొని తన మరణాన్ని తానే తెచ్చుకుంటుంది. ఈ కథలో సృంజయుడు లేకలేక కలిగిన తన కుమారుడు విసర్జించేవన్నీ బంగారం కావాలను కోరుకొని అతని మరణానికి కారకుడయ్యాడు. అందువల్ల ఇలాంటి వరాన్ని ఎవ్వరూ కోరుకో కూడదని అలా కోరుకుంటే మొదటికే మోసానికి వచ్చి పుత్రుణ్ణి కోల్పోవలసి వస్తుందనే నీతిని ఈ కథ తెలియజేస్తూ ఉంది. అయితే ఈ కథ చివర నారదుడు సువర్ణష్ఠీవిని బతికించినట్లుగా ఉంది. ఇలా బతికించడం హేతుబద్ధమైనది కాదు. ఈ కథలో నారుదుడు పుత్ర శోకంతో వశం తప్పి ఉన్న సృంజయుని ఓదారుస్తూ గతంలో భూమండలం మొత్తాన్ని ఏకచ్ఛత్రాదిపత్యంతో పరిపాలించిన షోడశ రాజులు చనిపోయారని చెప్పి అతణ్ణి ఓదార్చి, ఆ తర్వాత అతని కుమారుడైన సువర్ణష్ఠీవిని బతికించినట్లుగా చెప్పడం ఔచిత్యంగా లేదు.నారదుడు సువర్ణష్ఠీవిని బతికించ దలచుకుంటే సృంజయుని ఓదార్చడానికి షోడశ రాజుల కథలను చెప్పనవసరం లేదు. అందువల్ల ఈ కథ ముగింపు ఉచితంగా లేదని చెప్పవచ్చు.

తిక్కన తన భారతంలో ఈ కథను ద్రోణపర్వం ద్వితీయాశ్వాసంలోని 188వ పద్యం నుంచి 195వ పద్యం వరకూ 8 పద్య గద్యాల్లో క్లుప్తంగా రాశాడు. తిక్కన ఈ కథలో ఎలాంటి మార్పులు చేయకుండా క్లుప్తీకరించి రాశాడు.

## 2 . సరిత్సాగర సంవాదం కథ :

ఈ కథ శాంతిపర్వంలోని రాజధర్మానుశాసన పర్వం అనే ఉపపర్వంలో 113వ అధ్యాయంలో 14 శ్లోకాల్లో ఉంది. దీన్ని యుధిష్ఠిరునికి భీష్ముడు చెబుతాడు. "రాజు దుర్లభమైన రాజ్యాన్ని పొంది సైన్యం కోశాగారం మొదలైనవి లేకుండా బలవంతుడైన శత్రువు ముందు ఎలా నిలబడతాడు" అని ధర్మరాజు భీష్ముని అడిగి నపుడు భీష్ముడు "ఈ విషయానికి సంబంధించి సముద్రునికి, నదులకు మధ్య జరిగిన సంభాషణాత్మకమైన ఇతిహాసాన్ని ఆర్యులు ఉదాహరిస్తూ ఉంటారు. దాన్ని చెబుతాను విను" అని ఈ కథను ఇలా చెబుతాడు.

నదులకు భర్త అయిన సముద్రుడు ఒకసారి తనకు కలిగిన సందేహాన్ని నదులన్నింటితో ఇలా అడుగుతాడు. "నిండైన ప్రవాహంతో పరవళ్ళు తొక్కుతూ ప్రవహించే మీరు పెద్ద పెద్ద చెట్లను వేళ్ళతో సహా పెకలించి వేస్తారు. కానీ మీరు పెకలించిన వాటిలో ప్రబ్బలిచెట్టు లేదు. ఈ చెట్టు పెద్ద శరీరం కలది కాదు. అది మీ ఒడ్డునే పెరుగుతుంది. అయినప్పటికీ దాన్ని మీరు పెకలించడం లేదా లేక అది మీకు ఏమైనా ఉపకారం చేసిందా చెప్పండి". అప్పుడు గంగానది ఇలా సమాధానం చెబుతుంది.

**"తిష్ఠన్త్యేతే యథాస్థానం నగా హ్యేకనికేతనాః**
**తే త్యజన్తి తతః స్థానం ప్రాతిలోమ్యా న్న వేతసః"**
**"వేతసో వేగ మాయాతం దృష్ట్వా నమతి నాపరే**
**సరి ద్వేగే భ్యతిక్రాన్తే స్థాన మాసాద్య తిష్ఠతి"**
**(శాంతి. 113 – 8,9 శ్లోకాలు)**

"పెద్ద చెట్లు ఒకే చోట పాతుకునిపోయి నిటారుగా ఉండి మా ప్రవాహానికి తల వంచకుండా ఉంటాయి. ఈ వ్యతిరేకత కారణంగానే వాటిని మేము పెల్లగిస్తున్నాము. ప్రబ్బలి చెట్టు అలా కాదు. మా వేగాన్ని చూసి అది వంగుతుంది. నది వేగం గడచిపోయిన తర్వాత ప్రబ్బలి చెట్టు తన స్థానాన్ని పదిలపరచుకొని నిలబడుతుంది". అది కాల మహిమను, పరిస్థితులను గుర్తించినది. ఎల్లప్పుడు మా అధీనంలో ఉంటూ మాకు అనుకూలంగా ఉంటుంది. ఎప్పుడూ గర్వించదు. గాలి వేగానికి నీటి వేగానికి వంగుతూ పైకి లేస్తూ వుండే చిన్న వృక్షాలు, పొదలు పరాభవాన్ని పొందవు. అందువల్లనే మేము వాటిని పెల్లగించడం లేదు".

భీష్ముడు ధర్మరాజుకు ఈ కథను చెప్పి శత్రువు బలవంతుడుగా ఉన్నప్పుడు అతని బలాన్ని గుర్తించకుండా అతనితో తలపడే రాజు వెంటనే నశించిపోతాడు. వివేకవంతుడైన రాజు శత్రువును అతి బలంవంతుడుగా భావించినపుడు అతనికి తలవంచాలి అని చెబుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథ పండిత కవి కల్పించినది. ఇది రాజనీతికి సంభంధించినది. పూర్వకాలంలో రాజ్యం కోసం రాజుల మధ్య తరచుగా యుద్ధాలు జరుగుతూ ఉండేవి. బలవంతుడైన

రాజు చక్రవర్తి కావాలనే ఉద్దేశ్యంతో దండయాత్రకు వెళ్ళేవాడు. కొంత మంది రాజులు తలవంచడం ఇష్టం లేక విజయమో వీరస్వర్గమో తేల్చుకుందామని అతనితో యుద్ధానికి దిగి చనిపోయేవారు. అయితే రాజనీతిజ్ఞులైన రాజులు, శత్రువు బలవంతుడుగా ఉన్నప్పుడు అతనితో తలపడకుండా, అతనికి లొంగిపోయి కప్పం కట్టి సామంత రాజుగా ఉంటారు. శత్రువు బలవంతుడని తెలిసినప్పుడు అనవసరంగా యుద్ధం చేసి తనతోపాటు, తన వారిని, సైన్యాన్ని నాశనం చేసుకోవడం బుద్ధిమంతుల లక్షణం కాదు. యుద్ధం చేసినా తాను ఎలాగూ జయించ లేడు. కాబట్టి ప్రస్తుతానికి తగినట్లుగా సంధి చేసుకోవడమే మంచిది. అంతేగాకుండా అనవసరమైన హింసను నివారించిన వాడవుతాడు. చెట్లలో ప్రబ్బలిచెట్టు చిన్నది. గాలికి, ప్రవాహానికి అనుగుణంగా వంగి అవి వెళ్ళిపోయిన తర్వాత మళ్ళీ నిలబడుతుంది. కానీ పెద్ద వృక్షాలు ప్రవాహానికి, గాలికి వంగవు. ఆకారణం చేత అవి పెద్దగాలికి పెద్ద ప్రవాహానికి కూకటి వేళ్ళతో పెళ్ళగింపబడుతూ ఉంటాయి. చెట్లు ప్రాణవంతమైనవి అయినప్పటికీ మనుషుల లాగా ఆలోచించేశక్తి, తదనుగుణంగా ప్రవర్తించేశక్తి వాటికి లేదు. సమయాను కూలంగా ప్రవర్తించలేవు. కానీ మనుషులు అలా కాదు. మనుషులకు ఆలోచనా శక్తి, వివేచనాపటిమ మొదలైనవి ఉన్నాయి. అందువల్ల రాజు గానీ మరొకరు గానీ శత్రువు బలవంతుడుగా ఉన్నప్పుడు అతనితో పోరాడకుండా సంధి చేసుకోవడమే శ్రేయస్కరం అనే నీతిని ఈ కథ తెలుపుతూ ఉంది.

ఈ కథను తిక్కన శాంతిపర్వం తృతీయాశ్వాసంలోని 86వ పద్యం నుంచి 90వ పద్యం వరకూ 5 పద్య గద్యంలో చాలా క్లుప్తంగా రచించాడు.

## 3. ఋషి – శ్వానం కథ :

శ్వానం అంటే కుక్క. ఈ కథ ఋషికి, కుక్కకు సంబంధించినది. ఈ కథ సంస్కృత భారతం శాంతిపర్వంలో రాజ ధర్మానుశాసన పర్వం అనే ఉపపర్వంలో 115,116,117 అధ్యాయాల్లో 70 శ్లోకాల్లో ఉంది. “కులీనులైన సహాయకులు లేనప్పుడు రాజు నీచకులజులను సహాయకులుగా చేసుకోవచ్చునా?” అని ధర్మరాజు భీష్ముని ప్రశ్నించినపుడు భీష్ముడు ఈ కథను చెబుతాడు.

ఒక అడవిలో పళ్ళను ఆహారంగా తీసుకుంటూ తపస్సు చేసుకుంటున్న ఒక ఋషి ఉంటాడు. అడవిలోని సింహాలు, ఏనుగులు, పెద్దపులులు మొదలైన అన్ని రకాల జంతువులు సాధుజంతువుల లాగా అతని వద్దకు వచ్చి శిష్యుల మాదిరిగా తలవంచి కూర్చొని వెళ్ళిపోతూ ఉంటాయి. ఒక కుక్క మాత్రం ఎల్లప్పుడూ అతని దగ్గరే ఉంటూ పండ్లను, నీళ్ళను ఆహారంగా తీసుకుంటూ ఉపవాసాలు చేస్తూ అతని లాగానే ఉండేది. అంతేకాకుండా అది ఎల్లప్పుడూ ముని పాదాల దగ్గరే ఉంటూ ముని పట్ల స్నేహభావాన్ని ప్రకటించేది. ఇలా ఉండగా ఒకరోజు ఒక చిరుతపులి కుక్కను చంపడానికి వస్తుంది. అపుడు కుక్క మునిని శరణు కోరి చిరుతపులి వల్ల భయం లేకుండా ఉండేలా చేయమని

కోరుతుంది. అప్పుడు ముని కుక్కను చిరుతపులిగా మార్చివేసి ఇకనుంచి నీవు చిరుతపులికి భయపడ నక్కరలేదు అని చెబుతాడు. చిరుతపులిగా మారిన కుక్క అడవిలో నిర్భయంగా తిరుగుతూ ఉంటుంది. తర్వాత ఒకరోజు ఒక పెద్దపులి దాన్ని చంపడానికి వెంట పడుతుంది. అది మళ్ళీ ఋషిని ప్రాణరక్షణ కోసం శరణు కోరుతుంది. ఋషి దాని మీద ఉన్న ప్రేమతో దాన్ని పెద్దపులిగా మార్చివేస్తాడు. అప్పటి నుంచి అది పళ్ళు తినటం మానివేసి అడవిలోని జంతువులకు చంపి తింటూ ముని కుటీరం దగ్గర నిద్రిస్తూ ఉంటుంది. ఒక రోజున కొండ వంటి మదపుటేనుగు పులి మీదికి వస్తుంది. పులిభయంతో ముని వద్దకు వస్తుంది. ముని వెంటనే దాన్ని మదపుటేనుగుగా మార్చివేస్తాడు. కొన్ని రోజుల తర్వాత ఒక సింహం అక్కడికి వస్తుంది. సింహాన్ని చూసి ఏనుగు వణికిపోతూ ఋషిని శరణు కోరుతుంది. ఋషి వెంటనే దాన్ని సింహంగా మార్చి వేస్తాడు. అప్పటి నుండి అది అడవిలో స్వేచ్ఛగా నిర్భయంగా తిరుగుతూ ముని ఆశ్రమం దగ్గర ఉంటుంది. దాన్ని చూసి భయపడి ఇతర మృగాలు ఋషి దగ్గరకు రావడం మానివేస్తాయి. ఒకసారి ఈ సింహాన్ని చంపడానికి శరభం వస్తుంది. వెంటనే సింహం ఋషిని శరణు కోరుతుంది. ఋషి దాన్ని శరభంగా మార్చివేస్తాడు. అప్పటి నుంచి అది అడవిలోని జంతువులను స్వేచ్ఛగా చంపుతూ వాటి మాంసాన్ని తింటూ బలిష్టంగా తయారవుతుంది. ఆ తర్వాత శరభం ఇలా ఆలోచిస్తుంది. "ఋషి మహిమ వల్ల నేను శరభంగా మారిపోయాను, నాలాగే మిగిలిన ఇతర జంతువులను కూడా ఋషి శరభాలుగా మార్చివేయవచ్చు. అపుడు అవి నాకు పోటీగా వస్తాయి. అందువల్ల అలా జరగకుండా ఉండాలంటే ఋషిని చంపివేయాలి" ఋషి దాని ఆలోచనను తన తపశ్శక్తి ద్వారా తెలుసుకొని నీచజాతికి చెందిన కుక్కవైన నిన్ను అంచెలంచెలుగా శరభంగా మార్చివేశాను. నా మీద ఎలాంటి కృతజ్ఞతా లేకుండా ఏ పాపం ఎరగని నన్ను చంపాలనుకుంటున్నావు కాబట్టి నువ్వు మొదట ఏ జాతికి చెందావో ఆ కుక్కవే అవుతావు" అని దాన్ని నిందించి కుక్కగా మార్చివేయడమే కాకుండా దాన్ని తన ఆశ్రమం నుంచి వెళ్ళగొడతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

భీష్ముడు ఈకథను ధర్మరాజుకు చెప్పి ఉన్నత వంశానికి చెందిన వారిని మాత్రమే రాజు మంత్రి మొదలైన ముఖ్యమైన పదవుల్లో నియమించుకోవాలి అని చెబుతాడు. ఇది అచ్చమైన జానపద కథ. లోకంలో ప్రచారంలో ఉన్న ఈ జానపద కథను పండిత కవి స్వీకరించి, అవసరమైన వర్ణనలను చక్కటి సంభాషణలను కల్పించి భారతంలో చొప్పించాడు. కుక్క వెంట బడిన చిరుతపులి, పెద్దపులి, ఏనుగు, సింహం, శరభం – ఈ జంతువు లన్నింటినీ సంస్కృత భారతంలో కవి నైసర్గికమైన సహజోక్తిలో చక్కగా వర్ణించాడు. ఉదాహరణకు కుక్క వెంటపడిన చిరుతపులిని రెండు శ్లోకాల్లో ఇలా వర్ణించాడు.

**"తతో భ్యయా న్మహావీర్యో ద్వీపీ క్షతజభోజనః**
**స్వార్థమత్యంత సంతుష్ట ః క్రూరకాల ఇవాంతక ః**

**"లేలిహ్యమాన స్సృషితః పుచ్ఛా స్ఫోటన తత్పర ః**
**వ్యాదితాస్యః క్షుధాభుగ్నః ప్రార్థయాన స్తదామిషమ్"**
**(శాంతి. 116 – 11,1 2 శ్లోకాలు)**

"ఒకరోజు గొప్ప పరాక్రమశాలి, మాంసాహారి అయిన చిరుతపులి గొప్ప సంతోషంతో కుక్కను పట్టుకోవడానికి క్రూరుడైన యముని లాగా వస్తుంది. ఆ చిరుతపులి కుక్కను చూసి నాలుకతో పెదవుల చివరలను మాటి మాటికీ నాకుతూ తోక నేలకేసి కొడుతూ వుంది. నోరు పెద్దగా తెరుచుకొని ఆకలితో అలమటిస్తూ కుక్క మాంసాన్ని కోరుకుంటూ వుంది".

ఇదే విధంగా మిగిలిన సందర్భాలలో కూడా ఆయా జంతువుల వర్ణనలు, ఆ సందర్భంగా ఋషి, కుక్కను మధ్య జరిగిన సంభాషణలు రమణీయంగా వర్ణించ బడ్డాయి.

ఈ కథలో తనకు ఎంతో ఉపకారం చేసిన ఋషిని కుక్క చంపాలను కోవడం కృతఘ్నతగా చెప్పాలి. ఉపకారికి ఉపకారం చేయకపోయినా ఫర్వాలేదు. కానీ అపకారం చేయాలను కోవడం చాలా దుర్మార్గం. అందువల్లనే మనుషులు ఎవరికైనా ఉపకారం చేసేముందు ఆ వ్యక్తి అందుకు అర్హుడా? కాదా? అనే విషయం తెలుసుకోవాలి. తెలుసుకోకుండా దుర్మార్గులను, కృతఘ్నులను అందల మెక్కిస్తే వారు సమాజానికే కాకుండా ఉపకారం చేసిన వారికి కూడా ప్రమాదకారులుగా తయారవుతారనే నీతిని ఈ కథ తెలుపుతూ వుంది. జాతిపరంగా చూస్తే కుక్క మంచి విశ్వాసపాత్రమైంది. యజమానికోసం అది ప్రాణమివ్వడానికైనా ప్రాణం తీయడానికైనా వెనుకాడదు. ఈ కథలో కుక్క కుక్కగా ఉన్నప్పుడు ఋషి పట్ల విశ్వాసంగానే వుంది. కానీ అది చిరుతపులిగా, పులిగా, ఏనుగుగా, సింహంగా, శరభంగా మారినప్పుడు దాని ప్రవర్తన, ఆలోచనలు, ఆహార విధానం మొదలైనవన్నీ ఆయా జంతువులకు తగినట్లుగా క్రూరంగానే ఉన్నాయి. కాబట్టి ఒక జాతిలో పుట్టిన ప్రాణిని మరొక జాతిప్రాణిగా మార్చగూడదనే నీతిని గూడా ఈ కథ తెలుపుతూ వుంది.

తిక్కన ఈ కథను శాంతిపర్వం తృతీయాశ్వాసంలోని 91వ వచనం నుంచి 96వ పద్యం వరకు ఉన్న 5 పద్య గద్యాల్లో చాలా క్లుప్తంగా చెప్పాడు. ఋషి కుక్కను చిరుతపులిగా మార్చిన తర్వాత చిరుతపులి దశ నుండి శరభంగా మారడం, శరభం ఋషిని చంపాలనుకోవడం వరకూ ఉన్న కథను ఒకేఒక సీసపద్యంలో ఇలా చెప్పాడు.

**"అట్లు బెబ్బులి వచ్చి యదరిన బెబ్బులిగా**
**జేసి గెలిపించె గరుణ మెఱయ**
**నొక మత్తకరి జూచి యోటమై నొదిగిన నుద్ధత**
**కరి జేసి యొసగె జయము**
**సింహంబు దెస భీతిజెడి పాఱుతెంచిన**
**ఘనసింహముగ జేసి గర్వమిచ్చె**

**శరభంబు ధాటికి జకితమైన నుదగ్ర**
**శరభంబు జేసి యుత్సాహి జేసె**
**నిట్లు దివసక్రమంబున నెక్కుడైన!**
**సత్వముగ జేయగా గుక్క శరభభావ**
**మండితంబయి తిరుగుచునుండి పూర్వ**
**వాసనా నీచమగు మనో వర్తనమున"**
**(శాంతి-3-93)**

ఈ పద్యానికి సంబంధించిన కథ మూలంలో 24 శోకాల్లో వివరంగా ఉంది. దీన్నిబట్టి తిక్కన ఈ కథను ఎంత క్లుప్తంగా చెప్పాడో అర్థమవుతుంది.

## 4. మూడు చేపల కథ:

సంస్కృత భారతంలో ఈ కథ శాంతిపర్వంలోని ఆపద్ధర్మ పర్వం అనే ఉప పర్వంలో 137వ అధ్యాయంలో 24 శోకాల్లో ఉంది. ఈ కథను భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. ఈ కథకు సంబంధించి ఒక ప్రత్యేకత ఉంది. మిగిలిన కథలను ధర్మరాజు భీష్ముని ప్రశ్న అడగడం, దానికి సమాధానంగా భీష్ముడు కథను చెప్పడం జరుగుతుంది. అయితే ఈ కథను భీష్ముడు ధర్మరాజు తనను ప్రశ్నించకుండానే తనంతతానుగా చెబుతాడు. ఈ కథ చెప్పడానికి ముందు భీష్ముడు

**"అనాగతవిధాతా చ ప్రత్యుత్పన్న మతి శ్చ యః**
**ద్వావేవ సుఖ మేదేతే దీర్ఘసూత్రీ వినశ్యతి"**
**(శాంతి. 137 – 1వ శ్లోకం)**

"అనాగతవిధాత, ప్రత్యుత్పన్నమతి అనే ఇద్దరు సుఖాన్ని పొందుతారు. దీర్ఘసూత్రి నశించి పోతాడు". దీనికి ఉదాహరణగా ఒక చక్కని కథ చెబుతాను విను అని భీష్ముడు ఈ మూడు చేపల కథను ఇలా చెబుతాడు.

ఎక్కువ లోతు లేకుండా చాలా చేపలు ఉన్న ఒక చెరువులో మూడు చేపలు స్నేహంగా జీవిస్తుంటాయి. వాటిలో ఒకటి చాలా ముందు చూపు కలది. రెండవది సమయానికి తగిన పనిచేసే తెలివితేటలు కలది. మూడవది ప్రతి పనికీ అనవసరంగా ఆలస్యం చేస్తూ ఏ నిర్ణయానికి రాలేనిది. ఇలా ఉండగా ఒకరోజు మత్స్యకారులు చెరువులో ఉన్న నీటిని తోడుతూ ఉంటారు. చెరువులో నీరు తగ్గిపోతుండడం గమనించిన దీర్ఘదర్శి అయిన మొదటి చేప తన ఇద్దరు మిత్రులతో ఇలా అంటుంది.

**"ఇయ మాపత్సముత్పన్నా సర్వేషాం సలిలౌకసాం**
**శీఘ్రు మన్యత్ర గచ్ఛామః పన్థా యావ న్న దుష్యతి"**
**"అనాగత మనర్థం హి సునయై ర్యః ప్రబాధయేత్**
**స న సంశయ మాప్నోతి రోచతాం భో వ్రజామహే"**
**(శాంతి. 137 – 7,8 శ్లోకాలు)**

"ఈ చెరువులో నివసించే అన్ని ప్రాణులకు ఆపద వచ్చింది. తప్పించుకునే దారి చెడిపోక ముందే మనం ఇక్కడి నుంచి మరొక చోటుకి వెళదాం. రాబోయే కీడును ముందుగానే పసిగట్టి ఉపాయంతో తొలగించుకునే వానికి ప్రాణ భయం ఉండదు కాబట్టి మనం మరొక చెరువుకు పోదాము" దాని మాటలను విని దీర్ఘసూత్రం" నీవు చెప్పించి బాగానే ఉంది. కానీ మనం అంత తొందరపడ వలసిన అవసరంలేదని నా దృఢ నిశ్చయం" అని అంటుంది. ఆ తర్వాత దీర్ఘదర్శితో ప్రాప్తకాలజ్ఞం "సమయం వచ్చినప్పుడు నా బుద్ధికి తగిన యుక్తి తోస్తుంది" అని పలుకుతుంది. ఈ మాటలను విని దీర్ఘదర్శి ఒక సన్నని నీటి దారిలో ఒక పెద్ద మడుగులోకి చేరుకుంటుంది. ఆ తర్వాత చెరువులో నీరు తగ్గిపోవడంతో జాలరులు అనేక విధాలుగా అందులోని చేపలను పట్టుకుంటారు. వాటిలో మిగిలిన చేపల తోపాటు దీర్ఘసూత్రం కూడా ఉంటుంది. ప్రాప్తకాలజ్ఞం వలతాడును నోటితో పట్టుకొని వలలో చిక్కినట్లుగా కనిపిస్తుంది. తర్వాత జాలరులు పక్కన ఉన్న పెద్ద చెరువులో చేపలు ఉన్న వలను ముంచి కడుగుతున్నప్పుడు ప్రాప్తకాలజ్ఞం తాడును వదలి నీటిలోకి జారుకుంటుంది. తెలివిలేని దీర్ఘసూత్రం జాలరులకు చిక్కి చచ్చిపోతుంది. ఈ విధంగా ప్రాణం మీదికి వచ్చిన ఆపదను తెలుసుకోలేని మూర్ఖుడు దీర్ఘసూత్రం లాగా అప్పటికప్పుడే నశిస్తాడు. నేను తెలివి గలవాడిని, అవసరం వచ్చినపుడు ఆలోచించుకోవచ్చులే అని నిర్లక్ష్యంగా ఉండేవాడు ప్రాప్తకాలజ్ఞుని లాగా ప్రాణసంకటంలో చిక్కుకుంటాడు. రాబోయే ఆపదను ముందే ఊహించి జాగ్రత్తపడే వాడు సుఖంగా ఉంటాడు అని భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథ ప్రాథమిక స్థాయి తరగతుల తెలుగు పాఠ్యాంశంలో గతంలో ఉండేది. అయితే ఈ కథ భారతంలో ఉందనే విషయం చాలామందికి తెలియదు. ఇది జానపద నీతి కథల ప్రభావంతో పండిత కవి కల్పించినది. ఈ కథ దీర్ఘదర్శి లాగా రాబోయే ఆపదను ముందుగానే పసిగట్టి ఆపద రాకముందే సురక్షితంగా బయట పడాలనే నీతిని తెలుపుతూ ఉంది. ఈ పద్ధతి ఉత్తమమైంది. ఎలాంటి భయం ఆందోళన లేకుండా ప్రశాంత జీవనం గడపడానికి ఇది పనికి వస్తుంది. అపాయం ఎదురైనప్పుడు ఉపాయంతో బైట పడడం మధ్యమం. ఈ పద్ధతిలో అపాయం నుంచి బైటపడే వరకు ప్రాణాలు అరచేతిలో చిక్కబట్టు కోవాలి. అపాయం నుంచి తప్పించు కోవడానికి మన ఉపాయం నెరవేరుతుందో లేదో తెలియదు. అందువల్ల దాని కంటే మొదట పద్ధతే ఉత్తమమైంది. ఒక వేళ ఏ కారణం చేతనైనా మొదటి పద్ధతి పాటించకపోతే ప్రాప్తకాలజ్ఞుని లాగా రెండవ పద్ధతి ద్వారా ప్రాణాలు కాపాడుకోవాలి. ఈ రెండు పద్ధతులు పాటింపని సోమరి దీర్ఘసూత్రుని లాగా చనిపోవలసి వస్తుందనే చక్కని నీతిని ఈకథ తెలుపుతూ ఉంది.

ఈ కథను భారతంలో చొప్పించిన కవి అంత ప్రతిభావంతుడు కాదనిపిస్తుంది. ఎందుకంటే ఈ కథ స్పష్టంగా చెప్పబడలేదు. అంతేకాదు అస్పష్టంగా కూడా ఉంది. ఋషి శ్వాన సంవాద కథను రాసిన కవి చక్కటి ప్రతిభావంతుడు. జానపద కథకు రమణీయమైన

వర్ణనలను చక్కటి సంభాషణలను జోడించి ఆ కథను చెప్పాడు. ఈ మూడు చేపల కథలో ఇవేవీ లేకపోగా చివరకు కథను స్పష్టంగా కూడా కవి చెప్పలేకపోయాడు.

ఈ కథను తిక్కన శాంతిపర్వం తృతీయాశ్వాసంలో 185వ వచనం నుంచి 201వ పద్యం వరకూ ఉన్న 17 పద్యగద్యాలలో రచించాడు. ఈ కథను తిక్కన మూలంలో ఉన్న దానికంటే మరింత రమణీయంగా రచించాడు. మూలంలో మడుగును విడిచి వెళదామన్న దీర్ఘదర్శితో దీర్ఘసూత్రుడు. "నతు కార్యా త్వరా తావదితి మే నిశ్చితా మతిః॥" "మనం తొందర పడవలసిన అవసరంలేదు" అని చెప్పినట్లుగా ఉంది. దీన్ని తిక్కన దీర్ఘసూత్రుని సోమరి తత్వాన్ని మరింత స్పష్టంగా కింది పద్యంలో ఇలా తెలియజేశాడు.

**"జడనిథి చందమున ని**
**మ్మడు వొప్పగ నిప్పుడేమి మాడెనె? యిమ్మై**
**నడచిపడ రిత్త నెవ్వగ**
**లుడుగుడు మఱిచూచికొంద మొయ్యన తఱితోన్"**

**(శాంతిపర్వం – తృతీయాశ్వాసం – 188వ పద్యం)**

"ఈ చెరువు సముద్రం లాగా ఉంది. మనం తొందరపడడానికి ఈ చెరువు ఎండి పోయిందా ఏమి? అనవసరమైన ఆందోళన మానండి. అవసరాన్ని బట్టి తర్వాత చూసుకుందాం".

మూలంలో జాలరులు మడుగులోని చేపలను అనేక విధాలుగా పట్టు కున్నట్లుగా చెప్పబడింది. ఈ విషయంతోపాటు ప్రాప్తకాలజ్ఞుడు తప్పించుకున్న విషయాన్ని కింది మూడు పద్యాల్లో తిక్కన చక్కగా వివరించాడు.

**"వెరవున నూతల నెత్తల**
**గరముల మత్స్యముల బట్టి కడు సంతసముం**
**బొరయుచు ద్రాళ్ళం గ్రువ్వగ**
**గర మూహించి మది బ్రాప్తకాలజ్ఞుండున్"**
**"ఇందొక త్రాడు గఱచియే**
**నొందంగా గ్రుచ్చినట్ల యుండెద వీరీ**
**క్రందుకొనుట మానంగ న మందత**
**నది యెడల విడిచి మడువు దఱిసెదన్"**
**"అని యొక గుదిమీల నడుమ**
**నెనయంగా దూఱి కఱచి యిరుదౌడల ద్రా**
**డొనరంగ బట్టుకొని గ్రు**
**చ్చిన చందము దోప మూర్ఛ జెందిన భంగిన్"**
**(శాంతిపర్వం – తృతీయాశ్వాసం –193 నుంచి 195వ పద్యం వరకు)**

"జాలరులు చేపలు పట్టే బుట్టలతో, అడ్డు వలలతో, విడిచేతులతో ఎంతో నేర్పుగా చేపలను పట్టుకున్నారు. వాటిని సంతోషంగా తాళ్ళకు గుచ్చుతున్నారు. అప్పుడు ప్రాప్తజాలజ్ఞుడు చాలా సేపు ఆలోచించుకొని చేపలు గుచ్చిన తాళ్ళతో చక్కగా గుచ్చిన ఒక చేప లాగా ఒక తాడును కరచి పట్టుకుంటాను, జాలరులు చేపలు పట్టడం ఆపగానే వెంటనే ఆతాడును వదలిపెట్టి మడుగులోకి చేరుకుంటాను అని అనుకొని చేపల గుత్తిలోకి దూరి తన రెండు దవడలతో తాడును కరచి పట్టుకుని గుచ్చిన చేపల లాగా మూర్ఛ చెందినట్లుగా కదలక మెదలక ఉంటుంది". ఈ విషయం మూలంలో ఇంత వివరంగాలేదు. తిక్కన మూలానికి మెరుగులు దిద్ది ఈ కథను తేటతెలుగు మాటలతో రమణీయంగా రాశాడు.

## 5. పూజని - బ్రహ్మదత్త సంవాదం కథ :

సంస్కృత భారతంలో ఈ కథ శాంతిపర్వంలోని ఆపద్ధర్మ పర్వం అనే ఉప పర్వంలో 139వ అధ్యాయంలోని 113 శ్లోకాల్లో ఉంది. ఈ కథను ధర్మరాజుకు భీష్ముడు చెబుతాడు. ధర్మరాజు భీష్మునితో "మహాబాహూ! శత్రువులను నమ్మ గూడదని చెప్పావు. రాజు ఎవరినీ నమ్మకుండా శత్రువులను ఎలా గెలుస్తాడు' ఈ నా సందేహాన్ని తీర్చు" అని అంటాడు. దానికి సమాధానంగా భీష్ముడు బ్రహ్మదత్తుని ఇంటిలో జరిగిన వృత్తాంతాన్ని చెబుతాను విను అని ఈ కథను ఇలా చెబుతాడు.

కాంపిల్య నగరాన్ని పాలిస్తున్న బ్రహ్మదత్తుని అంతఃపురంలో పూజని అనే పేరు గల పక్షి చాలా కాలంగా ఉంటుంది. అది సర్వప్రాణుల భాషలను అర్థం చేసుకొన గలది. అన్ని విషయాలు తెలిసినది. కొంతకాలం తర్వాత అది ఒక అందమైన పిల్లకు జన్మనిస్తుంది. అదే రోజు బ్రహ్మదత్తునికి కూడా ఒక కుమారుడు పుడతాడు. పూజని పిల్ల, బ్రహ్మదత్తుని కుమారుడు కలిసి పెరుగుతూ ఉంటారు. కృతజ్ఞతా గుణం కల్గిన పూజని ప్రతిరోజూ సముద్ర తీరానికి వెళ్ళి తన పిల్ల కోసం ఒక పండు రాజు కుమారుని కోసం మరొక పండు కలిపి రెండు పండ్లను తెచ్చియిస్తూ ఉంటుంది. ఆ పండ్లు మంచి రుచికరమైనవి, బలవర్ధకమైనవి. ఆ పండ్లను తినడం వల్ల రాజపుత్రుడు బాగా ఎదిగాడు. ఒకరోజు రాజకుమారుడు పక్షిపిల్లతో ఆడుకుంటూ దాన్ని ఎవరూ లేని చోటుకు తీసుకొనిపోయి బాల్య చాపల్యంతో చంపేస్తాడు. పండ్ల కోసం వెళ్ళి తిరిగి వచ్చిన పూజని చనిపోయి నేల మీద పడి ఉన్న తన పిల్లను చూసి కన్నీరు మున్నీరుగా దుఃఖిస్తూ "క్షత్రియులకు స్నేహం లేదు, ప్రేమ లేదు, మంచితనం లేదు, అపకారం చేసే స్వభావం ఉన్న క్షత్రియులను నమ్మగూడదు. ఈ బ్రహ్మదత్తుడు కృతఘ్నుడు, క్రూరుడు. ఇతడు చేసిన పనికి తగిన ప్రతీకారం చేస్తాను" అని పలికి పూజని రాజకుమారుని కళ్ళను తన కాళ్ళతో, ముక్కుతో పొడిచి పీకివేస్తుంది. ఆ తర్వాత అది ఆకాశంలో ఎగురుతూ నిలబడి బ్రహ్మదత్తునితో

"ఇచ్ఛ యేహ కృతం పాపం సద్యస్తం చోపసర్పతి
కృతం ప్రతికృతం యేషాం న నశ్యతి శుభాశుభమ్"

(శాంతి. 139 - 21వ శ్లోకం)

"ఇష్టపూర్వకంగా పాపం చేస్తే దాని వల్ల వచ్చే ఫలం ఆ పాపికి వెంటనే తగులు తుంది. అయితే తాను చేసింది ప్రతిక్రియ మాత్రమే అయితే ఆకర్త అంతకు ముందు చేసిన శుభాశుభకర్మలు నశించవు. రాజా! ఒకవేళ పాపపు పని చేసినప్పటికీ దాని ఫలితం కర్తను చేరకపోతే అతని కుమారులు గానీ, మనుమలు గానీ, ముని మనుమలు గానీ దాన్ని అనుభవించవలసి ఉంటుంది" అని అంటుంది. పూజని వల్ల కళ్ళు పోగొట్టుకున్న తన కుమారుని చూసి బ్రహ్మదత్తుడు దాన్ని తన కొడుకు చేసిన పనికి ప్రతిఫలంగా భావించి పూజనితో "మేము నీకు అపకారం చేశాం. దానికి నీవు ప్రతీకారం తీర్చుకున్నావు? రెండింటికీ సరిపోయింది. నీవు ఎక్కడికీ వెళ్ళవద్దు పూజనీ! నా దగ్గరే ఉండు" అని అంటాడు. దానికి పూజని

**"సకృత్కృ తాపరాధస్య తత్రై వ పరిలంబతః**
**న తద్బుధాః ప్రశంసంతి శ్రేయ స్తత్రాపసర్పణం"**
**సాన్త్వే ప్రయుక్తే సతతం కృతవైరే నవిశ్వసేత్**
**క్షిప్రం స బధ్యతే మూఢో నహి వైరం ప్రశామ్యతి"**
**(శాంతి. 139 – 25,26 శ్లోకాలు)**

"ఒకసారి తప్పు చేసిన వాడు మళ్ళీ ఆస్థానంలో ఉండగూడదు. దెబ్బతిన్నవాడు సాంత్వన వచనాలు పలికినప్పటికీ అతడిని నమ్మకూడదు. శత్రుత్వం ఎప్పుడూ ఉపశమించదు. అలా శత్రువును నమ్మిన మూర్ఖుడు త్వరలోనే హత్యకు గురి అవుతాడు". పరస్పరం శత్రుత్వమున్న వారి మధ్య సంధి పొసగదు. ఒకసారి అపకారం చేసినవాణ్ణి అపకారానికి గురైనవాడు గౌరవించినప్పటికీ అపకర్త విశ్వసించ గూడదు. ఇప్పుడు మన మధ్య వైరమేర్పడింది. నేను వెళ్ళిపోవడమే క్షేమం కాబట్టి వెళ్తాను" అని పల్కుతుంది. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథలో పూజని, బ్రహ్మదత్తుల మధ్య ఈ సంభాషణ ఇంకా చాలా ఉంది. బ్రహ్మదత్తుడు పూజని తన అంతఃపురంలోనే ఉండాలని అనేక విధాలుగా కోరతాడు. పూజని అతని మాటలను ఖండిస్తూ తాను అక్కడ ఉండడం ఎప్పటికీ క్షేమం కాదని, వేరే ప్రదేశానికి వెళ్ళడమే అన్ని విధాల తనకు తగినదని పలికి తనకిష్టమైన చోటుకు వెళ్ళిపోతుంది.

ఈ కథ జానపద కథల ప్రభావంతో పండిత కవి కల్పించినది. ఈ కథలో చక్కటి నీతి ఉంది. ఇందులోని పాత్రలు పూజని, బ్రహ్మదత్తుడు ఇద్దరూ మంచివారే. చాలా కాలం నుంచి అంతఃపురంలో తనకు ఆశ్రయమిచ్చిన రాజు మీద కృతజ్ఞత కలిగి అతని కుమారునికి తన పిల్లకు అమృతం లాంటి రుచికరమైన బలవర్థకమైన పళ్ళను పూజని తెచ్చియిస్తూ ఉంటుంది. రాజకుమారుడు పూజని పిల్ల కలిసి ఆడుకుంటూ పెరుగుతూ ఉంటారు. లోకంలో "రాజుతో సహవాసం పాము పడగ నీడలాంటిది" అనే సామెత ఉంది. సామెతలు ఊరకే పుట్టవు. వాటిలో సత్యముంది. రాజకుమారునితో సామాన్యులు సహవాసం చేసినప్పుడు రాజు కుమారుడు తను రాజు కొడుకునన్న గర్వంతో విర్రవీగుతూ

తన గొప్పతనాన్ని ప్రదర్శించే అవకాశం ఉంది. అలాంటి సందర్భంలో మాటకు మాట పెరిగి శత్రుత్వం వస్తుంది. శత్రుత్వం వస్తే సామాన్యులకు ముప్పు తప్పదు. అలాగే ఈ కథలో రాజుకుమారుడు తనతో స్నేహంగా ఉంటూ తనతోపాటు పెరుగుతున్న పూజని పిల్లను స్నేహం, కనికరం, ప్రేమ ఏ మాత్రం లేకుండా బాల్య చాపల్యంతో చంపి వేస్తాడు. చనిపోయి కిందపడి ఉన్న తన పిల్లను చూసి పూజని దుఃఖావేశాలకు లోనై ప్రతీకారం తీర్చుకోవాలన్న కోపంతో రాజకుమారుడి కళ్ళు పీకివేస్తుంది. ఆ తర్వాత అది తాను చేసిన పనిలోని ప్రమాదం గ్రహించి కింద వాలకుండా ఆకాశంలో ఎగురుతూ అంతవరకూ తనకాశ్రయాన్నిచ్చిన రాజుతో తాను చేసిన పనిలోని ఔచిత్యాన్ని గురించి చెప్పి అక్కడి నుంచి వెళ్ళిపోతానని పల్కుతుంది. ఇలా చేయడం వివేకవంతులకు తగినది. రాజు స్వతహాగా మంచివాడు కాబట్టి పూజని తనకు చేసిన అపకారంలోని ఔచిత్యాన్ని గ్రహించి దాన్ని క్షమించినప్పటికీ అతని సేవకులు అతణ్ణి రెచ్చగొట్టి భవిష్యత్తులో పూజనికి అపకారం చేయించవచ్చు. కుమారుని పోగొట్టుకున్నవాడు సాధారణంగా శాంతించడు. అపకారికి ప్రత్యపకారం చేయాలనే అనుకుంటాడు. ఈ విషయాన్ని బాగా తెలిసినది కావడం చేతనే పూజని బ్రహ్మదత్తుని అంతఃపురంలో ఉండకుండా తనకిష్టమైన చోటుకి వెళ్ళిపోతుంది.

పరస్పరం అపకారం చేసుకున్నవారు ఒకే దగ్గర ఉంటే ఆ పగ వంశపారంపర్యంగా కొనసాగే అవకాశముంది. అందువల్ల ఇలాంటి వారు ఒకరికొకరు కనిపించకుండా దూరదూరంగా జీవించడమే మంచిది అనే నీతిని ఈ కథ చక్కగా వివరించింది.

తిక్కన ఈ కథను శాంతిపర్వం తృతీయాశ్వాసంలోని244వ వచనం నుంచి 266వ పద్యం వరకూ ఉన్న 23 గద్య పద్యాల్లో క్లుప్తంగా రాశాడు. తిక్కన ముఖ్యమైన కథను ఒకేఒక సీసపద్యంలో ఇలా రాశాడు.

**"బ్రహ్మదత్తుండన బరగిన నరపతి**
**నగర బూజని యను నామమొప్ప**
**జతుర భాషిణి యొక్క శారిక వర్తించు**
**నది పిల్ల బెట్టి యింపారు పండ్లు**
**దెచ్చి యర్మిలి దానికిచ్చుచో మేలేటి**
**యధిప పుత్త్రునకిచ్చు నందు గొన్ని**
**వాడును మచ్చిక వచ్చి యప్పిల్లతో**
**జర్లాటమాడుచు సంచరించు**
**నొక్కనాడు దాది యొద్ద లేకుండ న**
**ద్దారకుండు పిల్ల తల నొగిర్చి**
**చంపె దాని తల్లి సనుదెంచి కని మది**
**నిట్టులనియె శోక మెసక మెసగ"**

**(శాంతిపర్వం, తృతీయాశ్వాసం, 245వ పద్యం)**

పగ ఎలాంటిదో తిక్కన పూజని చేత ఇలా పలికించాడు.

**"పగయు గల్గెనేని పాయునె గూఢమై**
**మ్రాన నగ్నియున్న మాడ్కి నుండు**
**గాన నమ్మి బేల కాలాంతరంబున**
**నైన జెడును సందియంబు వలదు"**

**(శాంతిపర్వం, తృతీయాశ్వాసం, 258వ పద్యం)**

పగ పుట్టిన తర్వాత అది ఒక పట్టాన నశించదు. చెట్టులో దాగి ఉన్న నిప్పులాగా పగ మనసులో దాగి ఉంటుంది. కాబట్టి ఇది గ్రహించకుండా శత్రువును నమ్మిన వెర్రివాడు ఎప్పటికైనా చెడిపోతాడు. మూలంలో సుదీర్ఘంగా ఉన్న సంభాషణలను తిక్కన చాలా క్లుప్తంగా చెప్పాడు.

## 6. కపోత – లుబ్ధక కథ:

ఈ కథ సంస్కృత భారతంలో శాంతిపర్వంలోని ఆపద్ధర్మానుశాన పర్వం అనే ఉపపర్వంలో 143వ అధ్యాయం నుంచి 149వ అధ్యాయం వరకూ ఉన్న ఏడు అధ్యాయాల్లో 132 శ్లోకాల్లో ఉంది. ధర్మరాజు శరణాగత రక్షకుడు పాటించ వలసిన ధర్మాన్ని గురించి చెప్పమని భీష్ముని కోరినపుడు భీష్ముడు శరణాగత రక్షణను ఒక పావురం గొప్పగా పాటించింది. సర్వపాప వినాశకరమైన ఈ దివ్యకథను పూర్వం పరశురాముడు ముచికుందరాజుకు చెప్పాడు. ఆ కథను నేను నీకు చెబుతాను విను అని పావురం కథను ఇలా చెబుతాడు.

ఒక అడవి సమీపంలో అతి క్రూరుడైన బోయవాడు ఉండేవాడు. అతడు ప్రతిరోజు వల తీసుకొని అడవికి వెళ్ళి పక్షులను పట్టుకొని చంపి వాటిని అమ్మేవాడు. ఒకరోజు పక్షుల కోసం అతడు అడవికి వెళ్ళినపుడు గాలి, వానతో కూడిన కుండపోత వర్షం కురుస్తుంది. అడవంతా నీటితో నిండిపోతుంది. బోయవాడు ఆ వర్షంలో తడిచి ముద్దై చలికి వణుకుతూ అడవిలో తిరుగుతూ ఒకచోట నేల మీద పడివున్న ఒక పావురాన్ని చూసి దాన్ని తన బుట్టలో వేస్తాడు. అక్కడికి దగ్గరలోనే ఒక పెద్ద చెట్టును చూసి ఆ రాత్రికి అక్కడే ఉండిపోవాలని నిశ్చయించుకొని ఆ చెట్టుకు నమస్కరించి "ఈ చెట్టు మీద ఉన్న దేవతలందరినీ శరణుగోరుతున్నాను" అని పలికి చలికి వణుకుతూ ఆకలితో బాధపడుతూ నిద్రపోతాడు.

ఆ చెట్టు కొమ్మ మీద ఒక పావురం ఉంది. దాని భార్య ఆ రోజు పొద్దున ఆహారం కోసం వెళ్ళి తిరిగి రాలేదు. తన భార్య రాకపోయినందుకు ఆ పక్షి ఆమె క్షేమాన్ని గురించి దిగులు పడుతూ ఆమె పాతివ్రత్యాన్ని, సత్ప్రవర్తనను గురించి యిలా పలుకుతుంది. "నా భార్య లేకపోతే నాకు ఇల్లు శూన్యం –

**"పుత్ర పౌత్ర వధూ భృత్యై రాకీర్ణ మపి సర్వతః**
**భార్యా హీనం గృహస్థస్య శూన్య మేవ గృహమ్ భవేత్"**

**"న గృహమ్ గృహ మిత్యాహుః గృహిణీ గృహ ముచ్యతే**
**గృహం తు గృహిణీ హీన మరణ్య సదృశమ్ మతమ్"**
**(శాంతి. 144 – 5, 6 శ్లోకాలు)**

"కుమారులు కోడళ్ళు, మనుమలు, సేవకులు ఇంటి నిండా ఉన్నప్పటికీ ఇల్లాలు లేకపోతే గృహస్థునికి ఇల్లు శూన్యమే. గృహిణిలేని ఇల్లు ఇల్లు కాదు, గృహస్థునికి గృహిణియే ఇల్లు. గృహిణిలేని ఇల్లు అడవితో సమానం" సర్వాంగ సుందరమైన నా భార్య ఈ రోజు రాకపోతే నేను బతికి ఉపయోగం లేదు. ఆమె మహాపతివ్రత, ఎల్లప్పుడు నన్ను అనుసరించి నా ఆనందాన్ని తన ఆనందంగా, నా దుఃఖాన్ని తన దుఃఖంగా భావిస్తూ ఉంటుంది. అలాంటి భార్యను పొందినవాడు ధన్యుడు. పురుషునికి భార్యయే పరమార్థం. అతడు రోగాలతో బాధపడుతున్నా కష్టాల్లో చిక్కుకున్నా భార్య వంటి ఔషదం మరొకటి ఉండదు.

**"నాస్తి భార్యాసమో బంధుః నాస్తి భార్యా సమా గతిః**
**నాస్తి భార్యాసమో లోకే సహాయో ధర్మసంగ్రహే"**
**(శాంతి.144 –16వ శ్లోకం)**

"భార్యతో సమానమైన బంధువు ఉండడు. భార్యలాంటి గతి ఉండదు. లోకంలో ధర్మ సంగ్రహంలో భార్యతో సమానమైన సహాయకుడు ఉండడు". అలాంటి భార్య ఇంట్లో లేకపోతే భర్త అడవులకు వెళ్ళాలి. ఎందుకంటే భార్యలేని ఇల్లైనా అడవైనా ఒకటే" అని తన భార్యను తలచుకొని దీనంగా విలపిస్తుంది.

ఆ విధంగా విలపిస్తున్న పావురం మాటలను విని బోయవాని బుట్టలో ఉన్న ఆడపావురం తన భర్తకు తన మీద ఉన్న ప్రేమానురాగాలకు ఎంతో సంతోషించి, తన భర్తతో ఇలా చెబుతుంది. "నీ నివాసం దగ్గరకు వచ్చిన ఈ బోయవాడు చలితో ఆకలితో బాధపడుతూ పడి ఉన్నాడు. అతనికి సహాయం చేసి శరణాగత రక్షకుడవు కమ్ము. నాకోసం బాధపడవద్దు. సంతానవంతుడవైన నీవు ఈ బోయవాని మనసు సంతోషించేలాగా అతని కోరికలను తీర్చు" భార్య మాటలను విన్న మగపావురం భార్య చెప్పినట్లుగా చేయాలని నిశ్చయించుకొని బోయవానితో "నీవు బాధపడవలసిన అవసరంలేదు, నీవు మా ఇంటికి వచ్చిన అతిథివి"

**"అరా వప్యుచితం కార్య మాతిథ్యం గృహ మాగతే**
**ఛేత్తు మప్యాగతే ఛాయాం నోపసంహారతే ద్రుమః".**
**(శాంతి.146 – 5వ శ్లోకం)**

"ఇంటికి వచ్చిన శత్రువుకైనా ఆతిథ్యమివ్వాలి. నరకడానికి వచ్చిన వాడికి కూడా చెట్టు నీడనిస్తుందే కానీ ముడుచుకోదు". ఇంటికి వచ్చిన వానికి గృహస్థుడు తప్పని సరిగా ఆతిథ్యమివ్వాలి. కాబట్టి నీకేమి కావాలో చెప్పు అని బోయవానిని అడుగు తుంది. దానికి బోయవాడు చలి బాధ నుంచి తనను రక్షింపుమని కోరతాడు. వెంటనే పావురం నేల మీది ఆకులను పోగుచేసి తన రెక్కల శక్తినంతా ఉపయోగించి తొందరగా ఎగిరి దగ్గర్లో ఉన్న గ్రామానికి వెళ్ళి నిప్పు తీసుకొని వచ్చి ఎండుటాకుల మీద వేసి మంటవేసి

శరీరావయవాలను వెచ్చచేసుకోమని బోయవానికి చెబుతుంది. బోయవాడు మంటకు తన అవయవాలు కాచుకొని చలి నుంచి విముక్తుడై తన ఆకలి తీర్చమని పావురాన్ని కోరతాడు. అతని మాటలు విన్న పక్షి నా దగ్గర సంపద లేదు. ఏ రోజుకారోజు దొరికిన దానితో మేము జీవిస్తాం. భోజనం కోసం కూడబెట్టినది నా దగ్గర లేదు అని పలికి క్షణకాలమాగి అయినా నీ ఆకలి తీరుస్తాను అని బోయవానితో చెప్పి ఎండుటాకుల మంటను పెద్దదిగా చేసి

**"ఋషీణాం దేవతానాం చ పితౄణాంచ మహాత్మానామ్**
**శ్రుతః పూర్వం మయా ధర్మో మహా నతిథి పూజనే"**
**"కురుష్వానుగ్రహం సౌమ్య సత్యమేతదబ్రవీమి తే**
**నిశ్చితా ఖలు మే బుద్ధి రతిథి ప్రతిపూజనే"**
**(శాంతి. 146 – 21, 22 శ్లోకాలు)**

"ఋషులవల్ల, దేవతలవల్ల, పితరులవల్ల, మహాత్ములవల్ల అతిథి పూజయే గొప్ప ధర్మమని నేను గతంలో విన్నాను. ఓ సౌమ్యుడా! నేను సత్యం చెబుతున్నాను అతిథి పూజలో నాది తిరుగులేని బుద్ధి, అనుగ్రహించు" అని ఆ పావురం అతనితో పలికి నవ్వుతూ అగ్నికి మూడుసార్లు ప్రదక్షిణ చేసి అగ్నిలో ప్రవేశిస్తుంది. ఆ దృశ్యాన్ని చూసి బోయవాడు చలించిపోయి అప్పటి వరకూ తాను చేసిన క్రూర కర్మలను అనేక విధాలుగా నిందించుకుంటూ పెద్దగా విలపిస్తాడు. కపోతం యొక్క త్యాగాన్ని చూసి బోయవాడు ఇలా అంటాడు. "గతంలో ఎన్నో క్రూరమైన కర్మలతో ఎంతో పాపం చేశాను. నేను దుర్బుద్ధిని, నమ్మదగనివాడిని, ఎన్నో పక్షులను పట్టుకొని చంపి జీవిస్తున్నాను. గొప్ప మనస్సు గల ఈ పావురం తన శరీరాన్ని అగ్నికి ఆహుతి చేసి తన మాంసాన్ని నాకు అర్పించి నా క్రూరత్వానికి తగిన ప్రతీకారం చేసి నిస్సంశయంగా ధర్మమార్గాన్ని నాకు బోధించింది. కాబట్టి నేను భార్యా బిడ్డలను, ప్రియమైన ప్రాణాలను కూడా వదలివేస్తాను. భోగాలన్నింటినీ విడనాడి నా శరీరాన్ని రకరకాల ఉపవాసాలతో శుష్కింప జేసుకొని పరలోకాన్ని పొందుతాను" అని పలికి ధర్మాచరణకు నిశ్చయించుకొని క్రూరకర్ముడైన ఆ బోయవాడు పక్షులను పట్టుకోవడానికి ఉపయోగించే తన పరికరాలను అక్కడే వదిలివేసి పంజరంలో బంధించిన ఆడ పావురాన్ని విడిచిపెట్టి మహాప్రస్థానం వైపు పయనిస్తాడు.

బంధ విముక్తురాలైన ఆడపావురం తన భర్త మరణానికి దుఃఖిస్తూ, తన భర్త మంచితనాన్ని తన మీద అతనికి గల ప్రేమను, అతను తనకు కల్పించిన స్వర్గ సుఖాలను తలచుకొని స్త్రీకి భర్తతో సమానమైన వారు ఎవరూ లేరు. తండ్రి, సోదరుడు, కొడుకు స్త్రీని మితంగానే సుఖపెడతారు. భర్త మాత్రమే అమితమైన సుఖాన్ని అందించగలడు. అలాంటి భర్త లేకుండా నేను జీవించ నవసరం లేదు అని పలికి ఆడపావురం మండుతున్న అగ్నిలో దూకుతుంది. అపుడు ఆ పావురాల జంటను తీసుకొని వెళ్ళడానికి స్వర్గలోకం నుంచి చక్కగా అలంకరించిన విమానం వస్తుంది. దాన్ని ఎక్కి ఆ రెండు పావురాలు స్వర్గ లోకానికి వెళ్ళిపోతాయి. ఆ దృశ్యాన్ని చూసిన బోయవాడు తాను కూడా పక్షుల లాగే

ఉత్తమ లోకాలను పొందగోరి నిరాహారుడై ఉపవాసంతో కృశిస్తూ అడవిలో తిరుగుతూ కొంత కాలానికి అడవిలో చెలరేగిన దావాగ్నికి తన శరీరాన్ని అర్పించి పునీతుడై ఉత్తమ లోకాలను పొందుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథను భీష్ముడు ధర్మరాజుకు చెప్పి శరణాగత రక్షణ గొప్ప ధర్మం. ఈ ధర్మం వల్ల గోహత్యా పాపం నుంచి కూడా బయట పడవచ్చు. శరణాగతుని చంపిన వానికి నిష్కృతి లేదు. పుణ్యకర్మమూ, పాప వినాశకరమూ ఐన ఈ కథను విన్నవారు స్వర్గలోకాన్ని పొందగలరని చెబుతాడు.

జానపద కథల ప్రభావంతో రాసిన కథ ఇది. సంస్కృత భారతంలో ఈ కథను రాసిన కవి మహాకవి అనడంలో ఎలాంటి సందేహం లేదు. ఈ కథలో చక్కటి సన్నివేశ వర్ణన, సహృదయులను ప్రభావితం చేయగల రమణీయమైన సంభాషణలు, అపూర్వమైన పాత్రచిత్రణ ఉన్నాయి. ఈ కథను చదివినవారు కొంత కాలమైనా క్రూర కర్మలకు దూరంగా ఉంటారు. పఠితలను ప్రభావితం చేయగల ఈ కథను రాసిన కవి నిజంగా ధన్యుడు. చక్కటి రంగులతో అందమైన శరీరాన్ని కలిగి కుహు కుహూ అనే శబ్దాలతో ఆనందాన్నివ్వగల పావురం శాంతికి ప్రతీక. అలాంటి పావురాలను పాత్రలుగా తీసుకొని భార్యాభర్తల అన్యోన్య దాంపత్యాన్ని, పరస్పరం ఒకరినొకరు విడిచివుండలేని అపూర్వమైన భార్యాభర్తల ప్రేమాభి-మానాలను ఈ కథకుడు ఎంతో గొప్పగా చిత్రించాడు. అలాగే శరణాగత రక్షణ, అతిథిపూజ గొప్ప ధర్మాలని, మానవులు ఆ ధర్మాలను తప్పనిసరిగా పాటించాలని అలా పాటించిన వారు మరణానంతరం స్వర్గలోక సౌఖ్యాలను అనుభవిస్తారని చెప్పిన ఈ కథ మానవులకు పరోపకారం కష్టాల్లో ఉన్న వారికి సాయం చేయాలన్న గొప్ప నీతిని తెలుపుతూ ఉంది.

ఈ కథను తిక్కన శాంతిపర్వం తృతీయాశ్వాసంలో 304వ పద్యం నుంచి 342వ వచనం వరకూ ఉన్న 39 గద్య పద్యాల్లో క్లుప్తంగా చెప్పాడు. ఆహారం కోసం అడవికి వెళ్ళి తిరిగి రాని తన భార్యను గురించి మగ పావురం చింతించడం మూలంలో 144వ అధ్యాయంలో 17 శ్లోకాల్లో చాలా వివరంగా ఉంది.దీన్ని తిక్కన ఒకే ఒక్కసీసపద్యంలో క్లుప్తంగా, రమణీయంగా ఇలా చెప్పాడు.

**"ఎచట నున్నది యొక్కొ యింత ప్రొద్దొక చోట**
**నుండునే నను బాసి యుజ్వలాంగి?**
**యమ్మేను లేకున్న నిమ్మేని కలిమి ని**
**రర్థకంబధికాను రాగయుక్త**
**యగు సతి గుణముల యైహికాముష్మిక**
**సుఖ సాధనంబులు సువ్వె! పతికి**
**యే కారణంబున నే మయ్యెనో వాన**
**యేపున దెగియెగానోపు నకట**
**నేమిసేయుదు మందిరంబిపుడు పాడు**
**వాఱుచున్నది యనగ నప్పలుకులెల్ల**

**బోయ వలలోన నున్న కపోతి విని మ**
**నంబు సంతోష పూర మగ్నంబు గాగ"**
**(శాంతిపర్వం తృతీయాశ్వాసం, 310వ పద్యం)**

"ఇంతసేపు నా భార్య ఎక్కడుందో? ఆమె నన్ను వదలి ఉండలేదు, ఆమె లేకపోతే నా బతుకు నిరర్థకం, అధికమైన అనురాగం కలిగిన భార్య సుగుణాలు భర్తకు ఇహపర లోకాల్లో సుఖాన్ని కలిగిస్తాయి. నా భార్య ఏ కారణంచేత ఏమై పోయిందో? కుండపోతగా కురిసిన వాన వల్ల చనిపోయిందేమో? నేను ఏమి చేసేది? ఆమె లేని నా యిల్లు పాడువడిపోతుంది" అని మగ పావురం పలుకుతుంది. భర్త మాటలను బోయవాని బుట్టలో ఉన్న ఆడ పావురం విని సంతోషిస్తుంది.

మగ పావురం తన భార్య మాటలను విని బోయవానికి ఆతిథ్యమివ్వాలని నిశ్చయించుకొని అతనితో పలికిన మాటలు మూలంలో ఏడు శ్లోకాల్లో వివరంగా ఉంది. దీన్ని తిక్కన ఒకే ఒక్క కందపద్యంలో క్లుప్తంగా ఇలా రాశాడు.

**"ఓయన్న! దస్సినాదవు**
**మాయింటికి నతిథి వైతి మసలక నీకుం**
**జేయవలయు నాతిథ్యం**
**బేయది భవదీప్సితార్థ మెతిఁగింపు తగన్"**
**(శాంతిపర్వం తృతీయాశ్వాసం, 315వ పద్యం)**

పై పద్యంలో మగపావురం తన శత్రువైన బోయవానిని "అన్నా!" అని సంబోధించి గొప్ప అభిమానాన్ని కనపరిచింది. మూలంలో ఇలా లేదు తిక్కన అచ్చ తెనుగు పదమైన "అన్న" ను ఉపయోగించి సోదర భావాన్ని చక్కగా వ్యక్తం చేయించాడు. మిగిలిన కథను గూడా తిక్కన క్లుప్తంగా రచించాడు.

## 7. పవన – శాల్మలీ సంవాదం కథ :

పవనుడు అంటే వాయుదేవుడు. శాల్మలి అంటే బూరుగుచెట్టు. అంటే ఇది గాలి బూరుగు చెట్టుల కథ. ఈ కథ సంస్కృత భారతం శాంతిపర్వంలోని ఆపద్ధర్మాను శాసన పర్వం అనే ఉపపర్వంలో 154వ అధ్యాయం నుంచి 157 వ అధ్యాయం వరకూ ఉన్న నాలుగు అధ్యాయాల్లో 74 శ్లోకాల్లో ఉంది. ఈ కథను భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. "ఉపకార అపకారాలు చేయగల బలవంతుడైన శత్రువుతో అసమర్థుడు, అజ్ఞానం వల్ల వ్యర్థమైన మాటలు మాట్లాడి అనవసరమైన వైరాన్ని పెంచుకొనే బలహీనుని మీదికి బలవంతుడు వచ్చినపుడు, ఆ బలహీనుడు ఎలా వ్యవహరించాలి?" అని ధర్మరాజు భీష్ముని అడిగినపుడు భీష్ముడు ఈ కథను ఇలా చెబుతాడు.

హిమాలయ పర్వతం మీద పెద్ద బోదెతో దట్టమైన కొమ్మలు ఆకులతో నిండిన ఒక పెద్ద బూరుగుచెట్టు చాలా కాలం నుంచి ఉంటుంది. దాన్ని ఆశ్రయించుకొని అనేక జంతువులు, పక్షులు మొదలైన ప్రాణులు ఉంటాయి. దాని నీడన బాటసారులు అడవుల్లో

ఉండే ఋషులు విశ్రాంతి తీసుకొనేవారు. ఒకసారి నారదుడు ఆ చెట్టు దగ్గరకు వచ్చి దానితో "శాల్మలీ! నీవు ఎలాంటి ఆపద లేకుండా చాలా కాలంగా సుఖంగా ఉన్నావు. వాయుదేవుడు తన బలంతో చిన్న పెద్ద చెట్లను, పర్వత శిఖరాలను ఊపి వేస్తుంటాడు. కానీ నీ విశాలమైన పెద్ద కొమ్మలను గానీ, చిన్న కొమ్మలను గానీ స్కందాలను గానీ వాయుదేవుడు విరగగొట్టలేకపోయాడు. వాయుదేవుడు నీ మీద ఉన్న స్నేహం చేతనే నిన్ను రక్షిస్తూ ఉన్నాడని నేను భావిస్తున్నాను" అని అంటాడు. దానికి బూరుగచెట్టు "నారదా! వాయుదేవుడు నన్ను రక్షించడానికి నాకు బంధువు గానీ, మిత్రుడు గానీ కాదు. వాయుదేవుని కంటే నా తేజస్సు, బలం అధికమైనవి. వాయుదేవుడు ఎంత వేగంగా వచ్చినా నేను అతని వేగాన్ని చాలా సార్లు అడ్డుకున్నాను. కాబట్టి అతనికి ఎంత కోపం వచ్చినా నేను భయపడను" అని అంటుంది. అపుడు నారదుడు "శాల్మలీ! వాయుదేవునితో సమానమైన బలం కల ప్రాణి ఈ జగత్తులో ఒక్కటి కూడా లేదు. చివరకు ఇంద్రుడు, యముడు లాంటి దిక్పాలకులు కూడా అతనితో సమానులు కారు. అలాంటపుడు నీవెంత? నీవు నిస్సారమైన దానవు, వదరుబోతువు, ఇలా వాయుదేవుని గురించి తప్పుగా మాట్లాడితే నాకు కోపం వస్తుంది. నీ ప్రలాపాలను నేను వాయుదేవునికి చెబుతాను" అని పలికి నారదుడు వాయుదేవుని వద్దకు వెళ్ళి బూరుగుచెట్టు పలికిన మాటలను అతనితో చెబుతాడు. వెంటనే వాయుదేవుడు బూరుగుచెట్టు వద్దకు వచ్చి కోపంతో "నీవు నన్ను నిందించిన మాటలను నారదుడు నాకు చెప్పాడు. పూర్వం బ్రహ్మదేవుడు సృష్టి సమయంలో నీ నీడలో విశ్రమించడం వల్ల నీ మీద దయచూపి నీకు రక్షణ కల్గించాను, అంతేగానీ నీకు అపకారం చేయక పోవడం నీ బలం వల్ల కాదు. నీవు నన్ను సాధారణమైన వానిలాగా భావించి అవమానించావు. నీకు నా బలం ఏమిటో చూపిస్తాను" అని పలుకుతాడు.

వాయుదేవుని మాటలకు బూరుగుచెట్టు ఏ మాత్రం భయ పడకుండా అతణ్ణి వెక్కిరిస్తూ "వాయుదేవా! నా మీద నీకు కోపం వచ్చింది కాబట్టి నీ బలం నా మీద చూపించు. కానీ నీవు నన్నేమీ చేయలేవు. నీకంటే నేను బలవంతుడను" అని అంటుంది. రేపు నేను నీకు నా బలం చూపిస్తాను అని వాయుదేవుడు అక్కడి నుంచి వెళ్ళిపోతాడు. అతడు వెళ్ళిపోయిన తర్వాత బూరుగుచెట్టు తన బలాన్ని వాయుదేవుని బలాన్ని గురించి బాగా ఆలోచించుకొని నారదుడు చెప్పినట్లుగా వాయుదేవుడు చాలా బలవంతుడు. అతడి ముందు నేను బలహీనుణ్ణి. అయితే నాకు బుద్ధి బలం ఎక్కువ. నా తెలివి తేటలతో వాయుదేవుని వల్ల ఎలాంటి భయం లేకుండా చేసుకుంటాను అని బూరుగుచెట్టు నిశ్చయించుకొని తన పెద్ద చిన్న కొమ్మలను, స్కంధాలను, స్వయంగా విరగ్గొట్టుకొని మోడుగా అయి వాయుదేవుని రాక కోసం చూస్తూ ఉంటుంది. మరుసటి రోజు వాయుదేవుడు తీవ్రమైన వేగంతో పెద్దపెద్ద చెట్లను నేల కూలుస్తూ బూరుగచెట్టు వద్దకు వచ్చి మోడువారిన ఆ బూరుగచెట్టును చూసి మొదట ఆశ్చర్యపడి తర్వాత సంతోషంతో

**"అహమప్యేవ మేవ త్వాం కుర్వాణః శాల్మలేరుషా**
**ఆత్మనా యత్కృతం కృచ్ఛ్రం శాఖానా మపకర్షణం"**

**"హీనపుష్పాగ్ర శాఖ స్త్వం శీర్ణాంకుర పలాశకః**
**ఆత్మ దుర్మన్త్రితే నేహ మద్వీర్యవశగః కృతః"**
**(శాంతి. 157 – 5, 6 శ్లోకాలు)**

"శాల్మలీ! నా బలంతో నేను నిన్ను ఇలాగే చేయాలనుకున్నాను. నీకు నీవుగా కొమ్మలను, ఆకులను, పూలను నేల రాల్చుకున్నావు. మూర్ఖత్వంతో ఆపదను కొని తెచ్చుకున్నావు. నీవు నా బలపరాక్రమాలకు బలి అయ్యావు" అని అంటాడు. బూరుగు చెట్టు ఆ మాటలను విని సిగ్గుపడి నారదుడు చెప్పిన మాటలను గుర్తుకు తెచ్చుకొని పశ్చాత్తాప పడుతుంది. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది. ఈ కథను ధర్మరాజుకు భీష్ముడు చెప్పి బలహీనుడు బలవంతునితో విరోధం పెట్టుకుంటే ఇలాగే జరుగుతుంది.

**"తస్మాద్వైరం న కుర్వీత దుర్బలో బలవత్త రై ః**
**శోచేద్ధి వైరం కుర్వాణో యథా వై శాల్మలీ స్తథా"**
**(శాంతి. 157 – 9వ శ్లోకం)**

"కాబట్టి దుర్బలుడు బలవంతునితో శత్రుత్వం పెట్టుకుంటే బూరుగ చెట్టులాగా పశ్చాత్తాప పడవలసి వస్తుంది" అని చెబుతాడు.

ఇది జానపద నీతి కథల ప్రభావంతో పండిత కవి కల్పించినది. ఈ కథలో బూరుగచెట్టు, వాయుదేవుడు, నారదుడు పాత్రలుగా ఉన్నారు. ప్రాచీన సాహిత్యంలో నారదునికి కలహభోజనుడు అనే పేరు ఉంది. ఇతను ఇక్కడి మాటలు అక్కడ అక్కడి మాటలు ఇక్కడ చెప్పి తగవులు పెట్టి తమాషా చూస్తుంటాడు. ఈ కథలో కూడా బూరుగ చెట్టు మానాన బూరుగు చెట్టు, వాయుదేవుని మానాన వాయుదేవుడు ఉండగా వారిద్దరి మధ్య నారదుడు తగాదా కల్పించాడు. నారదుడు కల్పించే తగాదాల్లో లోకకళ్యాణం ఉంటుందని పెద్దలు చెబుతారు. అహంకార భూయిష్టుల అహంకారాన్ని అణచివేయించి వారికి పశ్చాత్తాపం కల్గించడం నారదుని ప్రయత్నాల్లో ఒకభాగం. గర్విష్ఠి అయిన సత్యభామ చేత పుణ్యకవ్రతం చేయించి శ్రీకృష్ణుని దానంగా పుచ్చుకొని సత్యభామ గర్వాన్ని పోగొట్టి ఆమె పశ్చాత్తాపపడే లాగా నారదుడు చేసినట్లుగా పూర్వ గ్రంథాల వల్ల తెలుస్తుంది. అలాగే ఈ కథలో కూడా బూరుగుచెట్టు గర్వంతో విర్రవీగి తన బలమేమిటో వాయుదేవుని బలమేమిటో తెలుసుకోకుండా అవాకులు, చవాకులు పేలి చివరకు తనకు తానే అపకారం చేసుకొని పశ్చాత్తాపపడేటట్లుగా నారదుడు చేసినట్లుగా ఈ కథలో చెప్పబడింది. ఈ కథలో బలహీనులు, బలవంతులతో అనవసరమైన శత్రుత్వం పెట్టుకోకూడదన్న మంచి నీతి ఉంది. లోకంలో కొంతమంది మూర్ఖులు అజ్ఞానంతో తమను గురించి గొప్పగా ఊహించుకొని నోటి దురదతో అవాకులు, చవాకులు పేలి బలవంతులతో విరోధం కొనితెచ్చుకొని ఆపదలపాలు అవుతూ ఉంటారు. ఈ కథలోని బూరుగుచెట్టు అలాంటిదే.

ఈ కథను తిక్కన శాంతిపర్వం తృతీయాశ్వాసంలో 383వ పద్యం నుంచి 397వ వచనం వరకూ 15 పద్య, గద్యాల్లో క్లుప్తంగా రచించాడు. మూలంలో విపులంగా ఉన్న సంభాషణలను తిక్కన చాలా క్లుప్తంగా చెప్పాడు.

## 8. కృతఘ్నుని కథ :

సంస్కృత భారతంలో ఈ కథ శాంతిపర్వంలోని ఆపద్ధర్మానుశాన పర్వం అనే ఉపపర్వంలో 168వ అధ్యాయం నుంచి 173వ అధ్యాయం వరకూ ఉన్న ఆరు అధ్యాయాల్లో 188 శ్లోకాల్లో ఉంది. ఈ కథను భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. ధర్మరాజు "మానవుల్లో ఎలాంటివాళ్ళు సౌమ్యులు? ఎవరిని ప్రేమించాలి? ఎవరు ఉపకారం చేసేవారు" అనే విషయాలను గురించి చెప్ప వలసిందిగా భీష్ముని కోరతాడు. దానికి భీష్ముడు దోషాలున్న వారందరిలోకి కృతఘ్నుడు పరమనీచుడు. అలాంటివాడు మిత్రులను కూడా చంపుతాడు. ఇలాంటి అధములను పూర్తిగా వదలివేయాలి. దీనికి సంబంధించిన కథను చెబుతాను విను అని భీష్ముడు ఈ కథను ఇలా చెబుతాడు.

మ్లేచ్ఛ దేశంలో గౌతముడు అనే పేరు గల ఒక బ్రహ్మణుడున్నాడు. అతడు బ్రాహ్మణులు చేయవలసిన వేదాధ్యయనం మొదలైనవేవీ చేయకుండా భిక్షాటనతో జీవించేవాడు. ఒకసారి అతను ఒక బందిపోటు దొంగ ఇంటికి భిక్షకోసం వెళ్తాడు. ఆ దొంగ దాత, బ్రాహ్మణ భక్తుడు కావడం వల్ల అతడు గౌతముడు ఉండడానికి ఒక ఇల్లు తినడానికి అవసరమైన ఆహార సామాగ్రి మొదలైన అన్ని సౌకర్యాలతోపాటు అతనికి సేవ చేయడానికి భర్త చనిపోయిన ఒక శూద్ర యువతిని కూడా ఏర్పాటు చేస్తాడు. గౌతముడు ఆ దాసితో సుఖంగా జీవిస్తూ ఆటవికుల లాగా గురి చూసి బాణం వేయడం నేర్చుకొని ప్రతిరోజూ అడవికి వెళ్ళి అనేక పక్షులను, మృగాలను చంపి తింటూ జీవిస్తుంటాడు. ఒకసారి అతని దగ్గరకు గౌతముని ఊరివాడు, మిత్రుడు వేదాధ్యన తత్పరుడు అయిన ఒక బ్రాహ్మణుడు వస్తాడు. అదే సమయంలో గౌతముడు తాను చంపిన హంసలను భజమ్మీద వేలాడ దీసుకొని చేతిలో ధనస్సు పట్టుకొని రక్తంతో తడిసిన శరీరంతో రాక్షసుని లాగా వేట నుంచి వస్తాడు. సద్బ్రాహ్మణుడు అతణ్ణి చూసి ఆశ్చర్యపోయి అతణ్ణి మార్చాలనే ఉద్దేశ్యంతో సద్బ్రాహ్మణ కర్మలను గురించి ఉపదేశించి, హింసను త్యజించమని అనేక రకాలుగా బోధిస్తాడు. గౌతముడు అతని మాటలను విని పశ్చాత్తాప పడినట్లుగా నటించి మరుసటి రోజు తెల్లవారిన తర్వాత ఆ వూరిని క్రూర కర్మలను వదిలిపెట్టి అతని తోపాటు తాను వస్తానని సద్బ్రాహ్మణునికి తగిన పనులను చేస్తానని చెప్పి అతనికి నమ్మకం కలిగిస్తాడు. సద్బ్రాహ్మణుడు రాత్రి నిద్రపోయిన తర్వాత గౌతముడు అక్కడ నుంచి సముద్రం దగ్గరికి వెళ్ళడానికి బయలుదేరుతాడు. అదే సమయంలో కొంతమంది వ్యాపారులు అక్కడికి రాగా వారితో కలిసి సముద్రతీరానికి వెళ్తాడు. ఇంతలోనే ఒక మదించిన ఏనుగు వారి మీద పడి అందరినీ చంపుతూ ఉంటుంది. గౌతముడు అతి కష్టం మీద తప్పించుకొని ఉత్తర దిక్కుకు పారిపోయి ఒక అడవిలో తిరుగుతూ తిరుగుతూ ఒక దివ్యమైన ఉద్యానవనంలోకి ప్రవేశిస్తాడు. ఆ ఉద్యాన వనం అనేక రకాల పండ్ల చెట్లతో, పూల మొక్కలతో సువాసనలు వెదజల్లుతూ రమణీయంగా ఉంటుంది. ఆ చల్లని గాలికి గౌతముడు ఆదమరిచి నిద్రపోతాడు.

ఆ ఉద్యానవనం నాడీజంఘుడు అనే పేరు గల ఉత్తమమైన కొంగది. ఆ కొంగ సురభి కశ్యపుల కుమారుడు, బ్రహ్మదేవునికి ఆప్తమిత్రుడు. అతనికి రాజధర్ముడు అనే ప్రసిద్ధమైన మరొక పేరు ఉంటుంది. దేవకన్యా పుత్రుడు కావడం వల్ల అతని శరీరం దివ్యతేజస్సుతో వెలిగిపోతూ ఉంటుంది. అలాంటి కొంగను చూసి గౌతముడు మొదట ఆశ్చర్యపోయి ఆకలితో ఉన్నవాడు కావడంచేత ఆ కొంగను చంపి తినాలనుకుంటాడు. ఆ కొంగ గౌతమునితో "బ్రాహ్మణా! నా అదృష్టం వల్ల ఈనాడు నాకు అతిథిగా వచ్చావు. యథావిథిగా నా ఆతిథ్యాన్ని స్వీకరించి రేపు పొద్దున నీ దారిలో నీవు వెళ్ళవచ్చు" అని పలికి పక్కనే ఉన్న నది నుంచి చేపలను పట్టి తెచ్చి వాటిని కాల్చి అతనికి ఆహారంగా సమర్పిస్తుంది. తన రెక్కలతో విసరి అతని శ్రమను పోగొడుతుంది. ఆ తర్వాత నాడీజంఘుడు గౌతముడు అక్కడికి వచ్చిన కారణాన్ని గురించి ప్రశ్నిస్తుంది. దానికి గౌతముడు తాను దరిద్రుణ్ణని, ద్రవ్య సంపాదన కోసం తిరుగుతున్నానని చెబుతాడు. దానికి కొంగ ధన సంపాదనకు అతడు ఎక్కడికీ వెళ్ళనవసరం లేదని, తనకు ఆప్తమిత్రుడైన విరూపాక్షుడు అనే రాక్షసరాజు మూడు యోజనాల దూరంలోని నగరంలో ఉన్నాడని అతని దగ్గరకు వెళ్ళి తన మిత్రునిగా చెప్పుకుంటే గౌతమునికి కావలసినంత బంగారం అతను ఇస్తాడని చెబుతుంది. దానికి గౌతముడు సంతోషించి మరుసటి రోజు విరూపాక్షుడు ఉన్న నగరానికి వెళ్ళి అతణ్ణి దర్శించి నాడీజంఘుని మిత్రునిగా పరిచయం చేసుకొని తాను వచ్చిన పనిని గురించి వివరిస్తాడు. విరూపాక్షుడు గౌతముని చరిత్ర ఉన్నది ఉన్నట్లుగా చెప్పమంటాడు. గౌతముడు "రాజా! నేను మధ్యదేశంలో బ్రాహ్మణ కులంలో పుట్టాను. శబరుల గ్రామంలో ఉంటాను. నా భార్య శూద్ర స్త్రీ, ఆమె మొదట ఇంకొకరి భార్య, ప్రస్తుతం నా భార్య" అని తన గురించిన వాస్తవాన్ని చెబుతాడు. అది విన్న తర్వాత విరూపాక్షుడు తనలో ఇతడు కేవలం జన్మతో మాత్రమే బ్రాహ్మణుడు, ఇతణ్ణి తనకు అత్యంత ఆప్తమిత్రుడైన నాడీజంఘుడు పంపించాడు. కాబట్టి ఇతనికి అవసరమైన ధనాన్ని ఇస్తాను అని భావించి, తాను ప్రతిరోజు చేసే బ్రాహ్మణ పూజతోపాటు గౌతముని కూడా పూజించి ఇతర బ్రాహ్మణులతో సమానంగా గౌతమునికి గూడా విలువైన బంగారు, వెండి, వజ్రాలు, వైఢూర్యాలు మొదలైన వాటిని ఇచ్చి పంపిస్తాడు. గౌతముడు ఆ బంగారాన్ని మోసుకుంటూ నాడీజంఘుని దగ్గరికి వస్తాడు. నాడీజంఘుడు మళ్ళీ అతనికి అనేక రకాల సపర్యలు చేసి చక్కటి భోజనం పెట్టి రాత్రి అతని పక్కలోనే పడుకుంటాడు. ఆ సమయంలో గౌతముడు "ఈ బంగారాన్ని మోసుకొని నేను చాలా దూరం వెళ్ళాలి. దారిలో తినడానికి ఆహారం కావాలి, ఆహారం ఉంటేగానీ ప్రాణం నిలవదు. కాబట్టి నేను బతకాలంటే ఆహారం తప్పనిసరి" అని ఆలోచిస్తున్నప్పుడు తన పక్కనే పడుకున్న తనకు ఎంతగానో ఉపకారం చేసిన నాడీజంఘుడు అతనికి పెద్ద మాంసపు ముద్దలాగా కనిపిస్తాడు. దానితో అతను నిద్రపోతున్న నాడీ జంఘుని చంపి పక్షి రెక్కలు ఈకలు తీసివేసి అగ్నిలో కాల్చి ఆ మాంసాన్ని బంగారాన్ని తీసుకొని తన గ్రామానికి బయలుదేరతాడు.

నాడీజంఘుడు ప్రతిరోజూ బ్రహ్మ దర్శనానికి వెళ్ళి తిరిగివస్తూ దారిలో విరూపాక్షుని దగ్గరకు వస్తూ ఉంటాడు. అప్పటికి రెండు రోజులుగా నాడీ జంఘుడు రాకపోవడం చేత విరూపాక్షుడు దుష్టుడైన గౌతముని వల్ల అతనికేదైనా అపకారం జరిగి ఉంటుందని అనుమానించి, తన కుమారునితోపాటు కొంతమంది అనుచరులైన రాక్షసులను నాడీజంఘుని ఉద్యాన వనానికి పంపిస్తాడు. అతని కుమారుడు అక్కడ నాడీజంఘుని ఈకలను చూసి జరిగిన విషయాన్ని గ్రహించి అనుచరులతో చాలా వేగంగా ప్రయాణించి గౌతముని పట్టుకొని అతని వద్ద ఉన్న నాడీజంఘుని శరీరాన్ని తీసుకొని విరూపాక్షుని వద్దకు వస్తాడు. నాడీజంఘుని శరీరాన్ని చూసి విరూపాక్షుడు, అతని కుటుంబ సభ్యులు, మంత్రులు బోరున విలపిస్తారు. వెంటనే విరూపాక్షుడు పట్టరాని కోపంతో తన మిత్రుని చంపిన పరమ క్రూరుడు, కృతఘ్నుడు అయిన గౌతముణ్ణి రాక్షసులైన తన అనుచరులతో ముక్కలు ముక్కలుగా నరికించి అతని మాంసాన్ని దోపిడిగాండ్రకు ఆహారంగా వేయిస్తాడు. కృతఘ్నుడైన అతడి మాంసాన్ని తినడానికి దోపిడిగాండ్రు కూడా ఇష్టపడరు.

**"మిత్రద్రోహీ కృతఘ్నశ్చ నృశంసశ్చ నరాధమః**
**క్రవ్యా దైః కృమిభిశ్చైవ న భుజ్యన్తేహి తాదృశాః"**
**(శాంతి. 172 – 26వ శ్లోకం)**

"మిత్రద్రోహం చేసినవాడు, కృతఘ్నుడు క్రూరుడు ఇంకా ఇలాంటి వారిని క్రూర మృగాలు, పురుగులు గూడా తినవు".

ఆ తర్వాత విరూపాక్షుడు నాడీజంఘుని శరీరానికి దహన క్రియలు నిర్వర్తిస్తాడు. అదే సమయంలో అతని తల్లి, దక్షుని కుమార్తె అయిన సురభిదేవి ఆకాశంలో నిల్చుంటుంది. దాని నోటి నుంచి పాలతో కూడిన నురుగు జారి నాడీజంఘుని చితి మీద పడుతుంది. దానితో నాడీజంఘుడు తిరిగి జీవిస్తాడు. అదే సమయంలోనే దేవేంద్రుడు అక్కడికి వచ్చి పూర్వం బ్రహ్మదేవుడు ఇచ్చిన శాపం వల్ల నాడీజంఘుడు గౌతమునిచేత చంపబడ్డాడని చెబుతాడు. అప్పుడు నాడీజంఘుడు మహేంద్రునికి నమస్కరించి చనిపోయిన గౌతముణ్ణి బతికించ వలసిందిగా కోరతాడు. దేవేంద్రుడు అమృతాన్ని చల్ల గౌతముని బతికిస్తాడు. నాడీ జంఘుడు గౌతముణ్ణి కౌగలించుకొని, ధనంతో సహా అతణ్ణి అతని గ్రామానికి పంపిస్తాడు. గౌతముడు తన గ్రామానికి వెళ్ళి శూద్రస్త్రీతో సంసారంచేసి సంతానం పొందుతాడు. ఈ పాపం కారణంగా అతడు ఘోరనరకంలో పడతాడు. ఈ కథను భీష్ముడు ధర్మరాజుకు చెప్పి

**"కృతజ్ఞేన సదా భావ్యం మిత్ర కామేన చైవ హ**
**మిత్రాచ్చ లభతే సర్వం మిత్రా త్పూజాం లభేతచ"**
**"మిత్రాద్ భోగాంశ్చ భుఞ్జీత మిత్రేణాపత్సు ముచ్యతే**
**సత్కారై రుత్తమైర్మిత్రం పూజయీత విచక్షణః"**
**(శాంతి. 173 – 22, 23 శ్లోకాలు)**

"మనిషి తాను ఎల్లప్పుడు కృతజ్ఞుడుగా ఉండాలి. మిత్రుల కోరికలను తీర్చాలి. మిత్రుని వల్ల సర్వమూ లభిస్తుంది. మిత్రుని వల్ల మనిషి భోగాలను పొందుతాడు. మిత్రుని వల్ల ఆపదల నుంచి బయట పడతాడు. వివేకవంతుడు మిత్రుని గొప్ప సత్కారాలతో పూజించాలి" అని చెబుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథ జానపద కథల ప్రభావంతో రాసినది. ఈ కథ వల్ల మనుషులు ఉపకారం చేసిన వారి పట్ల కృతజ్ఞులుగా ఉండాలని, మిత్రుల పట్ల నాడీ జంఘుని లాగా ప్రేమాభిమానాలను చూపించాలని తెలుస్తూ వుంది. అంతేగాకుండా కృతఘ్నునికి ఎలాంటి సహాయం చేయకూడదని, అసలు అలాంటి వారికి ఆశ్రయ మివ్వడం కూడా చేయగూడదనే నీతిని తెలుపుతూ ఉంది. ఈ కథలోని గౌతముడు అనే బ్రాహ్మణుడు నీచాతినీచుడు. అడవిలో దారి తెన్నూ తెలియకుండా తిరిగి అలసి సొలసి వున్న అతనికి ఆత్మీయతతో కూడుకున్న గొప్ప ఆతిథ్యాన్ని ఇవ్వడమే కాకుండా అతను జీవితాంతం ఎలాంటి కష్టం లేకుండా సుఖంగా జీవించడానికి అవసరమైన బంగారం వజ్రవైఢూర్యాలు మొదలైన వాటిని తన మిత్రుడైన విరూపాక్షునిద్వారా ఇప్పించిన నాడీజంఘుని మీద కొంచెం కూడా కృతజ్ఞత లేకుండా, మానవత్వం లేకుండా చంపి దాని మాంసాన్ని కాల్చి ఆహారంగా వినియోగించాలను కోవడం మాటలతో చెప్పడానికి సాధ్యం కాని దుర్మార్గం, నీచాతి నీచం. లోకంలో ఇలాంటి నరాధముడు ఇంకెవ్వరూ ఉండరు. పులి, తోడేలు, నక్క మొదలైన క్రూర జంతువులు కూడా ఇలా చేయవు. ఇలాంటి మనుషులను దూరంగా ఉంచాలని, వారికి దూరంగా ఉండాలని ఈకథ ఋజువుచేస్తూ ఉంది.

ఈ కథ వల్ల ఆనాడు కొంత మంది బ్రాహ్మణులు వేదాధ్యయనం మొదలైనవేవీ చేయకుండా కేవలం భిక్షాటన మీద మాత్రమే జీవించే వారని, కొంత మంది కృతజ్ఞత ఏ మాత్రం లేకుండా పరమ దుర్మార్గంగా ప్రవర్తించే వారని తెలుస్తూ ఉంది. అలాగే ఆనాటి సమాజంలో వేదాధ్యయనం స్నానం సంధ్య మొదలైనవి చేయకుండా బిక్షాటనతో జీవించే మామూలు బ్రాహ్మణులకు కూడా చాలా గౌరవం ఉన్నట్లు తెలుస్తూ ఉంది. ఈ కథలో ఒక దొంగ గౌతముడు నివసించడానికి ఇల్లు, తినడానికి అవసరమైన అన్ని సౌకర్యాలతోపాటు భర్త చనిపోయిన ఒక శూద్ర స్త్రీని అతనికి పరిచర్య చేయడానికి ఏర్పాటు చేశాడు. ఒక దొంగకు బ్రాహ్మణ లక్షణాలేవీ లేని బ్రాహ్మణుని మీద ఇంత భక్తి ఉంటే సాధారణ శూద్రులు, వైశ్యులు, క్షత్రియులకు ఎంత గొప్ప బ్రాహ్మణ భక్తి ఉండేదో మనం సులభంగా అర్థం చేసుకోవచ్చు.

ఈ కథలో ఒక ప్రత్యేకమైన పాత్ర నాడీజంఘుడు. ఇతని తండ్రి కశ్యపుడు, తల్లి దక్షుని కుమార్తె అయిన సురభి. సురభి అంటే ధేనువు. ఇతడు ఋషికి, గోవుకు పుట్టిన కొంగ. ఈ కథలో ఇతడు బ్రహ్మదేవునికి ఆప్తమిత్రుడని, మేరువ్రజం అనే నగరాన్ని పాలిస్తున్న విరూపాక్షుడు అనే రాక్షస రాజుకు ప్రాణమిత్రుడని చెప్పబడింది. ఇతను ప్రతీరోజు

బ్రహ్మ వద్దకు వెళ్ళి బ్రహ్మను దర్శించి తిరిగి వచ్చే మార్గంలో విరూపాక్షుని కలిసి, అతనితో కొంతసేపు గడిపి, తిరిగి తన నివాసానికి వస్తుంటాడు. ఇలాంటి ఈ కొంగ తన నివాసానికి వచ్చిన సాధారణ బ్రాహ్మణుడైన గౌతమునికి అపూర్వమైన అతిథి సత్కారాలు చేసి, తన మిత్రుని ద్వారా అమూల్యమైన ధనాన్ని ఇప్పిస్తుంది. ఇంత మహోపకారం చేసిన తనను చంపి, కాల్చి ఆహారంగా స్వీకరించడానికి ప్రయత్నించిన గౌతముని క్షమించడమే కాకుండా విరూపాక్షుని సేవకులచేత ముక్కలు ముక్కలుగా నరికి వేయబడిన గౌతముని బతికించమని దేవేంద్రుని కోరి అతణ్ణి పునర్జీవితుని చేసి కౌగలించుకొని ధనంతోసహా అతణ్ణి అతని గ్రామానికి పంపిస్తుంది.

ఈ కథా రచయిత ఆనాటి సమాజానికి బ్రాహ్మణభక్తిని చాటి చెప్పాడు. బ్రాహ్మణుడు ఎంత నీచుడు, దుర్మార్గుడు అయినప్పటికీ సమాజంలోని వ్యక్తులు దొంగల నుంచి మొదలుకొని అత్యున్నతమైన స్థాయి కల్గిన వారి వరకు అందరూ బ్రాహ్మణ భక్తి కల్గి ఉండాలని, బ్రాహ్మణులకు సేవ చేయాలని ఉద్బోధ చేశాడు. ఈ కథలో గౌతముడు బ్రాహ్మణుడు కావడంవల్ల అతనికి దొంగ అనేక సౌకర్యాలు కల్పించాడు. గొప్ప బ్రహ్మర్షి అయిన కశ్యపునికి దక్ష ప్రజాపతి పుత్రిక అయిన కామధేనువుకు జన్మించిన నాడీజంఘుడు పుట్టుక చేత చాలా గొప్పవాడు. అంతేగాకుండా ఇతడు సాక్షాత్తు బ్రహ్మకు ఆప్తమిత్రుడు. ఇలాంటి నాడీ జంఘుడు గౌతముని ప్రవర్తనను పట్టించు కోకుండా అతడు బ్రాహ్మణుడైనందు వల్లనే అతనికి మహోపకారం చేశాడు. ఈ కథలో దొంగ సమాజంలో అత్యంత హీనదశకు చెందినవాడు. నాడీజంఘుడు ఉన్నత దశకు చెందిన వాడు. వీరిద్దరూ కేవలం పుట్టు బ్రాహ్మణుడైన గౌతమునికి బ్రాహ్మణ భక్తితో ఎంతో సేవలు చేశారు. వీరి లాగానే సమాజంలో ఉన్న అన్ని జాతుల వారు బ్రాహ్మణుని గుణగణాలను పట్టించుకోకుండా బ్రాహ్మణులైన వారందరికీ సేవలు చేయాలని ఈ కథా రచయిత చెప్పి తన బ్రాహ్మణ కులాభిమానాన్ని చాటుకున్నాడు.

ఈ కథను తిక్కన శాంతిపర్వం తృతీయాశ్వాసంలోని 470 పద్యం నుంచి 525వ పద్యం వరకూ ఉన్న 56 గద్యపద్యాల్లో రచించాడు. తిక్కన ఈ కథలో ఎలాంటి మార్పు చేయలేదు. మూలంలో ఉన్నది ఉన్నట్లుగా కొంత సంక్షిప్తంగా రాశాడు.

ఈ నీతి కథలలో ఋషి-శ్వానం కథ అచ్చమైన జానపద కథ. మిగిలిన ఏడు జానపద నీతికథల ప్రభావంతో పండిత కవులు కల్పించినవి. వీటిలో జానపద నీతి కథాంశాలు ఉన్నాయి. అందువల్ల ఈ కథలన్నీ జానపద కథాంశాలతో ఉన్నాయని చెప్పవచ్చు.

# 5. మహాభారతంలోఅద్భుత కథాంశ కథలు

జానపద కథల్లో అద్భుతకథలకు ఒక విశిష్టమైన స్థానముంది. ప్రపంచంలోని అన్ని భాషల్లోను అద్భుతకథలకు చాలా ప్రచారం ప్రసిద్ధి ఉన్నాయి. ప్రాచీన మానవులకు గానీ, ఆధునిక మానవులకు గానీ అద్భుతాంశాల పట్ల ఆసక్తి ఎక్కువగా ఉంటుంది. మనుషులకు తీరని కోరికలు ఎన్నో ఉంటాయి. వాస్తవిక జీవితంలో అనుభవించలేని అంశాలను మానవులు తాము కల్పించే సాహిత్యంలోను, కళల్లోను చిత్రించి సంతృప్తి పొందుతూ ఉంటారు. కళాసృష్టి చేయలేని ఇతరులు వాటిని చదివి విని లేక చూచి ఆనందిస్తూ ఉంటారు. శాస్త్ర విజ్ఞానం తెలియని ప్రాచీన కాలంలో మనుషులు అతిశయోక్తులతో, అద్భుత సంఘటనలతో కూడిన కథలను విని ఆనందాన్ని పొందేవారు. శాస్త్ర విజ్ఞానం దినదినాభివృద్ధి చెందుతున్న నేటి కాలంలో స్పైడర్‌మాన్, సూపర్‌మాన్, అవతార్, హ్యారీపాటర్ మొదలైన అద్భుతాంశాలతో కూడిన చలనచిత్రాలను చూసి ప్రజలు ఆనందిసున్నారు. దీనికి కారణం మానవులకు అద్భుత కథల పట్ల ఉన్న ఆసక్తే. తాము చేయలేని అద్భుత కార్యాలను, సాహసాలను తాము చదివే కథల్లోనూ, చూచే సినిమాల్లోనూ తిలకించి వాటిని తామే చేసినట్లుగా సంతృప్తి పొందడం మానవ నైజం.

అద్భుతకథల్లో మానవాతీత శక్తుల పాత్ర ఎక్కువగా ఉంటుంది. దేవతలు, మునులు, వారు ఇచ్చే శాపాలు, వరాలు, రాక్షసులు, కీలుగుర్రాలు, గండబేరుండ పక్షులు, మాంత్రికులు, మంత్రదండాలు, దయ్యాలు, పిశాచాలు, బేతాళుడు, యక్షులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు మొదలైనవారు జానపద అద్భుత కథల్లో ప్రధాన పాత్ర వహిస్తాయి. అద్భుత కథా నిర్మాణాన్ని దాని స్వరూప స్వభావాలను గురించి పాశ్చాత్య దేశాల్లో గొప్ప పరిశోధన జరిగింది. వీటిలో V.J. ప్రాప్ రాసిన “Morphology of the Folk Tale” అనే గ్రంథం విశిష్టమైనది. ఈ గ్రంథంలో ప్రాప్ తన రష్యా దేశానికి చెందిన వంద అద్భుత కథలను స్వీకరించి వాటి నిర్మాణాన్ని విశ్లేషిస్తూ అపూర్వమైన, విశిష్టమైన సిద్ధాంతాన్ని చేశాడు. ఇందులో చెప్పిన సిద్ధాంతం ప్రపంచంలోని అన్ని భాషలకు చెందిన అద్భుత కథలకు వర్తింపజేసు కోవచ్చు. అద్భుతకథల్లో అతి ముఖ్యమైనవి అందులోని పాత్రల చర్యలు. ప్రాప్ ఈ చర్యలకు Functions (ప్రకార్యాలు) అని పేరు పెట్టి మొత్తం 31 ప్రకార్యాలను చెప్పాడు. జానపద అద్భుత కథా నిర్మాణాన్ని, దాని చట్రాన్ని ఈ ప్రకార్యాలు నిర్ణయిస్తాయని ఈ ప్రకార్యాల పరస్పర సంబంధాన్ని కథతో వాటికున్న సంబంధాన్ని ప్రధానంగా ప్రాప్ ఈ గ్రంథంలో విశ్లేషించాడు. అమెరికా దేశపు జానపద విజ్ఞానవేత్త అయిన అలెన్‌డండెస్ ప్రాప్ విశ్లేషణకు చిన్న మార్పులు చేసి అమెరికన్ ఇండియన్ జానపథ కథలను విశ్లేషించాడు.

తెలుగులో కొన్ని వందల అద్భుతకథలున్నాయి. వీటిలో కొన్ని కథలు సరళంగా చిన్నవిగా ఉంటే మరికొన్ని సంక్లిష్టంగా పెద్దవిగా ఉన్నాయి. సంక్లిష్టంగా ఉన్న

కథల్లో  ఉపకథలుంటాయి. తెలుగులోనే కాదు అన్ని భాషల్లోని అద్భుత కథల్లోనూ ఈ పరిస్థితి ఉంటుంది. తెలుగులోని అనేక అద్భుతకథలను పరిశీలించి  అద్భుత కథాంశాలను కింది విధంగా చెప్పవచ్చు.

1. అద్భుతకథలు వాస్తవానికి దూరంగా ఉంటాయి.
2. వీటిలో కల్పనలు నమ్మదగినవిగా, హేతుబద్ధమైనవిగా ఉండవు. అతిశయోక్తులు, అద్భుత సంఘటనలు ఉంటాయి. కొన్ని కథల్లో అత్యంతాతిశయోక్తు లుంటాయి. దేవతలు, యక్షులు, నాగులు మొదలైనవారుంటారు. వీటిలో కొందరు మంచివారుగా కొందరు చెడ్డవారుగా ఉంటారు. దుర్మార్గులు కథలో నాయకునికి లేదా ముఖ్యపాత్రలకు అపకారం చేసేవారుగా, నాయకుడు చేసే పనికి విఘ్నాలు కలిగించే వారుగా ఉంటారు. మంచివారు నాయకునికి ముఖ్యంగా అతడు కష్టాల్లో ఉన్నప్పుడు అతణ్ణి ఆ కష్టాల్లో నుంచి రక్షిస్తారు.
3. నాయకుడు లేదా ప్రధాన పాత్ర దేవతల వరం వల్ల గానీ, ఋషుల వరం వల్ల గానీ పుడతాడు. కొన్ని కథల్లో ఋషి ఇచ్చిన మామిడిపండు తినడం వల్ల సంతానం కలుగుతుంది. మరికొన్ని కథల్లో నాయకుడు గానీ, ప్రధాన పాత్ర గానీ గత జన్మలోని శాపం కారణంగా పుడతాడు.
4. నాయకుడు ప్రధానంగా రాజకుమారుడై ఉంటాడు. కొన్నికథల్లో బ్రాహ్మణ కుమారుడు నాయకుడుగా ఉంటాడు.
5. నాయకుడు ఇంటి నుంచి కార్యసాధనకు బయలుదేరతాడు. కొన్ని కథల్లో నాయకుడు ప్రతినాయకుని స్వాధీనంలో ఉన్న తన వారిని రక్షించుకోవడానికి బయలుదేరతాడు. మరికొన్ని కథల్లో నాయకుడు తనకు కలలో కనిపించిన అపురూప సౌందర్యరాశి అయిన దేవకన్యను చేపట్టడానికి గానీ లేదా దేశాటనకు గానీ బయలుదేరతాడు. కొన్ని కథల్లో నాయకుడు గురుదక్షిణగా గురువు కోరిన వస్తువును సాధించడానికి బయలుదేరుతాడు. ఇలా అనేక కారణాలతో నాయకుడు ఇంటి నుంచి బయలుదేరతాడు.
6. ప్రతినాయకుడు దుర్మార్గుడుగా ఉండి నాయకుని కార్యసాధనకు విఘ్నాలు కలిగిస్తాడు. ప్రతినాయకుడు మంత్రతంత్రాలు, క్షుద్రవిద్యలు, కామరూపం, కామగమనం మొదలైన విద్యలు తెలిసినవాడుగా ఉంటాడు. ఇతడు తనకు తెలిసిన అన్ని మాయలు ప్రయోగించి నాయకునికి దక్కవలసిన వస్తువును గానీ, స్త్రీని గానీ అపహరిస్తాడు. కొన్ని కథల్లో ప్రతినాయకుడు కాళికాదేవికి నరబలి ఇస్తుంటాడు. నాయకుడు నరబలిని ఆపడం గానీ, తానే ప్రతినాయకుణ్ణి కాళికాదేవికి బలి ఇవ్వడం గానీ చేస్తాడు.
7. కథ కేవలం భూలోకానికి పరిమితం గాకుండా ఊర్ధ్వలోకాలకు, అథో లోకాలకు వ్యాపించి ఉంటుంది. ప్రతినాయకుడు నాయకునికి చెందవలసిన వస్తువును గానీ, స్త్రీని గానీ అపహరించి వేరే లోకాలకు తీసుకొని వెళ్ళిపోతాడు.

8. నాయకుడు ప్రతినాయకుని అన్వేషిస్తూ బయలు దేరుతాడు. ఈ అన్వేషణలో అతనికి దేవతలు యక్షులు, కిన్నరులు సన్మార్గులైన రాక్షసులు మొదలైనవారు సాయం చేసి అతణ్ణి ప్రతినాయకుడు దాక్కున్న లోకానికి తీసుకొని పోతారు. ఆ లోకాల్లో కూడా నాయకుడు దేవతల సాయంతో ప్రతినాయకుని ఓడించి అతను అపహరించిన వస్తువును స్వాధీనం చేసుకొని దేవతల సాయంతోనే వాయువేగంతో నివాసానికి చేరుకొని నిర్ణీత సమయంలోనే వస్తువును అవసరానికి ఉపయోగిస్తాడు.

**9.** కొన్ని కథల్లో ప్రధాన పాత్రలు పందెం వేసుకోవడం ఉంటుంది. కొందరు అధర్మంగా అంటే మోసం చేసి పందెం గెలిచి ఓడిపోయిన వారి రాజ్యాన్నిగానీ, ధనాన్ని గానీ, వ్యక్తులను గానీ స్వాధీనం చేసుకుంటారు. ఇలా ఓడిపోయిన వారిని వారి కుమారుడైన కథానాయకుడు సాహసకార్యం చేసి ప్రతినాయకుడు అడిగిన వస్తువును తెచ్చి యిచ్చి తండ్రిని గానీ, తల్లిని గానీ దాస్య విముక్తి గావిస్తాడు.

**10.** నాయక ప్రతినాయక సంఘర్షణ ఉంటుంది. ఈ సంఘర్షణ కథ నిడివిని బట్టి ఉంటుంది. కథ చిన్నదిగా ఉంటే ఒకటి రెండు సంఘటనల్లో ఘర్షణ ఉండి, ఆ తర్వాత నాయకుడు ప్రతినాయకుని మీద విజయం సాధించడంతో కథ సుఖాంత మవుతుంది. కథ పెద్దదిగా ఉంటే సంఘర్షణ సంఘటనలు రెండు కంటె ఎక్కువ ఉంటాయి.

**11.** కొన్ని కథల్లో ప్రతినాయకుని మరణం ఒక ప్రత్యేక పద్ధతిలో జరుగుతుంది. ప్రతినాయకుని ప్రాణాలు అతని దేహంలో కాకుండా మరొక చోట నిక్షిప్తమై వుంటాయి. నాయకుడు ప్రతినాయకుని ప్రాణాలు వున్న చోటు తెలుసుకొని దాన్ని నాశనం చేయడం ద్వారా ప్రతినాయకుని సంహరిస్తాడు. దీనికి ఉదాహరణ బాలనాగమ్మ కథలోని మాయలఫకీరు ప్రాణాలు. ఈ కథలో మాయలఫకీరు ప్రాణాలు పద్నాలుగు సముద్రాల అవతల వున్న దీవిలోని చెట్టు తొర్రలో వున్న చిలుకలో వున్నట్లుగా చెప్పబడింది. కథానాయకుడైన బాలవర్ధి రాజు ఎంతో కష్టపడి ఆ చిలుకను చంపడం ద్వారా మాయల ఫకీరును చంపుతాడు. మరికొన్ని కథలలో ప్రతినాయకుని ప్రాణాలు అతని దేహంలో ఏదో ఒక చోట నిక్షిప్తమై వుంటాయి. ప్రాణాలు నిక్షిప్తమై వున్న చోట కొడితేనే అతడు చనిపోతాడు. లేకపోతే చనిపోడు. దీనికి ఉదాహరణ రావణుని ప్రాణాలు అతని పొట్టలోవున్న అమృతభాండంలో నిక్షిప్తమై వున్నట్లు కొన్ని కథల్లో చెప్పబడింది. రాముడు రావణుని పొట్టలోని అమృతబాండాన్ని కొట్టడం ద్వారా అతన్ని సంహరించినట్లుగా ఆ కథల్లో చెప్పబడింది. మరికొన్ని కథల్లో నాయకుడు ప్రతినాయకుని శరీరాన్ని ఒక పద్ధతిలో చీల్చడం ద్వారా అతన్ని చంపుతాడు. ఉదాహరణకు భారతంలో భీముడు జరాసంధుని శరీరాన్ని నిలువుకు రెండు భాగాలుగా చీల్చి ఆ భాగాలను వ్యతిరేక దిశలో వేసి చంపినట్లుగా చెప్పబడింది. ఈ విధంగా అద్భుతకథల్లో ప్రతినాయకుని మరణం ఆశ్చర్యకరంగా కొన్ని కథల్లో వుంటుంది.

**12.** కొన్ని కథల్లో నాయకునికి ఆంక్ష ఉంటుంది. అంటే నాయకుడు చేయగూడని పని ఉంటుంది. అయితే నాయకుడు కావాలని గానీ అనుకోకుండా గానీ ఆంక్షను అతిక్రమిస్తాడు. ఆంక్షను అతిక్రమించడం వల్ల దానికి పర్యవసానంగా నాయకుడు తాను సంపాదించిన వస్తువును కోల్పోవడం గానీ, కష్టాలపాలు కావడం గానీ, రాయిగా మారడం గానీ జరుగుతుంది. నాయకుడు దేవతల సాయంతోగానీ, పేదరాశి పెద్దమ్మలాంటి వారి సాయంతో గానీ, ఆంక్షాతిక్రమణవల్ల కలిగిన పర్యవసానం నుంచి బయటపడతాడు. ఆ తర్వాత నాయకుడు ఏ కార్యసిద్ధికి ప్రయత్నించాడో ఆ ప్రయత్నంలో విజయం సాధించడంతో కథ సుఖాంతమవుతుంది. ఇలాంటి కథల్లో "Lack > Interdiction > Violation > Consequence > Attempted escape > Lack Liquidation" అనే ఆరు అంశాలుంటాయి. దీన్ని L-LL సిద్ధాంతం అంటారు. ఈ సిద్ధాంతాన్ని అలెన్‌డండెస్ చెప్పాడు. అయితే అన్ని జానపద కథల్లోనూ ఈ ఆరుఉండకపోవచ్చు. కొన్నింటిలో ఒకటి రెండు అంశాలు లోపించవచ్చు.

**13.** మరికొన్ని కథల్లో ఆంక్ష మరొక విధంగా వుంటుంది. రాజు వేటకు వెళ్ళి ఒకచోట అందమైన స్త్రీని చూసి తనను పెళ్ళి చేసుకోమని ఆమెను కోరతాడు. ఆమె దానికి అంగీకరిస్తూ ఒక ఆంక్ష పెడుతుంది. రాజు ఆ ఆంక్షకు అంగీకరించి ఆమెను పెళ్ళి చేసుకుంటాడు. జానపద సాహిత్యంలో ఆంక్ష అంటూ వుంటే అది అతిక్రమించడానికే. అందువల్ల ఆంక్ష వున్న ప్రతి కథలోనూ ఆంక్షాతిక్రమణ తప్పనిసరిగా వుంటుంది. ఆంక్షాతిక్రమణ జరిగిన వెంటనే ఆమె అతన్ని విడిచిపెట్టి వెళ్ళిపోతుంది. రాజు చాలా ప్రయత్నించి తిరిగి ఆమెను దక్కించుకోవడంతో కథ సుఖాంతమవుతుంది.

**14.** అద్భుతకథల్లో జంతువులు, పక్షులు మొదలైన మానవేతర ప్రాణులు మాట్లాడతాయి. అంతేగాకుండా కథా నిర్వహణలో ఇవి ప్రధాన పాత్ర వహిస్తాయి. అత్యవసర సమయంలో నాయకునికి సహాయం చేస్తాయి.

**15.** ఈ కథల్లో అద్భుత వస్తువులకు ప్రాధాన్యత ఉంటుంది. మాహాత్మ్యం కలిగిన పావుకోళ్ళు, మణులు, మాయకంబలి, కత్తి మొదలైనవి ఉంటాయి. ఇవి కార్యసాధనలో నాయకునికి ఉపయోగపడతాయి.

**16.** కొన్ని కథల్లో గండబేరుండ పక్షు:లుంటాయి. కారణాంతరం వల్ల చనిపోయిన నాయకుని అవి సంజీవిపుల్ల తెచ్చి బతికిస్తాయి. అంతేగాకుండా కార్యసాధనలో నాయకుడు వెళ్ళ వలసిన ఏడేడు పధ్నాలుగు సముద్రాల అవతలికి అతణ్ణి తీసుకొనిపోయి మళ్ళీ తీసుకొని వస్తాయి.

**17.** అద్భుతకథలు కథను సూటిగా చెబుతాయి. వీటిలో కథను సాగదీయడం ఉండదు.

**18.** కథల్లో మూలాంశాలుంటాయి. వీటిని ఆంగ్లంలో Motifs అంటారు. వీటి వల్ల కథ మలుపు తిరుగుతుంది. సవతితల్లి, మాంత్రికుడు, పిశాచాలు, దేవతలు మొదలైన పాత్రలు, మంత్రదండం, మాయకంబలి మొదలైన మాంత్రిక వస్తువులు, నాయకుడు

సప్త సముద్రాలు దాటి వెళ్ళడం, వరాలు, శాపాలు, పరకాయ ప్రవేశం మొదలైన సంఘటనలు మూలాంశాలు. అమెరికా దేశపు జానపద విజ్ఞానవేత్త అయిన స్టిత్ థాంసన్ "Motif index of Folk Literature" అనే గ్రంథాన్ని ఆరు సంపుటాలుగా రాశాడు. ఇందులో అన్ని భాషల జానపద సాహిత్యంలోని మూలాంశాల విశ్లేషణ ఉంది.

**19.** అద్భుత కథ వచనం, కథాగేయం, రూపకం మొదలైన ఏ ప్రక్రియలోనైనా ఉండవచ్చు.

**20.** అద్భుత కథల్లో మానవస్త్రీలకు పాములు లేదా గుడ్లు జన్మించడం, గుడ్లలో నుంచి పాములు, పక్షులు పుట్టడం మొదలైన అంశాలుంటాయి. కొన్ని కథల్లో స్త్రీగా పుట్టిన వారు పురుషుడుగా మారడం, పురుషుడుగా పుట్టి స్త్రీగా మారడం జరుగుతుంది. ఇలా జరగడానికి కొన్ని కథల్లో వరాలు, శాపాలు కారణంకాగా మరి కొన్ని కథల్లో కొన్ని మహిమగల కోనేర్లు, సరస్సులు మొదలైనవాటిలో స్నానం చేయడం కారణమవుతుంది.

**21.** కొన్ని కథల్లో తల్లిదండ్రులు పుత్రసంతానం కోసం ఈశ్వరుడు మొదలైన దేవతల గురించి తపస్సు చేస్తారు. దేవత ప్రత్యక్షమై వారికి పుత్రుడు కాకుండా కుమార్తె జన్మిస్తుందని, ఆ కుమార్తె తర్వాత కాలంలో కుమారుడుగా మారతాడని ఒక మెలికతో కూడిన వరాన్ని ఇస్తాడు. దేవుడు చెప్పిన మాట వ్యర్థం కాదు కాబట్టి తమకు పుట్టినది కుమార్తె అయినప్పటికీ ఆమె తర్వాత ఎలాగూ పురుషుడుగా మారతాడు కాబట్టి, వారు తమకు కుమారుడు జన్మించాడని ప్రచారం చేస్తూ కుమార్తెను కుమారునిలాగా పెంచుతారు. అంతేగాకుండా ఆ కుమార్తెకు మరొక అమ్మాయినిచ్చి వివాహం కూడా చేస్తారు. అయితే కోడలు కాపురానికి వచ్చిన తర్వాత అసలు విషయం తెలిసిపోవడంతో తల్లిదండ్రులు చిక్కుల్లో పడతారు. తర్వాత కథ కొన్ని మలుపులు తిరిగి అమ్మాయిగా పుట్టిన ఆ వ్యక్తి పురుషుడుగా మారడంతో కథ సుఖాంతమవుతుంది. ఇవన్నీ జానపద కథల్లోని అద్భుత కథాంశాలు. ఈ కథాంశాలను స్వీకరించి పండిత కవులు తాము సొంతంగా కొన్ని కథలను కల్పించి భారతం లాంటి గ్రంథాల్లో చొప్పించారు. ఇలాంటి కథలు సంస్కృత భారతంలో ఉన్నాయి.

తెలుగు జానపద సాహిత్యంలోని అద్భుతకథలను పరిశీలిస్తే పై అంశాలున్నట్లుగా స్పష్టమవుతుంది. అయితే ఈ అంశాలన్నీ అన్ని అద్భుత కథల్లోనూ ఉండవు. వీటిలో కొన్ని అంశాలు కొన్ని కథల్లో ఉంటాయి. ఈ అంశాలు కేవలం తెలుగు కథలకు మాత్రమే సంబంధించినవి కావు. భారతీయ భాషలన్నింటిలోని అద్భుత కథల్లోనూ పై అంశాలు కన్పిస్తాయి. అందువల్లనే సంస్కృత భారతంలోని అద్భుత కథల్లో పై అంశాల్లోని కొన్ని కన్పిస్తున్నాయి. సంస్కృత భారతంలో ఉత్తంకుని కథ, గరుడుని కథ, గంగాశంతనుల కథ, జరాసంధుని కథ, శల దలుల చరిత్ర-వామదేవ మాహాత్మ్యం కథ, శిఖండి కథ అనే ఆరు అద్భుత కథలున్నాయి. వాటిని పరిశీలించుదాం.

## 1. ఉత్తంకుని కథ:

ఈ ఉపాఖ్యానం సంస్కృత భారతంలోని ఆదిపర్వంలో మూడవ ఉపపర్వ మైన పౌష్య పర్వంలో 82వ వచనం నుంచి 169వ వచనం వరకూ ఉన్న 81 వచన, శ్లోకాల్లో ఉంది. ఈ కథను ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలోని మునులకు చెబుతాడు. సంస్కృత భారతం కొన్ని ప్రాచీన ప్రతుల్లో ఇతని పేరు ఉత్తంకుడు అని ఉండగా, మరికొన్ని ప్రతుల్లో ఉదంకుడు అనిఉంది. ఈ రెండు పేర్లకు ఉత్కృష్టమైన జ్ఞానం కలవాడు అని అర్థం. ఉత్తంకుడు వేదుడు అనే గురువు దగ్గర విద్యాభ్యాసం చేస్తున్న శిష్యుడు. ఈ వేదుడు జనమేజయుడు, పౌష్యుడు అనే ఇద్దరు రాజులకు పురోహితుడు. వేదుడు ఈ రాజులకు యజ్ఞం చేయించడానికి వెళ్తూ ఉత్తంకునితో "భోయత్ కించి దస్మద్గృహే పరిహీయతే తదిచ్ఛా మ్యహమపరి హీయమానం భవతా క్రియమానం" "నా యింట్లో ఏ లోటు కలిగినా దాన్ని పూరించు" అని ఆజ్ఞాపించి వెళ్ళిపోతాడు. గురువు చెప్పినట్లుగా ఉత్తంకుడు ఆశ్రమంలో ఏలోటు లేకుండా అన్ని పనులు చేస్తూ ఉంటాడు. ఒకరోజు ఆశ్రమంలోని స్త్రీలు ఉత్తంకుని పిలిచి "ఉపాధ్యాయినీ తే ఋతుమతీ ఉపాధ్యాయశ్చ ప్రోషితః అస్యా యథాయం ఋతుః వంధ్యో న భవతి తథా క్రియతాం ఏషా విషీదతి ఇతి" (ఆది. 3 – 88) "గురుపత్ని ఋతుమతి అయింది. గురువు ఊర్లో లేనందువల్ల ఆమె ఋతుకాలం వృథా కాకుండా చేయు"మని చెబుతారు. అంటే ఋతు కాలంలో గురుపత్ని సంభోగం చేయాలని వారి ఉద్దేశ్యం. అయితే ఉత్తంకుడు దాన్ని అకార్యంగా భావించి తాను అలాంటి అకార్యం చేయనని చెబుతాడు. కొంత కాలం తర్వాత వేదుడు తిరిగి వచ్చి జరిగిన విషయం తెలుసుకొని ఉత్తంకుని ధర్మబుద్ధికి మెచ్చుకొని గురుకులం నుంచి అతణ్ణి ఇంటికి వెళ్ళడానికి అనుజ్ఞ ఇస్తాడు. ఉత్తంకుడు దానికి సంతోషించి గురుదక్షిణగా తాను ఏమి చేయాలో ఆజ్ఞాపించమని వేదుని కోరుతాడు. గురువు గురుపత్ని అడిగిన దాన్ని తెచ్చి ఇవ్వమని ఉత్తంకునికి చెబుతాడు. ఉత్తంకుడు గురుపత్ని వద్దకు వెళ్ళి విషయమంతా ఆమెకు చెప్పి ఆమెకు ఏమి కావాలో చెప్పవలసిందిగా కోరతాడు. దానికి గురుపత్ని పౌష్య మహారాజు భార్యవద్ద ఉన్న కుండలాలను నాలుగు రోజుల్లో తెచ్చి ఇవ్వాలని, వాటిని ధరించి పుణ్యకవ్రతం చేసి బ్రాహ్మణులకు భోజనం వడ్డించాలని, కాబట్టి నాలుగు రోజుల లోపల ఆ కుండలాలను తెచ్చి ఇవ్వుమని చెబుతుంది. ఉత్తంకుడు వెంటనే కుండలాల కోసం బయలుదేరుతాడు.

ఉత్తంకుడు పౌష్యుని దగ్గరకు పోతున్నప్పుడు దారిలో అతనికి ఒక పెద్ద ఎద్దును ఎక్కి వస్తున్న మహాకాయుడు తారసపడి ఆ ఎద్దుపేడను తినుమని చెబుతాడు. ఉత్తంకుడు ఆ పని చేయడానికి మొదట ఇష్టపడక పోయినప్పటికి తర్వాత ఆ ఎద్దు పేడను తిని త్వరగా వెళ్ళాలనే ఉద్దేశంతో నిలుచొని ఆచమనం చేసి పౌష్య మహారాజు వద్దకు వెళ్ళి అతణ్ణి ఆశీర్వాదపూర్వకంగా అభినందించి గురుదక్షిణ కోసం అతని భార్య కుండలాలను తనకు ఇప్పించవలసిందిగా కోరుతాడు. పౌష్యుడు అందుకు సంతోషంగా అంగీకరించి అంతఃపురం

లోపలికి వెళ్ళి తన భార్యను అడిగి కుండలాలను తీసుకోమని ఉత్తంకునికి చెబుతాడు. ఉత్తంకుడు అంతఃపురంలోనికి వెళ్ళి పౌష్యుని భార్య కనిపించక పోవడంతో తిరిగి పౌష్యుని వద్దకు వచ్చి ఆమె కనిపించలేదని చెబుతాడు. దానికి పౌష్యుడు ఆమె పతివ్రత కాబట్టి ఎంగిలితో అపవిత్రమైన వారికి ఆమె కనిపించదని చెబుతాడు. అపుడు ఉత్తంకుడు తాను ఎద్దు పేడ తిని నిలబడి ఆచమనం చేసిన విషయం పౌష్యునికి చెప్పి శాస్త్రబద్ధంగా మళ్ళీ ఆచమనం చేసి తిరిగి అంతఃపురంలోనికి వెళ్ళి పౌష్యుని భార్యను చూసి ఆమెతో తాను వచ్చిన పని గురించి చెప్పి తన గురుపత్ని కోసం ఆమె కుండలాలను ఇవ్వవలసిందిగా కోరుతాడు. పౌష్యుని భార్య సంతోషంగా దానికి అంగీకరించి తన కుండలాలను ఉత్తంకునికి ఇస్తూ నాగరాజైన తక్షకుడు ఆ కుండలాల కోసం గట్టిగా ప్రయత్నిస్తున్నాడని, అప్రమత్తంగా ఉండాలని చెబుతుంది. ఉత్తంకుడు అలాగే ఉంటానని ఆమెకు చెప్పి తిరిగి పౌష్యుని వద్దకు వస్తాడు. పౌష్యుడు తన ఆతిథ్యం స్వీకరించవలసిందిగా ఉత్తంకుని కోరుతాడు. ఉత్తంకుడు అందుకు అంగీకరిస్తూ తాను శీఘ్రంగా వెళ్ళాలని అందువల్ల సిద్ధంగా, పరిశుద్ధంగా ఉన్న అన్నాన్ని వడ్డించమని చెబుతాడు. రాజు సిద్ధంగా ఉన్న అన్నాన్ని అతనికి వడ్డిస్తాడు. ఆ అన్నంలో ఒక వెంట్రుక రావడం చేత ఉత్తంకుడు కోపగించి పౌష్యునితో "నాకుఅశుచి అయిన అన్నాన్ని పెట్టావు కాబట్టి నువ్వు అంధుడివి అవుతావు" అని అతణ్ణి శపిస్తాడు. దానికి పౌష్యుడు కోపించి "నువ్వు శుద్ధమైన అన్నాన్ని కూడా దూషిస్తున్నావు కాబట్టి నువ్వు సంతాన హీనుడవు అవుతావు అని శపిస్తాడు. అపుడు ఉత్తంకుడు అశుచి అయిన అన్నం పెట్టడమే కాకుండా ప్రతిశాపం ఇవ్వడం ఉచితం కాదని, అన్నాన్ని పరీక్షించమని పౌష్యునికి చెబుతాడు. పౌష్యుడు పరిక్షించి చూస్తే అన్నం చల్లబడి ఉండటం, అందులో వెంట్రుక ఉండటం గమనించి ఉత్తంకునితో అశుభ్రమైన అన్నాన్ని వడ్డించినందుకు తనను క్షమించమని, తాను అంధుణ్ణి కాలేనని అందువల్ల అతని శాపాన్ని ఉపసంహరించుమని కోరతాడు. దానికి ఉత్తంకుడు అతని అంధత్వం కొద్దికాలం మాత్రమే ఉంటుందని, అచిరకాలంలోనే అతడు శాపవిముక్తుడు అవుతాడని, అలాగే అతను తనకు ఇచ్చిన శాపాన్ని వెనక్కి తీసుకోమని చెబుతాడు.

**"నవనీతం హృదయం బ్రాహ్మణస్య వాచీ క్షురో నిశిత తీక్ష్ణధారః**
**తదుభయమే తద్విపరీతం క్షత్రియస్య వాఙ్నవనీతం హృదయం**
**తీక్ష్ణ ధారమితి" (ఆది. 3 - 124 )**

బ్రాహ్మణుడు వెన్నలాంటి మనసు కత్తిలాంటి మాటను కలిగి ఉంటాడని, క్షత్రియునిలో ఈ రెండు వ్యతిరేకంగా ఉంటాయని, అందువల్ల తనకు శాపాన్ని మరల్చే శక్తి లేదని పౌష్యుడు చెబుతాడు. అప్పుడు ఉత్తంకుడు శుచి అయిన అన్నాన్ని తాను దూషించడంవల్ల అతడు తనను సంతాన హీనుడవు కమ్మని శపించాడని, అయితే అన్నం దుష్టమైనదని పౌష్యుడు అంగీకరించాడు కాబట్టి అతను తనకు ఇచ్చిన శాపం తగులదని చెప్పి కుండలాలను తీసుకొని బయలు దేరుతాడు.

కుండలాలను చేజిక్కించుకోవడానికి వేచిచూస్తున్న తక్షకుడు దిగంబరుడైన బిక్షువు వేషంతో తక్షకుని వెంబడిస్తూ ఒకసారి కనిపిస్తూ మరొకసారి మాయమవుతూ ఉంటాడు. ఉత్తంకుడు దీన్ని గమనిస్తాడు. కొంత దూరం వెళ్ళిన తర్వాత ఉత్తంకుడు కుండలాలను నేలమీద పెట్టి స్నాన, సంధ్య, వందనాదులు నిర్వర్తించు కుంటూ ఉంటాడు. తక్షకుడు నేలమీద ఉన్న కుండలాలను తీసుకొని పారిపోతూ ఉంటాడు. ఉత్తంకుడు తన కార్యక్రమాలను ముగించుకొని తక్షకుని వెంట పరిగెత్తి అతణ్ణి పట్టుకోబోతున్న సమయంలో తక్షకుడు ఆ రూపాన్ని వదిలివేసి తన పాము రూపాన్ని ధరించి అక్కడ భూమిలో ఉన్న కన్నం గుండా తన నాగలోకానికి వెళ్ళిపోతాడు. ఉత్తంకుడు ఒక కట్టెతో ఆ కన్నాన్ని తవ్వుతూ కష్టం పడుతూ ఉంటాడు. దాన్ని గమనించి ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని ఉత్తంకునికి సాయంగా పంపిస్తాడు. వజ్రాయుధం ఉత్తంకుడు తవ్వుతున్న కట్టెలో ప్రవేశించి నాగలోకానికి దారిని ఏర్పరుస్తుంది. ఉత్తంకుడు ఆ మార్గంలో నాగలోకానికి వెళ్ళి తక్షకుడు కనిపించకపోవడంతో నాగులను ప్రసన్నం చేసుకోవడానికి ఐరావతుడు, ధృతరాష్ట్రుడు, తక్షకుడు మొదలైన నాగదేవతలను స్తోత్రం చేస్తాడు. దాని వల్ల ప్రయోజనం కనిపించదు.

ఉత్తంకుడు అక్కడ తెలుపు నలుపు పోగులున్న పడుగు నూలును మగ్గం మీద ఎక్కించి బట్ట నేస్తున్న ఇద్దరు స్త్రీలను, పన్నెండాకులు గల ఒక చక్రాన్ని తిప్పుతున్న ఆరుగురు బాలురను చూస్తాడు. తర్వాత ఒక అందమైన గుర్రం మీద కూర్చున్న ఒక మహాపురుషుని చూసి అతణ్ణి మంత్రాల వంటి శ్లోకాలతో స్తుతిస్తాడు. అతని స్తుతికి మెచ్చి గుర్రం మీద కూర్చున్న మహాపురుషుడు అతనికేమి కావాలో కోరుకోమంటాడు. ఉత్తంకుడు నాగులందరు తన వశం కావాలని కోరతాడు. అప్పుడు దివ్యపురుషుడు తన గుర్రం యొక్క అపాన ప్రదేశంలో గట్టిగా ఊదుమని చెబుతాడు. ఉత్తంకుడు అతడు చెప్పినట్లు చేయగానే అశ్వం యొక్క శరీరంలోని అన్ని రంధ్రాల నుంచి పొగతోకూడిన అగ్నిజ్వాలలు వెలువడి నాగలోకమంతటా వ్యాపిస్తాయి. దానితో తక్షకుడు భయపడి కుండలాలను తెచ్చి ఉత్తంకునికి ఇస్తాడు. ఉత్తంకుడు వాటిని తీసుకొని గురుపత్ని పుణ్యకవ్రతం చేసుకునేది అదేరోజు అని గ్రహించి తాను ఉన్న నాగలోకం నుంచి ఎలా వెళ్ళగలనా అని ఆలోచిస్తు ఉన్నప్పుడు ఆ దివ్యపురుషుడు అతని ఆలోచన తెలుసుకొని తన గుఱ్ఱం మీద ఉత్తంకుని ఎక్కించి క్షణకాలంలో గురుకులానికి అతణ్ణి చేరుస్తాడు. గురుపత్ని స్నానం చేసి వెంట్రుకలు ఆరబెట్టుకుంటూ ఉత్తంకుడు తాను చెప్పిన నిర్ణీత సమయానికి రాలేకపోయినందుకు అతణ్ణి శపించాలని అనుకుంటూ ఉంటుంది. అదే సమయంలో ఉత్తంకుడు ఆమె వద్దకు వచ్చి కుండలాలను ఆమెకు ఇస్తాడు.

ఆ తర్వాత ఉత్తంకుడు గురువును కలిసి కుండలాల కోసం బయలుదేరి నప్పటి నుంచి తనకు జరిగిన విషయమంతా అతనికి చెప్పి మార్గమధ్యలో తనకు కనిపించిన ఎద్దు, ఎద్దునెక్కిన పురుషుడు, నాగలోకంలో తనకు కనిపించిన ఇద్దరు స్త్రీలు బట్టనేయడం, పన్నెండాకుల చక్రాన్ని ఆరుగురు బాలురు తిప్పడం గుర్రం మీద ఎక్కి వచ్చి తనకు

సహాయం చేసిన మహాపురుషుడు – వీళ్ళందరు ఎవరు, వారి సంగతి ఏమిటని ప్రశ్నిస్తాడు. దానికి అతని గురువైన వేదుడు ఇలా సమాధానం చెబుతాడు. "ఆ యిద్దరు స్త్రీలు ధాత, విధాత. వారు నేస్తున్న బట్టలోని నల్లని తెల్లని పోగులు రాత్రింబవళ్ళు. పన్నెండాకుల చక్రం సంవత్సరం. పన్నెండాకులు పన్నెండు నెలలు. ఆ చక్రాన్ని తిప్పుతున్న ఆరుగురు బాలురు ఆరు ఋతువులు. నాగలోకంలో కనిపించిన అశ్వం అగ్ని. దాని మీద కూర్చున్న పురుషుడు పర్జన్యుడు (ఇంద్రుడు). దారిలో వెళ్తున్నప్పుడు ఉత్తంకునికి కనిపించిన ఎద్దుపేడ అమృతం. దాన్ని తిన్నందు వల్లనే నాగలోకంలో ఉత్తంకుడు చనిపోలేదు. ఇంద్రుడు నా స్నేహితుడు కావడం వల్ల నీకు సహాయం చేసాడు" అని చెప్పి గురుదక్షిణ ఇచ్చావు కాబట్టి నీవు నీకిష్టమైన చోటికి వెళ్ళవచ్చునని చెబుతాడు. ఉత్తంకుడు ఆ విధంగా గురుదక్షిణ చెల్లించి గురువు ఋణం తీర్చుకుని వెళ్ళిపోతాడు.

ఈ కథలో మనం ముందు చెప్పిన జానపద అద్భుత కథాంశాలు కొన్ని ఉన్నాయి. ఈ కథలో నాయకుడు ఉత్తంకుడు. ఇతడు గురుదక్షిణగా పౌష్యుని భార్య కుండలాలను తీసుకొని రావడానికి బయలుదేరతాడు. తర్వాత కథలో ఇతను నాగలోకానికి వెళ్ళవలసి ఉంది. అందుకు కావలసిన శక్తి సామర్థ్యాలను అతనికి సమకూర్చాలి. అందు వల్లనే దేవేంద్రుడు ఐరావతాన్ని ఎద్దుగా మార్చి దాని మీద ఎక్కి వచ్చి, అమృతాన్ని దాని పేడరూపంలో ఉత్తంకునిచేత తినిపిస్తాడు. అంతే కాకుండా ఉత్తంకుని కుండలాలను తక్షకుడు అపహరించి నాగలోకానికి వెళ్ళిపోయి నపుడు దేవేంద్రుడు తన వజ్రాయుధాన్ని పంపించి అతడు నాగలోకానికి వెళ్ళడానికి దారిని ఏర్పరచడమే కాకుండా నాగలోకంలో నాగులందరు భయపడేటట్లుగా చేసి తక్షకుడు కుండలాలను ఉత్తంకునికి ఇచ్చేలాగా చేస్తాడు. ఈ విధంగా ఈ కథలో ఇంద్రుడు కథానాయకుడైన ఉత్తంకునికి అతని కార్యసాధనలో సహాయం చేస్తాడు. ఈ కథలో ప్రతినాయకుడు తక్షకుడు. ఇతడు కామరూపం, కామగమనం మొదలైన శక్తులు కలవాడు. నాయకుడైన ఉత్తంకునికి అవసరమైన కుండలాలను దొంగిలిస్తాడు. అయితే ఉత్తంకునికి దేవేంద్రుడు సహాయం చేయడం వల్ల తక్షకుడు తప్పనిసరి అయి నాయకుని కుండలాలను నాయకునకి తెచ్చి ఇస్తాడు. ఈ కథ వాస్తవానికి దగ్గరగా లేదు. నిజజీవితంలో కష్టాల్లో ఉన్న వారికి దేవతలు సహాయం చేయడం జరగదు. ఈ కథలో దేవేంద్రుడు ఎద్దునెక్కి రావడం, తన వజ్రాయుధాన్ని ఉత్తంకునికి సాయంగా పంపించి అతను నాగలోకానికి వెళ్ళేలాగా చేయడం మొదలైన కల్పనలన్నీ అమానుషమైనవి, అద్భుతమైనవి. ఈ కథ కేవలం భూలోకానికి మాత్రమే పరిమితం కాకుండా నాగలోకానికి కూడా వ్యాపించింది.

ఈ కథలో రాత్రింబవళ్ళు, ఋతువులు, సంవత్సరాలు ఏర్పడడం మొదలైన వాటిని గురించి ప్రాచీన మానవుని ఊహాలను తెలుపుతూ ఉంది. శాస్త్రసాంకేతిక పరిజ్ఞానం తెలియని ప్రాచీన మానవునికి రాత్రింబవళ్ళు, ఋతువులు మొదలైనవి ఏర్పడడానికి వాస్తవ కారణాలు తెలియక అవన్నీ దేవతల కారణంగా ఏర్పడు తున్నాయని భావించాడు. దేవతలు

భూలోకంలో కాకుండా ఊర్ధ్వలోకాల్లో, అథోలోకాల్లో నివశిస్తారని అతని విశ్వాసం. ఆ విశ్వాసానికి తగినట్లుగా నాగలోకంలో ధాత విధాత అనే ఇద్దరు దేవతా స్త్రీలు రాత్రింబవళ్ళను కల్పిస్తున్నారని, ఆరుగురు దేవతా కుమారులు పండ్రెండు నెలలు గల చక్రాన్ని తిప్పుతూ కాలాన్ని నడుపుతున్నారని ఆ ఆరుగురు బాలురు వసంతం, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిర అనే ఆరు ఋతువులని ఊహించాడు. ఈ ఊహనే ఉత్తంకోపాఖ్యాన కర్త ఈ కథలో చెప్పాడు. ఈ విధంగా ప్రాచీన మానవుల ఊహాలను జానపద కథల్లో చెప్పడం సాధారణంగా జరుగుతూ ఉంటుంది.

ఈ కథలో శాపాల ప్రసక్తి, వరాల ప్రసక్తి కూడా ఉంది. ఉత్తంకుడు పౌష్యుడు పరస్పరం శపించుకుంటారు. నాగలోకంలో ఉత్తంకుడు పర్జన్యుని (దేవేంద్రుని) స్తుతించినపుడు పర్జన్యుడు అతనికేమి కావాలో కోరుకోమంటాడు. ఉత్తంకుడు నాగులందరు తనవశం కావాలని కోరుకుంటాడు. దేవేంద్రుడు తాను ఎక్కి ఉన్న గుర్రం శరీర రంధ్రాల నుంచి ధూమాగ్నిజ్వాలలు కల్పించి నాగలోకాన్ని భయపెట్టి తక్షకుడు కుండలాలను ఉత్తంకునికి తెచ్చి ఇచ్చేలాగా చేస్తాడు.

రష్యా దేశానికి చెందిన వి.జె. ప్రాప్ అద్భుత కథా నిర్మాణానికి సంబంధించి చేసిన నూతన పరిశోధనను ఆధారంగా చేసుకొని అలెన్ డండస్ L-LL అనే సిద్ధాంతాన్ని చెప్పాడు. ఈ సిద్ధాంతంలో LACK (లోటు), Interdiction (ఆంక్ష), Violation (ఆంక్షాతిక్రమణ), Consequence (పర్యవసానం), Attempted (అవరోధాలను తప్పించుకోవడం), Lack Liquidation (లోటు తీరడం) అనే ఆరు అంశాలున్నాయి. ఈ సిద్ధాంతాన్ని ఉత్తంకుని కథకు అన్వయించవచ్చు. ఉత్తంకుని గురుపత్నికి కుండలాలు లేకపోవడం LACK (లోటు). పౌష్యుని భార్య కుండలాలను ఉత్తంకునికి ఇస్తూ తక్షకుడు వాటి కోసం ప్రయత్నిస్తున్నాడని అప్రమత్తంగా ఉండాలని ఉత్తంకునికి చెప్పడం Interdiction (ఆంక్ష). ఉత్తంకుడు ఆమె చెప్పిన మాటలను పాటించకుండా అజాగ్రత్తగా కుండలాలను కిందపెట్టి స్నానం, సంధ్యా మొదలైన వాటిని చేయడానికి వెళ్ళడం Violation (ఆంక్షాతిక్రమణ). కిందపెట్టిన కుండలాలను తక్షకుడు దొంగిలించడం Consequence (పర్యవసానం). ఉత్తంకుడు దేవేంద్రుని సహాయంతో నాగలోకానికి వెళ్ళి తక్షకుని కోసం వెదకటం Attempted Escape (అవరోధాలను తప్పించుకోవడం). ఉత్తంకుడు దేవేంద్రుని సహాయంతో తక్షకుని నుంచి కుండలాలను తీసుకొని దేవేంద్రుడు ఇచ్చిన అశ్వంమీద కూర్చొని క్షణంలో గురుకులానికి వచ్చి సకాలంలో గురుపత్నికి కుండలాలను ఇవ్వడం Lack Liquidation (లోటు తీరడం).

ఈ విధంగా సంస్కృత భారతంలోని ఉత్తంకుని కథ జానపద అద్భుత కథాంశాలతో కూడుకొని ఉంది.

ఈ కథలో ఉత్తంకుడు తనకు వడ్డించిన అన్నంలో వెంట్రుక వచ్చినందుకు పౌష్యమహారాజును అంధుడివి కమ్మని శపించాడు. అన్నంలో వెంట్రుక రావడం పెద్ద తప్పుకాదు. అది చిన్న పొరపాటు మాత్రమే. ఈ చిన్న పొరపాటుకే ఉత్తంకుడు కోపించి

రాజు తనకు కుండలాలు ఇచ్చాడన్న కృతజ్ఞత కూడా లేకుండా పౌష్యుడు గుడ్డివాడు కావాలని దారుణంగా శపించాడు. చిన్న పొరపాటుకే ఇలా దారుణమైన శాపాన్ని ఇచ్చినట్లుగా ఈ కథలో బ్రాహ్మణకవి రాయడానికి కారణమేమంటే రాజులు గానీ, మరి ఎవరైనా గానీ బ్రాహ్మణులకు భోజనం పెట్టేటప్పుడుగానీ, ఇంకేదైనా ఉపకారం చేసేటప్పుడు గానీ చాలా జాగ్రత్తగా ఎలాంటి పొరపాటు లేకుండా వ్యవహరించి బ్రాహ్మణుల అనుగ్రహానికి పాత్రులు కావాలని. అలా కాకుండా ఏమాత్రం అజాగ్రత్తగా వ్యవహరించినా బ్రాహ్మణులు కోపించి శపిస్తారనే భయాన్ని ఆనాటి ప్రజలకు కలిగించడం ప్రధానంగా కన్పిస్తుంది. ఈ కథలో పౌష్యుడు ఉత్తంకునితో బ్రాహ్మణులు వెన్నలాంటి మనస్సు, కత్తిలాంటి మాట కలిగి వుంటారని, క్షత్రియునిలో ఇవి రెండు వ్యతిరేకంగా వుంటాయని బ్రాహ్మణులను గొప్పచేసి క్షత్రియులను తక్కువ చేసి చెబుతాడు. వాస్తవానికి ఇది నిజం కాదని ఉత్తంకుని కథనే ఉదాహరణగా చెప్పుకోవచ్చు. ఉత్తంకునికి వెన్నలాంటి మనస్సే వుంటే అన్నంలో వెంట్రుక వచ్చిన చిన్న పొరపాటుకు తనకు ఉపకారం చేసిన పౌష్యుని గుడ్డివాడు కావాలని శపించేవాడు కాదు. క్షత్రియులు పాలకులు, ప్రభువులు కాబట్టి వారి మాట కఠినంగా వుంటుంది. మనస్సు వెన్నలాగా వుంటుందా? కఠినంగా వుంటుందా? అనేది వ్యక్తి మీద ఆధారపడి వుంటుంది. ఇది బ్రాహ్మణులతోపాటు అందరికీ వర్తిస్తుంది. ఈ కథను రాసిన కవి క్షత్రియుడైన పౌష్యుని చేతనే క్షత్రియులను కించపరిచే విధంగా బ్రాహ్మణులను గొప్ప చేసే విధంగా పలికించి తన కులాభిమానాన్ని మరింతగా చాటుకున్నాడు.

ఈ కథలో కథాకాలంనాటి ఆచారాలు, సంప్రదాయాలు చెప్పబడ్డాయి. ఆనాటి ఋషులు శారీరక సుఖాల కోసం కాకుండా సంతానం కోసం మాత్రమే వివాహం చేసుకొనేవారు. అందువల్ల వారు ఋతుకాలంలో మాత్రమే భార్యతో సంభోగం చేసేవారు. భార్యా భర్తలిద్దరు ఋతుకాలం వ్యర్థం కావడానికి ఇష్టపడేవారు కారు. ఒకవేల ఋతుకాలంలో భర్త లేకపోతే తమ ఋతుకాలం వ్యర్థం కాకుండా ఉండటం కోసం స్త్రీలు ఇతర పురుషుల సంగమానికి కూడా ప్రయత్నించేవారు. అయితే దీనికి భర్త అనుమతి అవసరం. ఈ ఆచారం ఈ ఉత్తంకుని కథలో చెప్ప బడింది. ఉత్తంకుని గురువు వేదుడు వేరే ఊరికి పోతూ తన ఇంటిలో ఏ లోటు కలిగినా పూరించమని ఉత్తంకుని ఆజ్ఞాపించి వెళ్ళిపోతాడు. ఆ సమయంలోనే గురుపత్ని ఋతిమతి అయి తన ఋతుకాలం వ్యర్థం కాకుండా ఉండటం కోసం తన భర్త చేత నియోగింప బడిన ఉత్తంకునితో సంభోగాన్ని ఆశించి ఆశ్రమంలోని స్త్రీలతో ఉత్తంకునికి చెప్పిస్తుంది. తాను లేని లోటు పూరించమని గురువు ఉత్తంకునికి చెప్పడం చేత ఋతుకాలంలో గురుపత్ని గమనానికి కూడా గురువు అనుజ్ఞ ఇచ్చినట్లే. అందువల్లనే గురుపత్ని ఉత్తంకుని సమాగమాన్ని ఆశించింది. ఇలా ఆశించడం ఆనాడు దురాచారం కాదు. గురువు అనుమతి లేకుండా గురుపత్ని గమనం చేస్తే అది పాపం. దురాచారం. గురువు అనుమతితో ఋతుకాలంలో గురుపత్ని గమనం ఆనాడు దురాచారం కాదని ఈ కథ వల్ల తెలుస్తుంది.

ఈ కథలో ఆనాటి విద్యాభ్యాస విధానం తెలుస్తూ ఉంది. కథాకాలం నాడు గురుకులాల్లో గురువులు శిష్యులకు అన్నపానాదులు ఇస్తూ వారికి విద్యను చెప్పేవారు. శిష్యులు గురుకులంలో ఉన్నంత కాలం గురువును, గురుపత్నిని సేవిస్తూ వారు చెప్పిన అన్ని పనులు వినయ విధేయతలతో చేసేవారు. శిష్యులు విద్యాభ్యాసం పూర్తి అయిన తర్వాత గురువు అనుమతించిన తర్వాత మాత్రమే గురుకులాన్ని వదిలి పెట్టి తమ ఇంటికి వెళ్ళేవారు. గురువు అనుమతి లేకుండా ఎట్టి పరిస్థితిలోను శిష్యులు వెళ్ళేవారు కాదు. విద్యాభ్యాసం పూర్తయిన శిష్యుణ్ణి గురువు పిలిచి "నీ విద్యాభ్యాసం పూర్తయింది. నువ్వు నన్ను ధర్మబద్ధంగా సేవించావు, నీ విషయంలో నేను పూర్తి సమ్మతితో ఉన్నాను, నిన్ను ఇంటికి వెళ్ళడానికి అనుమతిస్తున్నాను" అని చెప్పేవాడు. అప్పుడు శిష్యుడు చాలా సంతోషించి గురు దక్షిణగా ఏమి కావాలో ఆజ్ఞాపించమని గురువును కోరతాడు. గురువు తనకు ఇష్టమైన వస్తువును తెచ్చి ఇమ్మని శిష్యునికి చెబుతాడు. శిష్యుడు ఎన్ని కష్టాలైనా పడి గురువు అడిగిన వస్తువును తెచ్చి ఇచ్చి గురువును సంతృప్తి పరచిన తర్వాతనే గురుకులాన్ని వదిలిపెట్టి బయటకి వెళ్ళేవాడు. గురుదక్షిణ ఇవ్వకుండా ఎవరూ గురుకులం నుంచి బయటకు వెళ్ళేవారు కాదు. గురుదక్షిణ ఇవ్వడాన్ని గురువు ఋణం తీర్చడంగా ఆనాడు శిష్యులు భావించేవారు. గురుపత్ని అడిగిన దాన్ని తెచ్చి ఇవ్వమని గురువు చెప్పినపుడు ఉత్తంకుడు గురుపత్ని వద్దకు వెళ్ళి"పూజ్యురాల గురువుగారు నేను ఇంటికి వెళ్ళడానికి అనుజ్ఞ ఇచ్చారు. మీకు ఇష్టమైన దాన్ని గురుదక్షిణగా సమర్పించి ఋణవిముక్తుడనై ఇంటికి వెళ్ళాలనుకుంటున్నాను. కాబట్టి గురుదక్షిణగా మీకు ఏమి కావాలో ఆజ్ఞాపించండి" అని చెప్పిన మాటలనుబట్టి పై విషయం స్పష్టమవుతుంది.

ఈ కథలో శాస్త్రబద్ధంగా ఆచమనం ఎలా చెయ్యాలో చెప్పబడింది. ఉత్తంకుడు కుండలాల కోసం వెళ్తున్నపుడు తనకు తారసపడిన మహాపురుషుడు చెప్పినట్లుగా అతడు ఎక్కివచ్చిన ఎద్దుపేడను తిని నిలబడి ఆచమనం చేసి పౌష్యుని వద్దకు వెళ్తాడు. ఇలా చేయడం వల్లనే అతనికి పతివ్రత అయిన పౌష్యుని భార్య కనిపించలేదు. ఈ విషయాన్ని ఉత్తంకుడు పౌష్యునికి చెప్పినపుడు పౌష్యుడు ఉత్తంకునితో "ఇది నీవు చేసిన శాస్త్ర విరుద్ధమైన పని, నిలబడి తొందర తొందరగా నడుస్తూ చేసిన ఆచమనం చేయనట్లే" అని చెబుతాడు. అపుడు ఉత్తంకుడు కాళ్ళు, చేతులు, ముఖం బాగా కడుక్కొని తూర్పు వైపు తిరిగి కూర్చొని శబ్దం చేయని నురుగులేని చల్లని యోగ్యమైన నీటిని ముడుసార్లు ఆచమనం చేసి రెండుసార్లు చేతి వేళ్ళ కొనలతో ముఖాన్ని తుడుచుకొని, మళ్ళీ చేతులను నీటిలో ముంచి వేళ్ళతో కళ్ళు, ముక్కు మొదలైన ఇంద్రియాలు స్పృశిస్తాడు. ఉత్తంకుడు ఇలా శాస్త్ర బద్ధంగా ఆచమనం చేసి ఎద్దుపేడ తిన్న దోషాన్ని పోగొట్టుకొని అంతఃపురంలోనికి వెళ్ళి పౌష్యుని భార్యను చూస్తాడు.

ఈ విధంగా సంస్కృత భారతంలోని ఉత్తంకుని కథలో కథాకాలం జాటి ఆచారాలు, సంప్రదాయాలు చెప్పబడ్డాయి. ఇవన్నీ జానపద విజ్ఞానాంశాలే.

ఈ ఉత్తంకుని కథ సంస్కృత భారతంలో అశ్వమేధిక పర్వంలో 53వ అధ్యాయం నుంచి 58వ అధ్యాయం వరకు ఉన్న ఆరు అధ్యాయాల్లో 216 శ్లోకాల్లో మళ్ళీ వివరంగా చెప్పబడింది. ఇందులో ఉత్తంకుని విద్యాభ్యాసం అతను గురుదక్షిణ ఇవ్వడం మొదలైన కథ 56, 57,58 అధ్యాయాల్లో 124 శ్లోకాల్లో ఆదిపర్వంలోని కథ కంటే కొంత భిన్నంగా ఉంది. ఈ కథ అశ్వమేధికపర్వంలో ఇలా ఉంది. ధర్మరాజు అశ్వమేధయాగం పూర్తి అయిన తర్వాత కృష్ణుడు హస్తినాపురం నుంచి ద్వారకకు వెళ్తూ మధ్యలో ఎడారి లాంటి ప్రదేశంలో ఉన్న ఉత్తంకుని దర్శిస్తాడు. ఉత్తంకుడు కృష్ణునికి అతిథి మర్యాదలు చేసిన తర్వాత "ధార్తరాష్ట్రులు, పాండవులు నీ ప్రయత్నంచేత సఖ్యంగా కలసిమెలసి సుఖంగా జీవిస్తున్నారు కదా?" అని ప్రశ్నిస్తాడు. అందుకు కృష్ణుడు తాను, విదురుడు, భీష్ముడు మొదలైన వారందరూ కౌరవ పాండవుల మధ్య సంధికి గట్టిగా ప్రయత్నించామని, కౌరవుల మూర్ఖత్వం చేత సంధి పొసగక కురుక్షేత్ర యుద్ధం జరిగిందని, ఆ యుద్ధంలో పాండవులు తప్ప మిగిలిన కౌరవవంశమంతా నశించిందని చెబుతాడు. దానికి ఉత్తంకుడు కోపించి శ్రీకృష్ణుడు కావాలనే కౌరవ పాండవ కలహాన్ని నివారించకుండా ఉపేక్షించి వంశ నాశనానికి కారకుడయ్యాడని పలికి కృష్ణుని శపించే ప్రయత్నం చేస్తాడు. కృష్ణుడు అతణ్ణి శాంతింపజేసి తన అవతార తత్వాన్ని ఆధ్యాత్మ తత్వంతో కలిపి వివరించి, కౌరవ పాండవ సంధికోసం తాను చేసిన ప్రయత్నాన్ని గురించి చెబుతాడు. ఉత్తంకుడు కృష్ణుడు చెప్పిన దానికి అంగీకరించి, అతని విశ్వరూపాన్ని చూపించ వలసిందిగా కృష్ణుని కోరతాడు. కృష్ణుడు తన విశ్వరూపాన్ని చూపించి, ఆ తర్వాత ఎడారి ప్రదేశంలో ఉత్తంకునికి నీరు అవసరమైనప్పుడు అతను ఉన్న దగ్గర వర్షం పడేటట్లుగా వరమిచ్చి ద్వారకకు వెళ్ళిపోతాడు.

పై కథను వైశంపాయనుని ద్వారా జనమేజయుడు విని విష్ణుమూర్తి అవతారమైన శ్రీకృష్ణుని శపించ గలిగే తపోశక్తి ఉత్తంకునికి ఎలా వచ్చిందని వైశంపాయనుని అడుగుతాడు. దానికి వైశంపాయనుడు ఉత్తంకుని విద్యాభ్యాస జీవితాన్ని గురించి ఇలా వివరిస్తాడు. ఉత్తంకుడు గొప్ప గురుభక్తి ఉన్నవాడు. అతడు తన గురువైన గౌతముని తదేక భక్తితో వంద సంవత్సరాలు సేవిస్తాడు. ఒకసారి అతను అడవి నుంచి పెద్ద కట్టెలమోపును కష్టపడి తెచ్చి ఆశ్రమంలో కింద పడేసినప్పుడు అతని తలవెంట్రుకలు కొన్ని మోపుకు చిక్కుకొని ఊడి వస్తాయి. అవి తెల్లబడి ఉంటాయి. ఆకలి దప్పికలతో అలసిపోయి ఉన్న అతను తెల్లని తల వెంట్రుకలను చూసి తనకు వృద్ధాప్యం వచ్చేసిందని ఆర్తస్వరంతో దుఃఖిస్తాడు. గురువు కూతురు అతని కన్నీటిని తన చేతుల్లో పడుతుంది. గురువు అతని దుఃఖానికి కారణమేమిటని ప్రశ్నిస్తాడు. దానికి ఉత్తంకుడు ఇలా చెబుతాడు.

**"భవద్గతేన మనసా భవత్ప్రియ చికీర్షయా**
**భవద్భక్తిగతే నేహ భవద్భావానుగేన చ"**
**"జరేయం నావబుద్ధా మే నాభిజ్ఞాతం సుఖంచ మే**

**శతవర్షోషితం మాంహి న త్వ మభ్యనుజానిథాః"**
**"భవతా త్వభ్యనుజ్ఞాతాః శిష్యాః ప్రత్యవరా మమ**
**ఉపపన్నా ద్విజశ్రేష్ఠ శతశోథ సహస్రశః"**
**(అశ్వమేధిక. 56 – 15, 16, 17 శ్లోకాలు)**

"మీ యందే లగ్నమైన మనస్సుతో, మీకు ప్రియం చేయాలనే కోరికతో, మీ మీద భక్తితో, మీ భావాన్ని అనుసరించే మనస్సుతో నూరేండ్లు మీకు సేవచేస్తూ ఉన్నాను. మీ సేవలో ఉన్న నాకు వృద్ధాప్యం గూడా తెలియలేదు. నేను ఎలాంటి సుఖాన్ని ఎరుగను. నా తర్వాత విద్యాభ్యాసానికి వచ్చిన వందల వేల కొద్ది శిష్యులను వారి ఇళ్ళకు వెళ్ళడానికి మీరు అనుమతించారు". నన్ను అనుమతించ లేదు అని ఉత్తంకుడు చెబుతాడు. అప్పుడు గౌతముడు ఉత్తంకుడు ఇంటికి వెళ్ళడానికి అనుమతిస్తాడు. గురుదక్షిణ ఏమి ఇవ్వాలో చెప్పుమని ఉత్తంకుడు కోరతాడు. దానికి గౌతముడు

**"దక్షిణా పరితోషో వై గురూణాం సద్భి రుచ్యతే**
**తవ హ్యాచరతో బ్రహ్మం స్తుష్టో హం వై నసంశయః"**
**(అశ్వమేధిక. 56 – 21 వ శ్లోకం)**

"సంతోషమే గురువులకు దక్షిణ అని సత్పురుషులు చెప్పారు. నీ సేవకు నేను సంతోషించాను". నువ్వు పదహారేండ్ల నవ యువకునివి అయితే నా కుమార్తెను నీకు భార్యగా ఇస్తాను అని చెబుతాడు. వెంటనే ఉత్తంకుడు నవయువకుడుగా మారిపోయి గౌతముని కుమార్తెను వివాహం చేసుకుంటాడు. తర్వాత ఉత్తంకుడు గురువు అనుమతి పొంది గురుపత్ని వద్దకు వచ్చి గురుదక్షిణ ఏమి ఇవ్వాలో ఆజ్ఞాపించ వలసిందిగా మరీమరీ కోరతాడు. సౌదాసుని భార్య ధరించే దివ్యమైన మణికుండలాలను తెచ్చి ఇమ్మని అహల్య చెబుతుంది. ఉత్తంకుడు వెంటనే కుండలాల కోసం బయలుదేరతాడు.

సౌదాసుడు శాపం కారణంగా నరమాంస భక్షణ చేస్తూ మానవ రక్తంతో తడిసిపోయి, పొడవైన గడ్డం మీసాలతో వికృతంగా ఒక అడవిలో ఉంటాడు. ఉత్తంకుడు భయపడకుండా అతని దగ్గరకు వెళ్ళగానే సౌదాసుడు తన ఆహారం తనను వెదుక్కుంటూ వచ్చినందుకు సంతోషించి అతణ్ణి తినడానికి ప్రయత్నిస్తాడు. ఉత్తంకుడు అతణ్ణి వారించి తాను గురుదక్షిణ కోసం అతని వద్దకు వచ్చానని, అతని భార్య కుండలాలను తనకు ఇప్పిస్తే వాటిని గురుదక్షిణగా తన గురుపత్నికి సమర్పించి తిరిగి వచ్చి అతనికి ఆహారమవుతానని చెబుతాడు. దానికి సౌదాసుడు అంగీకరించి అడవిలో సెలయేటి దగ్గర ఉన్న తన భార్య అయిన మదయంతి వద్దకు వెళ్ళి కుండలాలను తీసుకొమ్మని చెబుతాడు. ఉత్తంకుడు మదయంతి వద్దకు వెళ్ళి కుండలాలను కోరగా తన మణికుండలాలు చాలా మహిమ గలవని, వాటిని అపహరించడానికి దేవతలు, యక్షులు మొదలైనవారు ప్రయత్నిస్తున్నారని అందువల్ల తనకు నమ్మకం కలగడానికి సౌదాసుని దగ్గర నుంచి

ఏదైనా గుర్తు తేవాలని ఉత్తంకునికి చెబుతుంది. ఉత్తంకుడు సౌదాసుని వద్దకు వెళ్ళి గుర్తును అడుగుతాడు. దానికి సౌదాసుడు

**"న చైవైషా గతిః క్షేమ్యా నచాన్యా విద్యతే గతిః**
**ఏతన్మే మత మాజ్ఞాయ ప్రయచ్ఛ మణికుణ్డలే"**
**(అశ్వమేధిక. 58 – 2వ శ్లోకం)**

"ఇప్పటి నా గతి క్షేమాన్ని కలిగించేది కాదు. ప్రస్తుతం ఇంతకంటే వేరే గతిలేదు. నా భావాన్ని తెలుసుకొని ఇతనికి మణికుండలాలను ఇవ్వు" అని తన భార్యకు గుర్తు చెప్పమని ఉత్తంకునికి చెబుతాడు. ఉత్తంకుడు వెళ్ళి గుర్తు చెప్పగానే మదయంతి తన మణికుండలాలను అతనికి ఇస్తుంది.

ఉత్తంకుడు మణికుండలాలను తీసుకొని సౌదాసుని వద్దకు వచ్చి మదయంతికి గుర్తుగా చెప్పిన గూఢ వచనాల అర్థం ఏమిటని అడుగుతాడు. దానికి సౌదాసుడు "క్షత్రియులైన మానవులు విప్రులను పూజిస్తున్నారు. అయినప్పటికీ బ్రాహ్మణుల వల్ల క్షత్రియులకు అనేక కష్టాలు కలుగుతున్నాయి. నేను బ్రాహ్మణులను ఎల్లప్పుడూ పూజించాను. ఒక బ్రాహ్మణుని శాపంవల్ల నాకు ఈ గతి పట్టింది. మదయంతి తోడుగా ఉన్న నాకు ఈ దుర్గతి నుంచి విముక్తి కనిపించడం లేదు. ఇప్పుడు నాకు ఈ లోకంలో సుఖపడడం గానీ, పరలోకంలో స్వర్గ సుఖాలు అనుభవించడానికి గానీ గతి లేదు. బ్రాహ్మణులతో విరోధం పెట్టుకున్న ఏ రాజు ఈ లోకంలో నిలువలేడు. చనిపోయి పరలోకంలో సుఖ పడలేడు" అనేది తన మాటల్లోని అర్థమని చెప్పి, ఉత్తంకుడు కోరినట్లుగా కుండలాలను ఇప్పించాను కాబట్టి అతను తనకు ఆహారంగా కావాలని చెబుతాడు. ఉత్తంకుడు "గురుదక్షిణ చెల్లించి తిరిగి వచ్చి నీ వశమవుతాను. ప్రస్తుతం నువ్వు నా మిత్రునివి. మిత్రునిగా నాకు ఒక సలహా ఇవ్వు. నువ్వు నరభక్షకునివి. అలాంటి నీ వద్దకు నేను తిరిగి రావడం తగునా? తగదా?" అని అడుగుతాడు. దానికి సౌదాసుడు "మిత్రునిగా చెప్పాలంటే ఎట్టి పరిస్థితిలోనూ నువ్వు రావద్దు. వస్తే నీకు చావు తప్పదు" అని చెబుతాడు.

ఆ తర్వాత ఉత్తంకుడు సౌదాసుని వద్ద సెలవు తీసుకొని కుండలాలను జింక చర్మంలో కట్టి జాగ్రత్తగా పట్టుకొని బయలుదేరతాడు. దారిలో అతనికి ఆకలి వేయడం వల్ల ఒక మారేడు కొమ్మకు కుండలాలు కట్టిన జింక చర్మాన్ని వేలాడ దీసి తాను ఆ చెట్టు ఎక్కి మారేడు పండ్లను కోసి కింద వేస్తూ ఉంటాడు. వాటిలో కొన్ని పళ్ళు జింక చర్మం మీద పడి దాని ముడి ఊడిపోయి జింక చర్మం కింద పడుతుంది. వెంటనే ఐరావత కులంలో జన్మించిన ఒక సర్పం మణికుండలాలను పట్టుకొని పుట్టలోకి వెళ్ళిపోతుంది. ఉత్తంకుడు ఒక కర్రతో పుట్ట తవ్వుతున్నప్పుడు దేవేంద్రుడు ఆ ఉత్తమ బ్రాహ్మణుని చూచి బ్రాహ్మణ వేషంలో వచ్చి తన వజ్రాయుధాన్ని కర్రలో ప్రవేశపెట్టి నాగలోకానికి దారి ఏర్పరుస్తాడు. ఉత్తంకుడు నాగలోకానికి వెళ్ళి అత్యంత విశాలమైన నాగలోకంలో తన కుండలాలను అపహరించిన నాగుని తెలుసుకోలేక నిరాశ పడతాడు. అప్పుడు అగ్నిదేవుడు గుర్రం

రూపంలో వచ్చి తన అపాన ప్రదేశంలో ఊదమని ఉత్తంకునికి చెబుతాడు. ఉత్తంకుడు ఊదగానే గుర్రం రోమకూపాల నుంచి దట్టమైన పొగ వెలువడి నాగ లోకమంతటా వ్యాపిస్తుంది. దానితో నాగులందరూ ఉత్తంకుని శరణు వేడి మణికుండలాలను తెచ్చి ఇస్తారు. ఉత్తంకుడు అగ్నికి ప్రదక్షిణ చేసి ఆశ్రమానికి వచ్చి మణికుండలాలను గురుపత్నికి సమర్పిస్తాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఆదిపర్వంలోని ఉత్తంకుని కథకు, అశ్వమేధిక పర్వంలోని ఉత్తంకుని కథకు కొంత భేదముంది. ఆదిపర్వంలో ఉత్తంకుని గురువు వేదుడు కాగా అశ్వమేధిక పర్వంలో గురువు గౌతముడు. ఆదిపర్వంలో గురుపత్నికి పేరులేదు. ఇందులో ఆమె పేరు అహల్య. ఆదిపర్వంలో గురువు గ్రామాంతరం వెళ్ళినప్పుడు గురుపత్ని ఋతుమతి కావడం మొదలైన కథ అశ్వమేధిక పర్వంలో లేదు. ఆదిపర్వంలో లేని కొన్ని విషయాలు అశ్వమేధిక పర్వంలో చెప్పబడ్డాయి. గురు శుశ్రూషలో వృద్ధుడైన ఉత్తంకుడు తన తపో మహిమచేత నవయువకుడై గురువు కూతురును వివాహం చేసుకోవడం మొదటిది. ఉత్తంకుడు గొప్ప మహిమోపేతుడని చెప్పడానికి ఈ కల్పన చేయబడింది. రెండవది సౌదాసుని వృత్తాంతం. ఆదిపర్వంలో పౌష్యమహారాజు భార్యకు పేరు లేరు. ఈమె నుంచి ఉత్తంకుడు కుండలాలను గ్రహిస్తాడు. ఈ కుండలాలకు ఎలాంటి మహిమ లేదు. అశ్వమేధిక పర్వంలో సౌదాసుని భార్య పేరు మదయంతి. ఈమె తన వద్ద ఉన్న మణికుండలాల మహిమను ఉత్తంకునికి ఇలా తెల్పుతుంది. "కుండలాలు పగలు, రాత్రి బంగారం కురిపిస్తాయి. రాత్రి పూట నక్షత్రాల, తారల కాంతిని అపహరిస్తాయి. వాటిని ధరిస్తే ఆకలి దప్పికలుండవు. విషంవల్ల, అగ్నివల్ల క్రూరమృగాల వల్ల భయముండదు. పొట్టిగా ఉన్నవారు వాటిని ధరిస్తే వారి ఎత్తుకు తగినట్లుగా అవి చిన్నవిగా మారతాయి. పొడవు ఉన్నవారు వాటిని ధరిస్తే అవి పెద్దవి అవుతాయి". కుండలాలు ఇంతటి మహిమ కలవి కావడం చేతనే నాగుడు వాటిని దొంగిలించాడని చెప్పడానికే అశ్వమేధిక పర్వంలో కుండలాలు మహిమ గలవని చెప్పబడింది. ఆదిపర్వంలో పౌష్యుని భార్య కుండలాలకు ఎలాంటి మహిమ చెప్పబడలేదు. తక్షకుడు వాటిని ఎందుకు అపహరించాడో కారణం చెప్పలేదు. అశ్వమేధిక పర్వంలో కుండలాలను అపహరించిన నాగునికి పేరులేదు. ఐరావత కులంలో జన్మించిన ఒక సర్పం హరించినట్లుగా ఇందులో చెప్పబడింది.

అశ్వమేధిక పర్వంలో బ్రాహ్మణుల గొప్పతనం చాటి చెప్పడానికి సౌదాసుని వృత్తాంతం కల్పించబడింది. సౌదాసుడు క్షత్రియుడు, రాజు, బ్రాహ్మణ భక్తి ఉన్నవాడు. అయినప్పటికీ అతను ఒక బ్రాహ్మణుని శాపం వల్ల నరభక్షకుడుగా మారిపోతాడు. అందువల్లనే అతడు ఏ రాజు బ్రాహ్మణునితో విరోధం పెట్టుకోగూడదని, అలా పెట్టుకున్నవాడు ఇహపరలోకాల్లో సుఖాన్ని పొందలేడని ఉత్తంకునితో చెబుతాడు. దీన్ని బట్టి బ్రాహ్మణుడు తప్పు చేసినా సహించ వలసిందేగానీ అతనితో విరోధం పెట్టుకోగూడదనే విషయాన్ని ఈ కథను కల్పించిన కవి నాటి సమాజానికి చాటి చెప్పినట్లుగా స్పష్టమవుతూ ఉంది. రాజులే

బ్రాహ్మణులకు భయపడుతూ వుంటే వైశ్య, శూద్రులు వారిని చూసి భయపడడంలో ఆశ్చర్యం ఏముంటుంది.

ఈ విధంగా సంస్కృతంలోని అశ్వమేధిక పర్వంలో ఉత్తంకుని కథ మళ్ళీ చెప్పబడింది. ఈ రెండు కథలను రాసినది ఒకరు కాదు. వేర్వేరు కవులు. మొదట ఆదిపర్వంలోని కథ రాయబడి ఉంటుంది. ఆ తర్వాత బ్రాహ్మణుడైన ఋషి సాక్షాత్తు శ్రీమహావిష్ణువు అవతారమైన శ్రీకృష్ణుని గూడా శపించ గల మహిమోపేతుడని చాటి చెప్పడానికే బ్రాహ్మణకవి అశ్వమేధిక పర్వంలో ఈఉత్తంకుని కథను చెప్పాడు.

అశ్వమేధిక పర్వంలోని ఉత్తంకుని కథలో సౌదాసుడు ఒక బ్రాహ్మణుని శాపం వల్ల నరభక్షకుడుగా మారిపోయినట్లుగా చెప్పబడింది. సౌదాసుని శపించిన బ్రాహ్మణుడు ఎవరు? ఎందుకు శపించాడు? అనే విషయాలు ఈ కథలో చెప్పలేదు. ఈ విషయాలతో కూడిన కథ సంస్కృత రామాయణం ఉత్తరకాండ 65వ సర్గలో, సంస్కృత భాగవతం 9వ స్కంధంలోని 9వ అధ్యాయంలో చెప్పబడింది.

మొదట రామాయణంలోని కథను పరిశీలించుదాం. ఈ కథను వాల్మీకి మహర్షి శత్రుఘ్నునికి చెబుతాడు. శత్రుఘ్నుడు లవణాసురుని సంహరించడానికి వెళ్తూ దారి మధ్యలో వాల్మీకి ఆశ్రమంలో ఒకరోజు ఆగుతాడు. ఆ సమయంలో శత్రుఘ్నుడు "నీ ఆశ్రమ సమీపంలోని ఈ యజ్ఞ సమృద్ధి ఎవరిది (ఇయం యజ్ఞ విభూతిస్తే కస్యాశ్రమ సమీపతః)" అని ప్రశ్నిస్తాడు. దానికి సమాధానంగా వాల్మీకి సౌదాసుని కథను 30 శ్లోకాల్లో ఇలా వివరిస్తాడు.

ఇక్ష్వాకు వంశంలో మిత్రుసహుడు అనే రాజు వుండేవాడు. అతని తండ్రి సుదాసుడు కావడం వల్ల మిత్రసహుడు సౌదాసుడుగా పిలువబడ్డాడు. ఇతనికి బాల్యం నుంచి వేట చాలా ఇష్టం. ఇతని రాజ్యంలో ఇద్దరు రాక్షసులు పెద్దపులుల రూపాన్ని ధరించి అడవిలోని జంతువులన్నింటిని చంపి తింటూ వుంటారు. వారిలో ఒక రాక్షసుని సౌదాసుడు చంపుతాడు. తన మిత్రుని చంపినందుకు రెండవ రాక్షసుడు సౌదాసుని మీద ప్రతీకారం తీర్చుకోవాలనుంటాడు. తండ్రి తర్వాత సౌదాసుడు రాజై వసిష్ఠుని ఆధ్వర్యంలో అశ్వమేధయాగం చేస్తాడు. ఆ సమయంలో రాక్షసుడు వసిష్ఠుని వేషంలో రాజు వద్దకు వచ్చి తనకు వెంటనే మాంసాహారం కావాలని అడుగుతాడు. రాజు వంటవారిని పిలిచి –

**"హవిష్యం సామిషం స్వాదు యథా భవతి భోజనమ్**
**తథా కురుత శీఘ్రం వై పరితుష్యేద్యథా గురుః "**

**(రామాయణం – ఉత్తరకాండ – 65వ సర్గ – 23వ శ్లోకం)**

"యజ్ఞంలో హవిస్సుగా ఉపయోగించిన మాంసంతో గురువైన వసిష్ఠునికి మధురమైన మాంసాహారాన్ని తయారుచేయండి" అని ఆజ్ఞాపిస్తాడు. తర్వాత రాక్షసుడు వంటవాని రూపం ధరించి నర మాంసంతో భోజనం తయారుచేస్తాడు. రాజు అతని భార్య మదయంతి

ఆ భోజనాన్ని వశిష్ఠునికి సమర్పిస్తారు. అందులో నరమాంసం వున్నట్లుగా వసిష్ఠుడు తెలుసుకొని కోపంతో –

**"యస్మాత్త్వం భోజనం రాజన్ మమైతద్దాతుమిచ్చసి,**
**తస్మాద్భోజనమేతత్తే భవిష్యతి న సంశయః"**

**(రామాయణం – ఉత్తరకాండ – 65వ సర్గ – 28వ శ్లోకం)**

"రాజా నువు నాకు ఈ భోజనం పెట్టాలనుకున్నావు కాబట్టి నీకు ఇదే భోజనం కాగలదు" అని శపిస్తాడు. దానికి కోపించిన సౌదాసుడు జలం తీసుకొని వసిష్ఠుని శపించడానికి ప్రయత్నించగా అతని భార్య మదయంతి "పూజ్యుడైన వసిష్ఠ మహర్షి మన ప్రభువు, దేవతాసమానుడైన మన పురోహితుని తిరిగి శపించకూడదు" అని పలికి అతన్ని వారిస్తుంది. ధర్మాత్ముడైన ఆ రాజు క్రోధంతో నిండిన తేజోబలంతో కూడిన ఆ నీటిని తన పాదాల మీద కిందకు విడుస్తాడు. ఆ నీటి ప్రభావం చేత అతని పాదాలు నల్లగా మారతాయి. అప్పటినుండి అతడు కల్మాషపాదుడు (పాదాలలో నలుపు వున్నవాడు) గా ప్రసిద్ధి చెందుతాడు. తర్వాత రాజదంపతులు వసిష్ఠునికి అనేక నమస్కారాలు చేస్తూ రాక్షసుడు చేసిన మోసాన్ని గురించి అతనికి వివరిస్తారు. వసిష్ఠుడు రాక్షస మాయను తెలుసుకొని శాంతుడై –

**"కాలో ద్వాదశవర్షాణి శాపస్యాన్తో భవిష్యతి,**
**మత్ప్రసాదచ్చ రాజేన్ద్ర అతీతం న స్మరిష్యసి"**

**(రామాయణ – ఉత్తరకాండ – 65వ సర్గ – 36వ శ్లోకం)**

"పన్నెండు సంవత్సరాల తర్వాత శాపాంతమవుతుంది. నా అనుగ్రహం వల్ల నీకు శాపకాలంలో చేసిన నరమాంస భక్షణ గుర్తుండదు" అని చెబుతాడు.

వాల్మీకి శత్రుఘ్నునికి పై కథను చెప్పి సౌదాసుడు పన్నెండు సంవత్సరాల తర్వాత శాపం నుంచి విముక్తుడై మళ్ళీ రాజ్యాన్ని పొంది తన ఆశ్రమ సమీప స్థలంలో యజ్ఞం చేసాడని చెబుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఇప్పుడు సంస్కృత భాగవతంలో కథను పరిశీలించుదాం. ఈ కథ భాగవతం 9వ స్కంధంలో భగీరథుని చరిత్ర – గంగావతరణం అనే 9వ అధ్యాయంలో వుంది. ఈ కథను శుకమహర్షి పరీక్షిన్మహారాజుకు చెబుతాడు. శుక మహర్షి గంగావతరణ కథను చెప్పి భగీరథుని వంశంలోని రాజులను గురించి చెబుతూ సుదాసుని కుమారుడు సౌదాసుడు, అతని భార్య మదయంతి. సౌదాసునికి మిత్రసహుడు, కల్మాషపాదుడు అనే పేర్లు వున్నాయి. అతడు స్వయంకృతాపరాధంతో వసిష్ఠుని శాపానికి గురియై రాక్షసుడుగా మారి సంతానహీనుడు అయ్యాడు అని చెబుతాడు. అప్పుడు పరీక్షిత్తు సౌదాసుడు వసిష్ఠుని శాపానికి ఎందుకు గురి అయ్యాడో? చెప్ప వలసిందిగా కోరగా శుకుడు ఈ కథను ఇలా చెబుతాడు.

సౌదాసుడు ఒక రోజు వేటకు వెళ్ళి ఒక రాక్షసుని చంపుతాడు. ఆ రాక్షసుని సోదరుడు రాజు మీద ప్రతీకారం తీర్చుకోదలచి వంటవాని వేషంలో రాజభవనంలోకి

ప్రవేశిస్తాడు. సౌదాసుని గురువైన వశిష్ఠుడు రాజసౌదానికి భోజనం కోసం రాగా వంటవాని వేషంలో వున్న రాక్షసుడు ఆ మహర్షికి నరమాంస భోజనాన్ని వడ్డిస్తాడు. వసిష్ఠుడు యోగదృష్టి చేత దాన్ని గ్రహించి కోపించి "ఇలా అపచారం చేసినందుకు నీవు రాక్షసుడవు కమ్ము" అని సౌదాసుని శపిస్తాడు. ఆ తర్వాత మహర్షి అందులో సౌదాసుని తప్పు లేదని, అది రాక్షసుని మాయ అని తెలుసుకొని తన శాప ప్రభావాన్ని పన్నెండు సంవత్సరాలకు పరిమితం చేస్తాడు. వసిష్ఠుడు తనను అకారణంగా శపించినందుకు సౌదాసుడు కోపించి వసిష్ఠుని శపించడానికి తన దోసిట్లో నీటిని గ్రహించగా మదయంతి అతన్ని వారిస్తుంది. సౌదాసుడు ఆ నీటిని తన పాదాల మీద విడిచిపెడతాడు. శపించడానికి మంత్రించిన ఆ నీరు అతని పాదాల మీద పడటం వల్ల అవి నల్లగా మారతాయి. ముని శాప ప్రభావం చేత సౌదాసుడు రాక్షసుడుగా మారి అడవికి వెళ్తాడు. అక్కడ రతి క్రీడలో నిమగ్నులై వున్న బ్రాహ్మణ దంపతులను చూసి, బ్రాహ్మణుని పట్టుకుంటాడు. అతని భార్య తన భర్తను తినవద్దని తన భర్త లేకుండా తాను బ్రతకలేనని ఎంతగానో బ్రతిమాలుతుంది. ఆమె మాటలు పట్టించుకోకుండా సౌదాసుడు ఆ బ్రాహ్మణుని చంపి తింటాడు. బ్రాహ్మణుని భార్య కోపంతో –

**"యస్మాన్మే భక్షితో పాప కామార్తాయాః పతిస్త్వయా**
**తవాపి మృత్యురాధానాదకృతప్రజ్ఞ దర్శితః"**
**(శ్రీమద్భాగవతం – 9వ స్కంధం – 9 – 35వ శ్లోకం)**

"కామార్తురాలనై యున్న నాతో సంగమిస్తున్న నా భర్తను నీవు భక్షించావు. అందువల్ల నీవు నీ కాంతతో సంగమించడానికి సిద్ధపడినప్పుడు నీకు కూడా మృత్యువు ప్రాప్తించు గాక" అని సౌదాసుని శపిస్తుంది.

పన్నెండు సంవత్సరాల తర్వాత సౌదాసుడు శాప విముక్తుని పొంది పట్టమహిషితో సంగమించడానికి సిద్ధమవుతాడు. భార్య మదయంతి విప్రుని భార్య శాపాన్ని గుర్తు చేసి అతన్ని ఆ ప్రయత్నం నుంచి విరమింపజేస్తుంది. సౌదాసుడు స్త్రీ సుఖాన్ని పూర్తిగా త్యజిస్తాడు. స్వయంకృతాపరాధం చేత సంతాన హీనుడైన ఆ రాజు తన వంశాభివృద్ధికోసం వసిష్ఠుని ప్రార్తించగా వసిష్ఠుడు మదయంతి యందు గర్భాదానం చేస్తాడు. ఆమె గర్భవతి అయి ఏడు సంవత్సరాలు గడిచినప్పటికి ప్రసవించదు. వసిష్ఠుడు ఒక రాయితో ఆమె గర్భం మీద కొట్టగా ఆమెకు కుమారుడు ఉదయిస్తాడు. రాయి చేత కొట్టడం వల్ల పుట్టిన ఆ బాలునికి అశ్మకుడు అనే పేరు వస్తుంది. ఆ సమయంలో పరశురాముడు భూమ్మీద క్షత్రియులు లేకుండా చంపుతుండడం చేత అంతఃపుర స్త్రీలు అశ్మకుని దాచిపెట్టి కాపాడుతారు. అందువల్ల అతనికి నారీకవచుడు అనే నామాంతరం ఏర్పడుతుంది. పరశురాముడు క్షత్రియులందరిని నిర్మూలించడం చేత తర్వాత క్షత్రియుల వంశాలకు ఇతడే మూలపురుషుడయ్యాడు. క్షత్రియ వంశ ప్రవర్ధకుడు కావడం చేత ఇతనికి మూలకుడు అనే పేరు వస్తుంది. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

పైన చెప్పిన రామాయణ, భాగవత కథలనుబట్టి భారతం అశ్వమేధిక పర్వంలోని ఉత్తంకుని కథలో చెప్పబడిన సౌదాసుడు వసిష్ఠుని శాపం వల్ల నరమాంస భక్షకుడుగా మారాడని, పన్నెండు సంవత్సరాల తర్వాత అతను శాప విముక్తుడయ్యాడని ఇతనికి మిత్రసహుడు, కల్మాషపాదుడు అనే పేర్లు వున్నాయని స్పష్టమౌతుంది. భారతం ఆదిపర్వంలోని 175,176 అధ్యాయాలలో 96 శ్లోకాల్లో కల్మాషపాదుని కథ చెప్పబడింది. ఈ కథలో కల్మాషపాదునికి మిత్రసహుడు అనే పేరు వున్నట్లుగా వుంది, గానీ సౌదాసుడు అనే పేరు వున్నట్లుగా ఈ కథలో లేదు. ఈ కథను చిత్రరథుడు అనే గంధర్వుడు పాండవులకు అందులోను ముఖ్యంగా అర్జునునికి చెబుతాడు. పాండవులు బ్రాహ్మణ వేషంలో ఏకచక్రపురం నుంచి ద్రౌపది స్వయంవరానికి వెళ్తున్నప్పుడు చిత్రరథుడు వారిని అడ్డుతాడు. అర్జునుడు అతన్ని జయించడంతో చిత్రరథుడు అర్జునునితో స్నేహం చేసి అతనికి తపతీ సంవరణోపాఖ్యానాన్ని చెబుతాడు. ఈ కథలో సంవరణుడు తన పురోహితుడైన వసిష్ఠుని సాయంతో సూర్యుని పుత్రిక అయిన తపతిని పెళ్ళి చేసుకుంటాడు. అప్పుడు అర్జునుడు వసిష్ఠుని మాహాత్మ్యాన్ని చెప్పవలసిందిగా చిత్రరథుని కోరతాడు. చిత్రరథుడు వసిష్ఠ – విశ్వామిత్రుల కథను చెబుతూ కల్మాషపాదుని కథను ఇలా వివరిస్తాడు.

ఇక్ష్వాకు వంశంలో కల్మాషపాదుడనే రాజు వుండేవాడు. అతను ఒకసారి అడవికి వేటకు వెళ్ళి బాగా అలసిపోయి ఆకలి దప్పికలచేత పీడింపబడుతూ ఒక ఇరుకుబాటలో నడుస్తుంటాడు. ఎదురుగా వసిష్ఠుని పెద్దకొడుకైన శక్తిముని అదే దారిలో వస్తుంటాడు. రాజు నా దారి నుండి తప్పుకో అని ఋషితో అంటాడు. శక్తి ముని "ఏ ధర్మం ప్రకారం చూసినా రాజే బ్రాహ్మణునికి దారి ఇవ్వాలి. కాబట్టి నీవు తప్పుకో" అని రాజుతో అంటాడు. దానికి రాజు అంగీకరించకుండా శక్తిమునిని కొరడాతో కొడతాడు. శక్తిముని కోపించి రాక్షసుని లాగా తాపసుని కొట్టావు కాబట్టి నీవు రాక్షసుడవు అవుతావు అని రాజును శపిస్తాడు. ఆ రోజుల్లో వసిష్ఠ విశ్వామిత్రుల మధ్య శత్రుత్వం గట్టిగా వుంటుంది. కల్మాషపాదుడు తనను శపించినది తన గురువు వసిష్ఠుని జ్యేష్ఠపుత్రుడని గ్రహించి తనను అనుగ్రహించ వలసిందిగా శక్తిమునిని కోరతాడు. అదే సమయంలో అక్కడకు వచ్చిన విశ్వామిత్రుడు కల్మాషపాదునిలో ప్రవేశించవలసిందిగా కింకరుడు అనే రాక్షసుని ఆదేశిస్తాడు. కింకరుడు రాజులో ప్రవేశిస్తాడు. విశ్వామిత్రుడు అక్కడ నుంచి వెళ్ళిపోతాడు. రాక్షసుడు తనలో ప్రవేశించడం చేత రాజు కలవరానికి లోనై తాను ఏమి చేస్తున్నది తెలియకుండా వుంటాడు.

ఒకరోజు అరణ్యం వైపు వెళ్తున్న కల్మాషపాదునితో ఒక బ్రాహ్మణుడు తనకు మాంస భోజనం పెట్టమని కోరతాడు. రెండు గడియలలో తిరిగి వచ్చి భోజనం పెడతానని రాజు చెప్పి వెళ్లిపోతాడు. ఆ తర్వాత రాజు బ్రాహ్మణుని విషయం మరిచిపోయి తన అంతఃపురానికి వెళ్తాడు. అర్ధరాత్రి సమయంలో అతనికి అకస్మాత్తుగా బ్రాహ్మణుని విషయం

గుర్తుకు వచ్చి వంటవాణ్ణి పిలిచి అడవిలో వున్న బ్రాహ్మణునికి మాంస భోజనం తీసుకొని వెళ్ళమని ఆజ్ఞాపిస్తాడు. ఆ సమయంలో మాంసం లభించదు. అదే విషయాన్ని వంటవాడు రాజుకు చెప్తాడు. రాజు మీద రాక్షసుని ప్రభావం వుండటంచేత రాజు బ్రాహ్మణునికి నరమాంసంతో కూడిన భోజనం పెట్టమని చెబుతాడు. వంటవాడు తలారుల ఇంటికి వెళ్ళి నరమాంసాన్ని తెచ్చి ఆహారం తయారు చేసి అడవి దగ్గర వున్న బ్రాహ్మణునికి పెడతాడు. బ్రాహ్మణుడు దివ్యదృష్టితో అన్నాన్ని చూసి అది నరమాంసమని గ్రహించి "ఆ నృపాధముడు తినడానికి వీలు కాని అన్నాన్ని ఇచ్చాడు. ఆ మూర్ఖునికి ఇలాంటి అన్నం కోసం నోరు ఊరుతుంది. శక్తిముని చెప్పినట్లుగా నరమాంసం మీద ఆసక్తితో ఈ భూమిపై తిరుగుతాడు" అని కల్మాషపాదుని శపిస్తాడు. రెండుసార్లు శపించ బడటం చేత, తనలో ప్రవేశించిన రాక్షస బలం కారణంగా రాజు వివేకాన్ని పూర్తిగా కోల్పోతాడు.

కొన్ని రోజుల తర్వాత శక్తిముని రాజుకు కనిపించగా "నువ్వు నాకు తగని శాపాన్ని ఇచ్చావు, కాబట్టి నరమాంస భక్షణ నీతోనే ప్రారంభిస్తాను" అని పలికి శక్తిమునిని చంపి తింటాడు. ఆ తర్వాత విశ్వామిత్రుడు వసిష్ఠుని కుమారులందరి మీదకి సౌదాసుని రెచ్చగొడతాడు. రెచ్చిపోయిన ఆ రాక్షసుడు వసిష్ఠుని కుమారులందరిని చంపి తినేస్తాడు. వసిష్ఠుడు పుత్ర శోకంతో ఆత్మహత్య చేసుకోవడానికి అనేక రకాలుగా ప్రయత్నిస్తాడు. కాని అతని ప్రయత్నాలు ఫలించవు. తీవ్రమైన పుత్రశోకంతో వసిష్ఠుడు ఆశ్రమాన్ని వదిలిపెట్టి తిరుగుతూ వుంటాడు. అతని వెంట అతని కోడలు, శక్తిముని భార్య అయిన అదృశ్యంతి వుంటుంది. ఆమె గర్భం నుంచి స్వరబద్ధమైన వేదాధ్యయన శబ్దాన్ని వసిష్ఠుడు విని దాని గురించి కోడలును ప్రశ్నిస్తాడు. దానికామె "నీ కుమారుడైన శక్తి కొడుకు నా గర్భంలో వున్నాడు. పన్నెండు సంవత్సరాల నుంచి నా గర్భంలోనే వేదాభ్యాసం చేస్తున్నాడు" అని చెబుతుంది. దానికి వసిష్ఠుడు చాలా సంతోషించి తిరిగి తన ఆశ్రమానికి వస్తున్నప్పుడు రాక్షస రూపంలో వున్న కల్మాషపాదుడు అదృశ్యంతిని తినడానికి ప్రయత్నిస్తాడు. ఆమె భయంతో రక్షింపుమని వసిష్ఠుని కోరుతుంది. వసిష్ఠుడు మంత్రజలాన్ని రాక్షసుని మీద చల్లి తన యోగశక్తి చేత రాజును శాప విముక్తుని చేస్తాడు. ఆ తర్వాత వసిష్ఠుడు "రాజా బ్రాహ్మణుని ఎప్పుడూ అవమానించవద్దు, నీ రాజ్యానికి వెళ్ళి రాజ్యపాలన చేసుకో" అని చెబుతాడు. రాజు "పురుషోత్తమా ఇక్ష్వాకు వంశస్థులైన నా పితృదేవతల ఋణం నుంచి విముక్తి పొందడానికి మీ ద్వారా ఒక పుత్రున్ని పొందాలనుకుంటున్నాను" అని ప్రార్థిస్తాడు. దానికి వసిష్ఠుడు అంగీకరించి రాజుతో కలిసి అయోధ్యా నగరానికి వెళ్ళి ఋతుకాలంలో రాణి అయిన మదయంతిని కలుస్తాడు. ఆ తర్వాత రాణి గర్భం ధరిస్తుంది. చాలా కాలమైనప్పటికి ఆమె ప్రసవించదు. అప్పుడు ఆమె ఒక రాయితో తన గర్భం మీద కొట్టుకోగా తర్వాత పన్నెండు సంవత్సరాలకు కొడుకు పుడతాడు. అతనికి అశ్మకుడు అనే పేరు వస్తుంది. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథ ప్రధానంగా వసిష్ఠుని మాహాత్మ్యాన్ని చాటి చెప్పడానికి కల్పించ బడింది. విశ్వామిత్రుని ప్రేరణతో రెచ్చిపోయిన రాక్షసుడుగా మారిన కల్మాషపాదుడు వసిష్ఠుని కుమారులందరిని చంపి తిన్నప్పుడు వసిష్ఠుడు పుత్ర శోకంతో ఆత్మహత్యకు ప్రయత్నిస్తాడు. అతడు మేరుపర్వత శిఖరం నుండి దూకగా దూదికుప్ప మీద పడినట్లు అవుతుంది. దావాగ్నిలో ప్రవేశించగా అగ్ని చల్లారిపోతుంది. మెడకు గండశిలను కట్టుకొని సముద్రంలో దూకగా అలలు అతన్ని వొడ్డుకు చేరుస్తాయి. వర్షాకాలం ఉధృతంగా ప్రవహిస్తున్న నదిలో తనను తాను తాళ్ళతో బంధించుకొని మునగగా నది అతన్ని వొడ్డుకు చేర్చి కట్లు విప్పుతుంది. ఇది అంతా వసిష్ఠుని మాహాత్మ్యాన్ని చాటి చెబుతుంది. ఈ కథలో భాగవతంలోని కథలో చెప్పినట్లుగా కల్మాషపాదునికి భార్యతో సంగమిస్తే చనిపోవాలని శాపం లేదు. అయినప్పటికీ కల్మాషపాదుడు వసిష్ఠుని ద్వారా తన భార్య సంతానవతి కావాలని వసిష్ఠుని కోరినట్లుగా వుంది. ఇది క్షత్రియుడైన కల్మాషపాదుని అవమానించడానికి కల్పించబడింది.

రామాయణ, భాగవత, భారతాల్లోని పై సౌదాసుని కథలను పరిశీలిస్తే వాటిలో మొదట రామాయణంలోని కథ కల్పించబడి వుంటుందని దాన్ని చూసి మరొక కవి దానికి కొన్ని మార్పులు, చేర్పులు చేసి భాగవతంలోని కథను కల్పించి వుంటాడని, ఈ రెండింటిని చూసి మరొక కవి భారతంలోని కథను కల్పించి వుంటాడని చెప్పవచ్చు. రామాయణ, భాగవతాల్లో వసిష్ఠుని శాపం వల్ల సౌదాసుడు రాక్షసునిగా మారినట్లు చెప్పబడింది. శాంత స్వరూపుడుగా ప్రసిద్ధి పొందిన వసిష్ఠుడు సాధారణ ఋషి లాగా కల్మాషపాదుని శపించడం నచ్చక భారతం లోని కథను కల్పించిన కవి తన కథలో శక్తిముని శాపం, మరొక బ్రాహ్మణుని శాపం వల్ల, విశ్వామిత్రుడు ప్రేరేపించిన రాక్షసుని వల్ల కల్మాషపాదుడు రాక్షసుడుగా మారినట్లు చిత్రించాడు. ఈ చిత్రణ సమంజసంగానే వుంది. ఈ కథల్లో నరమాంస ప్రసక్తి ఉంది. ఈ కథా కాలం నాడు తలారులు నరమాంసాన్ని విక్రయించేవారని, కొందరు నరమాంసాన్ని తినేవారని తెలుస్తుంది. అలాగే ఆనాటి బ్రాహ్మణులు మాంసభక్షణ చేసేవారని ఈ కథలో తెలుస్తుంది.

పై మూడు కథల్లో బ్రాహ్మణ, క్షత్రియ సంఘర్షణ వుంది. ఈ కథలను రాసినవారు బ్రాహ్మణులు కావడం వల్ల ఈ సంఘర్షణలో బ్రాహ్మణులదే పై చేయి అయినట్లుగా చెప్పబడింది. భాగవత, భారతాల్లోని కథల్లో రాజైన సౌదాసుని భార్య పురోహితుడైన వసిష్ఠుని వల్ల అశ్మకుడు అనే కొడుకును కన్నట్లుగా అతడు క్షత్రియుడు అయినట్లుగా చెప్పబడింది. బ్రాహ్మణుని వల్ల క్షత్రియ స్త్రీకి పుట్టిన సంతానం బ్రాహ్మణులే అవుతారని అనుశాసన పర్వంలోని 48వ అధ్యాయమైన వర్ణసంకర సంతానం అనే అధ్యాయంలో చెప్పబడింది. దీన్నిబట్టి పై సౌదాసుని కథల్లో చెప్పబడినట్లుగా వసిష్ఠుని ద్వారా క్షత్రియ స్త్రీలకు పుట్టిన సంతానం బ్రాహ్మణులే అవుతారు కానీ క్షత్రియులు కారు. భాగవతంలోని సౌదాసుని కథలో అశ్మకుడు క్షత్రియ వంశాన్ని ప్రవర్ధమానం చేసాడని ఆ కారణం చేత

అతనికి మూలకుడు అనే పేరు స్థిరపడిందని చెప్పబడింది. ఈ కథలను పరిశీలిస్తే ఆనాటి బ్రాహ్మణ కవులు తమ కులం గొప్పతనాన్ని, తమ గొప్పతనాన్ని చాటుకోవడానికి, క్షత్రియులను అవమానించడానికి ఇలాంటి రాతలు రాసినట్లుగా తెలుస్తుంది. క్షత్రియుల భార్యలు బ్రాహ్మణుల వల్ల సంతానవతులయ్యారని చెప్పడం క్షత్రియులను అవమానించడమే.

క్షత్రియులను అవమానించే కథలు భారతంలో మరికొన్ని వున్నాయి. వాటిలో పరాకాష్ఠకు చెందినవి పరశురాముని కథ, గాలవుని కథ. పరశురాముని కథ క్షత్రియ పురుషులను అవమానించే కథ కాగా గాలవుని కథ క్షత్రియ స్త్రీపురుషులను ఇద్దరిని అవమానించే కథ. ఈ రెండు కథలను పరిశీలించుదాం.

**పరశురాముని కథ:**

పరశురాముని కథ భారతం ఆదిపర్వంలో ఒకచోట, వనపర్వంలో రెండుచోట్ల కలిపి మొత్తం మూడుచోట్ల ఉంది. ఆదిపర్వంలోని రెండవ అధ్యాయమైన పర్వసంగ్రహ పర్వం అనే ఉపపర్వం ప్రారంభంలో పరశురాముని కథ ఉంది. ఇందులో పరశురాముడు క్షత్రియులనందరిని సంహరించి వారి రక్తంతో అయిదు మడుగులు ఏర్పరచి, ఆ రక్తంతో పితరులకు తర్పణ ఇస్తాడు. ఋచీకుడు మొదలైన అతని పితృదేవతలు దానికి సంతోషించి వరం కోరుకోమని పరశురామునితో పలుకగా అతడు క్షత్రియులను చంపిన పాపం నుంచి తనకు విముక్తి కలిగించాలని, తాను ఏర్పరచిన అయిదు రక్తపు మడుగులు అయిదు తీర్థాలుగా ప్రసిద్ధి చెందాలని కోరతాడు. అలాగే జరుగుతుందని పితరులు వరం ఇస్తారు. రక్తపు మడుగులు ఉన్న ఆ ప్రాంతం సమంత పంచకం అనే పేరుతో పవిత్ర క్షేత్రంగా ప్రసిద్ధి చెందుతుంది. ఆ ప్రదేశంలోనే కురు పాండవుల యుద్ధం జరుగుతుంది.

ఈ వృత్తాంతం రాసిన బ్రాహ్మణకవి ఎంత కఠినుడో, ఎంత దుర్మార్గుడో చెప్పడానికి ఏ భాషలోని పదాలు సరిపోవు. మనుషులను చంపి వారి రక్తంతో మడుగులు కట్టి ఆ రక్తంతో పితృ దేవతలకు తర్పణ ఇవ్వడం, రక్తపు మడుగులున్న ఆ ప్రదేశం పవిత్ర క్షేత్రంగా ప్రసిద్ధి చెందాలని పితరులను వరం కోరడం, వారు వరం ఇవ్వడం ఆ ప్రదేశం సమంత పంచకం అనే పేరుతో పవిత్ర క్షేత్రమైందని చెప్పడం ఎంత అమానుషమో చెప్పలేము. ఒక బ్రాహ్మణుడు ఒంటరిగా చతురంగబల సమేతులైన, దేశమంతటా విస్తరించి వున్న రాజులందరిని చంపి, వారి రక్తాన్ని ఒక చోటుకి తెచ్చి ఆ రక్తంతో మడుగులు కట్టడం అసాధ్యం. అలా చేయాలంటే దేశమంతటా విస్తరించి ఉన్న క్షత్రియులను మడుగులు ఉన్న దగ్గరకు తెచ్చి వారిని చంపి వారి రక్తంతో మడుగులను నింపాలి. లేదా దేశవాప్తంగా ఉన్న రాజులను వారి స్వస్థలాల్లోనే చంపి వారి రక్తాన్ని తెచ్చి మడుగులు నింపాలి. ఇవి రెండు అసాధ్యాలు. అయినప్పటికి పరశురాముడు ఈ పని చేసినట్లుగా బ్రాహ్మణ కవి రాసాడు. ఇలా రాయడం మానవులను ప్రత్యేకించి క్షత్రియులను దారుణంగా అవమానించడమే.

ఈ పరశురాముని కథ భారతంలో మరికొన్ని చోట్ల గూడా వుంది. వనపర్వం 83వ అధ్యాయంలో తీర్థయాత్ర మహిమ చెప్పబడింది. ఇందులో పరశురాముడు క్షత్రియ సముదాయాన్ని చంపి వారి రక్తంతో అయిదు కుండాలను నింపాడని, ఆ కుండాలలో స్నానం చేసి పితృతర్పణం చేస్తే పితరులు సంతోషించి దుర్లభమైన కోర్కెలను తీర్చి శాశ్వత స్వర్గలోకాన్ని ప్రదానం చేస్తారని, బ్రహ్మచారి అయినవాడు ఆ కుండాల్లో స్నానం చేసి పరశురాముని పూజిస్తే సువర్ణరాశిని పొందుతాడని చెప్పబడింది. వనపర్వంలోనే 115,116, 117 అధ్యాయాల్లో 92 శ్లోకాల్లో పరశురాముని కథ వివరంగా వుంది. ఇందులో కూడా పై సమంత పంచకం విషయం చెప్పబడింది. పరశురాముడు సర్వక్షత్రియ సంహారం చేయగా వారి భార్యలు బ్రాహ్మణులను శరణుజొచ్చి వారి ద్వారా సంతానం పొందినట్లుగా ఆదిపర్వం 64 అధ్యాయంలో చెప్పబడింది. ఇలాంటి రాతలన్నీ క్షత్రియులను, వారి స్త్రీలను అవమానించడానికి ఆనాటి బ్రాహ్మణ కవులు రాశారు. ఆనాటి బ్రాహ్మణ కవులు పరశురాముని బ్రాహ్మణ పౌరుషానికి, పరాక్రమానికి ప్రతీకగా చిత్రించి అతణ్ణి విష్ణువు దశావతారాల్లో ఒక అవతారంగా చేర్చి పూజనీయునిగా మార్చారు. ఇలా చేయడం మానవజాతిని ప్రత్యేకించి క్షత్రియులను అవమానించడమే.

**గాలవునికథ :**

సంస్కృత మహాభారతం ఉద్యోగ పర్వంలో 106 అధ్యాయం నుంచి 120 వ అధ్యాయం వరకూ ఉన్న 15 అధ్యాయాల్లో 331 శ్లోకాల్లో ఈ కథ ఉంది. ఈ కథను నారదుడు దుర్యోధనునితో శ్రీకృష్ణరాయబారం సందర్భంలో చెబుతాడు. నారదుడు దుర్యోధనునితో పట్టుదలకు పోయిన దురాగ్రహం భయంకర పరిణామాలకు దారి తీస్తుంది. ఈ విషయంలో పట్టుదలకు పోయి పరాజయం పాలైన గాలవుని కథను పెద్దలు చెబుతుంటారు అని గాలవుని కథను ఇలా చెబుతాడు.

ఒకసారి యమధర్మరాజు ఆకలితో నకనకలాడుతూ వశిష్టుని రూపాన్ని ధరించి విశ్వామిత్రుని వద్దకు వచ్చి భోజనం పెట్టమంటాడు. విశ్వామిత్రుడు వశిష్టునికి పరమాన్నం పెట్టాలన్న ఉద్దేశ్యంతో వంట ప్రారంభిస్తాడు. అయితే అతిథి అంతవరకూ ఆగలేక ఇతర మహర్షులు పెట్టిన అన్నాన్ని తింటాడు. అదే సమయంలో విశ్వామిత్రుడు వేడి వేడిగా ఉన్న అన్నాన్ని తెస్తాడు. అతిథి "నేను భోజనం చేశాను, నీవు అక్కడే ఉండు" అని చెప్పి అక్కడి నుండి వెళ్ళిపోతాడు. ఆ మాటతో విశ్వామిత్రుడు చేతుల్లో ఉన్న అన్నాన్ని నెత్తిమీద పెట్టుకొని అలాగే నిలబడి దాన్ని తీవ్ర వ్రతంగా భావించి స్థానువై ఉంటాడు. ఆ స్థితిలో అతనికి గాలి మాత్రమే ఆహారం. ఆ స్థితిలో ఉన్న విశ్వామిత్రునికి అతని శిష్యుడైన గాలవుడు భక్తి శ్రద్ధలతో సేవ చేస్తాడు. తర్వాత వంద సంవత్సరాలకు యమధర్మరాజు మళ్ళీ వశిష్టుని రూపాన్ని ధరించి భోజనాపేక్షతో విశ్వామిత్రుని దగ్గరకు వచ్చి అతని చేతిలో వేడివేడిగా తాజాగా ఉన్న అన్నాన్ని తిని "బ్రహ్మర్షీ పరమానందంగా ఉంది" అని చెప్పి వెళ్ళిపోతాడు.

వంద సంవత్సరాలు తనకు ఎంతగానో సేవ చేసిన గాలవుని పట్ల విశ్వామిత్రుడు సంతృప్తుడై "గాలవా, నేను అనుమతిస్తున్నాను. నీవు స్వేచ్ఛగా వెళ్ళవచ్చు." అని చెబుతాడు. గాలవుడు సంతోషించి గురుదక్షిణగా ఏమి ఇవ్వమంటారు? అని విశ్వామిత్రుని కోరతాడు. విశ్వామిత్రుడు ఏమీ ఇవ్వనవసరం లేదు. నువ్వు వెళ్ళు అని చెబుతాడు. అయినప్పటికీ గాలవుడు పట్టుదలతో ఏమి ఇవ్వమంటారో చెప్పండి అని మళ్ళీ మళ్ళీ అడుగుతాడు. దానికి విశ్వామిత్రుడు కోపించి "చెవులు ఒకవైపు నల్లగా ఉండి తెల్లగా ఉన్న 800 గుర్రాలను తెచ్చి ఇవ్వు, ఆలస్యం చేయవద్దు" అని గాలవునితో చెబుతాడు. గాలవుడు గురువు చెప్పిన గుర్రాలను తెచ్చి ఇచ్చే మార్గం తెలియక శోకంలో మునిగిపోయి చిక్కిపోయి తనకు దిక్కు శ్రీహరి తప్ప వేరే ఎవ్వరూ లేరని భావించి విష్ణువును సందర్శించాలనుకుంటాడు. గాలవుడు అలా భావించగానే శ్రీహరి వాహనమైన గరుడుడు ప్రత్యక్షమై నీకు అవసరమైన 800 గుర్రాలు ఎక్కడ ఉన్నాయో భూమి నలువైపులా వెదుకుదాం అని చెప్పి తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం దిక్కుల్లో ఉన్న విశేషాలను వాటి ప్రాధాన్యతలను గురించి సుదీర్ఘంగా వివరిస్తాడు. చివరకు గాలవుడు తూర్పు దిక్కుగా వెళ్దామని చెప్పి గరుడుని మీద కూర్చొని ఆ దిక్కుగా వెళ్ళి గుర్రాల కోసం వెదుకుతారు. ఎక్కడా గుర్రాలు కనపడవు. అపుడు గరుడుడు గాలవుని యయాతి రాజు వద్దకు తీసుకొని వెళ్ళి గాలవుని వృత్తాంతమంతా యయాతికి చెప్పి 800 గుర్రాలకు తగిన ధన సహాయం చేయమని కోరతాడు. యయాతి " నా దగ్గర అంత ధనం లేదు ఈ ద్విజ శ్రేష్టుని ఆశను విఫలం చేయలేను. నా కుమార్తె మాధవి అందమైనది. ఈమెను తీసుకొని వెళ్ళి ఏ రాజు దగ్గరైనా పెట్టి శుల్కం తీసుకొని దానితో గురుదక్షిణ ఇవ్వు" అని చెబుతాడు. దానికి గాలవుడు అంగీకరించి మాధవిని తీసుకొని అయోధ్య రాజైన హర్యశ్వుని వద్దకు వెళ్ళి తన విషయమంతా చెప్పి మాధవిని భార్యగా స్వీకరించి తనకు కావలసిన గుర్రాలను ఇవ్వవలసిందిగా కోరతాడు. దానికి హర్యశ్వుడు తన వద్ద అలాంటి గుర్రాలు 200 మాత్రమే ఉన్నాయని అందువల్ల మాధవి యందు ఒక పుత్రుని మాత్రమే కంటానని చెబుతాడు. అపుడు మాధవి గాలవునితో గతంలో ఒక మహాత్ముడు సంతానాన్ని పొందిన తర్వాత కూడా తన కన్యత్వం చెడకుండా వరమిచ్చాడని గాలవుడు తనను ఒకరి తర్వాత ఒకరికి నలుగురు రాజులకు ఇచ్చి అతని కవసరమైన 800 గుర్రాలను తీసుకోవచ్చునని, తనకు నలుగురు కుమారులు అవుతారని చెబుతుంది. దానికి గాలవుడు అంగీకరించి మాధవిని హర్యశ్వుని వద్ద ఉంచి వెళ్ళిపోతాడు. హర్యశ్వుడు ఆమెను పెళ్ళి చేసుకొని వసుమనుడు అనే కుమారుని కంటాడు.

సంవత్సరం తర్వాత గాలవుడు హర్యశ్వుని వద్దకు వచ్చి గుర్రాలను ఆ రాజు దగ్గరే ఉంచి మాధవిని తన వెంట తీసుకొని వెళ్ళి కాశీ రాజైన దివోదాసు వద్దకు వెళ్ళి తన విషయమంతా వివరించి మాధవిని సంవత్సరం పాటు ఉంచుకొని ఆమె వల్ల కుమారుని కని అతని వద్ద ఉన్న 200 గుర్రాలను తనకివ్వాలని కోరతాడు. దానికి దివోదాసు

అంగీకరిస్తాడు. దివోదాసుకు మాధవి యందు ప్రతర్ధనుడు అనే కుమారుడు కలుగుతాడు. గాలవుడు ఆ తర్వాత మాధవిని ఉసీనర రాజుకు ఇస్తాడు. ఉసీనర రాజు శిబి అనే పేరు గల కుమారుని మాధవి యందు కంటాడు. అదే సమయంలో గురుడుడు అక్కడికి వచ్చి విశ్వామిత్రుడు కోరిన గుర్రాలు భూమి మీద 600 మాత్రమే ఉన్నాయని, కాబట్టి అతనికి ఇంకా 200 గుర్రాలు దొరికే అవకాశం లేదని 200 గుర్రాలకు బదులుగా మాధవిని సంవత్సరం పాటు విశ్వామిత్రునికి ఇస్తే సరిపోతుందని చెబుతాడు. గాలవుడు రాజుల దగ్గర ఉన్న 600 గుర్రాలను, మాధవిని తీసుకొని విశ్వామిత్రుని వద్దకు వెళ్ళి, "మిగిలిన 200 గుర్రాలకు బదులుగా మాధవిని స్వీకరించండి. ఈమె యందు ముగ్గురు రాజులు ముగ్గురు పుత్రులను కన్నారు. మీరు కూడా ఒక కుమారుని కనండి. ఆ విధంగా 800 గుర్రాల గురుదక్షిణ పూర్తియై నేను మీ రుణం నుంచి విముక్తుడనవుతాను." అని చెబుతాడు. విశ్వామిత్రుడు దానికంగీకరించి మాధవి ద్వారా అష్టకుడు అనే కుమారుని కంటాడు. సంవత్సరం తర్వాత విశ్వామిత్రుడు మాధవిని గాలవునికప్పగించి తపస్సుకు వెళ్ళిపోతాడు. గాలవుడు మాధవిని తీసుకొని తిరిగి ఆమె తండ్రియైన యయాతికి అప్పగిస్తాడు. యయాతి ఆమెకు మళ్ళీ వివాహం చేయడానికి గంగ యమునల సంగమ స్థానమైన ప్రయాగలో స్వయంవరాన్ని ఏర్పాటు చేస్తాడు. ఆమెను వరించడానికి నాగులు, యక్షులు, మనుషులు, గంధర్వులు, పశు పక్షిజాతికి చెందినవారు, గిరిజనులు వస్తారు. మాధవి వారిలో ఎవరిని వరించకుండా తపోవనాన్ని వరునిగా ఎన్నుకొని తపస్సుకు వెళ్తుంది. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథను క్షత్రియ రాజులను, క్షత్రియ స్త్రీలను దారుణంగా అవమానించడానికి బ్రాహ్మణ కవి కల్పించాడు. ఈ కవికి క్షత్రియుల మీద ఎంత ద్వేషముందో చెప్పలేము. యమధర్మరాజు వశిష్టుని వేషంలో విశ్వామిత్రుని వద్దకు వచ్చి అన్నాన్ని యాచించి, ఇతర మహర్షుల దగ్గర భోజనం చేసి తిరిగి విశ్వామిత్రుని వద్దకు వచ్చి చేతిలో భోజనంతో అలాగే ఉండుమని చెప్పి వెళ్ళిపోతాడు. విశ్వామిత్రుడు వంద సంవత్సరాల తర్వాత మళ్ళీ వసిష్టుడు తిరగి వచ్చే వరకు స్థానువు లాగా అలాగే నిలబడ్డాడని ఈ కథలో చెప్పడం క్షత్రియుడైన విశ్వామిత్రుని అవమానించడమే. అంటే బ్రాహ్మణుడైన వశిష్టుడు "అలాగే ఉండు" అని చెప్పిన మాటకు కట్టుబడి విశ్వామిత్రుడు అతను తిరిగి మళ్ళీ వచ్చేదాకా వంద సంవత్సరాలపాటు విగ్రహంలాగా నిలబడి ఉన్నాడని చెప్పటం దుర్మార్గమైన విషయం. విశ్వామిత్రుడు సాధారణమైన వ్యక్తి కాదు. క్షత్రియుడుగా పుట్టిన అతను వశిష్టుని మీద పంతం పట్టి అతి దారుణమైన తపస్సు చేసి మొదట రాజర్షి, ఆ తర్వాత బ్రహ్మర్షి పదవిని పొందినవాడు. అలాంటి విశ్వామిత్రుడు వశిష్టుడు చెప్పిన మాటను సుగ్రీవాజ్ఞగా భావించి వంద సంవత్సరాల పాటు నిలబడి ఉన్నాడని చెప్పడం అతన్ని అవమానించడమే. అంతేగాకుండా ఈ కథలో కవి విశ్వామిత్రుని స్త్రీలోలునిగా చిత్రించి అవమానించాడు. గాలవుడు గురుదక్షిణగా తనకివ్వవలసిన మిగిలిన రెండు వందల గుర్రాలకు బదులుగా

మాధవిని స్వీకరించి ఆమెను సంవత్సరం పాటు తన వద్ద ఉంచుకొని ఆమె వల్ల కుమారుని కన్నాడని చెప్పడం విశ్వామిత్రుని స్త్రీలోలునిగా చిత్రించి అవమానించడమే

యయాతి మహారాజు తన వద్దకు వచ్చిన గాలవుని కోరిక తీర్చడానికి తన కుమార్తెను అతనికిచ్చి, " ఈమె రూపాన్ని చూసి దేవతలు, మనుషులు, అసురులు పొందాలని కోరుకుంటారు. ఈమెను నీవు స్వీకరించు. ఈమె కోసం శుల్కంగా రాజులు రాజ్యాలనైనా ధారపోస్తారు. నల్లని చెవులు గల ఎనిమిది వందల గుర్రాలు ఏపాటి?" అని చెబుతాడు. కూతురు మీద ప్రేమ ఉన్న కటిక దరిద్రుడు కూడా పరాయివానికి తన కుమార్తెను అప్పగించడు. అప్పగిస్తూ ఇలాంటి హేయమైన మాటలు చెప్పడు. యయాతి సుక్షత్రియుడు, అభిమానవంతుడు. అలాంటివాడు ముక్కు మొహం తెలియని బ్రాహ్మణుడు వచ్చి ధనాన్ని యాచించగానే తన దగ్గర ధనం లేని కారణం చేత కుమార్తెను ఇచ్చి అలాంటి మాటలు పలకడం అత్యంత నీచమైన పని. అలాంటి నీచమైన పని క్షత్రియుడైన యయాతి చేసినట్లుగా బ్రాహ్మణ కవి రాయడానికి కారణం అతడికి గల క్షత్రియ ద్వేషమే. అంతేగాకుండా యయాతికి గల బ్రాహ్మణ భక్తి, కాదు కాదు బ్రాహ్మణ దాసానుదాసత్వాన్ని ఈ కథను కల్పించిన కవి తెలియజేస్తున్నాడు. ముక్కుమొగం తెలియని బ్రాహ్మణుడు వచ్చి ధనాన్ని యాచిస్తే, ధనం తన దగ్గర లేకపోతే తన ఇంట్లో ఉన్న కూతుర్లనైనా బ్రాహ్మణునికి ఇచ్చి అతనికి సహాయం చేయాలనే గొప్ప నీతిని ఈ బ్రాహ్మణ కవి సమాజానికి తెలియజేస్తున్నాడు. దీన్ని బట్టి ఈ కవికి బ్రాహ్మణ కులాభిమానం ఎంత తీవ్ర స్థాయిలో ఉందో స్పష్టమవుతుంది.

ఈ కథలో మాధవి కూడా తండ్రి లాగా బ్రాహ్మణుల పట్ల దాసాను దాసత్వ స్వబావం కలదే. తండ్రి తనను ముక్కు మొహం తెలియని బాపనికి అప్పగిస్తున్నపుడు ఆమె ఏ మాత్రం అడ్డు చెప్పదు. గాలవుడు తనను హర్యశ్యునికి అప్పగిస్తున్నపుడు హర్యశ్యుడు తన దగ్గర రెండు వందల గుర్రాలు మాత్రమే ఉన్నాయని, మాధవిని సంవత్సరంపాటు భార్యగా ఉంచుకొని ఆమె యందు ఒక కుమారుని మాత్రమే కంటానని చెప్పినపుడు మాధవి గాలవునితో తనను నలుగురు రాజులకు ఇచ్చి అతనికి అవసరమైన ఎనిమిది వందల గుర్రాలను తీసుకోమని చెబుతుంది. ఈ సంఘటన ఆమె బ్రాహ్మణ దాసానుదాసత్వాన్ని తెలియజేస్తూ ఉంది. అంటే ఈ కథను కల్పించిన బ్రాహ్మణకవి యయాతిని, అతని కూతురయిన మాధవిని బ్రాహ్మణ దాసానుదాసత్వ స్వభావం కలవారుగా చిత్రించాడు. క్షత్రియ స్త్రీ పురుషులను అవమానించ డానికే ఆనాటి బ్రాహ్మణకవి యయాతి, మాధవి పాత్రలను ఏ మాత్రం ఆత్మాభిమానం లేనివారుగా, బ్రాహ్మణ దాసానుదాసులుగా చిత్రించాడు.

గాలవుడు గురుదక్షిణ ఎలా చెల్లించాలో తెలియక దు:ఖిస్తూ విష్ణువును దర్శించాలనుకుంటాడు. వెంటనే అతని మిత్రుడైన గరుడుడు అతని దగ్గరికి వచ్చినట్లుగా ఈ కథలో చెప్పబడింది. గాలవుడు గొప్ప ఋషి కాదు. అతడు విశ్వామిత్రుని గురుకులంలో విద్యాభ్యాసం అప్పుడే పూర్తి చేసుకున్న ఒక విద్యార్థి మాత్రమే. అతనికి విష్ణువు వాహనమైన గరుడుడు మిత్రుడు అయ్యే అవకాశం గానీ, విష్ణువును దర్శించాలని అతను అనుకోగానే

గరుడుడు అతని దగ్గరికి వచ్చే అవకాశం గానీ లేదు. కానీ ఈ కథను కల్పించిన కవి గాలవుడు కేవలం బ్రాహ్మణుడు అయిన కారణంగానే అతడు భావించిన వెంటనే గరుడుడు వచ్చి అతనికి సాయం చేసినట్లుగా ఈ కథలో కల్పించాడు. ఇది కూడా ఈ కథను కల్పించిన బ్రాహ్మణ కవి యొక్క తీవ్రమైన బ్రాహ్మణ కులాభిమానాన్ని తెలియజేస్తూ ఉంది.

ఈ కథలో అనౌచిత్యాలున్నాయి. దేవతలకు ఆకలి దప్పికలు ఉండవు. కానీ ఈ కథలో యమధర్మరాజు ఆకలితో నకనకలాడుతున్నట్లుగా చెప్పబడింది. పోనీ యమధర్మరాజుకు ఆకలైతే అతడు తన స్వంత వేషంలోనూ విశ్వామిత్రుని దగ్గరకు వచ్చి ఆహారాన్ని యాచించవచ్చు. అతను ఆహారం కోసం వసిష్టుని వేషంలో విశ్వామిత్రుని దగ్గరకు రానవసరం లేదు.

గరుడుడు గాలవుని వద్దకు వచ్చి అతనికి అవసరమైన గుర్రాలు కలిగిన హర్యశ్వుడు, దివోదాసు, ఉశీనర రాజుల గురించి చెప్పకుండా నాలుగు దిక్కులను గురించి, ఆ దిక్కుల్లో ఉన్న విశేషాలను గురించి సుదీర్ఘంగా చెబుతాడు. పోనీ పైన చెప్పిన రాజుల గురించి గరుడునికి తెలియదనుకోవడానికి అవకాశం లేదు. ఎందుకంటే మూడు సంవత్సరాల తర్వాత గాలవుని వద్దకు వచ్చి భూమి మీద ముగ్గురు రాజుల దగ్గర ఆరు వందల గుర్రాలు మాత్రమే ఉన్నాయని మిగిలిన రెండు వందల గుర్రాలకు బదులుగా మాధవిని విశ్వామిత్రుని వద్ద ఒక సంవత్సరం పాటు ఉంచాలని చెబుతాడు. ఆ రోజుల్లో దాదాపు రాజులందరూ బ్రాహ్మణ భక్తి ఉన్నవారే. హర్యశ్వుడు, దివోదాసు, ఉశీనర రాజులకు కూడా బ్రాహ్మణ భక్తి ఉంటుంది. గరుడుడు వీరి వద్ద ఉన్న గుర్రాల గురించి గాలవునికి చెప్పి అతన్ని ఆ రాజుల వద్దకు తీసుకొని వచ్చి ఉంటే తప్పకుండా వారు తమ వద్ద ఉన్న గుర్రాలను గాలవునికి ఇచ్చి ఉండేవారే. గరుడుడు అలా చేయకుండా గాలవుని యయాతి వద్దకు తీసుకొని వెళ్ళటం అనౌచిత్యమని చెప్పాలి.

ఈ విధంగా గాలవుని కథ అనౌచిత్యాలతో ఉంది. అంతేగాకుండా ఈ కథ బ్రాహ్మణులకు గల తీవ్రమైన క్షత్రియ ద్వేషాన్ని, అంతే తీవ్రమైన బ్రాహ్మణ కులాభిమానాన్ని తెలియజేస్తూ ఉంది.

పనిగట్టుకొని క్షత్రియులను అవమానించడానికే ఆనాటి బ్రాహ్మణ కవులు పరశురాముని కథ, గాలవుని కథ లాంటి కథలను కల్పించారు. క్షత్రియ స్త్రీ పురుషులను అవమానించడానికే ప్రాచీనకాలంలోని బ్రాహ్మణులు పరమ అశ్లీలమైన, అతి జుగుప్సాకరమైన అశ్వమేథ యాగాన్ని రూపొందించారు. ఈ అశ్లీలాన్ని అథస్సూచిక [18]లో ఇచ్చాను. ఈ విధంగా బ్రాహ్మణులు క్షత్రియులను అవమానించడానికి కారణం ఆనాడు బ్రాహ్మణ క్షత్రియుల మధ్య తీవ్రమైన సంఘర్షణ వుండడమే. బ్రాహ్మణ క్షత్రియుల మధ్య సంఘర్షణ వున్నట్లుగా భారతం అనుశాసన పర్వంలోని 152వ అధ్యాయమైన కార్తవీర్యార్జుని కథ తెలుపుతుంది. ఈ కథను భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. ధర్మరాజు "ఏ ప్రత్యేక ఫలాన్ని ఆశించి ఏ అభ్యుదయాన్ని ఉద్దేశించి బ్రాహ్మణ పూజ చేస్తున్నావు" అని భీష్ముని అడుగుతాడు.

దానికి సమాధానంగా భీష్ముడు ఈ "విషయానికి కార్తవీర్యార్జునికి, వాయుదేవునికి మధ్య జరిగిన సంవాద రూపమైన ప్రాచీనేతిహాసాన్ని పెద్దలు ఉదాహరిస్తూ వుంటారు. దాన్ని చెబుతాను" అని ఈ కథను ఇలా చెబుతాడు.

పూర్వం మాహిష్మతీ పురంలో వేయి చేతులున్న మహాబలుడయిన కార్తవీర్యార్జునుడు ఈ లోకానికంతటికి ప్రభువుగా వుండి పాలిస్తుండేవాడు. అతను దత్తాత్రేయ మహర్షిని చాలా కాలం పూజించి తన సమస్త ధనాన్ని అతనికి సమర్పిస్తాడు. దానికి దత్తాత్రేయ మహర్షి సంతోషించి కార్తవీర్యార్జునుని మూడు వరాలు కోరుకొమ్మని పలుకుతాడు. దానికి కార్తవీర్యార్జుడు "నేను యుద్ధరంగంలో వేయి చేతులు వున్నవాడుగా వుండాలి. ఇంట్లో మాత్రం మామూలుగా వుండాలి. గొప్ప పరాక్రమంతో ఈ సమస్త భూమండలాన్ని నేను జయించి అలసత్వం లేకుండా దాన్ని పాలించాలి. బ్రాహ్మణ శ్రేష్ఠుడా నాలుగవ వరాన్ని కూడా నాకు అనుగ్రహించు నేను మార్గం తప్పి ప్రవర్తించినప్పుడు సాధవులు నన్ను సన్మార్గంలో ప్రవర్తింప చేయాలి. దీన్నికూడా అనుగ్రహించు". దత్తాత్రేయుడు ఆ వరాలన్నీ ఇస్తాడు.

వరాలను పొందిన తర్వాత కార్తవీర్యుడు అహంకారంతో "ఈ ప్రపంచంలో ధైర్యం, వీర్యం, యశస్సు, శౌర్యం, విక్రమం, ఓజస్సు మొదలైన వాటిలో నాతో సమానుడు ఎవడున్నాడు" అని గట్టిగా పలుకుతాడు. వెంటనే ఆకాశవాణి "మూర్ఖుడా! క్షత్రియుని కంటే బ్రాహ్మణుడు శ్రేష్ఠుడని తెలుసుకోలేకపోతున్నావు. క్షత్రియుడు బ్రాహ్మణునితో కలిసి మాత్రమే ప్రజలను పాలించగలుగుతున్నాడు" అని పలుకుతుంది. దానికి కార్తవీర్యుడు "నేను సంతోషిస్తే అన్ని భూతాలను సంతృప్తి పరుస్తాను. నేను కోపిస్తే నాశనం చేస్తాను. మనోవాక్కాయకర్మలలో నాకంటే గొప్ప ద్విజుడు లేడు. బ్రాహ్మణుడు గొప్పవాడనే వాదం ఇప్పుడు చెల్లదు. క్షత్రియుడు శ్రేష్ఠుడు అనేది నేటి సిద్ధాంతం. బ్రాహ్మణులు క్షత్రియులను ఆశ్రయించుకొని జీవిస్తారు. క్షత్రియుడు బ్రాహ్మణుని ఆశ్రయించడు. ప్రజా పరిపాలన క్షత్రియుల చేతిలోనే వుంది. కాబట్టి క్షత్రియుని కంటే విప్రుడు ఏవిధంగా శ్రేష్ఠుడు? విప్రులు భిక్షమెత్తుకొని జీవిస్తూ కూడా తమను తాము గొప్పవాళ్ళుగా చెప్పుకుంటూ వుంటారు. అలాంటి విప్రులను నేటి నుంచి నా అదుపులో వుంచుతాను. బ్రాహ్మణులందరిని తప్పక జయిస్తాను. ఈ ముల్లోకాల్లో ఎవడూ కూడా నన్ను పదవి నుంచి తొలగించలేడు. దేవుడైన, మానవుడైన నన్నేమీ చేయలేరు. అందుకే నేను బ్రాహ్మణుని కంటే శ్రేష్ఠుడను. నేటి వరకు బ్రాహ్మణ ప్రధానమైన లోకాన్ని క్షత్రియ ప్రధానంగా చేస్తాను. యుద్ధంలో నన్ను ఎవరు జయించలేరు" అని చెబుతాడు.

కార్తవీర్యుని మాటలు విన్న వాయుదేవుడు ఆకాశం నుంచి ఇలా అంటాడు. "అర్జునా! పాపభావాన్ని వదిలిపెట్టు. బ్రాహ్మణులకు నమస్కరించు, వారి పట్ల పాపంతో ప్రవర్తిస్తే దేశమంతా సంక్షోభంలో మునిగిపోతుంది. వారిని హింసిస్తే వారు నిన్ను దేశం నుంచి బహిష్కరిస్తారు" అని పలుకుతాడు. అప్పుడు అర్జునుడు నీవు ఎవరివి అని ప్రశ్నిస్తాడు.

"నేను వాయుదేవుడను, దేవతల దూతను, నేను నీకు హితం చెబుతున్నాను" అని అంటాడు. అప్పుడు అర్జునుడు "భూదేవితో సమానంగా సహనశీలం కలిగిన బ్రాహ్మణుని గురించి నాకు చెప్పు. వాయువు, జలం, అగ్ని, సూర్యుడు, ఆకాశం – వీటితో సమానుడైన బ్రాహ్మణోత్తముడు వుంటే అతని గురించి చెప్పు" అని పలుకుతాడు. అప్పుడు వాయుదేవుడు అర్జునునితో ఇలా అంటాడు. "మూర్ఖుడా! మహాత్ములైన బ్రాహ్మణుల గుణగణాలను కొన్నింటిని చెబుతాను విను. నీవు చెప్పిన వారందరి కంటే బ్రాహ్మణులే శ్రేష్ఠులు. ఒకప్పుడు అంగరాజుతో వివాదం ఏర్పడిన కారణంగా భూదేవి తన భూమి ధర్మాన్ని విడిచిపెట్టింది. అప్పుడు బ్రాహ్మణుడైన కశ్యపుడు తన తపోబలంతో భూమిని మళ్ళీ నిలబెట్టాడు. ఒకప్పుడు అంగిరసుడు తన తేజస్సుతో నీటిని అంతటిని తాగివేసి మళ్ళీ ఆ నీటినంతటిని గొప్ప ప్రవాహంతో బయటకు వదలివేశాడు. ఇంద్రుడు అహల్యను కామించడం చేత అతడు గౌతమ మహర్షిచేత శపించబడ్డాడు. పూర్వం సముద్రపు నీరు తీయగా వుండేది. బ్రాహ్మణుల శాపం కారణంగా ఆ నీరు ఉప్పగా మారిపోయింది. పూర్వం అగ్ని బంగారు రంగుతో పొగ లేకుండా పెద్ద జ్వాలలతో వెలుగుతుండేది. అంగిరసుని శాపం కారణం అగ్ని తన గుణాన్ని కోల్పోయింది. సగరుని కుమారులు యాగాశ్వాన్ని వెదుకుతూ భూమిని తవ్వి సాగరంగా మార్చారు. అలాంటి వారిని కపిల మహర్షి బూడిదగా మార్చాడు. ప్రస్తుతం దండకారణ్యంగా చెప్పబడుతున్న ప్రాంతమంతా ఒకప్పుడు గొప్ప సామ్రాజ్యం. బ్రాహ్మణ శాపం వల్ల అరణ్యంగా మారిపోయింది. కాబట్టి ఓ రాజా! నీవు బ్రాహ్మణులతో సమానం కాదు. రాజైన వాడు గర్భంలో వున్న బ్రాహ్మణ పిండానికి కూడా నమస్కరించాలి. నీవు కూడా బ్రాహ్మణుడైన దత్తాత్రేయ మహర్షి అనుగ్రహం చేతనే వరాలను పొందావు" వాయుదేవుడు ఇంకా అగస్త్య , వసిష్ఠ మహర్షుల మాహాత్మ్యాన్ని గురించి, అత్రి, చ్యవన మహర్షుల ప్రభావాన్ని గురించి సుదీర్ఘంగా కార్తవీర్యార్జునికి చెబుతాడు. ఆ మాటలు విన్న కార్తవీర్యార్జునుడు "ప్రభూ! నేను ఎల్లవేళలా బ్రాహ్మణుల ప్రయోజనాల కోసమే జీవిస్తాను. నేను బ్రాహ్మణ భక్తుడను. ఎల్లప్పుడు బ్రాహ్మణులకు నమస్కరిస్తాను. దత్తాత్రేయుని అనుగ్రహం వల్లనే నాకు గొప్ప బలం, లోకంలో కీర్తి వచ్చింది. వాయుదేవుడా నీవు చెప్పిన అద్భుతమైన బ్రాహ్మణ కార్యాలన్ని శ్రద్ధగా విన్నాను" అని పలుకుతాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ కథలో కార్తవీర్యార్జునుడు పలికిన మాటలను బట్టి ఆనాడు బ్రాహ్మణ క్షత్రియ వర్ణాల మధ్య తీవ్రమైన సంఘర్షణ వున్నట్లుగా స్పష్టమవుతుంది. వేయి బాహువులతో భూమిని మొత్తాన్ని పాలిస్తున్న కార్తవీర్యార్జునుడు తన బలపరాక్రమాలతో బ్రాహ్మణ ప్రధానమైన లోకాన్ని క్షత్రియ ప్రధానంగా మారుస్తానని దర్పంతో ప్రకటించిన అతడు వాయుదేవుడు చెప్పిన బ్రాహ్మణ మాహాత్మ్యానికి, ప్రభావానికి లొంగిపోయి బ్రాహ్మణ భక్తుడుగా మారిపోయినట్లుగా ఈ కథలో బ్రాహ్మణ కవి చెప్పి బ్రాహ్మణుల మాహాత్మ్యాన్ని, వారి ఆధిక్యాన్ని లోకానికి చాటి చెప్పాడు. ఈ కథలో కవి బ్రాహ్మణుల ఆధిక్యాన్ని మానవులతో

కాకుండా ఆకాశవాణి చేత వాయుదేవుని చేత చెప్పించి ప్రకృతి, దేవతలు కూడా బ్రాహ్మణుల మాహాత్మ్యాన్ని అంగీకరించి చాటి చెబుతున్నారని అమాయకులైన ప్రజలను నమ్మించే ప్రయత్నం చేశాడు. ఇలాంటి రాతలన్నీ ఆనాటి బ్రాహ్మణ కవులు బ్రాహ్మణుల అగ్రజన్మత్వాన్ని, వారి గొప్పతనాన్ని చాటి చెప్పడానికే రాశారు.

ఈ కార్తవీర్యార్జునుని కథలో అనౌచిత్యం ఉంది. కార్తవీర్యార్జునునికి దత్తాత్రేయుడు ఇచ్చిన వరాలు కొత్తవి కావు. వరాలు ఇవ్వకముందే కార్తవీర్యార్జునునికి వేయి చేతులున్నట్లుగా అతడు భూలోకం మొత్తాన్ని పాలిస్తున్నట్లుగా ఈ కథలో చెప్పబడింది.

నన్నయ తన భారతం ఆదిపర్వంలో ఉత్తంకుణ్ణి ఉదంకుడని చెప్పాడు. నన్నయ ఉదంకోపాఖ్యానాన్ని ఆదిపర్వ ప్రథమాశ్వాసంలోని 91 పద్యం నుంచి 119వ పద్యం వరకు ఉన్న 29 పద్య గద్యాల్లో చెప్పాడు. ఈ ఉపాఖ్యానంలో నన్నయ కొన్ని మార్పులు చేశాడు. సంస్కృత భారతంలో ఉత్తంకుని గురువు పేరు వేదుడు అని ఉండగా నన్నయ ఆ పేరును 'పైలుడు'గా మార్చాడు. సంస్కృత భారతంలో ఉత్తంకుని గురువు గ్రామాంతరం వెళ్ళడం, గురుపత్ని ఋతుకాలంలో ఉత్తంకుని సంభోగాన్ని ఆశించడం అతడు తిరస్కరించడం, గురువు తిరిగి వచ్చిన తర్వాత ఉత్తంకుని ప్రవర్తనకు సంతోషించి అతనికి గురుకులం నుంచి విడుదల ప్రకటించడం మొదలైన వృత్తాంతం ఔచిత్యంగా లేదని నన్నయ ఈ కథనంతటినీ వదలివేశాడు. ఉదంకుడు గురువును శ్రద్ధగా పూజించి అణిమాది అష్టసిద్ధులు పొందినట్లుగా నన్నయ ఇలా రాశాడు.

**"గురుకులమునందు గురులకు**
**బరిచర్య లొనర్చి తానపరిమిత నిష్ఠా**
**పరుడై జ్ఞానము వడసెను**
**గురుదయ నణిమాదికాష్ట గుణముల తోడన్"**
**(ప్రథమాశ్వాసం, 92వ పద్యం)**

అణిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, మహిమ, ఈశత్వం, వశిత్వం, కామావసాయిత అనే ఎనిమిది అష్టసిద్ధులు. మూలంలో ఉత్తంకుడు అష్టసిద్ధులు అభ్యసించినట్లుగా లేదు. ముందు జరుగబోయే కథా ప్రయోజనాన్ని ఉద్దేశించి నన్నయ ఈ మార్పు చేశాడు. తక్షకుడు ఉదంకుని కుండలాలను అపహరించి పాము రూపంలో భూమి రంధ్రంలో నుంచి నాగలోకానికి వెళ్ళినప్పుడు "ఉదంకుడును వానితోడన తగిలి యవ్వివరంబున నురగలోకంబున కరిగి నాగపతులనెల్ల నిట్లనిస్తుతియించె" అని నన్నయ రాశాడు. మూలంలో దేవేంద్రుడు పంపిన వజ్రాయుధం సాయంతో ఉత్తంకుడు భూమిని తవ్వి నాగలోకానికి వెళ్ళినట్లుగా ఉండగా నన్నయ్య దాన్ని మార్చి ఉదంకుడు తనకు తానుగా అతని వెంటపడి వెళ్ళినట్లుగా చెప్పాడు. అంటే ఉదంకుడు తాను అభ్యసించిన అణిమాదిసిద్ధుల సాయంతో తక్షకుని వెంటపడి వెళ్ళాడన్నమాట. అణిమ అంటే సూక్ష్మరూపాన్ని పొందడం.

అంటే ఉదంకుడు సూక్ష్మరూపాన్ని పొంది భూమి రంధ్రంగుండా నాగలోకాన్ని చేరుకున్నాడన్నమాట. ఇది నన్నయ ప్రసన్న కథా కలితార్థయుక్తి అనే కవితా లక్షణానికి సంబంధించిన విషయం. మూలంలో ఉత్తంకుడు నాగలోకంలో ఐరావతుడు, ధృతరాష్ట్రుడు, తక్షకుడు మొదలైన ప్రముఖ నాగులను స్తుతించినట్లు ఉండగా నన్నయ ఆదిశేషుడు, వాసుకి, తక్షకుడు, ఐరావతుడు మొదలైన వారిని స్తుతించినట్లుగా మార్పు చేశాడు. నాగుల్లో ఆదిశేషుడు వాసుకి చాలా గొప్పవారుగా ప్రసిద్ధి ఉంది. అందువల్లనే నన్నయ ఈ మార్పు చేశాడు. ఉదంకుడు నాగుల స్తుతి చేసినట్లుగా రాసిన నాలుగు పద్యాలను "మాకు ప్రసన్నుడయ్యెడున్" అనే పదాలతో ముగించాడు. ఈ ముగింపు తర్వాత శతక కవులకు మకుట నియమంగా ఉపయోగపడిందని సాహిత్య చరిత్రకారులు చెప్పారు. ఇలాంటి చిన్నమార్పులతో నన్నయ ఉదంకో పాఖ్యానాన్ని కొంత క్లుప్తంగా రాశాడు.

తిక్కన సంస్కృత భారతాన్ని అనుసరించి అశ్వమేధ పర్వం తృతీయా శ్వాసంలో 28వ వచనం నుండి 118 వ వచనం వరకు ఉన్న 90 పద్యగద్యాల్లో ఉదంకుని కథను చెప్పాడు. ఇందులో తిక్కన ఎలాంటి మార్పులు చేయలేదు.

## 2. గరుడుని కథ :

సంస్కృత భారతంలో గరుడుని కథ ఆదిపర్వంలోని ఆస్తీకపర్వం అనే ఉప పర్వంలో 16వ అధ్యాయం నుంచి 34 అధ్యాయం వరకు ఉన్న 19 అధ్యాయాల్లో 482 శ్లోకాల్లో ఉంది. ఈ కథను నైమిశారణ్యంలోని ఋషులకు ఉగ్రశ్రవసుడు అనే పౌరాణికుడు చెబుతాడు.

దక్ష ప్రజాపతి కుమార్తెలు కద్రువ, వినతలు. వీరు కశ్యప ప్రజాపతి భార్యలు. కశ్యపుడు తన భార్యలను తమకిష్టమైన వరాలను కోరుకొమ్మంటాడు. కద్రువ సమాన బలం కలిగిన వేయిసర్పాలను పుత్రులుగా కోరుకుంటుంది. కద్రువ పుత్రుల కంటే ఎక్కువ బల పరాక్రమాలు, శరీరం, తేజస్సు కలిగిన ఇద్దరు కుమారులను వినత కోరుకుంటుంది. చాలా కాలం తర్వాత కద్రువ వేయిగుడ్లను, వినత రెండు గుడ్లను కంటారు. ఆ గుడ్లను పైకి చెమర్చే నేతికుండల్లో పెట్టి రక్షిస్తుంటారు. 500 సంవత్సరాల తర్వాత కద్రువ అండాల నుండి ఆదిశేషుడు, వాసుకి మొదలైన నాగులు పుడతారు. కాని వినత అండాలు ఫలించలేదు. వినత అసూయతో తన ఒక గుడ్డును పగుల గొడుతుంది. అందులో నుంచి ఊర్ధ్వభాగ శరీరం మాత్రమే కలిగిన కుమారుడు ఉదయించి "అసూయతో నన్ను అర్ధశరీరం కలవానిగా చేశావు. కాబట్టి నీవు నీ సవతికి 500 సంవత్సరాలు దాసిగా సేవించు" అని తల్లిని శపించి రెండవ అండం నుంచి పుట్టిన కుమారుడు ఆమె దాసిత్వాన్ని తొలగిస్తాడని అది ఫలించే వరకు వేచి వుండమని చెబుతాడు.

కద్రువ వినతలు ఒకసారి విహారానికి సముద్ర తీరానికి వెళ్ళినప్పుడు సముద్ర మథన సందర్భంలో పుట్టిన "ఉచ్చైశ్రవం" అనే గుర్రాన్ని చూస్తారు. అప్పుడు కద్రువ

వినతతో ఆ గుర్రం ఏ రంగులో ఉంది?" అని అడుగుతుంది. "అది తెల్లగా ఉంది. నువ్వు ఏమనుకుంటున్నావు?పందెం వేసుకుందాం,చెప్పు" అని వినత అంటుంది. "దానితోక నల్లగా ఉందనుకుంటున్నాను. ఓడినవారు గెలిచినవారికి దాస్యం చేయాలి" అని కద్రువ అంటుంది. అలా వాళ్ళిద్దరూ పందెం వేసుకొని ఆ విషయం రేపు చూద్దామని వెళ్ళిపోతారు. కద్రువ మోసంతో పందెం గెలవాలని భావించి తన కుమారులైన వేయిమంది సర్పాలను పిలిచి ఉచ్చైశ్రవం తోకను నల్లగా చేయుమని ఆజ్ఞాపిస్తుంది. ఆ పని చేయడానికి వారు అంగీకరించరు. దానితో ఆమె కోపగించి

**"సర్పసత్రే వర్తమానే పావకో వః ప్రధక్ష్యతి**
**జనమేజయస్య రాజర్షేః పాండవేయస్య ధీమతః"**

**(ఆది. 20 – 8వ శ్లోకం)**

"పాండవ వంశస్థుడు రాజర్షి అయిన జనమేజయుడు చేసే సర్పయాగంలో మీరు నశిస్తారు" అని శపిస్తుంది. అప్పుడు నాగులు ఆలోచించుకొని తల్లి ఆజ్ఞ నెరవేర్చాలని భావించి, కొన్ని నాగులు ఉచ్చైశ్రవం తోకకు చుట్టుకుంటాయి. కద్రువ వినతలు మరుసటి రోజు వెళ్ళి చూసేసరికి గుర్రం తోక నల్లగా కనిపిస్తుంది. పందెంలో గెలిచిన కద్రువ ఓడిపోయిన వినతను తనకు దాసిగా చేసుకుంటుంది. సవతికి దాసిగా ఉండవలసి వచ్చినందుకు వినత చాలా దుఃఖిస్తుంది. వినత కద్రువకు దాస్యం చేస్తున్నప్పుడు గరుడుడు అండం చీల్చుకొని బయటికి వస్తాడు. ఆ పక్షీంద్రుడు మహాబలం కలవాడు. కామరూపం కామగమనం మొదలైన శక్తులున్నవాడు. గుడ్డు నుంచి వెలువడిన తర్వాత దివ్యతేజస్సుతో భయంగొల్పుతున్న గొప్ప శరీరంతో ఎగిరి వస్తున్న అతణ్ణి చూసి ఋషులు దేవతలు భయపడి ప్రసన్నం కావాలని అతణ్ణి ప్రార్థిస్తారు. వారి ప్రార్థన మన్నించి గరుడుడు తన భయంకర రూపాన్ని దివ్య తేజస్సును ఉపసంహరించు కుంటాడు. ఆ తర్వాత గరుడుడు తండ్రి అయిన కశ్యపుని ఆశ్రమానికి వచ్చి అక్కడ ఉన్న తన అన్న అయిన అరుణుని సూర్యుని సారథిగా చేసి భయంకరమైన సూర్యుని తేజస్సు నుంచి లోకాలను కాపాడతాడు.

ఆ తర్వాత గరుడుడు తల్లి వినత వద్దకు వస్తాడు. వినత కద్రువకు దాస్యం చేస్తూ ఆమె చెప్పిన చోటుకు కద్రువను తన వీపు మీద మోసి తీసుకొనిపోతూ కుమిలిపోతూ ఉంటుంది. తల్లితోపాటు గరుడుడు కూడా కద్రువ కుమారులైన నాగులను తన వీపు మీద ఎక్కించుకొని వారు తీసుకువెళ్ళమన్న చోటుకి తీసుకు వెళ్తూ ఉంటాడు. మహాబలవంతుడైన తాను సర్పాలకు ఎందుకు సేవ చేయాలని గరుడుడు తల్లిని అడుగుతాడు. వినత తాను పందెంలో ఓడిపోయి కద్రువకు దాసీ అయిన విషయం చెబుతుంది. అప్పుడు గరుడుడు నాగుల వద్దకు వచ్చి తన తల్లి దాస్యవిముక్తికి ఏమి కావాలో చెప్పుమని అడుగుతాడు. అమృతం తెచ్చి తమకు యిస్తే ఆమె దాస్యం తీరిపోతుందని నాగులు చెబుతారు. గరుడుడు వినత వద్దకు వచ్చి ఆమెకు విషయం చెప్పి అమృతం తీసుకురావడానికి తగిన ఆహారం

తనకు కావాలని, అది ఎక్కడ దొరుకుతుందో చెప్పుమని తల్లిని అడుగుతాడు. సముద్ర మధ్యలోని బోయపల్లెలో ఉన్న వేలాదిమంది నిషాదులను తిని అమృతాన్ని తీసుకొని రమ్మని తల్లి చెప్పి అతణ్ణి ఆశీర్వదించి పంపిస్తుంది. గరుడుడు వెంటనే వాయువేగంతో ఎగిరి వెళ్ళి నిషాదులను తిని ఇంకా ఆకలి తీరక తండ్రి అయిన కశ్యపుని వద్దకు వెళ్ళి తాను తల్లి దాస్య విముక్తి కోసం అమృతం కోసం పోతున్న విషయం చెప్పి తన ఆకలి తీరడానికి అవసరమైన ఆహారం కావాలని చెబుతాడు. ఒక సరస్సులో కొన్ని యోజనాల వరకు వ్యాపించిన శరీరం కలిగిన గజకచ్ఛపాలున్నాయని, అవి రెండు శాపం కారణంగా అక్కడుండి పరస్పరం దెబ్బలాడు కుంటున్నాయని, ఆ రెండింటిని తిని అమృతాన్ని తీసుకొని రమ్మని కశ్యపుడు గరుడునికి చెబుతాడు.

వెంటనే గరుడుడు సరస్సు వద్దకు వెళ్ళి ఒక గోటితో ఏనుగును, మరొక గోటితో తాబేలును పట్టుకొని ఆకాశంలోకి ఎగిరి వాటిని తినడానికి అనువైన స్థలం కోసం వెదుకుతూ ఉంటాడు. అతని వేగానికి చెట్లన్నీ కంపించిపోతూ తమ మీద కూర్చొని తమను విరుగ్గొట్టవద్దని అతణ్ణి వేడుకుంటాయి. అప్పుడు ఒక మర్రిచెట్టు నూరు యోజనాల వరకు వ్యాపించిన తన కొమ్మ మీద వాలి గజకచ్ఛపాలను తినమని గరుడునికి చెబుతుంది. గరుడుడు పర్వతం లాగా విశాలంగా వ్యాపించిన ఆచెట్టు కొమ్మ మీద వాలగానే అతని ధాటికి తట్టుకోలేక ఆ కొమ్మ విరుగుతుంది. వెంటనే గరుడుడు ఆ కొమ్మ కిందపడకుండా నోటితో పట్టుకుంటాడు. ఆ కొమ్మకు వాలఖిల్యులు అనే మహర్షులు తలకిందులుగా వేలాడుతూ తపస్సు చేస్తుంటారు. కొమ్మకింద పడితే వారికి అపాయం కలుగుతుందని భావించి గరుడుడు గజకచ్ఛపాలను, ఆ కొమ్మను పట్టుకొని గంధమాదన పర్వతం మీద తపస్సు చేస్తున్న తండ్రి వద్దకు వస్తాడు. కశ్యపుడు గరుడుని పరిస్థితి తెలుసుకొని గరుడుని అనుగ్రహించవలసిందిగా వాలఖిల్య మహర్షులను ప్రార్థిస్తాడు. కశ్యపుని ప్రార్థన మన్నించి వారు కొమ్మ వదలివేసి హిమాలయాలకు వెళ్ళిపోతారు. ఆ తర్వాత గరుడుడు తండ్రి సలహా మీద నిర్జన ప్రదేశానికి వెళ్ళి అక్కడ కొమ్మను వదలివేసి ఏనుగును తాబేలును భక్షిస్తాడు.

ఆ తర్వాత గరుడుడు ఊహించరాని మహావేగంతో స్వర్గం మీదికి ఎగిరి వెళ్ళి అష్టదిక్పాలను, వారి సైన్యాన్ని అనుపమానమైన బలపరాక్రమాలతో కకావికలు చేసి ఓడించి అమృతాన్ని గ్రహిస్తాడు. విష్ణువు అతని సాహసానికి మెచ్చి ప్రత్యక్షమై వరం కోరుకోమంటాడు. గరుడుడు తాను విష్ణువు ధ్వజంగా ఉండాలని, అమృతం తాగకుండానే తనకు జరామరణాలు లేకుండా ఉండాలని వరం కోరుకుని తాను గూడా విష్ణువుకు వరం ఇస్తానంటాడు. విష్ణువు గరుడుడు తనకు వాహనంగా ఉండాలని కోరతాడు. దానికి గరుడుడు అంగీకరిస్తాడు. ఆ తర్వాత గరుడుడు అమృత భాండాన్ని తీసుకొని బయలుదేరుతున్నప్పుడు ఇంద్రుడు వచ్చి అతని మీద వజ్రాయుధాన్ని ప్రయోగిస్తాడు. వజ్రాయుధం దధీచిమహర్షి వెన్నుముకతో

తయారయింది కాబట్టి దాన్ని గౌరవించడానికి గరుడుడు తన ఈకను ఒకదాన్ని దానికి వదులుతాడు. దానితో దేవేంద్రుడు దిగివచ్చి గరుడుని స్నేహాన్ని కోరి అమృతాన్ని ఎవరికైనా ఇస్తే వారు దాన్ని తాగి అమరత్వాన్ని పొంది తమకు అపకారం కలిగిస్తారు కాబట్టి అమృతభాండాన్ని తనకు ఇవ్వవలసిందిగా కోరతాడు. దానికి గరుడుడు తాను అమృతభాండాన్ని ఒక కారణంచేత తీసుకొని వెళ్తున్నానని, దాన్ని ఎవరికీ తాగడానికి ఇవ్వనని, దాన్ని తాను ఒకచోట ఉంచుతానని, దేవేంద్రుడు దాన్ని అపహరించి తీసుకొని వెళ్ళవచ్చునని ఇంద్రునికి చెబుతాడు. దేవేంద్రుడు దానికి అంగీకరించి ఏదైనా వరం కోరుకోమని గరుడునికి చెబుతాడు. మహాబలవంతులైన సర్పాలు తనకు ఆహారంగా కావాలని గరుడుడు కోరుతాడు. ఇంద్రుడు అలాగే జరుగు తుందని ఆ వరాన్ని గరుడునికి ఇస్తాడు.

ఆ తర్వాత గరుడుడు అమృతభాండాన్ని తీసుకొని నాగుల వద్దకు వచ్చి దాన్ని అక్కడ దర్భల మీద పెట్టి వారితో వారు కోరినట్లుగా అమృతభాండం తెచ్చానని, స్నానంచేసి శుచులై వచ్చి అమృతాన్ని సేవించాలని, వారు కోరినట్లుగా అమృతాన్ని తెచ్చాను కాబట్టి తన తల్లి దాస్యవిముక్తి పొందిందని చెప్పి తన తల్లి వినతను తీసుకొని స్వేచ్ఛగా వెళ్ళిపోతాడు. నాగులు సంతోషంతో స్నానం చేయడానికి వెళ్తారు. అదృశ్యంగా అక్కడికి వచ్చిన దేవేంద్రుడు అమృతభాండాన్ని తీసుకొని వెళ్ళిపోతాడు. స్నానం చేసి అమృతపానం చేయడానికి వచ్చిన నాగులకు అమృతభాండం కన్పించక పోవడం చేత అవి అమృతభాండం ఉంచబడిన దర్భలను నాకుతాయి. దానితో వాటి నాలుకలు రెండుగా చీలుతాయి. గరుడుడు పక్షులకు రాజై సర్పాలను తింటూ సంతోషంగా ఉంటాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ గరుడుని కథలో నాయకుడు గరుడుడు. జానపద కథల ప్రభావంతో పండితకవి రాసిన అద్భుతకథ యిది. ఈ కథలో కొన్ని జానపద అద్భుత కథాంశాలు ఉన్నాయి. కద్రువ వినతలు అక్కాచెల్లెళ్ళు అయినప్పటికీ సవతులు కావడంవల్ల పరస్పరం ఈర్ష్యాసూయలు కలిగి ఉండడం జానపద కథా లక్షణం. కశ్యపుడు వరాలు కోరుకొమ్మన్నప్పుడు కద్రువ సమాన తేజస్సు కలిగిన వేయిమంది సర్పాలు పుత్రులుగా కావాలని కోరుకుంటుంది. ఆమె మీద స్పర్ధ ఉన్న వినత కద్రువ కుమారులకంటె ఎక్కువ బలపరాక్రమాలు, శరీరం, తేజస్సు ఉన్న ఇద్దరు కుమారులను కోరుకుంటుంది. ఈ విధంగా సవతులు పరస్పరం స్పర్ధ కలిగి ఉండడం జానపద లక్షణం.

కద్రువ సర్పాలను పుత్రులుగా కోరుకోవడం, ఆమె వెయ్యి గుడ్లను, వినత రెండు గుడ్లను కనడం, కద్రువ గుడ్ల నుంచి ఆదిశేషుడు, వాసుకి లాంటి అద్భుత బల పరాక్రమాలు కలిగిన సర్పాలు ఉద్భవించడం, వినత రెండవ గుడ్డు నుంచి అత్యద్భుతమైన బల పరాక్రమాలు కలిగిన గరుడుడు ఉద్భవించడం మొదలైన అంశాలు జానపదుని ఆలోచనకు సంబంధించినవి. లోకంలో గుడ్డు నుంచి పాములు, పక్షులు ఉద్భవించడం గమనించిన జానపద కవి ఆ గుడ్డును స్త్రీలు కన్నారని ఊహించి ఇలాంటి కల్పనలను

చేశాడు. అంతేకాకుండా ఆదిశేషుడు, వాసుకి, గరుడుడు లాంటి అద్భుత బలపరాక్రమాలున్నవారు సామాన్యుల కడుపున పుట్టరని వారు గొప్ప మాహాత్మ్యం కలిగిన వారి కడుపున గొప్ప బ్రహర్షుల వరప్రభావంతో పుడతారని జానపదకవి ఆలోచన. కద్రువినతలు సామాన్యులు కారు. దక్ష ప్రజాపతి కుమార్తెలు. దక్షుడు బ్రహ్మకుమారుడు. కశ్యపుడు సాక్షాత్తుగా విష్ణువు అవతారం. అతడు గూడా ఒక ప్రజాపతే. ఒక ప్రజాపతి కుమార్తెలకు మరొక ప్రజాపతి వరం వల్ల పుట్టడం చేతనే వారు అలాంటి మహాబల పరాక్రమాలు కలిగిన వారుగా జన్మించారని జానపద కవి ఆలోచన. ఆదిశేషుడు భూభారాన్ని వహించడం, వాసుకి దేవ దానవులు సముద్ర మథన సందర్భంలో మందర పర్వతానికి తాడుగా ఉపయోగపడడం, గరుడుడు చేసిన అనేక అత్యద్భుత కార్యాలు మొదలైనవి పండిత కవి కల్పించినవి. ఈ విధంగా ఈ కథలో జానపద కవి ఆలోచన పండిత కవి కల్పన కలిసి ఉన్నాయి.

ఈ కథలో సర్పాలు, అనూరుడు, గరుడుడు మహా శరీరం, బలపరాక్రమాలు కలిగి ఉండడానికి మరొక కారణం చెప్ప బడింది. కద్రువకు వెయ్యి గుడ్లు, వినతకు రెండు గుడ్లు పుట్టిన తర్వాత వాటిని పైకి చెమర్చే నేతికుండల్లో ఉంచి జాగ్రత్తగా రక్షించారు. అలా 500 సంవత్సరాలు గడిచిన తర్వాత కద్రువ గుడ్ల నుంచి ఆదిశేషుడు, వాసుకి, ఐరావతుడు, తక్షకుడు మొదలైన నాగులు పుట్టారు. అంటే ఎక్కువ కాలం గుడ్లలో ఉండడం వల్ల వారు చాలా పెద్ద శరీరం, గొప్ప బలం కలిగిన వారయ్యారన్నమాట. వినత కద్రువ కుమారుల కంటే మరింత బలవంతులను కుమారులుగా కోరుకోవడం చేత ఆమె గుడ్లు ఫలించి వాటి నుంచి కుమారులు రావడానికి వెయ్యి సంవత్సరాలు పట్టింది. గుడ్డులో వెయ్యి సంవత్సరాలుండడం వల్లనే గరుడుడు అమితాశ్చర్యకరమైన పెద్ద శరీరం, బలపరాక్రమాలు కలిగిన వాడయ్యాడు. అతడు గుడ్డు నుంచి బైటకువచ్చి ఆకాశంలో ఎగురుతూ ఉంటే అతని శరీరాన్ని, అగ్నిలాగా వెలిగిపోతున్న అతని తేజస్సును, వేగాన్ని చూసి దేవతలు, మునులు భయపడిపోయి అతని భయంకర రూపాన్ని ఉపసంహరించ వలసిందిగా ప్రార్థిస్తారు.

గరుడుని బలపరాక్రమాలు ఈకథలో రెండుచోట్ల వివరింపబడ్డాయి. ఇతడు తల్లి దాస్యవిముక్తికోసం అమృతం తీసుకొని రావడానికి బయలుదేరేముందు కశ్యపుని సూచన ప్రకారం గజకచ్ఛపాలను తింటాడు. ఈ గజకచ్ఛపాలు సామాన్య మైనవి కావు. ఏనుగు ఆరు మోజనాల ఎత్తు, పన్నెండు యోజనాల పొడవు గలది. తాబేలు మూడు యోజనాల వెడల్పు పది యోజనాల చుట్టు కొలత ఉన్నది. యోజనం అంటే ఎనిమిది మైళ్ళు. అంటే ఏనుగు 48 మైళ్ళ ఎత్తు, 96 మైళ్ళ పొడవు ఉందన్న మాట. తాబేలు 24 మైళ్ళ వెడల్పు, 80 మైళ్ళ చుట్టుకొలత ఉన్నది. ఇంత భారీ జంతువులను గరుడుడు చాలా సునాయాసంగా ఒక కాలి గోటితో ఏనుగును, మరొక కాలి గోటితో తాబేలు పట్టుకొని ఆకాశంలోకి ఎగురుతాడు. దాన్ని బట్టి గరుడుని శరీర పరిమాణం, అతని బలం ఎంత

గొప్పవో ఊహించవచ్చు. గరుడుడు ఆ రెండు జంతువులను పట్టుకొని ఎగురుతూ నూరు యోజనాల పొడవు వరకు వ్యాపించిన ఒక మఱ్ఱిచెట్టు కొమ్మ మీద వాలుతాడు. అతని ధాటికి ఆ కొమ్మ విరిగిపోతుంది. ఆ కొమ్మకు తలకిందులుగా వేలాడుతూ అంగుష్ఠ మాత్ర దేహాలు కలిగిన వాలఖిల్య మహర్షులు తపస్సు చేసుకుంటూ ఉంటారు. అంగుష్ఠం అంటే బొటన వేలు. అంటే వాలఖిల్యులు బొటన వేలంత పరిమాణంలో ఉన్నవారన్న మాట. విరిగిన కొమ్మ కింద పడితే వాలఖిల్యులకు అపాయం కలుగుతుందని భావించి గరుడుడు ఆ కొమ్మను గూడా నోటితో పట్టుకొని గంధమాదన పర్వతం మీద తపస్సు చేసుకుంటున్న తండ్రి అయిన కశ్యపుని వద్దకు వాయువును మించిన వేగంతో ఎగిరి వెళ్తాడు. దాన్నిబట్టి గరుడుడు ఎంతటి బలవంతుడో ఊహించవచ్చు. కాదుకాదు మన ఊహకు అందనంత గొప్పబలం కలిగినవాడు అతడు.

గరుడుని బలం గురించి చెప్పే మరొక సంఘటన దేవతలతో అతడు చేసిన యుద్ధం. గరుడుడు గజకచ్ఛపాలను తిని దేవలోకం మీదికి దండెత్తి వెళ్ళి అష్ట దిక్పాలకులను వారి సైన్యాన్ని ఒంటరిగా సునాయాసంగా జయిస్తాడు. దేవేంద్రుడు తన మేటి ఆయుధమైన వజ్రాయుధాన్ని గరుడుని మీదికి ప్రయోగిస్తే అది దధీచి మహర్షి వెన్నెముకతో తయారైనది కాబట్టి దాన్ని గౌరవించడానికి తన ఈకను ఒక దాన్ని దానికి వదులుతాడు. గరుడుడు అంతటి శక్తివంతుడు. ఈ సందర్భంలోనే గరుడుడు తన బలాన్ని గురించి దేవేంద్రునితో "ఈ భూమండలం మొత్తాన్ని దేవేంద్రుని దేవలోకంతో కలిపి కేవలం ఒక రెక్కతో మోయగలనని, స్థావర జంగమాత్మకమైన ఈ బ్రహ్మాండం మొత్తాన్ని అనాయాసంగా తన ఒక్క రెక్కతో మోయగలనని" చెబుతాడు. ఈ విధంగా కథలో నాయకుడైన గరుడుని బలపరాక్రమాలు, శక్తిసామర్థ్యాలు అశ్చర్యకరమైన రీతిలో చెప్పబడ్డాయి. ఇవన్నీ పండిత కవి కల్పించిన అద్భుత సంఘనలు.

గరుడుడు ఇంతటి మహాబలవంతుడు కావడానికి ఈ కథలో మరొక కారణం చెప్పబడింది. గరుడుడు అమృతం కోసం దండెత్తి వస్తున్నప్పుడు దేవలోకంలో అనేక అపశకునాలు కలుగుతాయి. వాటి గురించి దేవేంద్రుడు బృహస్పతిని అడుగుతాడు. దానికి బృహస్పతి ఇదంతా దేవేంద్రుడు వాలఖిల్య మునులకు చేసిన అపరాధం వల్ల జరుగుతూ వుందని చెబుతాడు. ఈ గరుడుని కథను చెబుతున్న ఉగ్రశవసుని శౌనకుడు అనే ఋషి "ఇంద్రుడు వాలఖిల్యులకు ఎలాంటి అపరాధం చేశాడు? వాలఖిల్యుల తపఃప్రభావంతో గరుడుడు ఎలా జన్మించాడు? బ్రాహ్మణుడైన కశ్యపునికి పక్షిరాజైన గరుడుడు ఎలా జన్మించాడు? మొదలైన విషయాలు తెలుప వలసిందిగా" కోరతాడు. అప్పుడు ఉగ్రశ్రవసుడు ఇలా చెబుతాడు.

కశ్యపుడు పుత్రకామేష్టియాగం చేస్తున్నప్పుడు అతనికి అనేక ఋషులు, దేవతలు సాయం చేస్తారు. ఆ యజ్ఞానికి కావలసిన సమిధలు తీసుకొని రావడానికి కశ్యపుడు

ఇంద్రుని, వాలఖిల్య మహర్షులను నియోగించాడు. ఇంద్రుడు తన బలానికి తగినట్లుగా పర్వతంలాంటి పెద్ద సమిధల మోపును ఎత్తుకొని వస్తుంటాడు. అంగుష్ఠమాత్ర శరీరం కలిగిన వాలఖిల్య మహర్షులు ఒక్కొక్క రావి సమిధను పట్టుకొని కష్టపడి మోస్తూ తెస్తూ వుంటారు. ఇంద్రుడు బలగర్వంతో వారిని అపహసిస్తూ వారిని దాటి ముందుకు వెళ్తాడు. ఆ అవమానానికి వారు కోపించి ఇంద్రుని కంటే నూరు రెట్లు బలం కలిగిన మరొక ఇంద్రుడు కలగాలని, అతడు ఇంద్రునికి భయప్రదుడు కావాలని కోరుతూ యజ్ఞం చేస్తూ వుంటారు. ఇంద్రుడు ఈ విషయం తెలుసుకొని భయపడి కశ్యపుని శరణు వేడుతాడు. కశ్యపుడు వాలఖిల్యుల వద్దకు వెళ్ళి వారిని శాంతింపజేస్తూ "బ్రహ్మ ఆజ్ఞ వల్ల ఈ పురంధరుడు ముల్లోకాలకు ఇంద్రుడుగా ఉన్నాడు. బ్రహ్మ ఆజ్ఞ వ్యర్థం కాగూడదు. మీమాట గూడా వ్యర్థం కాగూడదు. మీ సంకల్పం ప్రకారం అత్యంత బలవంతుడైన ఇంద్రుడు జన్మించాలి. కానీ అతడు పక్షీంద్రుడుగు గాక. ఈ ఇంద్రుని మీరు మన్నించండి" అని వారికి చెబుతాడు. కశ్యపుని మాటలకు వారు శాంతించి కశ్యపుడు చెప్పినట్లు గానే అత్యంత బలసంపన్నుడైన పక్షీంద్రుడు కశ్యపునికి కలగాలని చెబుతారు. ఆ విధంగా వాలఖిల్యుల యజ్ఞం ఫలితంగా కశ్యపుని కుమారుడుగా గరుడుడు జన్మించాడని ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలోని మునులకు చెబుతాడు.

ఈ విధంగా ఈ కథలో నాయకుడైన గరుడుని పుట్టుకకు సంబంధించి అతని బలదర్పాలకు సంబంధించిన సంఘటనలు అత్యంతాతిశయోక్తులతో ఆశ్చర్యకరమైన రీతిలో చెప్పబడ్డాయి. జానపద కథల్లో గరుడుని లాంటి అతి భారీకాయుని గురించి అత్యంతాతిశయోక్తులతో చెప్పినట్లుగానే చాలా చిన్న శరీరాలు కలిగిన వారిని గురించి గూడా చెప్పబడుతుంది. ఈ కథలో వాలఖిల్య మహర్షులు అంగుష్ఠమాత్ర దేహులు, అంటే బొటన వేలంత పరిమాణంలో ఉన్నవారు. కానీ వీరు తమ తపోమాహాత్మ్యంతో దేవేంద్రునే భయపెట్టినట్లుగా ఇందులో చెప్పబడ్డారు. గరుడుడు అంత భారీ శరీరంతో పుట్టడానికి వీరు చేసిన యజ్ఞం కారణంగా చెప్పబడింది. నిజానికి లోకంలో గరుడుని లాంటి అతి భారీకాయులు గానీ, వాలఖిల్యుల లాగా బొటనవేలంత మనుషులు గానీ ఉండరు. ఇవి రెండూ జానపద కథాంశ ప్రభావంతో పండిత కవి కల్పించినవే. ఇవన్నీ వాస్తవానికి చాలా దూరంగా ఉన్నాయి. ఈ కథలో కద్రువ వినతలు సముద్ర తీరాన ఉన్న ఉచ్చైశ్రవాన్ని చూసి దాని రంగును గురించి పందెం వేసుకుంటారు. ఈ పందెంలో కద్రువ మోసంచేసి పందెం గెలిచి తన సవతి అయిన వినతను దాసిగా చేసుకుంటుంది. వినత దాసీత్వాన్ని ఆమె కుమారుడైన గరుడుడు కష్టసాధ్యమైన అమృతాన్ని తెచ్చియిచ్చి తల్లి దాసీత్వాన్ని తొలగిస్తాడు. ఇది జానపద అద్భుత కథాంశం.

ఈ కథలో శాపవరాల ప్రసక్తి ఉంది. ఇది కూడా జానపద అద్భుత కథాంశమే. కద్రువ వినతతో తాను వేసిన పందెం గెలవడానికి ఉచ్చైశ్రవం తోకను నల్లగా చేయాలని

తన కుమారులైన నాగులకు చెబుతుంది. దానికి వారు అంగీకరించక పోవడంతో ఆమె కోపగించి జనమేజయుడు చేసే సర్పయాగంలో నాగులు నశిస్తారని శపిస్తుంది. ఈ కథలో గజకచ్ఛపాల పూర్వజన్మ వృత్తాంతాన్ని కశ్యపుడు గరుడునికి చెబుతాడు. ఈ వృత్తాంతంలో శాపాల ప్రసక్తి ఉంది. పూర్వజన్మలో వారు విభావసుడు, సుప్రతీకుడు అనే అన్నదమ్ములు. ఇద్దరూ ఋషులు. సుప్రతీకుడు తన ధనాన్ని అన్న ధనంతో కలిపి ఉంచడం ఇష్టం లేక తన ధనాన్ని పంచి ఇమ్మని ఎప్పుడూ అడుగుతూ ఉంటాడు. దానికి కోపించిన విభావసుడు తమ్ముని వచ్చే జన్మలో ఏనుగుగా జన్మించాలని శపిస్తాడు. దానికి సుప్రతీకుడు వచ్చే జన్మలో తాబేలుగా పుట్టాలని అన్నను శపిస్తాడు. ఇలా ధనవ్యామోహంతో విభావస, సుప్రతీకులు పరస్పరం శపించుకొని మరుసటి జన్మలో కచ్ఛప,గజాలుగా జన్మించి పూర్వజన్మ వాసన చేత ఒక సరస్సులో దెబ్బలాడుకుంటూ ఉంటారు. కశ్యపుని మాట మీద ఈ రెండింటిని గరుడుడు ఎత్తుకొనిపోయి తింటాడు.

కశ్యపుడు తన భార్యలైన కద్రువ వినతలకు వారు కోరుకున్నట్లుగా కుమారులు పుడతారని వరం ఇస్తాడు. ఆ వరం ప్రకారం కద్రువకు వెయ్యి మంది నాగులు, వినతకు అరుణుడు, గరుడుడు జన్మిస్తారు. తన అద్భుత బలపరాక్రమాలతో దేవతలను జయించి అమృతభాండాన్ని హస్తగతం చేసుకున్న గరుడుని సాహసానికి మెచ్చి విష్ణువు ప్రత్యక్షమై వరం కోరుకోమంటాడు. గరుడుడు తాను విష్ణువు ధ్వజంగా ఉండాలని, అమృతం తాగకుండానే తనకు జరామరణాలు లేకుండా ఉండాలని వరాలు కోరుకుంటాడు. విష్ణువు ఆ రెండు వరాలను గరుడునికి ఇస్తాడు. తర్వాత గరుడుడు తాను గూడా విష్ణువుకు వరమివ్వాలను కుంటున్నానని చెబుతాడు. తనకు వాహనంగా ఉండమని గరుడుని కోరతాడు. ఇలా ఈ కథలో గరుడ విష్ణువులు పరస్పరం వరాలు ఇచ్చి పుచ్చుకుంటారు. తర్వాత కథలో గరుడుడు, దేవేంద్రుడు స్నేహితులయిన తర్వాత వరం కోరుకోమని ఇంద్రుడు గరుడునికి చెబుతాడు. సర్పాలు తనకు ఆహారం కావాలని గరుడుడు కోరుకుంటాడు. ఈ విధంగా ఈ కథలో శాపవరాల ప్రసక్తి ఉంది.

ఈ విధంగా గరుడుని కథలో కొన్ని జానపద అద్భుత కథాంశాలున్నాయి.

ఈ కథను రాసిన కవి బ్రాహ్మణుడు కావడం వల్ల అతడు బ్రాహ్మణుల మాహాత్మ్యాన్ని గొప్పతనాన్ని తెలియ జెప్పే ఒక సంఘటనను ఈ కథలో కల్పించాడు. నిజానికి ఈ సంఘటన ఈ కథకు అవసరం లేదు. అయినప్పటికీ పనిగట్టుకొని కవి ఈ సంఘటనను కల్పించి తన బ్రాహ్మణ కులాభిమానాన్ని చాటుకున్నాడు. గరుడుడు అమృతాన్ని తీసుకొని రావడానికి వెళ్తున్నప్పుడు సముద్ర మధ్యలో ఉన్న బోయపల్లెలోని నిషాదులను తిని ఆకలి తీర్చుకోమని వినత గరుడునికి చెబుతూ ఆ నిషాదుల్లో ఎవరైనా బ్రాహ్మణుడుంటే వాణ్ణి మాత్రం చంపవద్దని చెబుతూ బ్రాహ్మణుల గొప్పతనాన్ని ఇలా చెబుతుంది.

**"న చ తే బ్రాహ్మణం హంతుం కార్యా బుద్ధిః కథంచన**
**అవధ్యః సర్వభూతానాం బ్రాహ్మణో హ్యనలోపమః"**
**"అగ్ని రర్కో విషం శస్త్రం విప్రో భవతి కోపితః**
**గురుర్హి సర్వభూతానాం బ్రాహ్మణః పరికీర్తితః"**
**"ఏవమాదిభిరుపైస్తు సతాం వై బ్రాహ్మణో మతః**
**"స తే తాత న హంతవ్యః సంకృద్ధేనాపి సర్వథా**
**బ్రాహ్మణానామభిద్రోహో న కర్తవ్యః కథంచన"**
**"న హ్యేవమగ్నిర్నాదిత్యో భస్మ కుర్యాత్తథానఘ**
**యథా కుర్యాదభిక్రుద్ధో బ్రాహ్మణః సంశితవ్రతః"**
**"తదేతైర్వివిధైర్లింగైస్త్వం విద్యాస్తం ద్విజోత్తమమ్**
**భూతానామగ్ర భూర్విప్రో వర్ణశ్రేష్ఠః పితా గురుః"**
**(ఆది. 28 – 3 నుంచి 7 వరకు శ్లోకాలు)**

"బ్రాహ్మణుడు అగ్ని లాంటివాడు. అన్ని ప్రాణుల్లో బ్రాహ్మణుడు అవధ్యుడు. కోపించిన బ్రాహ్మణుడు అగ్ని., సూర్యుడు, విషం, ఆయుధం లాంటివాడు. బ్రాహ్మణుడు సర్వ భూతాలకు పూజనీయుడు. అందువల్ల నువ్వు కోపంతో ఉన్నప్పటికీ బ్రాహ్మణుని చంప గూడదు. బ్రాహ్మణునితో వైరం ఎప్పటికీ మంచిది కాదు. బ్రాహ్మణుని కోపాగ్ని అగ్ని కంటే సూర్యుని కంటే ఎక్కువ దహిస్తుంది. బ్రాహ్మణులకు అపకారం తలపెట్ట కూడదు. అతడు ప్రాణులన్నింటి కంటే ముందు పుట్టినవాడు. నాలుగు వర్ణాల్లో ఉన్నతుడు. తండ్రి, గురువు" అని వినత బ్రాహ్మణుల గొప్పతనాన్ని గురించి గరుడునికి చెబుతుంది. అప్పుడు గరుడుడు తల్లితో

**"కిం రూపో బ్రాహ్మణో మతః కిం శీలః కిం పరాక్రమః**
**కిం స్విదగ్నినిభో భాతి కిం స్వితౌమ్య ప్రదర్శనః"**
**"యథాహమభిజానీయాం బ్రాహ్మణం లక్షణైః శుభైః**
**తన్మే కారణ తో మాతః పృచ్ఛతో వక్తుమర్హసి"**
**(ఆది. 3 – 8,9 శ్లోకాలు)**

"బ్రాహ్మణుడు ఎలాంటి రూపంలో ఉంటాడు. అతని శీలం, పరాక్రమం ఎలాంటివి? అతడు అగ్నిలాగా ఉంటాడా? లేక సౌమ్యంగా ఉంటాడా? నేను బ్రాహ్మణుని ఎలాంటి మంచి లక్షణలతో గుర్తించాలి. అమ్మా నాకు సకారణంగా చెప్పు" అని అడుగుతాడు. అప్పుడు గరుడునితో వినత

**"యస్తే కంఠమనుప్రాప్తో నిగీర్ణం బడిశం యథా**
**దహేదంగార వత్పుత్ర తం విద్యాద్బ్రాహ్మణ ర్షభమ్"**
**"విప్రస్త్వయా న హన్తవ్యః సంక్రుద్ధేనాపి సర్వదా**
**ప్రోవాచ చైనం వినతా పుత్రహార్దాదిదం వచః"**

**"జఠరే న చ జీర్యేద్యస్తం జానీహి ద్విజోత్తమమ్**
**పునః ప్రోవాచ వినతా పుత్రహార్దాదిదం వచః"**
**(ఆది. 28 -10,11,12, శ్లోకాలు)**

"నువ్వు మింగినప్పుడు నీ కంఠంలోపలికి పోకుండా అగ్నిలాగా ఎవడు దహిస్తూ ఉంటాడో. అలాంటి వాణ్ణి బ్రాహ్మణునిగా గుర్తించు. కోపం వచ్చినప్పటికీ నువ్వు బ్రాహ్మణుని చంపగూడదు. నీ జఠరంలో జీర్ణం కాని వాడే బ్రాహ్మణుడు అని తెలుసుకో అని చెబుతుంది". ఆ తర్వాత గరుడుడు బోయపల్లెకు వెళ్ళి నిషాదులను తినడానికి నోరు తెరుస్తాడు. వెంటనే నిషాదులందరూ అతని నోటిలోకి వెళ్ళిపోతారు. వారందరినీ అతడు తన నోటిలో ఇముడ్చుకుంటాడు. గరుడుని కంఠంలో ఒక బ్రాహ్మణుడు ప్రవేశించి అగ్నిలాగా దహిస్తూ ఉండగా గరుడుడు అతణ్ణి బ్రాహ్మణునిగా గుర్తించి అతనితో "బ్రాహ్మణుడా బయటకిరా! ఎంతటి పాపాత్ముడైనప్పటికీ బ్రాహ్మణుని నేను చంపను" అని అంటాడు. అప్పుడు బ్రాహ్మణుడు "నా భార్య నిషాది, ఆమె గూడా నాతోపాటు బయటికి రావాలి" అంటాడు. దానికి గరుడుడు అంగీకరించి భార్యతోసహా బ్రాహ్మణుని బయటికి రమ్మంటాడు. వెంటనే విప్రుడు భార్యను తీసుకొని గరుడుని నోటిలో నుంచి బయటకికి వస్తాడు. ఈ విధంగా గరుడుని కథలో కవి బ్రాహ్మణుల గొప్పతనాన్ని తెలిపే సంఘటనను రాశాడు.

భారతంలోని గరుడుని కథకు మూలం కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహిత షష్ఠ కాండ ప్రథమ ప్రపాఠకం షష్ఠోనువాకంలో ఉంది. ఆ కథ[19] ఇది.

కద్రువ, సుపర్ణి సవతులు. వీరిద్దరూ తమ తమ రూపాలు మిక్కిలి సౌందర్యం కలిగినవని వివాదపడ్డారు. ఈ సౌందర్య వివాదంలో కద్రువ సుపర్ణిని జయించింది. అంటే సుపర్ణి కంటే కద్రువ సౌందర్యవతి అని మధ్యస్థులు నిర్ణయించారు. ఓడిపోయిన వ్యక్తి గెలిచిన వ్యక్తికి దాసిగా సేవ చేయాలని వారు పందెం కట్టుకున్నారు. భూలోకం నుంచి మూడవదైన ద్యులోకంలో సోమం ఉంది. ఆ సోమాన్ని తెచ్చి ఇచ్చి దాసీత్వం నుంచి విముక్తిరాలివి కమ్మని కద్రువ సుపర్ణికి చెబుతుంది. కద్రువ భూలోక స్వరూపం. ఆమె మూడవదైన ద్యులోకం నుంచి సోమాన్ని తేవడానికి సమర్థురాలు కాదు. సుపర్ణి ద్యులోక స్వరూప కావడం చేత సోమాన్ని తీసుకొని రావడానికి ఆమె సమర్థురాలు. గాయత్రి, జగతీ, త్రిష్టుక్ మొదలైన ఛందస్సులు సుపర్ణి సంతానాలు.

సుపర్ణి తన కుమారులైన గాయత్రీ మొదలైన వారికి కద్రువ చెప్పిన మాట చెప్పి ద్యులోకం నుంచి సోమాన్ని తెచ్చి తనను దాసీతనం నుంచి విడిపింపుమని పల్కుతుంది. పూర్వం జగతీ ఛందస్సుకు 14 అక్షరాలు ఉండేవి. అలాంటి జగతీ ఛందస్సు ద్యులోకానికి వెళ్ళి సోమ రక్షకులతో యుద్ధం చేసి ఓడిపోయి రెండు అక్షరాలను కోల్పోయి అక్కడ నుంచి పశువులను తీసుకొని వస్తుంది. ఈ విధంగా జగతీ ఛందస్సు పశువులను తీసుకొని రావడం చేత జగతి అత్యంత పశుప్రదం అయింది. త్రిష్టుక్ ఛందస్సు 13 అక్షరాలు కలది. అది

సోమం తేవడానికి ద్యులోకానికి ఎగిరి వెళ్ళి అక్కడ సోమ రక్షకులతో యుద్ధం చేసి ఓడిపోయి రెండు అక్షరాలను సోమరక్షకులు అపహరించగా దక్షిణలతో తపస్సుతో వెనక్కి తిరిగి వస్తుంది. దక్షిణలు యజ్ఞకర్త, ఋత్విజులకు ఇవ్వదగినవి. యజ్ఞకర్త చేయవలసింది తపస్సు. ద్యులోకం నుంచి త్రిష్టుక్ ఛందస్సు దక్షిణలు తీసుకొని రావడం చేత లోకంలో ఈ ఛందస్సునకు స్థానం ఏర్పడింది.

సహాయం లేకుండా ఒంటరిగా ద్యులోకానికి వెళ్ళి పరాజయం పొంది వచ్చిన జగతి, త్రిష్టుక్ ఛందస్సుల విషయాన్ని గాయత్రి ఛందస్సు తెలుసుకొని మేకను తీసుకొని ద్యులోకానికి పోతుంది. అక్కడ మేక తన తేజస్సుతో సోమాన్ని నలువైపులా అవరోధిస్తుంది. ఆ కారణం చేత అజకు(మేకకు) అజత్వం సిద్ధిస్తుంది. గాయత్రీ ఛందస్సు సోమరక్షకులను జయించి సోమాన్ని, జగతీ త్రిష్టుక్ ఛందస్సులు కోల్పోయిన నాలుగు అక్షరాలను తీసుకొని వస్తుంది. గాయత్రి ద్యులోకానికి వెళ్ళేటపుడు నాలుగు అక్షరాలను మాత్రమే కలిగి ఉంటుంది. సోమ రక్షకుల నుంచి తెచ్చుకున్న నాలుగు అక్షరాలతో కలిసి అష్టాక్షరి అవుతుంది. జగతీ, త్రిష్టుక్, గాయత్రీ ఛందస్సులలో గాయత్రీ ఛందస్సు మిగిలిన రెండింటి కంటే తక్కువ అల్పాక్షరాలు కలది. అందువల్ల అది ప్రాతస్సవనమును పొందింది అని కొంతమంది మంత్రజ్ఞులు చెబుతున్నారు. గాయత్రి ద్యులోకానికి వెళ్ళి సోమ రక్షకులను జయించి సోమాన్ని తేవడం చేత గాయత్రి ఛందస్సును యజ్ఞ ముఖంలో ఉపయోగిస్తున్నారని కొందరు మంత్రజ్ఞులు చెబుతున్నారు.

కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహిత ప్రధానంగా యజ్ఞయాగాల విధివిధానాలకు సంబంధించినది. ఈ అనువాకంలో సోమక్రయానికి సంబంధించిన విషయాలు చెప్పబడ్డాయి. అంటే సోమయాగంలో ఉపయోగించే సోమలతను కొనడానికి సంబంధించిన అంశాలు ఈ అనువాకంలో చెప్పబడ్డాయి. ఈ అనువాకంలో సోమయాగానికి సంబంధించిన సోమం గురించిన వివరాలను ఇంకా సుదీర్ఘంగా చెప్పబడ్డాయి. అదంతా మన ప్రస్తుత కథకు అవసరం లేదు. ఈ అనువాకంలోని కద్రువ సుపర్ణుల ఇతివృత్తాన్ని ఆధారంగా చేసుకొని భారత కవి సౌపర్ణోపాఖ్యానాన్ని కల్పించి రాసాడు. కద్రువ అంటే వంకరయైన గతి కలది అని అర్థం. వంకర అయిన గతి కలది పాము. అందువలనే భారత కవి కద్రువ పాములను కన్నట్లుగా రాసాడు. సుపర్ణి అంటే విశాలమైన రెక్కలు కలది అని అర్థం. అందువలనే భారత కవి సుపర్ణి అత్యంత గొప్పదైన, విశాలమైన రెక్కలు కలిగిన గరుడుని కన్నట్లుగా భారత కథలో రాసాడు. ఈ అనువాకంలో గాయత్రి ద్యులోకానికి వెళ్ళి సోమాన్ని తెచ్చి తల్లియైన సుపర్ణి దాస్యాన్ని తొలగించినట్లుగా ఉండగా భారత కవి సుపర్ణి కొడుకైన గరుత్మంతుడు అమేయబల సంపన్నుడై దేవేంద్రునితో కలిపి దేవతలందరినీ ఓడించి అమృతాన్ని తెచ్చి తన తల్లి అయిన వినత దాస్య విముక్తిని కలిగించినగట్లుగా రాసాడు.

నన్నయ ఈ గరుడోపాఖ్యానాన్ని ఆదిపర్వం ద్వితీయాశ్వాసం రెండవ పద్యం నుంచి 122వ పద్యం వరకు ఉన్న 121 పద్య గద్యాల్లో దాదాపుగా మూలంలో ఉన్నది

ఉన్నట్లుగా రచించాడు. ఇందులో నన్నయ ఎలాంటి మార్పులు చేయలేదు. ఈ ఉపాఖ్యానంలో నన్నయ రాసిన కొన్ని పద్యాలు చాలా రమణీయంగా ఉన్నాయి. ఉదాహరణకు ఉచ్చైశ్రవం తోక నల్లగా ఉందని కద్రువ వినతతో పందెం వేసి, ఇంటికి వచ్చి తన కుమారులైన నాగులతో ఉచ్చైశ్రవం తోకను నల్లగా చేసి తనను గెలిపించాలని కోరుతూ కద్రువ చెప్పిన కింది పద్యం సులభమైన పదాలతో చిన్నచిన్న వాక్యాల రూపంలో ఎంతో రమణీయంగా ఉంది.

**"కద్రువ కొడుకుల కడకేగి యేను మి**
**మ్మందఱ వేడెద నన్నలారా**
**నాపంపు సేయుడు, నన్ను రక్షింపుడు**
**కామచారులకు దుష్కరము కలదె**
**యుల్ల తెల్లని తురగోత్తము వాలంబు**
**నల్ల సేసితిరేని నాకు దాసి**
**యగు మన వినత, మీరట్లు సేయని నాడు**
**దానికి మరి యేను దాసి నగుదు**
**జంట పన్నిదంబు సఱచితి మిట్లుగా**
**ననిన పాములెల్ల నవయ మిదియు**
**దల్లి పనిచెనని యధర్మువు సేయగ**
**నగునె! యెఱుక గలరె మగువ లెందు"**

**(ఆదిపర్వం, 2వ ఆశ్వాసం, 33వ పద్యం)**

పై సీసపద్యంలో మొత్తం పది వాక్యాలున్నాయి. మూడు నాలుగు పాదాల్లోని రెండు వాక్యాలు కొంచెం పెద్ద వాక్యాలు. మిగిలిన ఎనిమిది చాలా చిన్న వాక్యాలు. ఇందులోని అన్నలారా, నా పంపు, సేయుడు, నన్ను, రక్షింపుడు మొదలైన తెలుగు పదాలు చాలా సులభంగా ఉండి కద్రువ అప్పటి పరిస్థితిని తెలుపుతున్నాయి.

గరుడుడు దేవలోకం మీదికి దండెత్తి వస్తున్నప్పుడు స్వర్గ లోకంలో కన్పించిన కొన్ని ఉత్పాతాలను గురించి ఇంద్రుడు బృహస్పతిని ప్రశ్నిస్తాడు. బృహస్పతి గరుడుని గురించి దేవేంద్రునికి ఇలా చెబుతాడు.

**"బ్రాహ్మణ్యుడగు కశ్యపబ్రహ్మ వరమున**
**వినతకు బుట్టిన యనఘుమూర్తి**
**వాలఖిల్యుల దయ వరపక్షికులమున**
**కింద్రుడై పరగిన యిద్ధతేజు**
**డుదధిలో నున్నయత్యుగ్ర నిషాదుల**
**నారంగ మ్రింగిన ఘోర వీరు**

**డిభకచ్ఛపముల రోహిణశాఖతో నెత్తి**
**కొని దివి బఱచిన యనిల వేగి**
**వీగి తన తల్లి దాస్యంబు నీగబూని**
**తడయకమృతంబు గొని పోవగడగి వచ్చె**
**గామరూప సంపన్నుండు గామగమను**
**డతడు నీకు నసాధ్యుండు శతమఖుండ"**
**(ఆదిపర్వం, 2వ ఆశ్వాసం, 83వ పద్యం)**

పై సీసపద్యంలో నన్నయ గరుడుని వృత్తాంతం మొత్తాన్ని క్లుప్తంగా చక్కగా తెలిపాడు. మొదటి నాలుగు పాదాల చివర గరుడునికి అనఘమూర్తి, యిద్ధతేజుడు, ఘోరవీరుడు, అనిలవేగి అనే విశేషణాలనుపయోగించి అతని ధర్మగుణాన్ని తేజస్సును, పరాక్రమాన్ని, వేగాన్ని తెలియజేశాడు. గీత పద్యంలో గరుడుడు దేవలోకం మీదికి దండెత్తి వస్తున్న కారణాన్ని అతడు దేవేంద్రుని జయించగలడనే వాస్తవాన్ని వివరించాడు. మూలంలో ఈ ఘట్టాలు ఇంత రమణీయంగా లేవు.

## 3. గంగా శంతనుల కథ

ఈ కథ ఆదిపర్వంలోని సంభవపర్వం అనే ఉపపర్వంలో 96వ అధ్యాయం నుంచి 99వ అధ్యాయం వరకు ఉన్న నాలుగు అధ్యాయాల్లో 140 శ్లోకాల్లో వివరంగా ఉంది. ఈ వృత్తాంతాన్ని వైశంపాయనుడు జనమేజయునికి చెబుతాడు.

శంతనుడు ప్రతీపుడు అనే రాజు కుమారుడు. ప్రతీపుడు అతని భార్య చాలా కాలం తపస్సు చేయడం వల్ల వారి వృద్ధాప్యంలో శంతనుడు జన్మిస్తాడు. ఇతడు పూర్వజన్మలో ఇక్ష్వాకు వంశస్థుడైన మహాభిషుడు అనే రాజు. ఈ మహాభిషుడు బ్రహ్మదేవుని శాపం వల్ల ప్రతీపునికి కుమారునిగా జన్మిస్తాడు. శంతనుడు రాజైన తర్వాత ఒకరోజు గంగానదీ తీరానికి వేటకు వెళ్తాడు. అక్కడ అతనికి అద్భుత సౌందర్యరాశి అయిన ఒక స్త్రీ కన్పిస్తుంది. ఆమె మానవ స్త్రీ వేషం ధరించిన గంగానది. ఆమె సౌందర్యానికి ముగ్ధుడైన శంతనుడు ఆమెను తనకు భార్య కావలసిందిగా కోరతాడు. ఆమె దానికి అంగీకరిస్తూ ఒక ఆంక్ష పెడుతుంది, "రాజా! నేను నీకు భార్యనై నీ అధీనంలో ఉంటాను. అయితే శుభమైనా, అశుభమైనా నేను ఏ పని చేసినా అడ్డగించకూడదు. నాకు కష్టం కలిగేటట్లు మాట్లాడకూడదు. నీవు ఇలా ప్రవర్తించినంతకాలం నేను నీదగ్గర ఉంటాను. నన్ను అడ్డగించినా, అప్రియంగా మాట్లాడినా నిన్ను విడిచిపెట్టి వెళ్ళిపోతాను" శంతనుడు ఆమె షరతుకు అంగీకరించి ఆమెను వివాహం చేసుకుంటాడు.

గంగాశంతనులకు వరుసగా ఏడుగురు కుమారులు పుడతారు. గంగ ఏడుగురు కుమారులను పుట్టిన వెంటనే నీటిలో వేస్తుంది. ఆమె చేస్తున్న ఆపని శంతనునికి ఇష్టం లేకపోయినప్పటికీ తాను అడ్డు చెబితే ఆమె తనను వదిలి వెళ్ళిపోతుందని భావించి శంతనుడు

ఆమెకు అడ్డు చెప్పడు. ఎనిమిదవ కుమారుడు పుట్టినపుడు శంతనుడు ఆ కుమారుని బ్రతికించుకోవాలని భావించి గంగతో "ఈ కుమారుని చంపవద్దు పిల్లలనెందుకు చంపుతున్నావు? పుత్రఘాతిని కుమారులని చంపి పెద్దపాపాన్ని పొందుతున్నావు" అని అంటాడు. దానికామె "నేను ఈ కొడుకును చంపను. పుత్రవంతులలో నీవు గొప్పవాడవు. కానీ నేను ముందు చెప్పిన నియమం ప్రకారం నీవద్ద ఉండను. నేను గంగను. దేవతల కార్యసిద్ధి కోసం నీతో కలిసి జీవించాను. అష్టవసువులు శాపం వల్ల మానవులుగా జన్మించారు. వారికి తండ్రి కాగల అర్హత ఈ లోకంలో నీకు మాత్రమే ఉంది. వారిని గర్భంలో ధరించడానికి నేను మానవరూపాన్ని పొందాను. అష్టవసువుల్లో ఏడుగురిని పుట్టినవారు పుట్టినట్లుగా నీట్లో వేసి వారికి శాప విముక్తి కలిగించాను. ఈ బాలుడు అష్టవసువుల్లో చివరివాడు. ఇతన్ని నేను పెంచి పెద్ద చేసి నీకు అప్పగిస్తాను" అని చెప్పి కుమారుని తీసుకొని వెళ్ళిపోతుంది. శంతనుడు గంగ చెప్పిన దానికి ఆశ్చర్యపోయి ఆమె తనను విడిచిపెట్టి వెళ్ళిపోయినందుకు విచారించి యథాప్రకారంగా రాజ్యాన్ని పాలిస్తూ ఉంటాడు. కొన్ని సంవత్సరాల తర్వాత అతడు గంగానది సమీపానికి వేటకు వెళ్ళి అక్కడ బాణాలతో గంగానదికి అడ్డుకట్ట వేసిన దివ్యాస్త్ర సంపన్నుడైన ఒక యువకుని చూస్తాడు. అదే సమయంలో గంగ అక్కడికి వచ్చి ఆ యువకుని శంతనునికి అప్పగిస్తూ "ఈ బాలుడు నీవు గతంలో నా గర్భం ద్వారా పొందిన ఎనిమిదవ బిడ్డ. ఇతడు సర్వ శాస్త్రాలు అభ్యసించాడు. వశిష్టుని దగ్గర అన్ని విద్యలను అభ్యసించాడు. శస్త్రాస్త్ర విద్యల్లో మేటి. అలాంటి ఈ కుమారుని స్వీకరించు" అని చెప్పి ఆ కుమారుని శంతనునికి అప్పగించి వెళ్ళిపోతుంది. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ గంగా శంతనుల కథలో జానపద అద్భుత కథాంశాలు కొన్ని ఉన్నాయి. జానపద అద్భుత కథల్లో నాయకుడు తల్లిదండ్రులకు లేకలేక కలుగుతాడు. తల్లిదండ్రులు సంతానం కోసం అనేక ప్రయత్నాలు చేస్తారు. చివరకు వారు తపస్సు చేయడంవల్ల గానీ, ఋషి ఇచ్చిన మామిడిపండు వల్ల గానీ సంతానవంతులవుతారు. కొన్ని కథల్లో నాయకుడు పూర్వజన్మలోని శాపం కారణంగా పుడతాడు. నాయకుడు వేటకు వెళ్ళి అక్కడ అద్భుత సౌందర్యరాశియైన స్త్రీని చూసి మోహించి ఆమెను వివాహం చేసుకోవాలనుకుంటాడు. ఆమె దానికి అంగీకరిస్తూ ఒక ఆంక్ష పెడుతంది. రాజు ఆ ఆంక్షకు అంగీకరించి ఆమెను వివాహం చేసుకుంటాడు. అద్భుత కథల్లో ఆంక్ష ఉంటే ఆంక్షాతిక్రమణ తప్పనిసరిగా ఉంటుంది. నాయకుడు అనుకోకుండా గానీ, కావాలని గానీ ఆంక్షను అతిక్రమిస్తాడు. దానితో ఆమె అతనిని వదిలిపెట్టి వెళ్ళిపోతుంది. చివరకు నాయకుడు అనేక ప్రయత్నాలు చేసి ఆమెను దక్కించుకుంటాడు. ఈ లక్షణాలు గంగాశంతనుల కథలో చాలా వరకూ ఉన్నాయి.

గంగాశంతనుల కథలో నాయకుడు శంతనుడు. అతడు తల్లిదండ్రులకు లేకలేక తపస్సు చేయటం వల్ల పుట్టినవాడు. అంతేకాకుండా ఇతడు పూర్వజన్మలో మహాభిషుడు అనే పేరుగల రాజు. బ్రహ్మదేవుని శాపం వల్ల మానవుడిగా జన్మించాడు. ఇతడు గంగానది

తీరానికి వేటకు వెళ్ళి అక్కడ మానవరూపంలో ఉన్న గంగను చూసి మోహించి తనను పెళ్ళి చేసుకోమని ఆమెను కోరడం, ఆమె దానికి అంగీకరిస్తూ ఆంక్ష పెట్టడం, శంతనుడు దానికి అంగీకరించి ఆమెను వివాహం చేసుకోవడం, శంతనుడు ఆంక్షాతిక్రమణ చేయడం, గంగ అతన్ని వదిలిపెట్టి వెళ్ళిపోవడం మొదలైన కథాంశాలన్నీ జానపద అద్భుత కథాంశాలే.

గంగాశంతనుల కథలో అలెన్ డండెస్ చెప్పిన L-LL సిద్ధాంత లక్షణాలు కొన్ని ఉన్నాయి. నాయకుడైన శంతనునికి గంగ(భార్య) లేకపోవడం అభావం(LACK). గంగ తాను శంతనునికి భార్యగా ఉండాలంటే తాను ఏమి చేసినా శంతనుడు అడ్డుచెప్పకూడదనే నిబంధన పెట్టడం ఆంక్ష (INTERDICTION). గంగ తనకు పుట్టిన ఎనిమిదవ కుమారుని నీటిపాలు చేస్తుండగా శంతనుడు ఆమెకు అడ్డు చెప్పడం ఆంక్షాతిక్రమణ(VIOLATION). శంతనుడు తన పనికి అడ్డు చెప్పాడు కాబట్టి అతన్ని వదిలిపెట్టి వెళ్ళిపోవడం పర్యావసానం(CONSEQUENCE). ఈ కథలో డండెస్ చెప్పిన అవరోధాలను తప్పించుకోవడం, అభావ నివారణ అనే చివరి రెండు లక్షణాలు లేవు. ఈ రెండు లక్షణాలు ఉన్న జానపద కథల్లో నాయకుడు తననుంచి వెళ్ళిపోయిన భార్యను తిరిగి దక్కించుకోవడానికి అద్భుత కార్యాలతో కూడిన ప్రయత్నం చేస్తాడు. అలా ప్రయత్నించడం అవరోధాలను తప్పించుకోవడం అవుతుంది. నాయకుని ప్రయత్నాలు ఫలించి చివరకు అతని భార్యను దక్కించుకుంటాడు. ఇది అభావ నివారణ అవుతుంది. ఈ రెండు లక్షణాలు గంగాశంతనుల కథలో లేవు. ఈ కథలో కథ చివర నాయకునికి భార్య(గంగ) దక్కకపోయినా కొడుకు గంగేయుడు దక్కుతాడు.

భారతంలో గంగాశంతనుల కథను పోలిన కథ హోమర్ మహాకవి రాసిన గ్రీకుల ఇతిహాసమైన ఇలియడ్‌లో ఉంది. ఆ కథ[20] ఇది.

గ్రీసు రాజధాని అయిన ఏథెన్స్ నగరానికి సమీపంలో "ఈజినా" అనే ద్వీపం ఉంది. దాని రాజైన "ఈ యేకస్" కుమారుడు "పీలేయస్". ఈ పీలేయస్‌కు సముద్రపు అప్సరస అయిన "థెటిస్"కు పుట్టినవాడు "ఎకిలీజ్". పెళ్ళికి ముందు థెటిస్ పీలేయస్‌కు ఒక షరతు పెడుతుంది. అది భారతంలో గంగ శంతనునికి పెట్టిన నిబంధన లాంటిదే. తాను చేసే ఏ పని అయినా ఎందుకు చేస్తున్నావని అడ్డు చెబితే వెంటనే పీలేయస్‌ను వదిలి వెళ్ళిపోతానని థెటిస్ చెబుతుంది. దానికి పీలేయస్ అంగీకరించి ఆమెను పెళ్ళిచేసుకుంటాడు. వారికి సంవత్సరానికి ఒకరు చొప్పున ఆరుగురు కుమారులు పుడతారు. వారందరూ తనలాగా అమరులా కాదా అని పరీక్షించడానికి థెటిస్ పుట్టిన వెంటనే వారిని మంటలో వేస్తుంది. వారందరూ కాలి చనిపోతారు. థెటిస్ వారందరికీ శరీరం నిండా అమృతం పూసి వాళ్ళు అమరులా కాదా అని తెలుసుకోవడానికి వారిని మంటల్లో వేసేదట. పీలేయస్ ఇదంతా చూస్తూ కూడా ఆమెను విధించిన షరతును బట్టి ఆమెను ప్రశ్నించడం గానీ, అడ్డుకోవడం గానీ చేయలేదు. ఏడవ కుమారుడుగా పుట్టిన "ఎకిలీజ్"కు కూడా థెటిస్ అమృతం పూసి

మంటలో వేయగా పీలేయస్ వెంటనే వచ్చి ఆ శిశువు కుడికాలు మడమ దగ్గర పట్టుకొని మంటలో నుంచి బయటకు లాగేస్తాడు. మిగిలిన శరీరభాగమంతా అమృతం పూసి మంటలో కాల్చబడినందువల్ల ఆ శరీరమంతా దృఢంగా తయారయింది. పీలేయస్ ఎకిలీజ్ కుడికాలు మడమ దగ్గర పట్టుకోవడం వల్ల అక్కడ సరిగా కాలలేదు. ఆ భాగం బలహీనమైనదిగా తయారయింది. అక్కడ గాయపరిస్తేనే ఎకిలీజ్ చనిపోతాడు. తాను చేసిన పనికి పీలేయస్ అడ్డు చెప్పడం చేత థెటీస్ పీలేయస్‌ను వదిలివేసి దేవలోకానికి వెళ్ళిపోతుంది.

గంగా శంతనుల కథకు, థెటిస్ పీలేయస్‌ల కథకు చాలా దగ్గరి పోలికలు ఉన్నాయి. రెండింటిలోనూ నాయికలు దేవతా స్త్రీలు కాగా నాయకులు మానవులు. రెంటింటిలోనూ నాయికలు షరతులు పెట్టి నాయకులను పెళ్ళి చేసుకుంటారు. రెండు కథల్లోనూ నాయికలు కన్న కుమారులను చంపుతారు. అంతేగాకుండా రెండు కథల్లోనూ నాయకులు షరతులు ఉల్లంఘించడంతో నాయికలు భర్తలను వదిలి వేసి వెళ్ళిపోతారు. ఇలా ఈ రెండు కథలకూ కొన్ని పోలికలతో పాటు తేడాలు కూడా ఉన్నాయి. గంగా శంతనుల కథలో గంగ వసువులకు శాప విమోచన కలిగించడానికి వారు పుట్టిన వెంటనే నీటిలో వేసి చంపుతుంది. ఇలియడ్ కథలో థెటిస్ తనకు పుట్టిన కుమారులు దేవతల లాగ అమరులా కాదా అని పరీక్షించడానికి వారిని మంటల్లో వేసి చంపుతుంది. గంగా శంతనుల కథలో గంగ శంతనుని వదిలిపెట్టి వెళ్ళిపోతూ తన కుమారుని వెంట తీసుకొని వెళ్ళి పెంచి పెద్ద చేసి సర్వ శాస్త్రాల్లోనూ శస్త్రాస్త్ర విద్యల్లోనూ పారంగతున్ని చేసి శంతనునికి అప్పగిస్తుంది. ఇలియడ్‌లో థెటిస్ శిశువుగా ఉన్న తన కొడుకును భర్త అయిన పీలేయస్ దగ్గర వదిలేసి వెళ్ళిపోతుంది. ఈ రెండు కథలు జానపద అద్భుత కథల ప్రభావంతో పండిత కవులు రాసినవే. అందువల్ల ఈ రెండింటిలోనూ జానపద కథాంశాలు ఉన్నాయి.

## 4. జరాసంధుని కథ :

ఈ కథ సభా పర్వంలో మూడవ ఉపపర్వమైన రాజసూయారంభ పర్వం, నాల్గవ ఉపపర్వమైన జరాసంధవధ పర్వం అనే రెండు ఉపపర్వాల్లో 366 శ్లోకాల్లో చాలా వివరంగా వుంది. ధర్మరాజు రాజసూయ యాగం చేయ తలపెట్టినప్పుడు కృష్ణుడు అతనితో జరాసంధుడు భూమి మీద చాలా మంది రాజులను జయించి వారిని కాళికాదేవికి బలి ఇవ్వడానికి బందీలుగా పట్టుకున్నాడని తనకు కూడా అతడు అజేయుడని, అతన్ని చంపకుండా రాజసూయయాగం చేయడం సాధ్యం కాదని చెబుతాడు. అప్పుడు ధర్మరాజు జరాసంధుడు శ్రీకృష్ణునికి ఎలా అజేయుడయ్యాడని కృష్ణుని ప్రశ్నిస్తాడు. దానికి సమాధానంగా కృష్ణుడు జరాసంధుని జన్మ వృత్తాంతాన్ని ఇలా చెబుతాడు.

మగధదేశ రాజైన బృహద్రథుడు చాలా బలవంతుడు, సజ్జనుడు. అతనికి ఇద్దరు భార్యలు. వారికి చాలా కాలం సంతానం కలగలేదు. సంతానం కోసం ఆ రాజు అనేక హోమాలు, యాగాలు చేశాడు. అయినప్పటికీ సంతానం కలగలేదు. ఇలా

ఉండగా అతని రాజ్యానికి చండకౌశికుడు అనే ముని వచ్చి ఒక మామిడి చెట్టు కింద విశ్రమిస్తాడు. బృహద్రధుడు భార్యలతో కలిసి మునిని దర్శించి అనేక విలువైన రత్నాలను కానుకగా సమర్పిస్తాడు. అతని సేవకు ముని సంతోషించి వరం కోరుకోమంటాడు. సంతాన హీనుడైన తనకు రాజ్యం, వరం ఎందుకు అని రాజు దీనంగా అంటాడు. అతని బాధ గమనించిన ముని అప్పుడే తన చేతిలో పడిన ఒక మామిడిపండును మంత్రించి రాజుకు ఇచ్చి ఆ పండును అతని భార్యలు తింటే కుమారుడు కలుగుతాడని చెబుతాడు. అంతేగాకుండా పుట్టబోయే అతని కుమారునికి బ్రాహ్మణ భక్తి, యుద్ధంలో పరాజయం లేకపోవడం, యుద్ధాసక్తి నశించకపోవడం, అతిథి మర్యాద, దీనరక్షణ, మహాబలం, లోకంలో శాశ్వతమైన కీర్తి, ప్రజానురాగం అనే ఎనిమిది వరాలను ఇస్తాడు. రాజు ముని చెప్పిన మాటలకు చాలా సంతోషించి మామిడిపండును తన ఇద్దరు భార్యలకు ఇవ్వగా వారు దాన్ని కోసి చెరిసగం తింటారు. అచిరకాలంలోనే రాజు భార్యలు గర్భవతులై నెలలు నిండిన తర్వాత చెరొక ముక్కగా వున్న ప్రాణం లేని మగశిశువును కంటారు. ఒక కన్ను, ఒక చెయ్యి, ఒక కాలు, సగం ముఖం, సగం పొట్ట, నడుము కింది భాగం కల రెండు శరీరాల ముక్కలను చూసి రాజు, రాజు భార్యలు భయపడిపోయి ఎంతగానో దుఃఖిస్తారు. వారి చెలికత్తెలు ఆ ముక్కలను గుడ్డల్లో చుట్టి అంత:పురం నుండి బయటకు వచ్చి వాటిని పారవేసి వెళతారు. అదే సమయంలోనే 'జర' అనే పేరు గల రాక్షసి ఆ రెండు ముక్కలను తీసుకొని కలుపుతుంది. అలా కలపగానే ఆ రెండు ముక్కలు కలిసిపోయి శిశువుగా ఏర్పడి ప్రాణం వచ్చి ఏడ్వడం ప్రారంభిస్తాడు. వెంటనే జర స్త్రీరూపాన్ని ధరించి రాజు దగ్గరకు వచ్చి ఆ కుమారుని అతనికి అప్పగిస్తుంది. రాజు అపరిమితంగా సంతోషించి జర చేత కలుపబడినవాడు కావడంచేత జరాసంధుడు అని ఆ శిశువుకు పేరు పెట్టి అల్లారు ముద్దుగా పెంచుతాడు. కొంత కాలం తర్వాత చండకౌశిక ముని మళ్ళీ ఆ రాజ్యానికి వస్తాడు. బృహద్రధుడు తన కుమారుని తీసుకొని వెళ్ళి మునిని కలుస్తాడు. జరాసంధుడు గొప్ప బల పరాక్రమాలతో రాజులను జయిస్తాడని, అతని ముందు ఏ రాజు నిలబడలేడని ముని చెబుతాడు. ఆ తర్వాత కొంతకాలానికి బృహద్రధుడు జరాసంధునికి పట్టాభిషేకం చేసి భార్యలతో కలిసి అడవులకు వెళ్ళిపోతాడు. జరాసంధుడు దండయాత్రలు చేసి రాజులందరిని జయించి వారిని బందీలుగా పట్టుకుని కాళికాదేవికి బలి ఇవ్వాలనుకుంటాడు.

పై విధంగా కృష్ణుడు జరాసంధుని పుట్టుకను గురించి ధర్మరాజుకు చెప్పి జరాసంధుడు ఎలాంటి ఆయుధం వల్ల చావడని అతన్ని బాహుబలంతోనే చంపాలని, అతన్ని చంపకుండా రాజసూయయాగం చేయడం సాధ్యం కాదని, భీమార్జునులను తనతో పంపిస్తే జరాసంధుని చంపి వస్తానని చెబుతాడు. ధర్మరాజు దానికి అంగీకరించడంతో కృష్ణుడు భీమార్జునులను తీసుకొని బ్రాహ్మణుల వేషంతో రహస్యంగా మగధ రాజ్యంలోకి ప్రవేశించి జరాసంధుని కలుసుకొని తమతో యుద్ధం చేయాలని జరాసంధునికి చెబుతాడు.

జరాసంధుడు భీమునితో బాహుయుద్ధానికి సిద్ధమౌతాడు. వారి యుద్ధం కార్తీకమాసం మొదటి రోజు ప్రారంభమై రేయింబవళ్ళు ఎలాంటి ఆహారం లేకుండా త్రయోదశి వరకు సాగుతుంది. చతుర్దశి నాటికి జరాసంధుడు అలసిపోతాడు. అది గమనించిన కృష్ణుడు భీముడు చూస్తుండగా ఒక గడ్డిపరకను నిలువుకు రెండుగా చీల్చి పారేస్తాడు. దాన్ని గమనించిన భీముడు జరాసంధుని కింద పడవేసి తన కాలుతో అతని కాలును తొక్కిపెట్టి అతన్ని నిలువుకు రెండు ముక్కలుగా చీల్చి వాటిని పారేస్తాడు. అయితే ఆశ్చర్యంగా ఆ రెండు ముక్కలు మళ్ళీ దగ్గర వచ్చి అతుక్కుని జరాసంధుడు లేచి భీమునితో మళ్ళీ యుద్ధం చేస్తాడు. ఈసారి కృష్ణుడు గడ్డిపరకను రెండుగా చీల్చి ఎడమచేతిలో ముక్కను కుడివైపుకు, కుడిచేతిలో ముక్కను ఎడమవైపుకు పడవేస్తాడు. దీన్ని గమనించిన భీముడు జరాసంధుని రెండు ముక్కలుగా చీల్చి వాటిని విపరీతదిశలో పడేస్తాడు. దానితో ఆ రెండు ముక్కలు అతుక్కోకుండా పోతాయి. దానితో జరాసంధుడు చనిపోతాడు.

కొన్ని సంస్కృత భారత ప్రతుల్లో కృష్ణుడు గడ్డి పరకను రెండుగా చీల్చి భీమునికి సంకేతమివ్వడం, దానిని చూచి భీముడు జరాసంధుని నిలువుకు రెండుగా చీల్చడం మొదలయిన వృత్తాంతం లేదు. భీముడు జరాసంధుని ఎత్తి ఆకాశంలో గిరగిర తిప్పి భూమి మీద పడవేసి అతని నడుము విరిచి చంపినట్లుగా ఈ ప్రతుల్లో ఉంది. నన్నయ్య తన భారతంలో భీముడు జరాసంధుని ఇదే విధంగా చంపినట్లుగా రాశాడు.

ఈ జరాసంధుని కథలో జానపద అద్భుత కథాంశాలుగా మొదట చెప్పుకున్న నాయక, ప్రతినాయక లక్షణాలు కొన్ని వున్నాయి. జరాసంధుని పుట్టుక జానపద కథల్లోని నాయకుని లాగా ఋషి ఇచ్చిన మామిడిపండు కారణంగా జరిగింది. అతడు పెరిగి పెద్దవాడైన తర్వాత ప్రతినాయకుని లాగా రాజులను చెరబట్టి కాళికాదేవికి బలి ఇవ్వాలనుకుంటాడు. అంతేగాకుండా కృష్ణునితో విరోధం పెంచుకొని అతని మీదకు చాలాసార్లు దండెత్తుతాడు. దానితో కృష్ణుడు అతన్ని చంపాలనుకుంటాడు. జానపద కథల్లో ప్రతినాయకుని మరణం ప్రత్యేకమైన పద్ధతిలో ప్రత్యేకమైన వ్యక్తిచేత జరిగినట్లుగా చెప్పబడుతుంది. జరాసంధుని కథలో జరాసంధుని మరణం కృష్ణుని చేతిలో కాకుండా భీముని చేతిలో ఎలాంటి ఆయుధం లేకుండా ఒక ప్రత్యేకమైన పద్ధతిలో జరగాలని చెప్పబడింది. అందువల్ల కృష్ణుడు జరాసంధుని చంపలేకపోతాడు. ఈ కారణం చేతనే కృష్ణుడు భీమార్జునులను తన వెంట తీసుకొనివెళ్ళి జరాసంధుని ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానిస్తాడు. జరాసంధుడు ఋషి మంత్రించి ఇచ్చిన మామిడిపండు కారణంగా ఇద్దరు తల్లులకు రెండు ముక్కలుగా పుట్టిన కారణం చేత అతడు అలాగే రెండు ముక్కలుగా చీల్చబడడం ద్వారానే చనిపోవాలనేది జానపద కవి ఆలోచన. అంతేగాకుండా ఆ రెండు ముక్కలు సవ్యదిశలో పడేస్తే తిరిగి దగ్గరకు వచ్చి అతుక్కుంటాయని, వ్యతిరేకదిశలో పడేయడంవల్ల అతుక్కునే అవకాశం లేక

జరాసంధుడు చనిపోవాలనేది జానపద కవి యొక్క అద్భుతమైన ఆలోచన. ఈ విధంగా జరాసంధుని కథలో అద్భుత కథాంశాలున్నాయి. శిష్టకవి కొన్ని జానపద అద్భుత కథాంశాలను తీసుకొని ఈ జరాసంధ కథను కల్పించాడు.

ఈ కథలో చండకౌశికుని చేతిలో మామిడిపండు తనంత తానుగా పడడం, బృహద్రధుని భార్యలు ఒక కన్ను, ఒక కాలు, ఒక చెయ్యి కలిగిన బాలుని ఒక భాగాన్ని కనడం, జర అనే రాక్షసి ఆ రెండు ముక్కలును కలపగానే అవి రెండు అతుక్కుపోయి బాలుడుగా ఏర్పడడం, భీముడు జరాసంధుని నిలువుకు రెండు ముక్కలుగా చీల్చి పారేస్తే అవి రెండు అతుక్కుని జరాసంధుడు మళ్ళీ లేచి భీమునితో మళ్ళీ యుద్ధం చేయడం, భీముడు రెండవసారి జరాసంధుని రెండుగా చీల్చి ఆ ముక్కలను వ్యతిరేక దిశలో పారేయగానే అవి అతుక్కోకుండా జరాసంధుడు చనిపోవడం – ఇవి అన్నీ ఈ కథలోని అద్భుత సంఘటనలు. అందువల్లనే ఈ కథ అద్భుత కథ అవుతూ వుంది. ఈ కథలో చండకౌశిక ముని పుట్టబోతున్న జరాసంధునికి ఇచ్చిన ఎనిమిది వరాల్లో మొదటిది జరాసంధుడు బ్రాహ్మణ భక్తిని కలిగి వుంటాడని చెప్పడం. ఈ కథను రాసిన కవి బ్రాహ్మణకవి కావడం వల్ల స్వకులాభిమానంతో అలా రాసాడు. రాజులు బ్రాహ్మణభక్తి కలిగి వుండాలనేది ఆ కవి ఆలోచన. రాజుల లాగానే ప్రజలు బ్రాహ్మణభక్తిని కలిగి వుండాలనే చాటి చెప్పడానికి కవి అలా రాసాడు.

## 5. శల, దలుల చరిత్ర – వామదేవ మాహాత్మ్యం కథ :

ఈ కథ వనపర్వంలోని మార్కండేయ సమస్యాపర్వం అనే ఉపపర్వంలో 72 శ్లోకాల్లో వుంది. ఈ కథను మార్కండేయ ముని పాండవులకు చెబుతాడు. అరణ్యవాసం చేస్తున్న పాండవుల వద్దకు మార్కండేయముని వచ్చి వారికి అనేక కథలు చెబుతూ బ్రాహ్మణుల మాహాత్మ్యాన్ని గురించి వివరిస్తాడు. అపుడు ఇంకా బ్రాహ్మణుల మాహాత్మ్యాన్ని గురించి చెప్పమని ధర్మరాజు మార్కండేయమునిని కోరగా ముని ఈ కథను చెబుతాడు. ఈ కథలో రెండు భాగాలున్నాయి. మొదటి భాగం శల, దలుల తల్లిదండ్రులైన సుశోభన, పరీక్షిన్మహారాజులకు సంబంధించినది. ఇది పూర్తిగా జానపద కథ. రెండవ భాగం శల, దలులకు వామదేవునికి సంబంధించిన కథ. ఇది పండిత కవి కల్పించినది, బ్రాహ్మణ మాహాత్మ్యాన్ని వివరించేది. ఈ కథను మార్కండేయుడు ఇలా చెబుతాడు.

అయోధ్యానగరాన్ని పాలిస్తున్న ఇక్ష్వాకు వంశస్థుడైన పరీక్షిన్మహారాజు ఒకసారి వేటకు వెళ్ళి గుర్రం మీద ఒంటరిగా ఒక జింకను తరుముతూ చాలా దూరం దట్టమైన అడవిలోకి వెళతాడు. అలసిపోయి వున్న అతనికి అక్కడ ఒక సరస్సు దగ్గర మధురంగా గానం చేస్తున్న అందమైన యువతి కన్పిస్తుంది. రాజు ఆమెను చూడగానే మోహించి ఆమె వివరాలను గురించి అడుగుతాడు. ఆమె తాను కన్యను అని చెబుతుంది. ఆమె తనకు కావాలని రాజు ఆమెను అడుగుతాడు. తనకు ఎప్పుడూ గూడా నీటిని చూపించగూడదు, అలా మాట ఇస్తే తను రాజుకు దక్కుతానని ఆమె చెబుతుంది. రాజు అలాగే అని ఆమెకు

మాట ఇచ్చి ఆమెను పెళ్ళి చేసుకొని రాజధానికి తెచ్చి ఆమెతో కూడి ఏకాంతంగా వుంటాడు. మంత్రి విషయమంతా తెలుసుకొని అనేక రకాల పూల, పండ్ల మొక్కలతో అందమైన ఉద్యానవనాన్ని నిర్మించి అందులో మధురమైన జలాలతో కూడిన దిగుడు బావిని ఏర్పరచి దాన్ని ముత్యాల జాలరులతో మూసివేయించి ఆ వనంలో భార్యతో కలిసి విహరించుమని రాజుకు చెబుతాడు. రాజు భార్యతో కలిసి అందులో ఆనందంగా విహరిస్తూ ఒకరోజు బాగా అలసిపోయి ఆకలి దప్పికలతో బావి దగ్గరకు వచ్చి అందులోని నీటిని భార్యకు చూపించి జాగ్రత్తగా బావిలోకి దిగమని ఆమెతో చెబుతాడు. ఆమె బావిలోకి దిగి నీటిలో మునిగిపోయి మళ్ళీ పైకి రాదు. రాజు ఆమె కోసం చాలా వెదికిస్తాడు. బావిలోని నీటిని తోడించి చూస్తే ఒక బిలంలో ఒక కప్ప కనిపిస్తుంది. దాన్ని చూసి రాజు కప్పలు తన రాణిని భక్షించాయని భావించి దేశంలోని కప్పలన్నింటిని చంపివేయాలని తన సేవకులను ఆదేశిస్తాడు. రాజు ఆదేశాన్ని అనుసరించి ప్రజలందరు కప్పలను చంపుతూ వుంటారు. అప్పుడు కప్పల రాజు తాపసవేషాన్ని ధరించి రాజు దగ్గరకు వచ్చి కప్పలు ఎలాంటి నేరమూ చేయలేదని, అందువల్ల వాటిని చంపవద్దని చెబుతాడు. దానికి రాజు అంగీకరించకుండా కప్పలు తన భార్యను తిన్నాయని అందువల్ల వాటిని క్షమించనని చెబుతాడు. అప్పుడు కప్పల రాజు తన పేరు 'ఆయువు' అని తాను కప్పల రాజును అని, ఆమె తన కూతురు సుశోభన అని, ఆమె రాజును విడిచి వెళ్ళినట్లుగానే అంతకుముందు చాలా మంది రాజులను అలాగే మోసగించిందని చెబుతాడు. రాజు సుశోభన తనకు కావాలని ఆమెను తనకు అప్పగించమని ఆయువును కోరతాడు. ఆయువు తన కూతురు సుశోభనను తెచ్చి రాజుకు అప్పగించి రాజును సేవించమని ఆమెకు చెప్పి, ఆమె అంతకుముందు చాలా మంది రాజులను మోసగించినందుకు "ఆమె సంతానం బ్రాహ్మణ విరోధులౌతారని" శపించి వెళ్లిపోతాడు. సుశోభన తిరిగి తనకు లభించినందుకు రాజు పరమానంద భరితుడౌతాడు.

ఇంతవరకు వున్న ఈ కథ మొదటి భాగం. ఈ కథలో కప్పల రాజు తన కూతురైన సుశోభనను శపించడం తప్ప మిలిగినదంతా జానపద కథ. ఈ కథలో పండిత కవి ఈ శాప వృత్తాంతాన్ని ప్రవేశపెట్టి కథను కొంత వరకు విషాదాంతం చేసాడు. జానపద కథలు సాధారణంగా విషాదాంతాలుగా వుండవు. అవి సుఖాంతాలు వుంటాయి. ఈ కథలో పరీక్షిన్మహారాజు వేటకు వెళ్ళి అడవిలో ఒంటరిగా వున్న సుశోభనను చూసి పెళ్ళి చేసుకోవాలను కోవడం, ఆమె తనకు ఎప్పుడు నీళ్ళు చూపించ గూడదని ఆంక్ష పెట్టడం, రాజు దానికి అంగీకరించి ఆమెను పెళ్ళి చేసుకోవడం, జానపద కథల్లో ఆంక్ష అంటూ వుంటే ఆంక్షాతిక్రమణ తప్పని సరిగా వుంటుంది కాబట్టి రాజు ఆంక్షను అతిక్రమించి ఆమెకు నీటిని చూపించడం, రాజు ఆంక్షాతిక్రమణ చేయడం వల్ల ఆమె అతన్ని వదిలిపెట్టి వెళ్ళిపోవడం, రాజు కప్పలరాజు ద్వారా తిరిగి ఆమెను పొందడం మొదలైన కథ పూర్తిగా జానపదకవి కల్పితమే. సుశోభన పరీక్షిన్మహారాజును మోసగించినట్లుగా అంతకు ముందు

చాలా మంది రాజులను మోసం చేసిందని, అందుకు ఆమె తండ్రి ఆయువు ఆమెకు పుట్టిన కుమారులు బ్రాహ్మణ విరోధులౌతారని శపించడం అనే రెండు అంశాలను తర్వాత కథ జరగడానికి వీలుగా పండితకవి కల్పించాడు.

పరీక్షిన్మహరాజుకు సుశోభన ద్వారా శలుడు, దలుడు, బలుడు అనే ముగ్గురు కుమారులు పుడతారు. వారు యుక్తవయస్సులోకి వచ్చిన తర్వాత పరీక్షిత్తు శలుని రాజుగా అభిషేకించి భార్యతో కలిసి అడవికి తపస్సు కోసం వెళ్ళిపోతాడు. ఒకసారి శలుడు వేటకు వెళ్ళి రథం మీద ఒక జింకను  తరుముతూ వేగంగా రథం నడుపమని సారథిని పదేపదే ఆజ్ఞాపిస్తాడు. దానికి సారథి రథానికి వామ్యాశ్వాలు వుంటే తప్ప ఆ మృగాన్ని అందుకోలేవని శలునికి చెబుతాడు. వామ్యాశ్వాలు ఎక్కడున్నాయో చెప్పమని లేకుంటే చంపేస్తానని శలుడు సారథిని ఆజ్ఞాపిస్తాడు. దానికి సారథి వామదేవుడు అనే బ్రాహ్మణుని దగ్గర వామ్యాశ్వాలు వున్నాయని అవి మనోవేగంతో వెళ్ళగలవని చెబుతాడు. వెంటనే శలుడు వామదేవుని ఆశ్రమానికి వెళ్ళి వామదేవునితో తన బాణం దెబ్బ తగిలి ఒక జింక పారిపోయిందని దాన్ని చంపడానికి వామ్యాశ్వాలను ఇచ్చి అనుగ్రహించాలని కోరతాడు. వామదేవుడు అశ్వాలను అతనికి ఇచ్చి పని అయిపోయిన తర్వాత తన అశ్వాలను తనకు ఇవ్వాలని చెబుతాడు. శలుడు వామ్యాశ్వాలను తీసుకొని మృగాన్ని పట్టుకొని అలాంటి ఉత్తమ అశ్వాలు బ్రాహ్మణులకు అనవసరమని భావించి వాటిని తన నగరానికి తీసుకొని వెళతాడు.

వామదేవుడు తన గుర్రాల కోసం నెల రోజులపాటు వేచిచూసి, మైత్రేయుడు అనే తన శిష్యుని ద్వారా తన గుర్రాలను తెచ్చి ఇవ్వమని శలునికి వర్తమానం పంపిస్తాడు. రత్నాల్లాంటి వామ్యాశ్వాలు రాజులకు తగినవని, బ్రాహ్మణులకు తగినవి కావని శలుడు మైత్రేయునికి చెప్పి పంపిస్తాడు. వామదేవుడు కోపంతో శలుని దగ్గరకు వచ్చి తన గుర్రాలను ఇవ్వమంటాడు. రాజు ఆ గుర్రాలకు బదులుగా వామదేవుడు ప్రయాణించడానికి మంచి ఎద్దులబండిని, అనేక కంచర గాడిదలను ఇస్తాను గానీ, గుర్రాలను మాత్రం ఇవ్వనని చెప్తాడు. తన గుర్రాలను ఇవ్వకపోతే నలుగురు భయంకర రాక్షసులను సృష్టించి వారిచేత రాజును చంపిస్తానని బ్రాహ్మణుడు చెబుతాడు. దానికి రాజు అంగీకరించకపోవడంతో నలుగురు రాక్షసులు ఉద్భవించి శలుణ్ణి చంపివేస్తారు. రాజు మరణించినట్లు తెలుసుకొని ఇక్ష్వాకు వంశస్థులు దలుని రాజుగా చేసుకుంటారు. వామదేవుడు దలరాజు దగ్గరకు వచ్చి తన గుర్రాలను ఇప్పించమంటాడు. దలుడు దానికి కోపగించి సూతునితో “విషపూరితమైన ఒక బాణాన్ని తీసుకొనిరా, దానితో వామదేవుడు నేల మీద పడాలి” అని అంటాడు. అపుడు వామదేవుడు రాజుతో “రాజా నా మాట మన్నించి నీ పదేండ్ల కుమారుడైన శ్యేనజిత్తును నీ బాణంతో చంపు” అని అంటాడు. వెంటనే భయంకరమైన బాణం ధనస్సు నుండి దానంతటఅదే వెలువడి అంతఃపురంలో వున్న రాజకుమారున్ని చంపుతుంది. అప్పుడు దలుడు “ఇక్ష్వాకు వంశస్థులారా ఈ విప్రుని కొట్టి చంపుతాను మరొక బాణాన్ని

తీసుకొని రండి" అని అంటాడు. అప్పుడు వామదేవుడు "రాజా! నన్ను చంపడానికి విషం కలిగిన భయంకరమైన బాణాన్ని వదలబోతున్నావు, కాని నీవు ఆ బాణాన్ని ఎక్కు పెట్టలేవు" అని అంటాడు. వామదేవుడు చెప్పినట్లుగానే దలుడు ఆ బాణాన్ని ఎక్కుపెట్టలేడు. అప్పుడు వామదేవుడు " రాజా! నీవు ఈ బాణంతో రాణిని చంపు, అప్పుడు బ్రహ్మహత్యా పాపం నుంచి బయటపడతావు" అని అంటాడు. దలుడు ఆ విధంగా చేస్తాడు. అప్పుడు రాజు భార్య వామదేవునితో "బ్రాహ్మణుడా క్రూర స్వభావం కలిగిన నా భర్తకు నేను ప్రతి దినమూ తగిన విధంగా హితబోధ చేస్తాను. బ్రాహ్మణ సేవకై వెదుకులాడుతాను. కాబట్టి నేను పుణ్యలోకాలను పొందాలి" అని అంటుంది. అప్పుడు వామదేవుడు రాజకుమారి నీ రాజ వంశాన్ని రక్షించావు. సాటిలేని వరాన్ని కోరుకో ఇస్తాను. నీ వారిని, ఇక్ష్వాకు రాజ్యాన్ని పరిపాలించు" అని అంటాడు. అప్పుడు రాజకుమారి "నా భర్త నేడే పాపవిముక్తుడు కావాలి, సపుత్రబాంధవంగా అతను క్షేమంగా వుండాలి" అని కోరుకుంటుంది. వామదేవుడు తథాస్తు అంటాడు. అప్పుడు బలుడు ఆనందించి వామదేవునికి నమస్కరించి అతని గుర్రాలను అతనికి ఇస్తాడు. ఇంతటితో ఈ కథ ముగుస్తుంది.

ఈ వామదేవుని కథ బ్రాహ్మణ మాహాత్మ్యాన్ని వివరించేది కావడం చేత ఇందులో బ్రాహ్మణ మాహాత్మ్యం అత్యంతాతిశయోక్తులతో ఆశ్చర్యకరమైన పద్ధతిలో వివరింపబడింది. ఈ కథలో వామదేవుడు తన గుర్రాల కోసం శలుని దగ్గరకు వచ్చి –

**"నానుయోగ బ్రాహ్మణానాం భవన్తి**
**వాచా రాజన్ మనసా కర్మణా వా**
**యస్త్వేవం బ్రహ్మతపసాన్వేతి విద్వాం**
**స్తేన శ్రేష్ఠో భవతి హి జీవమానః "**

**(ఆదిపర్వం – 192వ అధ్యాయం – 56వ శ్లోకం)**

"మనోవాక్కాయకర్మల్లో దేనితో గూడా బ్రాహ్మణులను ఎవరూ శాసించలేరు. దీన్ని తెలుసుకొని కష్టించి బ్రాహ్మణులను సేవించినవాడు ఆ సేవ ద్వారా శ్రేష్ఠుడై జీవిస్తాడు" అని చెప్పగానే ఘోరాకారులైన రాక్షసులు ప్రత్యక్షమై శలుని చంపి వేసినట్లుగా చెప్పబడింది. అలాగే దలుడు వామదేవుని చంపడానికి బాణం ఎక్కుపెట్టినప్పుడు వామదేవుడు ఆ బాణంతో నీ కుమారుని చంపు అని అనగానే బాణం దూసుకొని వెళ్ళి అంతఃపురంలో వున్న రాజకుమారుని చంపడం, రాజు మరొక బాణాన్ని వామదేవుని మీదకి ఎక్కుపెట్టినప్పుడు వామదేవుడు ఆ బాణాన్ని నువ్వు ఎక్కుపెట్టలేవు అని చెప్పగానే దలుడు "నేను లొంగిపోయాను బాణాన్ని విడవలేకుండా వున్నాను. నేను వామదేవుని చంపాలనుకోవడం లేదు" అని చెబుతాడు. ఆ తర్వాత వామదేవుడు రాజుతో ఆ బాణంతో మహారాణిని చంపు అని అనగానే ఆ బాణం వెళ్ళి రాణికి తగులుతుంది. ఈ వృత్తాంతమంతా అత్యంతాతిశయోక్తులతో ఆశ్చర్యకరమైన రీతిలో చెప్పబడింది. అంటే బ్రాహ్మణుడైన వామదేవుడు అద్భుతమైన మాహాత్మ్యం

కలిగినవాడని, అతని నోటి నుంచి మాట వెలువడగానే అక్షరాల జరిగినట్లుగా ఈ కథలో చెప్పబడింది. బ్రాహ్మణుల మాహాత్మ్యాన్ని చాటి చెప్పడానికే కవి ఇలా రాశాడు.

ఈ కథలో పరీక్షిన్మహారాజు అడవి మధ్యలో ఒంటరిగా వున్న సుశోభనను చూడడం, ఆమె బావిలో దిగి కనిపించకుండా వెళ్ళిపోవడం, కప్పలరాజు పరీక్షిన్మహారాజు దగ్గరకు వచ్చి తన కూతురు గురించి చెప్పడం, వామదేవుడు మాట మాత్రంతోనే రాక్షసులను సృష్టించి శలుని చంపించడం, దలుని లొంగదీసుకోవడం మొదలైన కథాభాగమంతా అద్భుతాంశాలతో కూడికొని వుంది. అందువల్ల ఈ కథ అద్భుత కథ అవుతూ వుంది.

ఈ కథలోని మొదటి భాగంలో అలెన్‌డండెస్ చెప్పిన **L-LL** సిద్ధాంత లక్షణాలున్నాయి. పరీక్షిన్మహారాజుకు సుశోభన లేకపోవడం **Lack** (లోటు), సుశోభన తనకు ఎప్పుడూ గూడా నీటిని చూపించగూడదని పరీక్షిన్మహారాజుకు చెప్పడం **Interdiction** (ఆంక్ష), పరీక్షిత్తు సుశోభనకు బావిలో నీటిని చూపించడం **Violation** (ఆంక్షాతిక్రమణ), పరీక్షిత్తు ఆంక్షాతిక్రమణ చేయడం వల్ల సుశోభన బావి నీటిలో మునిగి మాయమైపోవడం **Consequence** (పర్యవసానం), పరీక్షిన్మహారాజు దేశంలోని కప్పలను చంపించడం **Attempted Escape** (అవరోధాలను తప్పించుకోవడం), కప్పల రాజు తన కూతురు సుశోభనను పరీక్షిన్మహారాజుకు అప్పగించడంతో రాజు సుశోభనను పొందడం **Lack Liquidation** (లోటు తీరడం). ఈ విధంగా ఈ కథలో **L-LL** సిద్ధాంతముంది.

ఈ కథలోని రెండవ భాగంలో బ్రాహ్మణ, క్షత్రియ సంఘర్షణ వుంది. ఈ సంఘర్షణలో బ్రాహ్మణులదే విజయం. ఇలాంటి సంఘర్షణ వున్న కథలు భారతంలో ఇంకా కొన్ని వున్నాయి. ద్రోణద్రుపదుల కథ, పరశురాముని కథ, వసిష్ఠ విశ్వామిత్రుల కథ మొదలైనవి ఇలాంటివి. ఈ కథలనుబట్టి ఆనాడు బ్రాహ్మణ క్షత్రియుల మధ్య సంఘర్షణ జరిగినట్లుగా స్పష్టమవుతుంది. స్వామి ధర్మతీర్థగారు రాసిన "**The History of Hindu Imperialism**" అనే గ్రంథం తెలుగు అనువాదం హిందూ సామ్రాజ్యవాద చరిత్రలోని బ్రాహ్మణ – క్షత్రియ సంఘర్షణ అనే ప్రకరణంలో "బ్రాహ్మణ పూజారుల ఆశకు అంతే లేదు. వీళ్ళు మొత్తం సమాజాన్ని తమ ఆధిపత్యం కిందకు తెచ్చుకోవాలనుకున్నారు. రాజుల్ని సైతం తమ చెప్పు చేతల్లో పెట్టుకోవాలనుకున్నారు. వాళ్ళు రాజ్య వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడం మొదలయినప్పటి నుండి యాగాలు నిర్వహించడంలో క్షత్రియులకున్న హక్కుల పైన వివాదాలు పొడసూపినాయి. వేదాల్లోనూ, రామాయణం లోనూ, మహాభారతంలోనూ విశ్వామిత్రుడు, వసిష్టుల మధ్య చెలరేగిన వివాదం దీన్నే రుజువు చేస్తున్నది"[21] అని రాశారు. దీన్ని బట్టి ఆనాడు బ్రాహ్మణ క్షత్రియుల మధ్య సంఘర్షణ జరిగినట్లుగా మరింత స్పష్టంగా చెప్పవచ్చు. ఈ కథలన్నింటిలోను బ్రాహ్మణులు ధర్మపరులుగా, క్షత్రియులు అధర్మపరులుగా చెప్పబడ్డారు. ఈ కథలు రాసిన వారందరూ బ్రాహ్మణులు కావడం చేత ఇలాంటి కథలను రాసారు. బ్రాహ్మణులు తపోమహిమచేత అద్భుతమైన మాహాత్మ్యం కలవారు కాబట్టి వారు క్షత్రియుల మీద లేక రాజుల మీద విజయం సాధించినట్లుగా బ్రాహ్మణ, క్షత్రియ సంఘర్షణ వున్న ఇలాంటి కథల్లో చెప్పబడింది.

హేతుబద్ధంగా చూస్తే ఇది జరిగేదికాదు. రాజరికంలో రాజు సర్వాధికారి. సైనిక బలం అతని చేతిలో వుంటుంది. కాబట్టి అతని మాట శిలాశాసనం. అతని రాజ్యంలో బ్రాహ్మణులు గానీ, ఇతరులు గానీ వ్యక్తులు ఎవరైనా రాజును ఎదిరించి విజయం సాధించడం అసాధ్యం. ఇలాంటి కథల్లో చెప్పినట్లుగా బ్రాహ్మణులకు ఎలాంటి మహిమ లేదు. ఇవన్నీ కల్పనలు. ఇలాంటి కల్పనలతో కూడిన కథలు రాయడంలో ఆనాటి బ్రాహ్మణ కవుల ఉద్దేశ్యం ఏమంటే బ్రాహ్మణులు అగ్రజన్ములని, వారు మహిమాన్వితులని, వారి ముందు పాలకులైన క్షత్రియులే లొంగిపోయారని, మిగిలిన వర్ణాలవారు వారిపట్ల భయభక్తులు కలిగి వుండాలని లోకానికి చాటిచెప్పడానికే. మన దేశానికి ఆంగ్లేయులు వచ్చి అందరికి సమన్యాయాన్ని ప్రవేశపెట్టే వరకు మన సమాజంలో బ్రాహ్మణులకు చాలా ప్రత్యేకమైన సౌకర్యాలు, హక్కులు, గౌరవాలు వుండేవి. బ్రాహ్మణులు వీటిని తమ హక్కుగా భావించి ఆ ప్రత్యేక సౌకర్యాలను పొందేవారు. దీనికి కారణం ఈ కథలాంటి కథలను రాసి నిరక్షరాస్యులు అమాయకులైన ఆనాటి ప్రజలను నమ్మించి సమాజం మీద తిరుగులేని పెత్తనం చలాయించారు. ఇలాంటి కథలను నమ్మి ఈనాటికి కొందరు బ్రాహ్మణుల పట్ల ప్రత్యేకమైన గౌరవాన్ని, భక్తిని కలిగి వున్నారు. దీన్ని బట్టి ఈ కథలు మన కులవర్గ సమాజం మీద ఎంత గొప్ప ప్రభావాన్ని కలిగి వున్నాయో తెలుస్తూ వుంది.

## 6. శిఖండి కథ :

సంస్కృత భారతంలో శిఖండి కథ ఉద్యోగపర్వంలోని అంబోపాఖ్యాన పర్వం అనే ఉపపర్వంలో 173వ అధ్యాయం నుంచి 192వ అధ్యాయం వరకు ఉన్న 20 అధ్యాయాల్లో 803 శ్లోకాల్లో ఉంది. ఈ కథను భీష్ముడు దుర్యోధనునికి చెబుతాడు. కురుక్షేత్ర యుద్ధానికి ముందు దుర్యోధనుడు తన సైన్యానికి భీష్ముని సర్వ సైన్యాధ్యక్షునిగా చేసినపుడు భీష్ముడు తన శక్తిసామర్థ్యాలను గురించి దుర్యోధనుడు మొదలైన ధార్తరాష్ట్రులకు చెబుతూ "స్త్రీని గాని, మొదట స్త్రీగా ఉండి తర్వాత పురుషుడుగా మారిన వాణ్ణి గానీ చంపను, శిఖండి మొదటస్త్రీగా పుట్టి తర్వాత పురుషుడయ్యాడు, అలాంటివాడు నన్నెదిరించి నా మీద బాణాలు వేసినప్పటికి నేను అతని మీద బాణం వెయ్యను" అని చెప్పినప్పుడు అలా ఎందుకు వెయ్యలేవు అని దుర్యోధనుడు భీష్ముని ప్రశ్నిస్తాడు. దానికి సమాధానంగా భీష్ముడు అంబోపాఖ్యానాన్ని ఇలా చెబుతాడు.

భీష్ముడు తన తమ్ముడైన విచిత్రవీర్యుని కోసం కాశీరాజు కుమార్తెలైన అంబ, అంబిక, అంబాలికలను బలవంతంగా తీసుకొని వచ్చి వారిని విచిత్రవీర్యునికి వివాహం చేయబోతున్న సమయంలో అంబ తాను సాళ్వరాజును ప్రేమించానని, అతడు గూడా తనను ప్రేమించాడని కాబట్టి తనను అతని దగ్గరకు పంపించమని భీష్ముని కోరుతుంది. భీష్ముడు ఆమెను పంపిస్తాడు. అయితే సాళ్వరాజు భీష్ముని చేత అపహరించబడిన అంబను తాను

పెళ్ళి చేసుకోనని ఆమెను తిరస్కరిస్తాడు. అంబ తన మాతామహుడైన హోత్రవాహనుడు అనే రాజర్షి ద్వారా పరుశురాముని శరణు వేడుతుంది. పరుశురాముడు భీష్ముని పిలిపించి అంబను విచిత్రవీర్యునికిచ్చి వివాహం చేయవలసిందిగా ఆజ్ఞాపిస్తాడు. భీష్ముడు అది అధర్మంగా భావించి తిరస్కరిస్తాడు. దానితో అంబ కారణంగా భీష్మునికి పరుశురామునికి ఇరవై నాలుగు రోజులు భయంకర యుద్ధం జరుగుతుంది. ఆ యుద్ధంలో ఎవరు ఎవరినీ జయించలేరు. చివరకు నారదుడు, వసువులు, పరుశురాముని తండ్రి జమదగ్ని మొదలైనవారు దేవలోకం నుంచి వచ్చి వారి యుద్ధాన్ని విరమింపజేస్తారు.

మహావీరుడైన పరుశురాముడు కూడా భీష్ముని ఓడించలేకపోవడంతో తన ధౌర్భాగ్యస్థితికి భీష్ముడు కారకుడుగా భావించిన అంబ భీష్ముని చంపి అతని మీద పగ సాధించడానికి ఈశ్వరుని గురించి ఘోరమైన తపస్సు చేస్తుంది. ఈశ్వరుడు ఆమెకు ప్రత్యక్షమై వరం కోరుకొమ్మంటే తాము భీష్ముని చంపాలని కోరుకుంటుంది. అది ఈ జన్మలో సాధ్యం కాదని మరుసటి జన్మలో మొదట స్త్రీగా పుట్టి ఆ తర్వాత పురుషునిగా మారి భీష్ముని చంపుతావు అని ఆమెకు వరమిస్తాడు. ఆ తర్వాత అంబ అగ్నిలో దూకుతూ "నేను భీష్మున్ని వధిస్తాను" అని కోపావేశంతో పలికి మంటల్లో పడి చనిపోతుంది. మరుసటి జన్మలో ఆమె ద్రుపద మహారాజుకు కూతురుగా జన్మించి తర్వాత పురుషుడుగా మారి భీష్మవధకు కారణమవుతాడు. ఈ జన్మలో అతని పేరు శిఖండి. ఈ శిఖండి పుట్టుక, పెరుగుదల వివాహం మొదలైన విషయాల్లో జానపద కథాలక్షణాలు చోటుచేసుకున్నాయి.

ఉద్యోగ పర్వంలోని ఈ శిఖండి కథలో మహావీరుడైన ద్రుపదుడు సాధారణ వ్యక్తిగా చెప్పబడ్డాడు. ఈ కథలో ద్రుపదుడు భీష్ముని మీద కోపంతో అతణ్ణి చంపగల కుమారుని కోసం ఈశ్వరుని గురించి తపస్సు చేస్తాడు.

**"భగవన్ పుత్ర మిచ్ఛామి భీష్మం ప్రతిచికీర్షయా**
**ఇత్యుక్తో దేవదేవేన స్త్రీపుమాంస్తే భవిష్యతి"**
**(ఉద్యోగ. 188 – 5వ శ్లోకం)**

ఈశ్వరుడు ప్రత్యక్షమై అతనికి మొదట కూతురుపుట్టి ఆ తర్వాత ఆ కూతురు పురుషుడుగా మారుతుందని వరమిచ్చి పంపిస్తాడు. ద్రుపదుడు నిరాశతో ఇంటికి వచ్చి ఆ విషయాన్ని తన భార్యతో చెబుతాడు. ఆ తర్వాత ద్రుపదుని భార్య గర్భవతి అయి కూతురుకు జన్మనిస్తుంది. ఈశ్వరుని వరప్రభావంతో కుమార్తె ఆ తర్వాత ఎలాగూ పురుషుడుగా మారతాడని ద్రుపదుడు అతని భార్య భావించి తమకు కుమారుడు పుట్టినట్లుగా ప్రజలకు తెలిపి ఆమెకు శిఖండి అని పురుష నామం పెడతారు. అంతేగాకుండా శిఖండికి ద్రోణుని దగ్గర ధనుర్విద్యాభ్యాసం చేయిస్తారు. ఆ తర్వాత దంపతులిద్దరు దశార్ణ దేశాధీశుడైన హిరణ్యవర్మ కూతురును శిఖండికిచ్చి వివాహం కూడా చేస్తారు. శిఖండి భార్య యుక్తవయస్కురాలైన తర్వాత ఆమె కాపురానికి వచ్చి తనను పెళ్ళి చేసుకున్నది పురుషుడు కాదని స్త్రీ అనే విషయాన్ని గ్రహించి తన తండ్రి అయిన హిరణ్యవర్మకు అసలు విషయాన్ని దూత ద్వారా తెలియ జేస్తుంది. ద్రుపదుడు తనను తన కుమార్తెను అలా మోసగించి అవమానించి నందుకు హిరణ్యవర్మ

తీవ్రంగా మండిపడి సైన్యంతో ద్రుపదుని మీదికి దండెత్తి వస్తున్నట్లుగా వర్తమానం పంపిస్తాడు. దీనితో ద్రుపదుడు భయపడి వణకిపోతూ ఏమీ చేయాలా అని భార్యతో కలిసి ఆందోళన చెందుతూ ఉంటాడు. ఇదంతా శిఖండిని గమనించి తన కారణంగా తన తల్లిదండ్రులు చిక్కుల్లో పడినందుకు విచారించి ప్రాణత్యాగం చేయడానికి ఇల్లు వదిలి అడవికి వెళ్ళిపోతుంది. ఆ అడవికి స్థూణాకర్ణుడు అనే యక్షుడు రక్షణగా ఉంటాడు. శిఖండిని అతని ఇంటిలోని ప్రవేశించి నిరాహార వ్రతంతో చిక్కిపోతూ ఉంటుంది. ఆమె స్థితికి జాలిపడి యక్షుడు ఆమె ద్వారా విషయమంతా తెలుసుకొని ఆమెను ఆమె తల్లిదండ్రులను ఆపద నుంచి రక్షించడానికి తన పురుషత్వాన్ని ఆమెకు ఇచ్చి ఆమె స్త్రీత్వాన్ని తాను తీసుకొని ఒక గడువు విధించి ఆ గడువు లోపల ఆమె తిరిగి రావాలని చెప్పి శిఖండిని ఇంటికి పంపిస్తాడు. పురుషుడుగా మారిన శిఖండి సంతోషంతో తల్లిదండ్రుల వద్దకు వచ్చి జరిగిన విషయమంతా వారికి చెబుతాడు. ద్రుపదుడు అతని భార్య తమ కుమార్తె కుమారునిగా మారినందుకు చాలా సంతోషిస్తారు. ద్రుపదుడు తమ వియ్యంకుడైన హిరణ్యవర్మకు అతణ్ణి అతని కుమార్తెను తాము మోసం చేయలేదని, తమ శిఖండి పురుషుడేనని, కావాలంటే పరీక్షించుకోవచ్చునని వర్తమానం పంపిస్తాడు. హిరణ్యవర్మ కొంతమంది స్త్రీలను పంపించి శిఖండిని పరీక్షింపజేసి అతడు పురుషుడే అని వారి ద్వారా తెలుసుకొని సంతోషించి, అల్లునికి అనేక కానుకలిచ్చి అబద్ధపువార్త చెప్పినందుకు కూతురిని తిట్టి తన దేశానికి వెళ్ళిపోతాడు.

ఇలా ఉండగా స్థూణాకర్ణుడు ఉన్న దగ్గరకి యక్షరాజైన కుబేరుడు వచ్చి స్థూణాకర్ణుడు తన మగతనాన్ని శిఖండినికి ఇచ్చి ఆమె ఆడతనాన్ని తాను తీసుకు న్నందుకు కోపగించి

**"తతోఽబ్రవీ ద్యక్షపతి ర్మహాత్మా యస్మా దదా స్త్వమన్యేహ యక్షాన్**
**శిఖండినో లక్షణం పాపబుద్ధేః స్త్రీలక్షణం చాగ్రహీః పాపకర్మన్"**
**"అప్రవృత్తం సుదుర్బుద్ధే యస్మా దేతత్త్వయా కృతమ్**
**తస్మా దద్యప్రభృత్యేవ స్త్రీత్వం సా పురుష స్తథా"**

**(ఉద్యోగ. 192 – 46, 47 శ్లోకాలు)**

"నీ మగతనాన్ని శిఖండినికిచ్చి ఆమె ఆడతనాన్ని నువ్వు తీసుకొని యక్షులను అవమానించావు. కాబట్టి నేటి నుండి నువ్వు స్త్రీగానే ఉండు అది పురుషుడుగానే ఉంటుంది" అని శపిస్తాడు. అపుడు యక్షులందరు స్థూణాకర్ణుడికి శాపవిమోచనా మార్గం చెప్పమని కుబేరుని వేడుకుంటారు. శిఖండి చనిపోయిన తర్వాత స్థూణాకర్ణుడు తిరిగి తన పురుషత్వాన్ని పొందుతాడని కుబేరుడు చెప్పి వెళ్ళిపోతాడు. ఆ తర్వాత ఒప్పందం ప్రకారం శిఖండి స్థూణాకర్ణుడి దగ్గరకి వస్తాడు. స్థూణాకర్ణుడు కుబేరుడు తనను శపించిన విషయమంతా శిఖండికి చెప్పి జీవించినంతకాలం పురుషుడిగా సుఖంగా జీవించమని అతనికి చెప్పి ఇంటికి పంపిస్తాడు. శిఖండి అతని తల్లిదండ్రులు పరమానందాన్ని పొందుతారు. దీనితో ఈ కథ సుఖాంతమవుతుంది.

ఈ శిఖండి కథలో అద్భుతకథా కథాంశాలు కొన్ని ఉన్నాయి. ద్రుపదుడు పుత్రసంతానం కోరి ఈశ్వరుని గురించి తపస్సు చేయగా ఈశ్వరుడు ప్రత్యక్షమై అతనికి

మొదట కూతురు పుడుతుందని ఆ తర్వాత ఆమె కుమారుడుగా మారుతుందని చెప్పడం, ఈశ్వరుడు చెప్పినట్లుగానే ద్రుపదునికి కూతురు పుట్టడం, ఆ కూతురుకు శిఖండి అని పురుషనామం పెట్టి పురుషునిగా పెంచి వివాహం చేయడం మొదలైన కథ అంతా జరిగి స్థూణాకర్ణుడు తన పురషత్వాన్ని శిఖండికి ఇచ్చి ఆమె స్త్రీత్వాన్ని తాను తీసుకోవడం, కుబేరుడు స్థూణాకర్ణుని శాశ్వతంగా స్త్రీగా ఉండాలని శపించడంతో శిఖండిని శాశ్వతంగా పురుషుడుగా ఉండి పోతాడు. ఈ కథలో శిఖండి పూర్వజన్మ అయిన అంబ వృత్తాంతం చెప్పబడింది. పూర్వజన్మలో శివుడు ఆమెకు ఇచ్చిన వరం ప్రకారం, అలాగే శివుడు ద్రుపదునికి ఇచ్చిన వరం ప్రకారం ఆమె ఈ జన్మలో ద్రుపదునికి మొదట స్త్రీగా పుట్టి తర్వాత పురుషుడుగా మారుతుంది. ఈ కథలో ద్రుపదునికి ఈశ్వరుడు వరం ఇవ్వడం చెప్పబడింది. స్థూణాకర్ణుడు శిఖండినికి తన పురుషత్వాన్ని ఇచ్చి, ఆమె స్త్రీత్వాన్ని తాను తీసుకోవడం శిఖండినికి ఒక వరం లాంటిదే. కుబేరుడు స్థూణాకర్ణుని శాశ్వతంగా స్త్రీగా ఉండాలని శపించడం ఈ కథలో చెప్పబడింది. ఈ విధంగా ఇందులో శాపవరాల ప్రసక్తి ఉంది. ఈ విధంగా మహాభారతంలోని శిఖండి కథలో జానపద కథాంశాలున్నాయి.

ఈ శిఖండి కథను పోలిన కథలు కొన్ని జానపద సాహిత్యంలో ఉన్నాయి. ఉదాహరణకు ధర్మాంగద చరిత్ర కథను పరిశీలించుదాం. ధర్మాంగదుడు కాశ్మీరదేశ రాజు. ఇతనికి చాలా కాలం పాటు సంతానం కలుగదు. అనేక పుణ్యకార్యాలు చేయగా చివరకు ఇతని భార్య గర్భవతి అయి నవమాసాలు గడిచిన తర్వాత ఒక పాముకు జన్మనిస్తుంది. ఈ వైపరిత్యానికి రాజ దంపతులు దుఃఖించి మంత్రితో ఆలోచించి తమకు కుమారుడు పుట్టినట్లుగా ప్రచారం చేస్తారు. పాముకు పన్నెండు సంవత్సరాలు వచ్చిన తర్వాత అదే వయసులో ఉన్న మంత్రి కుమారుని తమ కుమారునిగా చూపించి, కత్తికి బాసికం కట్టే ఆచారం ప్రకారం రత్నాంగుడు అనే పేరుగల రాజుకుమార్తె అయిన త్రైలోక్య సుందరి అనే అమ్మాయిని కోడలుగా తెస్తారు. ఆ తర్వాత త్రైలోక్యసుందరి కాపురానికి వచ్చి తన భర్త మనిషి కాదని పాము అని తెలుసుకొని విచారించి మామ అనుమతితో ఆ పామును తీసుకొని 116 పుణ్యక్షేత్రాలను దర్శించి చివరకు ధర్మగుండం అనే పేరు గల కొలనులో పాముతో కలిసి మునిగితే పాము అందమైన రాజకుమారుడుగా మారిపోతాడు. ఆ తర్వాత సుందరి తన భర్తను తీసుకొని తన తండ్రి వద్దకు వెళ్ళి జరిగిన విషయాన్ని తండ్రికి చెబుతుంది. తండ్రి కూతురును అళ్ళుణ్ణి తీసుకొని సైన్యంతో ధర్మాంగద రాజు మీదకు దండెత్తి వెళ్ళి తన కూతురును అళ్ళుణ్ణి చూపించమంటాడు. ధర్మాంగదరాజు తనకు పాము పుట్టడం, అబద్ధాలు చెప్పి సుందరిని కోడలుగా చేసుకోవడం, సుందరి పామును తీసుకొని పుణ్యక్షేత్రాలకు వెళ్ళడం మొదలైన విషయమంతా రత్నాంగునికి చెబుతాడు. ఆ తర్వాత రత్నాంగుడు తన కూతురును ఆమె భర్తను చూపించి వారికి పుట్టిన పాము శాపవిముక్తి కలిగి అందమైన కుమారుడుగా మారిపోయాడని జరిగిన విషయమంతా చెబుతాడు. అపుడు ఆకాశవాణి పాము గతజన్మలో చిత్రాంగుడు అనే పేరుగల రాజకుమారుడని, ఆ జన్మలో అతడు బ్రాహ్మణులకు చేసిన అపకారం కారణంగా ఈ జన్మలో పాముగా పుట్టాడని,

ధర్మగుండంలోని నీటి మాహాత్మ్యంచేత అతడు శాపవిముక్తుడై మనిషిగా మారాడని చెబుతుంది. ధర్మాంగదడు అతని భార్య సంతోషించి కొడుకు కోడలును స్వీకరిస్తారు.

ఈ ధర్మాగద చరిత్రకు శిఖండి కథకు కొన్ని విషయాల్లో భేదం ఉన్నప్పటికీ కొన్ని పోలికలు కూడా ఉన్నాయి. శిఖండి కథలో శిఖండి స్త్రీగా పుడుతుంది. ఆమె తల్లిదండ్రులు ఆమెను లోకానికి కుమారుడుగా ప్రచారం చేసి వివాహం చేస్తారు. ధర్మాగద చరిత్ర కథలో వారికి పాము పుట్టగా దాన్ని దాచిపెట్టి తమకు కుమారుడు పుట్టినట్టుగా ప్రచారంచేసి వివాహం చేస్తారు. అయితే ఇలాంటి అబద్దాల పెళ్ళిళ్ళు ఎంతో కాలం దాగవు. రెండు కథల్లోను కోడళ్ళు కాపురానికి రావడంతో జరిగిన మోసం బయట పడుతుంది. శిఖండి కథలో ద్రుపదుడు తనను మోసగించాడని తెలుసుకొని హిరణ్యవర్మ ద్రుపదుని మీదికి దండెత్తి వెళ్తాడు. ధర్మాంగద చరిత్ర కథలో ధర్మాంగదుడు అబద్దాలు చెప్పి పాముకు తన కుమార్తెను భార్యగా చేసుకున్నందుకు చిత్రాంగుడు ధర్మాంగదుని మీద కోపగించి అతనికి బుద్ధి చెప్పాలనుకుంటాడు. రెండు కథలు చివరకు సుఖాంతమవుతాయి. శిఖండి కథలో శిఖండిని ఈశ్వరుని వరంవల్ల మొదట స్త్రీగా పుట్టి తర్వాత పురుషుడుగా మారుతాడు. ధర్మాంగద చరిత్రకథలో చిత్రాంగదుడు శాపం కారణంగా పాముగా పుట్టి తర్వాత మనిషి అవుతాడు. జానపద సాహిత్యంలో ఇలా పురుషుడు స్త్రీగా మారడం, శాపం కారణంగా మానవేతర ప్రాణులుగా పుట్టి తర్వాత మానవులుగా మారిన కథలు చాలా ఉన్నాయి. లోకంలో మౌఖిక ప్రచారంలో ఉన్న ఇలాంటి కథలను ఆధారంగా చేసుకొని అజ్ఞాత కవి శిఖండి కథను రాసి భారతం సభాపర్వంలో చొప్పించినట్లుగా భావించవచ్చు. ఈ కారణంగానే ఈ శిఖండి కథలో జానపద కథాంశాలు లేక లక్షణాలు చోటుచేసుకున్నాయి.

సంస్కృత భారతంలో 803 శ్లోకాల్లో చాలా వివరంగా ఉన్న అంబోపాఖ్యానాన్ని తిక్కన ఉద్యోగపర్వం చతుర్థాశ్వాసం 270వ పద్యం నుంచి 400వ వచనం వరకు వున్న 130 పద్యగద్యాల్లో కొంతవరకు క్లుప్తీకరించి చెప్పాడు. తిక్కన ఈ ఉపాఖ్యానంలో ఎలాంటి మార్పులు చేయలేదు.

ఈ విధంగా సంస్కృత మహాభారతంలో కట్టుకథాంశ కథలు, ప్రాణి కథాంశ కథలు, నీతి కథాంశ కథలు, అద్భుత కథాంశ కథలు ఉన్నాయి.

# అథస్సూచికలు

1. Mahabhratha, sanskrit text with English translation, M.N.Dutt, page IV
సంస్కృత సాహిత్య చరిత్ర– డా॥ ముదిగంటి గోపాలరెడ్డి, సుజాతారెడ్డి , పుట: 211
2. ఆంధ్ర సాహిత్య చరిత్ర – పింగళి లక్ష్మీకాంతం, పుటలు: 36, 37
3. కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహిత, ద్వితీయకాండం, ద్వితీయ సంపుటం, పుటలు: 383–385
4. ప్రొ॥ ఎ. రామచంద్రయ్య, నిట్, వరంగల్, కన్వీనర్ శాస్త్ర ప్రచార విభాగం, జన విజ్ఞాన వేదిక, ఈనాడు దినపత్రిక, విశాఖపట్నం సిటీ ఎడిషన్, మంగళవారం, 16–02–2016
5. కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహిత, ద్వితీయకాండ, తృతీయ ప్రపాఠకం, పంచమానువాకం, పదకొండవ మంత్రం, వ్యాఖ్యానకర్త –శ్రీరామవరపు కృష్ణమూర్తి శాస్త్రి, పుటలు: 169–172
6. కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహిత, ద్వితీయకాండ, పంచమ ప్రపాఠకం, షష్ఠోనువాకం, వ్యాఖ్యానకర్త –శ్రీరామవరపు కృష్ణమూర్తి శాస్త్రి, పుటలు: 298–303
7. తెలుగు నాటక వికాసం, పి.ఎస్.ఆర్.అప్పారావు పుటలు: 7, 8
8. వేదముల యథార్థ స్వరూపము, పండిత లోక మలహరి సిద్ధాంతాచార్య, పుట: 48
9. వేదముల యథార్థ స్వరూపము, పండిత లోక మలహరి సిద్ధాంతాచార్య, పుట: 49
10. కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహిత, ద్వితీయకాండ, పంచమ ప్రపాఠకం, ప్రథమోనువాకం, పుటలు: 266–272
11. కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహిత, ద్వితీయకాండ, చతుర్థ ప్రపాఠకం, ద్వాదశానువాకం, పుటలు: 251–257
12. కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహిత, ద్వితీయకాండ, పంచమ ప్రపాఠకం, ద్వితీయోనువాకం, పుటలు: 273–278
13. కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ బ్రాహ్మణము, ప్రథమ కాండము, సప్తమ ప్రపాఠకం, ప్రథమోనువాకం, 11 వ మంత్రం, పుటలు: 372– 373
14. కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహిత, పంచమ కాండ, పంచమ సంపుటం, పంచమాష్టకం, షష్ఠ ప్రపాఠకం, షష్ఠోనువాకం, పుటలు: 420 – 421
15. సంస్కృత వాఙ్మయ చరిత్ర, ప్రథమ సంపుటము, మల్లాది సూర్యనారాయణ శాస్త్రి, పుటలు: 123– 124
16. మహాభారత చరిత్రము, పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి, పుటలు: 147, 148
17. మహాభారత చరిత్రము, పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి, పుటలు: 147, 148
18. కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయసంహిత సప్తమకాండలో అశ్వమేధయాగ విధి విధానం చెప్పబడింది. ఈ కాండలోని చతుర్థ ప్రపాఠకం ఏకోనవింశోనువాకంలో రాజపత్నుల విలాప రూపమైన మృతాశ్వోపచారం చెప్పబడింది. ఈ అనువాకం పాఠ్యాన్ని, దానికి రామవరపు కృష్ణమూర్తి శాస్త్రిగారి అర్థ తాత్పర్యాలను కింద ఇస్తున్నాను.

[1]అమ్బే అమ్బాల్యమ్బికే న మా నయతి కశ్చన। ససస్త్యశ్వక: । [2]సుభగే కామ్పీలవాసినీ సువర్గే లోకే సం ప్రోర్ణ్వాథామ్ । ఆహ మజాని గర్భధమా త్వమజాసి గర్భధమ్ । [3]తౌ సహ చతుర: పద: సంప్ర సారయావ హై । [4]వృషా వాగ్ం రేతోధా రేతో దధాతూ [5]త్సక్థ్యో ర్గృదం ధేహ్యఞ్జి ముదఞ్జి మన్వజ । య: స్త్రీణాం జీవభోజనో య ఆసామ్ (1) బిలధావన: । ప్రియ: స్త్రీణామపీచ్య: । య ఆసాం కృష్ణే లక్ష్మణి సర్దిగృదిం పరావధీత్ । [6]అమ్బే అమ్బాల్యమ్బికే న మా యభతి కశ్చన । ససస్త్యశ్వక: । [7]ఊర్ధ్వామేనా ముచ్ఛ్రుయతా ద్వేణుభారం గిరావివ । అథాస్యా మధ్యమేధతాగ్ం శీతే వాతే పునన్నివ । [8]అమ్బే అమ్బాల్యమ్బికే న మా యభతి కశ్చన । సస్తన్యశ్వక: । [9]యద్ధరిణీ యవమత్తి న (2) పుష్టం పశు మన్యతే । శూద్రా యదర్యజారా న పోషాయ ధనాయతి । [10]అమ్బే అమ్బాల్యమ్బికే న మా యభతి కశ్చన । సస్తన్యశ్వక: । [11]ఇయం యకా శకున్తికా హలమితి సర్పతి । ఆహతం గభే పసో ని జల్గులీతి ధాణికా । [12]అమ్బే అమ్బాల్యమ్బికే న మా యభతి కశ్చన సస్తన్యశ్వక: । [13]మాతా చ తే పితా చ తేగ్రం వృక్షస్య రోహత: (3) । ప్ర సులామీతి తే పితా గభే ముష్టి మతగ్ంసయత్ । [14]దధిక్రావ్ణో అకారిషం జిష్ణో రశ్వస్య వాజిన: । సురభి నో ముఖా కరత్ప్ర ణ ఆయూగ్ంషి తారిషత్ ।

వేదార్థదీపిక

అవతారిక: ఈ యేకోనవింశాను వాకమునందు రాజపత్నుల విలాపరూపమైన మృతాశ్వోపచారము చెప్పబడుచున్నది.

1. అర్థము: హే అమ్బే!, హే అమ్బాలి!, హే అమ్బికే! = ఓ రాజపత్నులారా!, కశ్చన= ఒక్క పురుషుదును, మా= నన్ను, న నయతి= భోగమునకై రహస్య స్థలమునకు తీసుకొనిపోలేదు. అశ్వక:= ఈ కుత్సితమైన యశ్వము, ససస్తి= నిద్రపోవుచున్నది.

తాత్పర్యము: ఉత్తమ, మధ్యమ, అధమ యని రాజపత్నులు మూడు విధములుగా నుందురు. ఇచట ప్రతిప్రస్థాత యను ఋత్విజుడు అంబ, అంబాలిక, అంబిక యను మూడు పదములచే వరుసగా ఆ ముగ్గురు రాజపత్నులను సంబోధించును. సంబోధింపబడిన ఆ రాజపత్నులలో ఉత్తమయైన రాజమహిషి యీ విధముగా సమాధానము చెప్పుచున్నది. ‘ ఏ ఒక పురుషుదును భోగమునకై నన్ను రహస్య ప్రదేశమునకు తీసికొనిపోలేదు. కుత్సితమైన ఈ అశ్వము నిద్రపోవుచున్నది’. కుత్సిత: అశ్వ:= అశ్వక:. ఇచట ‘క’ ప్రత్యయము నిందార్థకము. రాజమహిషి భోగాభావమువలన కలిగిన దు:ఖముచే ఈ యశ్వమును నిందించుచున్నది.

2. అర్థము: హే సుభగే!= ఓ శోభన భగము కల పట్టపుదేవీ!, హే కామ్పీలవాసిని! = శ్లాఘ్యమైన వస్త్రవిశేషమును ఆచ్ఛాదించుకొనియున్న మహిషీ!, (త్వమ్=నీవు, అయం చ= ఈ అశ్వమును, ఉభౌ=ఇద్దఱు,) సువర్గే లోకే= స్వర్గలోక సదృశమైన ఈ స్థానమునందు, సంప్రోర్ణ్వాథామ్= ఈ క్షౌమ వస్త్రమును ఆచ్ఛాదించుకొనుడు. (ఆచ్ఛాద్యమానా చ= ఆచ్ఛాదించు కొనుచున్నదానవగుచును, తేన అశ్వేన సహ= ఆ యశ్వముతో కూడ, ఏవం బ్రూహి= ఈ విధముగా పలుకుము. “హే అశ్వ!= ఓ యశ్వమా!”) గర్భధమ్= గర్భమును ధరింపజేయునట్టి నిన్ను, అహమ్= నేను, ఆజాని= అభిముఖముగా పొందుదును. త్వమ్= నీవు, గర్భధమ్= గర్భమును ధరించునట్టి నన్ను, ఆజాసి= అభిముఖముగా పొందుము.

తాత్పర్యము: శోభన భఘము కలదానవు, శ్రేష్ఠ వస్త్ర విశేషము నాచ్ఛాదించుకొనినదానవునైన ఓ రాజమహిషీ! నీవు, ఈ యశ్వము, ఇద్దఱును ఈ క్షౌమ వస్త్రమును కప్పుకొనుడు. ఆచ్ఛాదించుకొనుచును నీవు "ఓ యశ్వమా! గర్భమును ధరింపజేయునట్టి నిన్ను అభిముఖముగ పొందుదును. నీవు కూడ గర్భమును ధరించునట్టి నన్ను అభిముఖముగ పొందుము. అధ్వర్యు డీ మంత్రమును పఠించుచు రాజమహిషిని, అశ్వమును క్షౌమవస్త్రముచే నాచ్ఛాదించవలెను."

3. అర్థము: (హే అశ్వ!= ఓ యశ్వమా!, త్వమ్= నీవు, అహం చ= నేనును) తౌ=ఆ యీ మన ముభయములము, చతుర: పద: = నాలుగు పాదములును, సహ= కూడ, సంప్రసారయావ హై= కలసికొనునట్లుగా చాచుకొందము.

తాత్పర్యము: ఓ యశ్వమా! నీవును, రాజమహిషియైన నేనునూ మన ముభయులము నా పాద ద్వయమును నీ వెనుకటి పాదద్వయమును అనగా నాలుగు పాదములను కలయునట్లుగా చాచుకొందము.

4. అర్థము: వామ్= మీ యుభయములలో, వృషా= సేచకమైన యశ్వము, ( సిఞ్చతు= వీర్య సేచనము చేయుగాక. ) రేతోధా:= వీర్యమును ధరించునట్టి రాజమహిషి, రేత:= రేతస్సును, దధాతు= ధరించుగాక.

తాత్పర్యము: మీ యుభయములలో వీర్య సేచకమైన యశ్వము వీర్యమును సేచనము చేయుగాక. రేతస్సును ధరించునట్టి మహిషి రేతస్సును ధరించుగాక. అధ్వర్యు డీ మంత్రముచే ఆ యుభయముల నభిమంత్రించవలెను.

5. అర్థము: హే అశ్వ!= ఓ యశ్వమా!, గృదమ్= నీ పాశ్చాత్య భాగమును, సక్థ్యో:= మహిషి యొక్క తొడలందు, ఉద్ధేహి= ఊర్ధ్వముననుంచుము. య:= ఏ పురుషాంగము, స్త్రీణామ్= స్త్రీలకు, జీవభోజన:= జీవాత్మచే ప్రీతిపూర్వకముగా అనుభవించబడునదియో, య:= ఏ పురుషాంగము, ఆసామ్= ఈ స్త్రీల యొక్క, బిలధావన:= యోనిని శీఘ్రముగ ప్రవేశించునదియో, స్త్రీణామ్= స్త్రీలకు, ప్రియ:= ప్రియమగుచు, అపీచ్య:= అత్యాదరముచే పొందబడునట్టిదియో, య:= ఏ పురుషాంగము ఆసామ్= ఈ స్త్రీల యొక్క, కృష్ణే లక్ష్మణి = అసాధారణ లక్షణమైన స్త్రీ వ్యంజనమందు, సర్దిగృదిమ్= శుక్రపాత స్థానవిశేషమును, పరావధీత్= వేగముగా కొట్టునో, హే అశ్వ= ఓ యశ్వమా! తమ్ ఉదఞ్జిమ్= అటువంటి సర్వోన్నతమైన పురుషాంగమును, అఞ్జిమ్ అను= మహిషి యొక్క యోనిని అభిలక్షించి, అజ= ప్రేరించుము.

తాత్పర్యము: ఓ యశ్వమా! త్వదీయ గుద సమీపవర్తి పాశ్చాత్య భాగమును రాజమహిషి యొక్క తొడలయందు పైని స్థాపించుము. నీ యెత్తైన పురుషాంగమును రాజమహిషియొక్క యోని నభిలక్షించి ప్రేరణ చేయుము. పురుషుని పురుషాంగము స్త్రీ గుహ్యావయవమును ప్రీతి పూర్వకముగా ననుభవించునట్టిది. అనగా స్త్రీ జీవము పురుషుని పురుషాంగము వలన ప్రీతి ననుభవించునట్టిది. మఱియు ఆ పురుషాంగము స్త్రీ యోనియందు శీఘ్రముగా ప్రవేశించునట్టిది. ఇంకను స్త్రీలకు ప్రియమగుచు అత్యాదరముగ స్త్రీలచే పొందబడునట్టిది. స్త్రీల యొక్క అసాధారణ లక్షణమైన స్త్రీ వ్యంజనమందలి శుక్రపాత స్థానమును వేగముగ తాడనము చేయునట్టిది. "త్రివృత్ప్రజననమ్।

ఉపస్థో యోని ర్మధ్యమా" అని శ్రుతి. ఉపస్థము, యోని, మధ్యమము అను భేదములచే స్త్రీ గుహ్యావయవము మూడు స్థానములు కలిగియుండును. పురుషాంగము స్త్రీ యొక్క గుహ్యావయవమందలి మధ్యభాగమును (శుక్రపాత స్థానమును) బాగుగ తాకుటచే అక్కడ శుక్రము పడునని భావము. ఈ మంత్రముచే అశ్వ ప్రజననమును (జననాంగమును) మహిషి ప్రజననము ( యోని) నందు ఉంచవలెను.

6. అర్థము: హే అమ్బే!, హే అమ్బాలికే!, హే అమ్బికే!= ఓ తల్లీ, కశ్చన= ఒక్కడును, మా= నన్ను, న యభతి= భోగించుటలేదు. అశ్వక:= ఈ కుత్సితమైన అశ్వము, ససస్తి= నిద్రించుచున్నది.

తాత్పర్యము: ఓ తల్లీ! ఒక్కడును నన్ను భోగించుట లేదు. ఈ కుత్సితమైన అశ్వము నిద్రపోవుచున్నది. ఇచట మహిషి భోగాభావ దు:ఖముచే విలపించుచు దగ్గఱ ఉన్నను లేకున్నను తన తల్లితో తన బాధను చెప్పుకొనుచున్నది. ఇచట అంబాది పదములు మాతృవాచకములు. లోకమునందు స్త్రీ బాల్యమునందు తనకు ఆపదలు కలిగినపుడు తల్లిని పిలిచి ఆమెతో తన బాధలను గూర్చి చెప్పుకొనుటకు అలవాటుపడియుండును. ఆ యలవాటుచే ఆ మాతృ సంబోధనమే వెంటనే నాలుకయందు వచ్చును. ఆ విధముగనే యిచట మహిషి తల్లిని సంబోధించి తనబాధను చెప్పుకొనినది.

7. అర్థము: హే మహిషి!= ఓ పట్టమహిషి!, గిరౌ= పర్వతమునందు, వేణుభారమివ= వెదుళ్లమోపును వలె, ఏనామ్= ఈ నీ యోనిని, ఊర్ధ్వామ్= ఊర్ధ్వాభిముఖముగ, ఉచ్ఛ్రయతాత్= ఎత్తి యుంచుము. అథ= అనంతరము, అస్యా:= ఈ యోనియొక్క, మధ్యమ్= మధ్యస్థానము, శీతే వాతే= చల్లని గాలియందు, పునన్నివ=ధాన్యమును శుద్ధిచేయుచుండువాని వలె, ఏధతామ్= వృద్ధిచెందుగాక( హర్షించుగాక).

తాత్పర్యము: తన దు:ఖమును తెలియజేయుటకై అంబాది శబ్దములచే తల్లిని సంబోధిస్తున్న యీ రాజమహిషిని గూర్చి వస్త్రాచ్ఛాదనమునకు వెలుపల ఉన్నట్టి ఇతర రాజపత్ను లీ విధముగ బోధించుచున్నారు. ఓ రాజమహిషీ! ఒకానొకడు పర్వతమునందు వెదుళ్లను ఖండించి వానిని పెద్ద మోపుగా కట్టి యామోపును స్వగృహమునకు తీసుకొనిపోవుటకై ప్రథమమున నేలమీద ఊర్ధ్వముగ ఉంచిన విధముగ నీవు నీ యోనిని ఊర్ధ్వాభిముఖముగ చేసి యున్నతమైనదిగా నుంచుము. అనంతరము కళ్ళమునందలి ధాన్యమును గ్రహించునతడు చేటచే ధాన్యమును తూర్పాఱబెట్టుటచే అలసట చెందినవాడై చల్లని గాలి వీచుచుండగా సంతోషించు విధముగ నీ యోని స్వాభిమతమును పొందుటచే వృద్ధి నొందును(హర్షించును). ఇచట వృద్ధియనగా హర్ష విశేషము.

8. అర్థము: అమ్బే!, అమ్బాలికే!, అమ్బికే!, కశ్చన, మా,న యభతి. అశ్వక:, ససస్తి అర్థ తాత్పర్యములు. 6వ మంత్ర వ్యాఖ్యానమున వ్రాయబడినవి. రాజమహిషి భోగాభావ దు:ఖముచే తనబాధను దీనితో మూడు ఋక్కులచే తన తల్లికి తెలియజేయుచున్నది. ఆ ఋక్కులలో నిది మొదటిది. ఈ ఋక్కునందు మహిషి యశ్వమును గర్హించుటచే ఇది గర్హార్థ ఋక్కు అనబడుచున్నది.

9. అర్థము: యత్= ఎప్పుడు, హరిణీ= ఆడు లేడి, యవమ్= ధాన్యమును, అత్తి= తినునో, తత్= అప్పుడు, సా= ఆ లేడి, పుష్టమ్= బలిసినదైనను, పశు(మ్)= పశువును, న మన్యతే= తెలిసికొనుటలేదు. (హే మహిషి!= ఓ రాజ మహిషి!, తథా= ఆ విధముగ, త్వమపి= నీవు కూడా, దేవతారూపేణ=

దేవతారూపముతో, త్వామ్= నిన్ను, అనుభూయ= అనుభవించి, అన్తర్హితమ్ అశ్వమ్= అంతర్ధానము చెందిన అశ్వమును, నజానాసి= తెలిసికొనుట లేదు. కిం చ = మఱియు, కదాచిత్= ఒకానొకప్పుడు) శూద్రా= ఒకానొక దాసి, యత్= ఎప్పుడు, ఆర్యజారా= తన యజమానుడు జారుడుగా కలదిగా, భవతి = అగుచున్నదో, (తదాని= అప్పుడు, సా= ఆ దాసి) పోషాయ= తన కుటుంబమును పోషించుకొనుటకై, న ధనాయతి= యజమానుని నుండిధనమును కోరుట లేదు. (తథా= ఆ విధముగ, మనుష్య శరీరా త్వమపి= మనుష్య శరీరము గల నీవు కూడ, దేవతా రూపస్య అశ్వస్య స్వీకారాదేవ = దేవతారూపమైన అశ్వము నిన్ను స్వీకరించుటవలననే, పరితుష్టాభవ= సంతుష్టురాల వగుము. తు= కాని, తుచ్ఛమ్ ఇమం మానుషం భోగమ్= తుచ్ఛమైన యీ మనుష్య సంబంధమైన భోగమును, న అపేక్షస్వ= అపేక్షించకుము)

తాత్పర్యము: ఒకానొకప్పుడు ఒక ఆడులేడి రాత్రియందు వచ్చి పొలము(క్షేత్రము)నందు యవధాన్యమును ఎప్పుడు భక్షించుచుండునో, ఆ క్షేత్రమునందు భక్షించి మఱల అరణ్యమునందు వచ్చినట్టి పశువును పుష్టిగా ఉన్నదానినైనను తెలిసికొనని విధముగ, ఓ రాజమహిషీ! నీవు కూడ దేవతారూపమున నిన్ను అనుభవించి యంతర్హితమైన యశ్వమును తెలిసికొనుట లేదు. కాని నీకు భోగము మాత్రము అయినదనియే ఇతర రాజపత్నుల అభిప్రాయము. మఱియు ఎప్పుడు ఒకానొక దాసి ఒకానొకప్పుడు తన యజమానుడు జారుడుగా తనకు లభించునో, అప్పు డా దాసి తన యజమానుడు తనను స్వీకరించిన మాత్రముచేతనే సంతోషించును. కానీ కుటుంబ పోషణముకై యజమాని నుండి ధనమును కోరదు. ఆ విధముగనే మనుష్య శరీరము గల నీవు కూడ దేవతా రూపమున అశ్వము నిన్ను స్వీకరించుటవలననే(స్వీకరించినందుకే) సంతుష్టి నొందుము. తుచ్ఛమైన యీ మానుష భోగమును మాత్రము అపేక్షించకుము. ఇతర రాజపత్నులు ఈ ఋక్కుతో కూడ మూడు ఋక్కులతో రాజమహిషికి ప్రబోధము చేయుదురు. ఇది ప్రబోధాత్మకమైన (అభిమేధనాత్మకమైన) ప్రథమ ఋక్కు.

10. అర్థము: హే అమ్బే!, హే అమ్బాలికే!, హే అమ్బికే! , కశ్చన, మా, న యభతి. అశ్వకః, ససస్తి. అర్థతాత్పర్యములు పూర్వోక్తములే. ఇది ద్వితీయ గర్హణార్థ ఋక్కు.

11. అర్థము: ఇయమ్= ఈ కనబడుచున్న, యకా శకున్తికా= ఒకానొక ఆడుపక్షి, ఆహలమ్ ఇతి= ఆహలమని ధ్వనిచేయుచు, సర్పతి = మగపక్షి ననుసరించి వెళ్లుచున్నది. (తృప్తా = తృప్తిచెందినదై, క్వచిత్= ఒకచోట, నావతిష్ఠతే= ఉండుట లేదు. హే మహిషి!= ఓ రాజ మహిషీ!, ఏవమ్ = ఈ విధముగ, త్వమపి= నీవు కూడ, న తృప్యసి= తృప్తిచెందుటలేదు. ఇది సమంజసము కాదు. కిం చ= మఱియు, లోకే= లోకమునందు, ధాణికా= గర్భమును ధరించునట్టి స్త్రీ, గభే(భగే)= యోనియందు, ఆహతమ్= ఉంచబడిన, పసః=(సపః)= రేతస్సును, నిజల్గులీతి= గర్భరూపమున లోపల ధరించుచున్నది. (ఏవమ్= ఈ విధముగ, త్వమపి= నీవు కూడ, దేవతా రూపాశ్వస్వీకారేణ= దేవతారూపమైన యశ్వమును స్వీకరించుటచే, సంతోష్టుమ్= సంతోషించుటకొఱకు, అర్హసి= తగుచున్నావు.)

తాత్పర్యము: ఈ కనబడుచున్న ఒకానొక ఆడుపక్షి ఆహల శబ్దము చేయుచు మగపక్షి వెంట వెళ్లుచున్నది. తృప్తిచెందినదై ఒకచోట ఉండుటలేదు. ఓ మహిషీ! ఈ విధముగ నీవు కూడ తృప్తిచెందుట

లేదు. ఇది మంచిది కాదని ఇతర రాజపత్నుల అభిప్రాయము. ఆహల శబ్దము పక్షి ధ్వనికి అనుకరణము. మఱియు లోకమున గర్భమును ధరించునట్టి స్త్రీ యోనియందు ఉంచబడిన రేతస్సును గర్భరూపమున లోపల ధరించి సంతోషించుచున్నది. ఈ విధముగ నీవు కూడ దేవతారూపమైన యశ్వమును స్వీకరించుట చేత సంతోషించుట కర్హురాల వగుచున్నావు. ఇది అభిమేధనార్థకమైన ద్వితీయ ఋక్కు.

12. అర్థము: అమ్బే!, అమ్బాలికే!, అమ్బికే!, కశ్చన, మా, న యభతి. అశ్వక:, ససస్తి. అర్థ తాత్పర్యములు పూర్వోక్తములు. ఇది తృతీయ గర్హార్థ ఋక్కు.

13. అర్థము: హే మహిషి!= ఓ పట్టమహిషీ!, తే= నీ యొక్క, మాతా చ= తల్లియు, తే= నీ యొక్క, పితా చ = తండ్రియు, (ఉభౌ= ఇద్దఱు, యదా= ఎప్పుడు,) వృక్షస్య= వృక్షముయొక్క, అగ్రమ్= శాఖచే నిర్మితమైన తల్పమును, రోహత:= ఎక్కుచున్నారో (ఎక్కి శయినించుచున్నారో), తదా= అప్పుడు, తే పితా= నీ యొక్క తండ్రి, ప్రసూలామీతి= ప్రవేశపెట్టుచున్నానని, గభే(భగే)= యోని యందు, ముష్టిమ్= ముష్టి సదృశమైన మేహమును(పురుషాంగమును), అతంసయత్= ప్రవేశింపజేసెను. (ఏవమ్= ఈ విధముగ, అయమపి అశ్వ:= ఈ యశ్వముకూడ, చకార= చేసెను. హే మహిషి!= ఓ పట్టమహిషీ!, త్వమ్= నీవు, ఉత్తిష్ఠ= లెమ్ము.)

తాత్పర్యము: ఓ పట్టమహిషీ! నీ తల్లియు, తండ్రియు, ఉభయులును ఎప్పుడు వృక్షశాఖానిర్మితమైన తల్పము నధిష్ఠించి శయనించుచున్నారో, అప్పుడు నీ తండ్రి ప్రవేశపెట్టుచున్నానని చెప్పి ముష్టివంటి మేహనమును(పురుషాంగమును) యోనియందు ప్రవేశపెట్టెను. ఈ విధముగనే ఈ యశ్వము కూడ చేసినది. ఓ మహిషీ! ఇక నీవు లెమ్ము అని అభిప్రాయము. ఇది అభిమేధనార్థమైన తృతీయఋక్కు.

14. అర్థము: జిష్ణో:= జయశీలుడును, అశ్వస్య= వ్యాపించువాడును, వాజిన:= అన్నవంతుడునగు, దధిక్రావ్ణ:= దధిప్రియుడైన 'దధిక్రావన్' అను పేరు గల (అగ్ని) దేవునకు, అకారిషమ్= నేను కర్మను చేసితిని.స:= ఆ దేవుడు, న:= మా యొక్క, ముఖా (ఖమ్) = ముఖమును, సురభి= సుగంధోపేతముగ, కరత్(కరోతు)= చేయుగాక. న:= మాకు, ఆయూంషి= ఆయువులను, ప్రతారిషత్= ప్రకర్షముగ వృద్ధిచేయుగాక.

తాత్పర్యము:దధిప్రియుడైన 'దధిక్రావన్' అను పేరు గల దేవునకు (అగ్నియని కొందఱి పక్షము.) నేను కర్మ చేసితిని. అనగా పూజ చేసితిని.అతడు జయశీలుడు. అంతటను వ్యాపించి యుండువాడు. అన్నవంతుడు. ఆ దేవుడు మా ముఖమును కర్పూరాది ద్రవ్యమును సమృద్ధిగా నొసగుటచే సుగంధోపేతముగా చేయుగాక. మా ఆయువులను వృద్ధి చేయుగాక. స్త్రీలందఱు సురభిమతియైన ఈ ఋక్కును జపించవలెను. సురభిమతి= సురభి శబ్దము కలిగి యున్నది. (కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహిత, సప్తమ కాండ, చతుర్థ ప్రపాఠకం, ఏకోనవింశోనువాకం, పుటలు: 245-249)

19. కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహిత, షష్ఠ కాండ, ప్రథమ ప్రపాఠకం, షష్ఠోనువాకం, పుటలు: 42-46

20. హోమర్ ఇలియడ్, తెలుగు ముత్తేవి రవీంద్రనాథ్, పుటలు: 30-40

21. హిందూ సామ్రాజ్యవాద చరిత్ర, తెలుగు సేత - కలేకూరి ప్రసాద్, పుట: 24

# ఆధార గ్రంథాలు


## తెలుగు గ్రంథాలు :

1. ఆంధ్ర సాహిత్య చరిత్ర – పింగళి లక్ష్మీకాంతం – విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్.
2. కవిత్రయ రచిత శ్రీమదాంధ్ర మహాభారతము 15 భాగాలు, తిరుమల తిరుపతి దేవస్థానముల వారి ప్రచురణ.
3. జయమ్–నాయుని కృష్ణమూర్తి, విజయవాణి ప్రింటర్స్, చౌడేపల్లి, చిత్తూరు జిల్లా–2016
4. తెలుగు నాటక వికాసం – పి.ఎస్.ఆర్. అప్పారావు.
5. తెలుగు సాహిత్య చరిత్ర, మొదటి భాగం – కొర్లపాటి శ్రీరామమూర్తి.
6. మహాభారత చరిత్రము – పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి
7. వ్యాస భారతం (తెలుగు వచనం) 20 భాగాలు, డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి, డా॥ సూరం శ్రీనివాసులు.
8. వేదముల యదార్థ స్వరూపము, అనువాద కర్త – బ్రహ్మశ్రీ పండిత లోకమలహరి సిద్ధాంతాచార్య, వైదిక సాహిత్య ప్రచార సమితి, హైదరబాదు– 2007
9. శ్రీమదాంధ్ర వచన ఋగ్వేద సంహిత – మూడు భాగాలు, డా॥ దాశరది రంగాచార్య, శ్రీరామ పబ్లిషర్స్, హైదరబాదు
10. సంస్కృత వాఙ్మయ చరిత్ర – 2 సంపుటాలు – మల్లాది సూర్యనారాయణ శాస్త్రి, ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్ రోడ్డు, హైదరాబాదు, డిశంబరు, 1982
11. సంస్కృత సాహిత్య చరిత్ర – డా॥ముదుగంటి గోపాలరెడ్డి, సుజాతరెడ్డి
12. హిందూ సామ్రాజ్యవాద చరిత్ర – తెలుగు సేత– కలేకూరి ప్రసాద్, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, హైదరాబాద్.

## సంస్కృత గ్రంథాలు :

1. ఆధ్యాత్మ రామాయణము– గీతా ప్రెస్, గోరఖ్‌పూర్, 2010
2. కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహిత 1 – 8 సంపుటాలు, వ్యాఖ్యాన కర్త – శ్రీరామవరపు కృష్ణమూర్తి శాస్త్రి, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి
3. జయ సంహితా కింవా ఆది భారతం – 2 సంపుటాలు, ఆచార్య కేశవరాం. కె.శాస్త్రి, గుజరాత్ రీసెర్చ్ సొసైటీ, అహమ్మదాబాద్ – 1977
4. శ్రీమద్భాగవత మహాపురాణము – వ్యాసుడు, గీతా ప్రెస్, గోరఖ్‌పూర్.
5. శ్రీమన్మహా భారతమ్ – నీలకంఠీయ వ్యాఖ్యానువాద సహితమ్ విరాట, ఉద్యోగ, శాంతి, అనుశాసన, అశ్వమేధిక, ఆశ్రమవాసిక, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వాలు – ఆర్ష విజ్ఞాన ట్రస్టు, హైదరాబాదు.
6. శ్రీమద్రామాయణము – వాల్మీకి, గీతా ప్రెస్, గోరఖ్‌పూర్.
7. శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత, ప్రథమ సంపుటం, ఆంధ్రానువాద కర్త – శ్రీ నేమాని వెంకట నరసింహా శాస్త్రి, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
8. రామ చరిత మానసం – తులసీదాసు, గీతా ప్రెస్, గోరఖ్‌పూర్.

## ఆంగ్ల గ్రంథం :

1 Mahabhrata - Sanskrit Text with English Translation - 9 volumes - M.N. Dutt.

